# జితేంద్రుడు

(నవల)


రచన :

శ్రీ జైనేంద్రకుమార్

అనువాదం :

శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి




ప్రచురణ:
1960

మూల్యము: రూ 4-50

సంపాదకుడు: "ఛాయేశ్వర్"

ముద్రణ: విక్టరీ ప్రెస్, విజయవాడ-1

త్యాగమూలకమైన ప్రేమసిద్ధాంతానికి
శక్తివంతమైన సాహిత్యరూపం
కల్పించిన సాహితీస్రష్ట
శ్రీ జైనేంద్రకుమార్
జైనేంద్ర సాహిత్యమంతా - పూర్తిగా
తప్పక చదవండి!

ప్రకాశకులు:
ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్
విజయవాడ.



## రచయిత

జననం: 1905. ప్రారంభికవిద్యాప్రాప్తి, బ్రహ్మచర్యాశ్రమం—హస్తినాపురంలో (1911-18). ప్రైవేటు మెట్రిక్ 1919. కాశీ విశ్వవిద్యాలయంలో—1919-1920. సహాయ నిరాకరణోద్యమంలో కాలేజీ పరిత్యాగం—1921. ప్రథమ కారాగారవాసం-1924. పునః కారాగారవాసాలు-1930-1932. ఆతరువాత నిరుద్యోగం. తననుతాను శాశ్వత నిరుద్యోగినని చెప్పుకొనేవారు.

మొదటి కథలసంపుటి 'ఫాంసీ' [ఉరి] తో 1929 లో సాహిత్య రంగంలో అడుగుపెట్టారు. మొదటి నవల 'పరఖ్' ప్రచురణ—1930 మొదటి తాత్త్విక గ్రంథం 'జైనేంద్రుని అభిప్రాయాలు'—ప్రచురణ 1937. సాహిత్యరంగంలో ఈయన ప్రవేశమువల్ల ఉద్భవించిన కలకలాన్ని గురించి కతిపయ విజ్ఞుల ఈ ఉద్ఘాటనవల్ల ఊహించవచ్చు—

"....నువు గోర్కీ కాగోరుతున్నావా? భారత దేశంలో గోర్కీ కాగలిగినవారూ - అయినవారూ ఎవరైనా ఉన్నారా అంటే ఒక్క జైనేంద్రుడు మాత్రమే."

—ప్రేమ్‌చంద్.

"'జైనేంద్రుని అభిప్రాయాలు' చదువుతూ టాల్‌స్టాయ్ రచనలు చదువుతున్నంత—కాదు, ఇంకా చాల అధికంగా ఆనందానుభూతిని పొందాను నేను...."

—కిశోర్‌లాల్ మశ్రూవాలా.

"....హిందీ కథాసాహిత్య క్షేత్రంలో, ఇప్పుడు మనం రవీంద్రనాథ్, శరత్‌బాబులను జైనేంద్రునిలో ఒకేసారిగా పొందగలిగాము—తిరిగి పొందగలిగాము."

—మైథిలీ శరణ్ గుప్త.

## ఈ పుస్తకాలు మీరు చదివారా ?

| | | |
|---|---|---|
| సునీత | (జైనేంద్ర కుమార్) | 3-75 |
| సుఖద | ,, | 3-75 |
| కల్యాణి | ,, | 3-00 |
| రాజీనామా | ,, | 2-00 |
| జయంత్ | ,, | 2-50 |
| జితేంద్రుడు | ,, | 3-75 |
| కామము, ప్రేమ, పరివారము | ,, | 3-00 |
| చంద్రయ్యలో చైతన్యం | ,, | 2-00 |
| జయవర్ధన | ,, | 6-00 |
| సన్యాసి | (ఇలాచంద్రజోషీ) | 7-50 |
| ప్రేతము-ఛాయ | ,, | 4-00 |

ఇంకా చదవకపోయినట్లయితే తప్పక చదవండి. జైనేంద్రకుమార్, ఇలాచంద్రజోషీలు సుప్రసిద్ధులైన భారతీయ రచయితలు. వీరిని వీరి రచనలను ఎందరో ప్రముఖులు ఎన్నెన్నోవిధాల కీర్తించారు. అన్ని పత్రికలు ప్రశంసించాయి. కాని ఆ ప్రశంసలన్నీ ఇక్కడ మేము ఇవ్వగోరడంలేదు. ఆ విషయాలన్నీ వారి పుస్తకాలలోనే మీరు చూడవచ్చు. అయితే ఒక్క విషయంమాత్రం చెప్పగోరుతున్నాం—

వీరిద్దరూకూడా తెలుగుదేశానికి (అంటే హిందీసాహిత్యంతో తగినంత పరిచయం లేనివారికిమాత్రం) క్రొత్తవారే. వీరి రచనలలోగల విజ్ఞానం

వికాసం, నిత్యజీవితంలో వీరి సత్యసంశోధన మా పాఠకులకు అందజేయాలనే కాంక్షతో వీరి రచనలు తెలుగులో ప్రచురిస్తున్నాం. అనతికాలంలోనే వీరి మిగతారచనలుకూడా మీకు అందించగలమని సంతోషపూర్వకంగా తెలియజేస్తున్నాం. అయితే, వీరిరువురి రచనలపట్ల మా పాఠకుల అభిప్రాయాలుకూడా తెలుసుకోవాలని మాకు చాల కుతూహలంగా ఉంది. దయవుంచి పాఠకులందరూకూడా జైనేంద్రకుమార్ ఇలాచంద్రజోషీల రచనల యెడల తమకుకలిగిన అభిప్రాయాలను మాకు తప్పక తెలియజేయవలసినదిగా ప్రార్థన.

ఇట్లు,
తెలుగుభాషలో "జైనేంద్ర సాహిత్యము"నకు
సంబంధించిన సమస్తహక్కులు పొందిన

ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్,
విజయవాడ.

# జితేంద్రుడు

## 1

రామచరణరాయ్ అసలు ఎక్కడో తూర్పుజిల్లాకు చెందిన మనిషి. చాలకాలంగా ఢిల్లీలో వచ్చివుంటున్నాడు. ప్లీడరువృత్తి చేశాడు. ఫైలు బాగానే వుండేది. 'సర్' బిరుదు సంపాదించాడు. జడ్జికూడా అయినాడు. కాని జడ్జిగా ఒక్క సంవత్సరం పనిచేశాడో లేదో రాజీనామా ఇచ్చి ఇప్పుడు ఊరికేనే ఉంటున్నాడు. ఇందుకు కారణం: భార్య చనిపోయింది; కొడుకు కూడా చనిపోయాడు. గోరుచుట్టుపై రోకలిపోటు అన్నట్టుగా జరిగాయి ఈ రెండు సంఘటనలు. కొడుకు విదేశాల్లో వుంటూ చనిపోయాడు. అందుచేత విధవరాలైన ఒక కోడలు ఇంట్లో లేకుండా తప్పిపోయింది. కొడుకు ఎవతెనో విదేశీయువతినే పెండ్లిచేసుకున్నాడు; అతడు చనిపోవటానికి చాల కాలం ముందుగానే ఆమె తన యేర్పాటేదో వేరే చూచేసుకుంది. రామచరణరాయ్‌కి ఇప్పుడింట్లో భార్యలేదు; కొడుకులేడు; ఒక్క కూతురు భువనమోహిని మాత్రం ఉంది. ఇంతవరకూ జీవితం హాయిగానే గడిచింది. కాని ఇప్పుడు దెబ్బమీద దెబ్బ తిన్నాడేమో, ఆయనకు జగత్తు అంతా శూన్యంగా కనిపించసాగింది. మనస్సు వికలమైపోయింది. జీవితంలో ఆసక్తిపోయి, విరక్తి కుదురుకోసాగింది. భవిష్యదాశాయుతసంకల్పాలు జీర్ణించి వాస్తవిక దుఃఖం మిగిలిపోయింది. పొందాలనుకునే ఆకాంక్షలేమీ లేవిప్పుడు; కోల్పోయిన స్నేహసౌహార్దాల్ని నెమరువేసుకుంటూ ఉన్నాడు.

ఇది అతని మానసికావస్థ. ఈలోగా భువనమోహిని పెరిగి పెద్దదైంది. బి. ఏ. ప్యాసైంది. ప్లీడరుపట్టా పుచ్చుకుంది. ఎం. ఎ. కూడా ప్యాసైంది. ఇరవై రెండుసంవత్సరాలవయస్సు వచ్చింది. పెండ్లిచేసుకుందామనిగాని, ప్రాక్టీసు పెడదామనిగాని ఆమెకెట్టి ఆసక్తీ ఉన్నట్టులేదు. హృదయంలో వలపుజిలుగుల జాడలూ కనిపించవు. తండ్రి కామెవ్యవహారమేమీ అర్థంకాలేదు.

"ఇదిగో భువన్! నాకీ జీవితంలో నువు సెలవిచ్చి పంపిస్తావా లేదా?" అన్నాడొకసారి కూతుర్ని దగ్గరకు పిలిచి.

"నన్నొక్క నెట్టు నెట్టేసి దూరంగా పంపించెయ్యాలని చూస్తున్నా వన్నమాట! అంతేనా నాన్నా! ఇంట్లో ప్రతిగదిలోనూ మా అమ్మ ఫోటోలు తగిలించి వున్నాయి, చూస్తున్నాను. నీకు సేవచేసేందుకు ఆమె మళ్ళీ రాదు కదా! నన్ను నీదగ్గర దిగబెట్టి వెళ్ళిపోయింది. ఇప్పుడిక నేనుకూడా నిన్ను విడిచిపెట్టేసి వెళ్ళిపోతే...."

"నామాట విను భువన్! లేనిపోని తెలివితేటలు చూపించకు. విధి అంటూ ఉన్నదంటావా, లేదంటావా? నా ప్రారబ్ధం నాకేగాని, నువ్వెవరూ మోయటానికి? అదేం పనికిరాదు. నాకు పాపం అంటుకోటానికా? భగవంతుడు ప్రసాదించిన జీవితం దానిదారిన అది చివరిదాకా సాగిపోతూఉండాలి. అలా స్వేచ్ఛగా సాగనీకుండా మధ్యలో దాన్ని ఏ చిలక్కొయ్యకో తగిలించి ఉంచటం తప్పు. నువ్వేమో నాకు సంరక్షకురాలివిగా భావించుకుని, ఆ రకంగా కాలక్షేపంచేద్దామనుకున్నావు కాబోలు! అది నేను సహించలేను."

"చాలుచాల్లే నాన్నా! ఇక ఎక్కువగా మాటాడబోకు. మా అమ్మ మీద ఒట్టు."

"నువు నన్నలా భయపెడదామనుకుంటేమాత్రం ఏదీ మీ అమ్మ? మీ అమ్మేఉంటే నువు ఇలా ఇక్కడ వుండేదానివా? పిల్ల జెల్ల, కలిగా హాయిగా సంసారం చేస్తూ ఉండేదానివి కాదూ!"

భువనమోహిని చటుక్కున ముందుకువచ్చి ఆయన నోటికి చెయి గట్టిగా అడ్డంపెట్టింది. ఆయన బుజాలు పట్టుకుని ఊగిసలాడింది.

ఇలా ఆ తండ్రి, కూతురు ఒకరిపై ఒకరు అపేక్షగాఉంటూ కాలం గడుపుతున్నారు.

* * * *

కాని పాలు పొంగే వయస్సు వ్యర్థంగా గడవదు. రావుసాహెబ్ తన పఠనమందిరంలో వున్నాడు. మోహిని వచ్చింది. "నేను వెడుతున్నాను నాన్నా!"

"మంచిది!" అన్నాడు తండ్రి తలెత్తి చూడకుండానే.

"మంచిదేమిటి? 'ఎక్కడికి?' అనికూడా అడగవేం?"

"సరే అడుగుతా చెప్పు; ఎక్కడికి?"

"జితేన్ యిప్పుడే ఫోన్‌లో మాటాడాడు. ఏదో తేల్చివేసుకోవాలని అతని ఉద్దేశం. సినీమాకు రమ్మన్నాడు; వెళ్ళనా ?"

"వెళ్ళు," తండ్రి నవ్వాడు, "కాని ఇదిగో, పోట్లాడి రాబోకేం!"

"నేను తప్పకుండా పోట్లాడి వస్తాను. మీరేమి అడ్డగిస్తారో చూస్తాగా ?"

"పో, పో, పిచ్చిపిల్లా ! నా వయసు ఎంతో చూస్తున్నావుగా! దేవుని పిలుపు ఏగడియన వస్తుందో చెప్పలేం. నిన్నొక సత్పురుషునిచేతుల్లో పెట్టి, కృతార్థుడినై, పరలోకయాత్రకు పోతాను. ఏమంటావు ?"

సమాధానం చెప్పకుండా మౌనంగావున్న భువనమోహినివైపు ప్రేమగా చూస్తూ "దాపరికం లేకుండా చెప్పు : కాదని అతన్ని నిరాకరించేస్తావా ?" అన్నాడు తండ్రి మళ్ళీ.

మోహిని ఒక ఉత్తరం తీసి తండ్రికి ఇచ్చింది, "నిన్న వచ్చింది ఈ ఉత్తరం" అంటూ.

తండ్రి కాగితం విప్పి చదివాడు! మరోసారి చదివాడు. చివరకు తిరిగి మడిచి జేబులో పెట్టుకున్నాడు. "నువు ఏమాలోచించావు మరి?"

"నేను ఆలోచించేదేముంది నాన్నా !"

"ఇదిగో భువన్! జీవితపుదారులు భిన్నంగా ఉంటాయి. ఎవరిదారిన వారుసాగిపోవలసిందే. మీ అమ్మను నేను పట్టుకుని ఆపగలిగానా? వెళ్ళవలసివుంది, వెళ్ళిపోయింది. నీ నా యిష్టాలు పనికిరావు. నీజీవితం నాబ్రతుకుతో ముడిపెట్టుకోవలసిన అవసరం ఏముందీ? నన్నుగురించి నీకెందుకమ్మా ఆలోచన పిచ్చిదానా?"

మోహిని ఆయనమాటల్ని వినిపించుకోలేదు. గుండీ పెట్టుకుంటూ రెండడుగులు గుమ్మంవైపు నడిచింది. నౌకర్ను పిలిచింది. రాత్రికి ఏమేమి వంటకాలు చెయ్యాలో పుర్మాయించింది. మోటారు తయారుగా ఉంచమని ఆజ్ఞాపించింది—"నువు అంటూవుంటావుగా నాన్నా! ఆ పెద్దబండి నాదేనని. మా—యిద్దరిదీనా ?"

ఈ అసందర్భపు మాటకు తండ్రి, ఆశ్చర్యపడుతూ చూచాడు. మోహిని మళ్ళీ వెంటనే అందుకుని "నువ్వే చెబుతూవుంటావుగా నాన్నా ! కాడిలాక్ దూరపుప్రయాణానికి బాగా ఉపయోగిస్తుందని !" అన్నది మ

"దూరపు ప్రయాణమా? ఏమిటి నువ్వనేది?"

మోహిని మందహాసం చేసింది. "ఇల్లు వొదిలిపెట్టి వెళ్ళిపోతున్నాను నాన్నా! అదేగా మీరు కోరేది? ఎలాగైతేనేం? మీకోరిక నెరవేరుతుంది, నిశ్చింతగా ఉండురుగాని!"

"నిన్ను నా చేతుల్లోనించి తీసుకువెళ్ళేవాడు రావాలిగాని.... ఆ సుదినం అంతతేలిగ్గా నాకు లభిస్తుందా? చెప్పు! ఏసినిమాకు నువు వెళ్ళేది?" అన్నాడు తండ్రి గంభీరముద్రదాల్చి.

"సినీమాకు వెళ్ళటంలేదు."

"మరెక్కడికి వెడుతున్నావు?"

వెంటనే మోహిని చెప్పలేకపోయింది. కొంచెం ఆగి "ఏమో, ఇంకా తేల్చుకోలేదు" అన్నది.

తండ్రి చకితుడైనాడు. "విషయం ఏమిటి? చెప్పవేం?"

"ఇప్పుడే వచ్చేస్తాను. రాకపోతే....రాకపోతే...." ఇక ఆమె మాటాడలేకపోయింది. తండ్రిముఖంలోకి చూస్తూ నిల్చిపోయింది. చివరకు తననుతాను సమీకరించుకొని "రాకపోతే, మోహిని అసలు లేదనే అను కోండి!" అన్నది.

తండ్రి ఆ అయోమయపు పిల్లవైపు చూస్తూ ఉండిపోయాడు. ఆయన మాటలు వినడానికి ఆమె అక్కడ నిలిచివుండలేదు. వెనక్కు తిరిగి పోనే పోయింది.

## 2

రండి, తమాషా చూదాం. అక్కడ శబ్దాడంబరం కాదు; అసలైన కవిత్వం దొరుకుతుంది. ఒకవయస్సులో ఆవేశం అధికంగా ఉంటుంది; నిర్ణయబుద్ధి ఉండదు. ఆవేశం స్వకీయమైన ప్రతిఘటనతో తనను తానే నిరోధించు కోవటంకద్దు. దాన్ని సంయమం అనటానికి వీల్లేదు. మందత్వం అనాలి— దెబ్బతినడం అనాలి. దానివల్ల శాంతి చేకూరదు. వికలత్వం, వైఫల్యం కలుగుతాయి.

ఆ కాడిలాక్ కారు వచ్చి జితేన్ పనిచేస్తున్న ఆఫీసుముందు ఆగింది. మోహిని హారన్ మోగించింది. గబగబా అలా చాలసార్లు మోగిస్తూనే ఉంది.

జితేంద్రుడు ఒక సాధారణకుటుంబంలో జన్మించాడు. అయినా కొద్ది వయసులోనే మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించాడు. ఒక ఆంగ్ల పత్రిక సంపాదకీయవర్గంలో పనిచేస్తున్నాడు. మొదటిసారి హారన్ మోగింది, అతడు లేవలేదు. రెండవసారి మోగింది, అయినా లేవలేదు. మూడోసారి మోగినా లేవలేదు. కాని తాను చాలసేపటినించీ ప్రతీక్షిస్తునే ఉన్నాడు. చివరకు లేచి బయటికి వచ్చాడు. డ్రయివరు కూర్చునేచోట మోహినే కూర్చుంది. ఈ మోటారుకారుమీద మోహిని రావడం.... అతడు చూడ్డం ...అదే మొదటిసారి. ప్రసన్నముఖుడై ఆమెకు నమస్కారం చెప్పాడు. పక్కసీటు తలుపు తెరచి సిద్ధంగానేఉంది. కాని ఆమె ముఖం మరోవైపు తిరిగివుంది. అతడు వచ్చి మోహినిపక్కనే కూర్చున్నాడు, తలుపువేసేశాడు. మోహిని ఇప్పటికీ పెదవి విప్పి మాటాడలేదు. అతడు లోపల వచ్చి కూర్చుని, తలుపు వేశాడో లేదో ఆమె మోటారు 'స్టార్టు'చేసింది.

ఇవాళ మోహిని తీరు మరోరకంగా కనిపించింది జితేంద్రునికి. ఏదో ఒక ప్రత్యేకత, సన్నద్ధత కనిపిస్తున్నాయి ఆమెలో. మోటారు బయలు దేరింది. "ఎక్కడికీ ఈ పోవటం?"—అడిగాడు జితేంద్రుడు.

"సినీమాకు."

"సినీమాహాలు దాటిపోయిందిగా!"

"అసలు సినీమాకు."

జితేంద్రునికి అర్థంకాలేదు. మోహిని ముఖంలోకి పరిశీలనగా చూచాడు. ఆ ముఖకవళికలో ఏకాగ్రత ద్యోతకం ఔతోంది. అంతకుమించి మరేమీ విశదంకావటంలేదు. విచలితుడైనాడు. "ఏమిటా అసలు సినీమా మోహినీ?"

దానికి సమాధానంగా మోహిని ఏక్సిలేటర్ మీద పాదం దబాయించి నొక్కింది. మోటారువేగం హెచ్చింది. ఆమె పెదవుల చివరల్లో వొంపులు తిరిగాయి; మళ్ళీ మామూలుగా వచ్చాయి. ఆమె ఏమీ మాటాడలేదు. మోటారు వేగంగా సాగిపోతున్నది. న్యూఢిల్లీ పొలిమేరలోకి వెళ్ళింది. జితేంద్రుడు ఆమె బుజంమీద చెయివేసి "ఏమిటో తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు న్నావే!" అన్నాడు.

ఆబుజంమీద పులకాంకురాలు లేవు. ఆమె ఇటు తిరగనేలేదు, మాటాడనూలేదు."

"వినిపించటంలేదా? ఏమిటి నీకోరిక?"

"తమ కోరికేమిటో చెప్పండి?" అన్నదామె ఎదురుగా రోడ్డుచూస్తూ.

"నా కోరికా?"—మరుక్షణమే తన్ను తాను నిగ్రహించుకుని "సినీమాలో మన సీట్లు...." అన్నాడు.

"లేవు సీట్లు."

"లేవా? ఏం?"

"నేను రిజర్వు చేయించలేదు."

"చేయించలేదా? అయితే...."

"ఏమిటయితే?"

"మోహినీ!...."

"నువు సినీమాకు వెడతావా?"

"సరే, నిన్ను తీసుకువెళ్ళి దిగబెడతాలే...." అన్నదామె.

"నిన్ను తీసుకువెళ్ళి దిగబెడతాను....అంటే....నీఅభిప్రాయం ఏమిటి మోహినీ?"

"కోప్పడబోకండి. నేను రాను."

మాటలు ఆమె పలుకుతున్నటుగా లేవు, విసిరివేస్తున్నట్టుగాఉన్నాయి. నొసటిమీద, మెడమీద గాలికి చెదరి చిందులువేస్తూన్న నెరికురులు....బుజంమీద ఊగిఊగి ఒయ్యారంగా కులుకుతూన్న పైటకొంగు....అతన్ని సవాలు చేస్తున్నట్టుగా ఉన్నాయి. అన్నాడు: "మోహినీ! ఏమిటి నీ యీ వ్యవహారమంతా?"

"ప్రేమ!" అన్నదామె పెదవులచివర రవంత చిరునవ్వు చిలుకరిస్తూ. ముఖం త్రిప్పి అతనివైపు చూడలేదు.

"ఈ మోటారు ఇలా ఎంతదూరం తీసుకుపోతావు?"

"అక్కడికే....ప్రేమనగరుకు!"

"మోహినీ!" అతడామె భుజంమీద చేయివేశాడు.

"తాక బోకు. దూరంగా ఉండే మాటాడు. లేకపోతే ఇద్దరం చచ్చి పోతాం."

జితేంద్రుడు చేయి వెనక్కు తీసుకున్నాడు. "నువ్వు మోటారు నడుపుతున్న వేగం చూస్తే నిజంగా చచ్చిపోతామనే అనిపిస్తున్నది."

"—నీకు ఇష్టమేనా మరి?" అడిగింది మోహిని ఎదురుగా దారివైపు చూస్తూ.

"ఇష్టం కాకపోవటమేం? కాని....నిజంగానేనా?"

"నీకు అనుమానమా?"

"నేను నీతో ఎన్నిసార్లు చెప్పాను: రా, పోదాం రా........"

మోహిని అతనిమాటకు అడ్డంవచ్చింది: "ఈ రోడ్డు తిన్నగా బొంబాయి వెడుతుంది. తీసుకుపోనా?"

ఆమె చేతులు రెండూ చక్రంమీద ఉన్నాయి. కళ్ళకు నీలి అద్దాల జోడుపెట్టుకుంది. జితేంద్రుడు ఆమె కన్నుల్లోకి చూడలేకపోతున్నాడు; ముందుకు వంగి ఆమె రెండుచేతులూ పట్టుకోనూలేకపోతున్నాడు. మోటారు వేగం దుస్సహంగా ఉంది. "నిజంగా వచ్చేస్తావా మోహినీ!"

మోహిని తల ఊపింది. వెంటనే నవ్వింది. ఆ నవ్వు చాల కఠినంగా ఉంది. "కావలసినంత పైకంకూడా వెంట తీసుకునే వస్తున్నాను."

మోటారువేగం రెచ్చిపోతున్నది. జితేంద్రుడు ఆమెహృదయాన్ని అర్థంచేసుకోలేకపోతున్నాడు. ఆమెముఖకవళికలో కాఠిన్యం ఉంది; క్రూరత కనిపిస్తున్నది. మరెప్పుడైనాఅయితే జితేంద్రునిలోని పౌరుషం ఇటువంటి వ్యవహారాన్ని సహించలేకపోయేది. కాని మోటారు తీవ్రంగా పరుగెత్తి పోతోంది; చాల ఘోరంగా ఉంది వేగం. డ్రయివరుసీటులో కూర్చుని ఆవిధంగా స్టీరింగ్ చేస్తున్న ఆమెను తానేం చెయ్యగలడు? "మోహినీ! అదిగో హుమాయూన్ సమాధి! ఇక్కడ కాస్త ఆగుదామా?" అన్నాడు.

మోహిని మాటాడలేదు. మోటారువేగం తగ్గనూలేదు.

"ఆపు. ఇక్కడ కాసేపు కూర్చుందాం. వినిపిస్తుందా?....వినిపించటం లేదా?"

మోహిని ఎదురుగా ఏ దూరభూములో చూస్తున్నది. "ఏమిటీ? ఏమన్నావు ?"

"మనం తిరిగి వెళ్ళద్దూ! ఇంకా సినీమాకు...."

మోహిని ఆమాటలు విన్నది; కాని ఏమీ మాటాడలేదు. ఆమె ముఖ కవళిక దుర్భేద్యంగా, చీకటిమయంగా ఉంది.

"నామాట వినిపించటంలేదా ? ఆపవా ?" అన్నాడు జితేంద్రుడు దూకుడుగా.

మోహిని పెదవులచివరలు వ్యంగ్యసూచకంగా వొంపుతిరిగాయి. "ఆపుతున్నాను" అన్నది. మెల్లిగా శరీరంలోని పట్టు సడలించింది; పాదాలు పైకి కొద్దిగా లేచాయి. మోటారు వేగం తగ్గింది. "నువు చెప్పింది నిజమే జితేన్! మనం సినిమా చూడాలి; అంతకుమించి ఏమీ అక్కర్లేదు. అంతే కదూ?...." ఆమె బ్రేక్‌మీద పాదం నొక్కుతూ "ఏమంటావు? మోటారు సమాధిదగ్గరకు తీసుకపోనా ? నీ మనసంతా సమాధిమీదే ఉన్నట్టుంది !" అంటూ ముఖం అతనివైపు త్రిప్పి, "చెప్పుమరి, సమాధికి పోదామా-లేక బొంబాయి పోదామా ?" అన్నది.

జితేంద్రుడు ఎంత దూకుడుగా జవాబు చెప్పదలచుకున్నాడో మరి! మోహిని ప్రశ్న పూర్తిఅయిందో లేదో తటాలున ఇంగ్లీషులో అనేశాడు: "టేక్ మి టు హెల్ విత్ యూ!"(నీతోపాటు నన్ను నరకానికి తీసుకుపో!)

మోహిని పకపకా నవ్వింది. "సినిమా నీకు 'హెల్ (నరకం)' అయిపోయిందా? ఇదెప్పటినుంచీ? ఇదివరకు 'హెవెన్(స్వర్గం)'లా ఉండేదిగా! గాభరాపడబోకు, అక్కడికే తీసుకుపోతాలే."

జితేంద్రుడు ఇక సహించలేకపోయాడు. చక్రంమీదినించి ఆమె రెండుచేతుల్నీ లాగి ఒక్కగుప్పెట్లో బంధించాడు; రెండోచేత్తో ఆమె కళ్ళ జోడు లాగేశాడు. "నువు అసలు స్పృహలో ఉన్నావా మోహినీ !"

ఆమెముఖంలో భయంగాని, ద్వైధీభావంగాని కనిపించలేదు. నవ్వే ఉబికింది. "ఉహుఁ, లేను" అన్నది జవాబుగా.

"ఏమిటీ ఆట!"

"స్పృహలేని ఆట!"

నవ్వుతూన్న ఆమె కన్నులోకి చూస్తూ ఉండిపోయాడతను. వాటిలో

తొ్రుపాటుగాని, నిరసనభావంగాని లేవు; ఒక వ్యంగ్యరేఖమాత్రం తొణి కిసలాడుతోంది. ఆమెను చూస్తోంటే అతని నోటివెంట మాటరాలేదు. ఆ నేత్రాల్లో రసమో! విషమో!....పెదవులు పలుచగా, ఎర్రగా, కొంచెంగా కదలాడుతున్నవి; ఆ కదలికలో ఎటువంటి నృత్యపాటవమో అది! తెల్లని మెడమీద నీలిసోగవెంట్రుకలు ఆడుకుంటున్నాయి. ఆక్రింద వక్షస్సీమ; దానిపై దువ్వలువపైట....తనకు తెలియకుండానే ఈ అందమంతా చూస్తూ ఉన్నాడు. అతని గొంతు ఎండిపోయింది.

తన చేయి విడిపించుకోటానికి ప్రయత్నిస్తూ మోహిని కిలకిలా నవ్వింది. "వొదిలెయ్యి, వొదిలెయ్యి. ఏమిటలా చూస్తున్నావు? నేనేగా! కల కాదులే కరగిపోవటానికి, నేనేం ఎగిరి మాయమైపోవటంలేదు. మనం ఇంకా మాటాడుకోవలసిన విషయాలుకూడా ఉన్నాయి. ఏం, ఉన్నాయి కదూ! సరే రా, ఆ నీ గోరీదగ్గరకే పోదాం."

జితేంద్రుడు ఆమెచేయి విడిచిపెట్టలేదు. "ఔను, నిజమే చెప్పావు. నాకు గోరీ కట్టించటమే ఇక నీకు మిగిలివున్న పని."

మోహిని నవ్వింది. "కోప్పడబోకులే. రా, పోదాం."

మోటారు దిగి ఇద్దరూ సమాధిఆవరణలోకి వెళ్ళారు. ఒకచోట కూర్చున్నారు.

"ఏదీ, నా ఉత్తరం ఇలా ఇచ్చెయ్యి" అన్నాడు జితేంద్రుడు.

మోహిని మందహాసంచేసింది.

"ఇలా ఇచ్చెయ్యి."

"నాదగ్గర లేదు."

"ఏంచేశావు?"

"మా నాన్నగారిదగ్గర ఉంది."

"వారిదగ్గర కెలా పోయిందీ?"

"నేనే ఇచ్చాను."

"నువ్వే ఇచ్చావా?" జితేంద్రునికి బాగా కోపంవచ్చింది. "నువ్వు ఇంకా నాన్నగారి పంజరంలో పట్టవేనన్నమాట! నాకుతెలియధాసంగతి."

"క్షమించు జితేన్! ఎదురుగా ఇక్కడే వున్నాగా! నువు చెప్పదలచిందేమో చెప్పరాదూ!"

"చెప్పేదేముంది? నిన్నే నువు ప్రశ్నించుకుని, నువు చెప్పదలచిందేమిటో చెప్పు."

"నేనేమీ చెప్పను. కాని...."

"నువు శ్రీమంతురాలివి; నేను కష్టంచేసి బ్రతికేవాడిని. ప్రతిపైసా నేను చెమటోడ్చి సంపాదించాలి. అయినాకూడా మనిద్దరిమధ్య ఏమిటిదంతా? బాగా ఆలోచించుకో మోహినీ! నువ్వేం పొరపాటు చెయ్యటంలేదు కద!"

"ఆడవాళ్ళుకూడా ఆలోచించగలరా?"

"కాని నువు ఆలోచించుకోవాలి, తప్పదు. నేను—"

"ఆలోచించటం మా ఆడవాళ్ళకు చాతకాదు. అయినా నువు మాటిమాటికీ అలాగా...."

"నువు ఆలోచించుకోటం చాల అవసరం."

"అయితే సరే; నీమాటప్రకారం ఆలోచించిచూస్తేమాత్రం నాది పొరపాటులాగే కనిపిస్తున్నది."

"ఏమిటి?...." జితేంద్రుడు అధీరుడైనాడు.

మోహిని కంఠస్వరం తీక్షణంగా మారింది. "గూఢంగా ఎందుకూ? బట్టబయలుగానే చెప్పరాదూ? నువు కష్టంచేసుకుని బ్రతికేవాడివి; మేం తేరతిండి తినేవాళ్ళం. అదేగా నీ ఉద్దేశం?"

"కాదు మోహినీ! అదికాదు నా ఉద్దేశం" అన్నాడు జితేంద్రుడు వ్యగ్రచితుడై.

"నాకు అర్థమైందిలే. నీకు పెళ్ళిఅక్కర్లేదు; ప్రేమకావాలి, అంతే" అన్నది మోహిని పూర్వపు వైఖరిలోలోనే.

"మోహినీ!"

"నీకు ప్రేమకూడా అక్కర్లేనట్టుగానే కనిపిస్తున్నది. నువు నాలో 'నన్ను' చూడలేకపోతున్నావు; ఒక శ్రీమంతురాల్ని చూస్తున్నావు. అది ప్రేమ అనిపించుకుంటుందా? నీ కళ్ళకు నేను కనిపించటంలేదు; మోటారు బంగళా కనిపిస్తున్నాయి. అది ప్రేమ ఔతుందా?"

జితేంద్రుడు తన రెండుచేతుల్లో ఆమెను పొదువుకుని గుండెకు హత్తుకోవాలనుకున్నాడు. "మోహినీ!"

మోహిని అతన్ని వారిస్తూ ఆవేశంతో వివశయైపోయింది. "నేను.... ధర్మాన్నిపాటిస్తూ జన్మజన్మాంతరాలవరకూ ఈ అనంతజీవయాత్రలో నీకు చేదోడుగా ఉండిపోదామని ఎంతో ఉబలాటపడ్డాను. కాని నువు—నీ—" ఆమె కంఠం రుద్ధమైపోయింది. జితేంద్రుడు ఆమెను కావిలించుకుందామను కున్నాడు. కాని ఆమె అతన్ని వారించింది. "ఏమిటో ఈ నీ సందేహం మరి! అబ్బ! వొదిలిపెట్టు జితేన్! ఇక నేను ఏవిధివిధానంలో బ్రతుకు గడుపుకోవాలో! ఇన్నాళ్ళనించీ నువు ఉన్నావుకదా అనుకున్నాను. తీయ తీయని కలలుగంటూ నవ్యప్రపంచంలో నీతోపాటు విహరిద్దామనుకున్నాను. అక్కడ మనిద్దరిమధ్య ఈ విభేదాలు ఉండవుకదా అని ఆశించాను. నీ మనసు లోని ప్రేమతో ఇద్దరం ఒకటైపోతా మనుకున్నాను!"

రెండుచేతులతో అతడు ఆమెను దగ్గరకు పొదువుకుంటూ కంపిత కంఠస్వరాన "మోహినీ! నేను—" అన్నాడు.

"ఉండు జితేన్! నన్ను అడ్డగించబోకు. నా వొళ్ళు నాకు తెలియ టం లేదిప్పుడు. ఎకాయెకి సాగిపోదామనే బయలుదేరి వచ్చాను. ముందు చూపేగాని వెనుకచూపు పెట్టుకోదలచుకోలేదు. కాని నే నేంచెయ్యను మరి! నీ కీ మోటారు, బంగళా కంటకంగా వున్నాయి....వాటిమీదే నీకు మక్కువ ఎక్కువైపోతున్నదో యేమోమరి! లేకపోతే వాటిని నీవు మరచి పోనేలేవేం? నిన్ను అవే అస్తమానం వెన్నాడుతున్నాయేం? వాటికోస మనే నన్ను వాంఛిస్తున్నావన్నమాటా!" అంటూ రెండుచేతుల్లో ముఖం కప్పుకుని వెక్కివెక్కి ఏడువసాగింది. అతడామెముఖాన్ని పైకి ఎత్తటానికి ప్రయత్నిస్తూ "మోహినీ! ఇటు చూడు! ఏమిటీగొడవ! ఇదిగో నామాట విను, మోహినీ!" అన్నాడు.

మోహిని మరేమీ మాటాడలేదు. అవతలకు జరిగి, వెక్కివెక్కి ఏడుస్తూఉంది.

జితేంద్రునికి ఏమీ అర్థంకాలేదు. విభ్రాంతపోయి కూర్చున్నాడు.

దుస్సహంగా ఉన్నాయి క్షణాలు. అతని మనసులో ఏమనుకుంటున్నాడో యేమో! ఆమె బక్కపలచని శరీరాన్ని అలా అమాంతం ఎత్తి....నామ రూపాలులేకుండాపోయేట్టు....ఆ పనికిమాలినయువతిని విసురుగా ఆకాశం లోకి విసరిపారేద్దామనుకుంటున్నాడా? లేక తానే ఆమెపాదాలమీద సాష్టాం గంగా వాలిపోయి శూన్యంలో లీనమైపోదామనుకుంటున్నాడా? కాని అతను ఏమీ చేయలేదు. చకితుడు, విమూఢుడు, నిశ్చేష్టుడు—రాయిలా కూర్చుండి పోయాడు, వెక్కివెక్కిఏడుస్తూన్న ఆమెకెదురుగా.

కొంతసేపటి కామె తనంతతానే చిత్తస్వాస్థ్యం పొందింది. లేచి నిల్చుంది. "క్షమించు జితేన్! చాల ఆలస్యం ఐనట్టుంది" అంటూనే ఆమె మోటారుదగ్గరికి నడిచివెళ్ళింది.

జితేంద్రుడు అలాగే కూర్చున్నాడు. స్పృహ ఉన్నట్టులేదు. తాను అక్కడే....ఉన్నవాడు ఉన్నట్టుగా బండరాయిలా మారిపోతే బాగుండునే! ఆమోటారుకూ, బంగళాకు, తనకూ, సర్వానికీ నిప్పంటించేస్తే భస్మీపటలంగా సర్వం తగలబడిపోతూఉండునే!

హారన్ వరసబెట్టి మోగసాగింది. చివరకు అతను లేచాడు. వచ్చి తన సీటులో కూర్చున్నాడు ఆమెప్రక్కనే.

మోటారు తిరుగుదారి పట్టింది. ఎవరూ ఏమీ మాటాడలేదు. టైముకు సినీమాహాలుదగ్గరకు వచ్చారు. మోహిని అతని మోకాళ్ళమీదుగా వంగి తలుపు తెరచింది. జితేంద్రుడు ఏమీ మాటాడలేకపోయాడు. ఒక్క క్షణం కూడా ఆలస్యంచెయ్యకుండా మోటారు దిగాడు. కాళ్ళు నేలమీద ఆనాయి. మోహినికూడా దిగివస్తుందని అతడనుకోలేదు; ఆమెకోసమని ఆగనూలేదు. చటుక్కున తలుపువేసేశాడు.

మోహినికూడా ఏమీమాటాడలేదు. జితేంద్రుడు సినిమాహాలువైపు నడిచివెళ్ళాడు. మరికాసేపటికి కనిపించలేదు. ఆమె మోటారు నడుపుకుని ఇంటికి వెళ్ళిపోయింది.

తండ్రియెదుటికి పోయి, "క్షమించు నాన్నా! గంటకుపైగా ఆలస్యమై పోయింది" అన్నది చేతిగడియారం చూచుకుంటూ.

# 3

మూడురోజులు గడిచాయి. తండ్రి అడగనూలేదు, కూతురు చెప్పనూ లేదు. ఆమె ఎప్పుడూ ఇంట్లో పనిపాటలు చూస్తూఉండేది. ఎక్కువగా ఏమీ మాటాడేదికాదు. తండ్రి చూస్తూ ఊరుకునేవాడు; తనకు తానై ఏమీ అడిగేవాడు కాదు.

"నాన్నా! ఇక నాకు నువ్వు యేదన్నా సంబంధం చూస్తావా?" అడిగింది మోహిని ఒకనాడు.

"ఏం? ఎందుకూ?" తండ్రి ఆశ్చర్యం ప్రకటించాడు.

"ఉహుఁ. ఏంలేదు."

తండ్రి నవ్వాడు. "నేను చెప్పానుకదూ: పోట్టాడి రావద్దని. కాని ఉపదేశాలు సమయానికి జ్ఞాపకంరావులే. ఆఖరికి పోట్టాడే వచ్చావన్నమాట. సరే, నేను ఆలోచిస్తాలే."

"నీ యిష్టం."

తండ్రి సంతోషంగా నవ్వాడు. "మోహినీ, నువు చాలానే చదువు కున్నావు; కాని ఏంలాభం? చదువునేర్చిన ఆడపిల్ల తన పెళ్ళివిషయంలో ఇతర్లు చెప్పినట్టే విని ఊరుకుంటుందా!....కాని నువుమాత్రం...."

తండ్రి ముఖకవళికలో ఒక సంతృప్తి ద్యోతకం అయింది. అది చూచి మోహినికి సిగ్గు వచ్చింది. ఇక అక్కడ ఒక్క క్షణంకూడా ఉండ లేదు.

అసలు జరిగిన సంగతేమిటో తెలుసుకోవాలని తండ్రి కోరిక. వార్తా పత్రిక ఆఫీసుకు ఫోన్ చేశాడు. జితేంద్రునితో మాట్లాడాలని ఆయన ఉద్దేశం. కాని అతడు రాజీనామాఇచ్చి వెళ్ళిపోయాడనీ, ఇప్పుడాఫీసులో పని చేయటం లేదనీ ఫోనులో ఎవరో చెప్పారు. అందువల్ల ఆయనకొకరకమైన సంతృప్తే కలిగింది. కాని మోహినిమీద కోపంకూడా వచ్చింది. ఆతరువాత జితేంద్రుడు ఈపట్నంలోకూడా లేకుండా వెళ్ళిపోయాడని తెలిసినప్పుడు "జితేన్ ఎక్కడికి వెళ్ళాడో ఏమో నీకేమైనా కబుర్లు తెలిశాయా?" అని అడిగాడు కూతుర్ని.

"ఉహుం."

"నేను ఫోనుచేసి కనుక్కున్నాను. ఉద్యోగం వదలుకుని వెళ్ళిపోయాడట. ఊళ్ళోకూడా లేడుట."

వింటూ మూగిమొద్దులా నిల్చుంది మోహిని.

"అతనితో నువ్వు ఏమన్నావు, ఏంచేశావు? ఏమైందీ అసలు?"

"మనం తేరగా కూర్చుని తినేవాళ్ళం నాన్నా!"

రావుసాహెబ్ నవ్వాడు. "నిజమేనమ్మా! కూర్చుని తినేవాళ్ళం కాకపోతే ఏమిటిమరి! నేనెప్పుడూ ఎంత ఖాళీగా ఉంటున్నానో చూడు. నేను చేసేపని ఏముందనీ? ఎవరన్నా అడిగితేమాత్రం ఏం సమాధానం చెబుతానూ? నిజమే, తేరగా కూర్చుని తినేవాడినే."

మోహినికోపం ఇంకా చల్లారలేదు. మాటపట్టింపు ఎక్కువ. సమాధానమేమీ చెప్పలేదు.

రావుసాహెబ్ పకపకానవ్వాడు; "మీ యిద్దరిమధ్య కొన్ని మాటలేవో వచ్చాయన్నమాట: మాటలు మంచి యిబ్బందే తెచ్చిపెడతాయి. 'తేరగా కూర్చుని తినేవాడు' అనేమాట నాకు సంతోషాన్నే కలిగిస్తుంది. కష్టంచెయ్యటం మంచిదే. కాని కష్టాన్ని అమ్ముకోటమనేది నాకు నచ్చదు. శ్రమను అమ్ముకోనివాడుమాత్రమే తేరతిండి తినటంలేదని నా అభిప్రాయం. స్వతంత్రంగానే శ్రమించాలి; హాయిగా కూర్చునే తినాలి, అసలు బ్రతుకంతా స్వేచ్ఛగానే ఉండాలి! అదీ నా ఉద్దేశం. కూలిచేసి సంపాదించదలచుకున్నవాడు మరొకడిని యజమానిగా అంగీకరించవలసేవుంటుంది. ఈవిధంగా యజమాని సేవకుడు అనే తరగతులు ఏర్పడుతున్నాయి. నా దృష్టికిమాత్రం స్వతంత్రంగా పనిచెయ్యటం, హాయిగా కూర్చుని తినటం, స్వేచ్ఛగా బ్రతకటం....ఇవన్నీ ఒకదానికొకటి పొంతనలేని విషయాలు. వయసులోవున్న మీరుకూడా ఇలాంటి శబ్దాల్ని పురస్కరించుకుని పోట్లాడుకున్నారన్నమాట! ఒకవైపు జీవితంలో ప్రవేశిస్తూనే ఇలాంటి పొరపాట్లకు మీరు ఎలా లోబడిపోతారో నాకు అర్థంకాదు."

"మనం శ్రీమంతులం, వాళ్ళు బీదవాళ్ళు. మనకూ వాళ్ళకూ కలయిక ఎలా ఏర్పడుతుంది?"

"నీకేమన్నా మతిపోయిందా మోహినీ! కలయిక అనేది నీకూ నాకూ కూడా పొసగడంలేదు....ఈక్షణాన. ఏర్పరుచుకుంటేనే అది ఎర్పడుతుంది. ఏర్పరచుకోకపోతే ఏర్పడదు."

"ఐశ్వర్యం ఒక మహాపాపంటకదూ!"

"సరే పాపమే; అయితే?"

"పాపం ఎందుకౌతుందీ?"

"అరిభగవంతుడా! పాపపుణ్యాల్నిగురించి ఇప్పుడు నీతో నేను చర్చించాలాయేమిటి? అయితే ఇదేనా నిన్ను పోట్లాడించింది?"

"పోనీలే నాన్నా, ఇక ఆవిషయం మళ్ళీ ఎత్తనేవద్దు అసలు. మన స్థితి ఇదీ. ఎవరిస్థితి వాళ్ళదే. ఎవడిస్థితిలో వాడు ఉండేందుకు స్వతంత్రం లేదా? 'నువ్వెందుకు శ్రీమంతుడివి కాలేదు' అని నే నెవరినేనా వెళ్ళి అడిగా నేమిటి? ఎవరేనా వచ్చి 'మీరు శ్రీమంతులెందుకైనారు?' అని మనల్ని ఎందుకు అడగాలి? పోయి భగవంతుడిని అడగమనండి; కోర్టులో వెళ్ళి అడగమనండి లేకపోతే. ఎవరి యిష్టం వాళ్ళది. పేదరికం నచ్చనివానికి ప్రయత్నించి శ్రీమంతుడు కావాలని కోరుకునే హక్కు ఉంది. ఐశ్వర్యం నచ్చనివానికి బీదవాడుగానే ఉండిపోయే హక్కు ఉంది. ఇందులో ఒకరు చెప్పేదేముంది; వినేదేముంది?"

ఆ మెరోషం ఏమిటో తండ్రికి అర్థంకాలేదు. బహుశా కొంచెంగా అర్థమయిందేమో! ఇక ఆప్రసంగం మానివేశాడు. తన మనస్సులోవున్న ఆలోచనలు చెప్పాడు: ఆయనకొక మిత్రుడున్నాడు. ఆ మిత్రుని కొడుకు విదేశాల్లో బారిష్టరుపరీక్ష ప్యాసై తిరిగివచ్చాడు. మోహిని ఏమంటుందోనన్న అనుమానంవల్లనే ఇన్నాళ్ళనించీ ఈ ప్రసంగం తీసుకురాలేదు. అదీగాక కుర్రవాడు రెండేళ్ళనించీ విదేశాల్లోనే ఉన్నాడు. కాని పిల్లవాన్ని తండ్రి తనకు చాల పాతస్నేహితుడు; భువనమోహినిని తన కొడుక్కు చేసుకోవా లన్న అభిలాష చాలకాలంగా ఆయనకు ఉన్నది. మోహినికి గనక అభ్యం తరం లేకపోతే కదిలించి చూస్తానన్నాడు. చూడ్డం ఏమిటి, అంతా నిశ్చయం అయిపోయినట్టే.

తనకు లేశమాత్రమూ అభ్యంతరంలేదని మోహిని చెప్పేసింది.

"అయినా మీరొకసారి ఒకరినొకరు చూచుకోండి ; ఆలోచించు కోండి" అన్నాడు తండ్రి.

"ఏమక్కర్లేదు" అన్నది కూతురు.

"అతడైనా నిన్ను ఒకసారివచ్చి చూడనీ."

"ఒకసారేం! పదిసార్లు చూడమనండి. నాకేం ? ఎలా చూచుకున్నా సరే."

"అదేమిటి ? నువు అలా మాటాడతావేం ?" అన్నాడు తండ్రి మందలింపుగా.

"ఎలా మాటాడుతున్నాను నాన్నా ! నేను తండ్రిచాటు బిడ్డను. నువు ఎలాచెబితే అలా నడుచుకుంటాను. అదీ నేను తెలియజెప్పదలచుకున్న విషయం."

ఇంతకూ తరువాత జరిగిన విషయంఏమంటే—ఆ మిత్రుని పుత్రుడు నరేశచంద్రుడు పెళ్ళిచూపులకు వచ్చాడు. పెళ్ళికొడుకుతోపాటు ఇద్దరు స్త్రీలుకూడా వచ్చారు. రెండురోజులు ఉన్నారు. పిల్ల నచ్చింది; ప్రసన్న చిత్తులై వెళ్ళారు. ఇరుపక్షాలవారూ పెళ్ళిప్రయత్నాలు చేసుకున్నారు. త్వరలోనే వివాహం అయింది.

# 4

వివాహమై నాలుగు సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు ఇంకా తెల్లవారలేదు ; చీకటిగానే ఉంది. దర్బాన్ గదిగుమ్మందగ్గరకు వచ్చి తలుపు కొట్టాడు. ఆసమయాన మోహిని టేబిల్‌మీది దీపం వెలుతురులో పుస్తకం ఏదో చదువుకుంటోంది. భర్త నిద్రపోతూనే ఉన్నాడు. "ఏం? ఎందుకూ?" అన్నదామె తలుపుచప్పుడు వినగానే.

"ఎవరో వచ్చారమ్మగారూ !"

"ఎవరూ ?"

"సామానుతోకూడా వచ్చారు. ఏగదిలో ఏర్పాటుచేయమన్నారూ ?" మాటఅలికిడి తెలియగానే నరేశచంద్రుడు "ఏమిటది ? వెళ్లు వెళ్ళు,

నిద్రపాడుచేస్తావేం?" అంటూ ఇటువైపు మళ్ళాడు. మోహినిచేతిలోని పుస్తకంతీసి అవతల పెట్టాడు. ఆమెను లేచిపోనీకుండా చెయ్యాలని అతని కోరిక.

"ఉండండి; వొదిలిపెట్టండి. నేను లేచి వెళ్లాలి."

అంత తెల్లవారుజామునే ఆమె లేచి వెళ్ళటం అతని కిష్టంలేదు. "ఎందుకూ అంతతొందర నీకు?"

"లేచి కాస్త బెటికి వెళ్ళి చూడండి; ఎవరో వచ్చారుట. నేను వెళ్ళాలా?"

"పోనిద్దూ ఎవరైతేనేం! భలేసమయమే దొరికింది; ఎవరోగాని!"

"లేచి కొంచెం చూచిరండి. ఆ చివరిగదిలో ఏర్పాటుచేయిద్దామా?"

ఆమె ఈవిధంగా తన్ను అనునయించటం అతనికి బాగుండలేదు. మంచంమీదినించి లేవకుండానే 'బటన్' నొక్కాడు. గుమ్మందగ్గరకు నౌకరు వచ్చివుంటా డనుకున్నాడు. "ఎవరో వచ్చారుటకదూ! వారికి ఆచివరిగదిలో ఏర్పాటుచెయ్యి. వారి కేమీఇబ్బంది కలక్కుండా చూడు" అన్నాడు.

నౌకరు వినే ఉంటాడు; ఆజ్ఞ శిరసావహించి వెళ్ళే వుంటాడు. ఈలోగా మోహిని వెళ్ళి తలుపుతీసింది. బయటికి వెళ్లాలని కాబోలు ఆమె ఉద్దేశం! గుమ్మంలో దర్బాన్ అలా ఎదురుగా నిల్చునే ఉన్నాడు. ఆమె హఠాత్తుగా ఆగిపోయింది.

నరేశుడు అది చూచాడు. "ఏం? నువు ఇంకా నేలేదా అక్కడి నించి?" కోపంగా అడిగాడు.

వెంటనే దర్బాన్ తిరిగి వెళ్ళిపోయాడు. మోహిని ముందడుగు వెయ్యలేదు, నవ్వుతూ వెనక్కు వచ్చింది. "పొద్దున్నే కోప్పడుతున్నారే! ఇక లేవరాదూ? బయట చూడండి: ప్రభాతశోభ ఎంత అంధగా ఉందో!"

"తలుపు వేసిరా" అన్నాడు నరేశుడు.

ఆమె తలుపైతే వెయ్యలేదు. పేముకుర్చీ ఒకటి మంచానికి దగ్గరగా లాక్కొని కూర్చుంది. నరేశుని పాదాల్లో మెల్లిగా గోకుతూ "ఇక లేవండి, తెల్లారుతోంది...." అన్నది.

"నామాట వినిపిస్తోందా! తలుపుగెడవేసి ఇలారా" అన్నాడు పట్టుదలగా.

"ఇక్కడే కూర్చున్నాగా! మీ విదేశాల్లో బ్రాహ్మముహూర్తమంటూ ఎరగరుకాబోలు! లేచి చూడండి: బైట ఎంత శోభగా ఉందో!"

"అబ్బ! ఏమిటి నువు చేసేపని? నాకు గిలిగింతలుగా ఉంది." పాదాలు అవతలకు పెట్టేసుకున్నాడు నరేశుడు.

మోహిని నవ్వింది: "లేవండి, వచ్చింది ఎవరో. కాస్త చూచి రండి. మీరు చాల మంచివారు కదూ!"

నరేశుడు దుప్పటి ఇంకా ముఖంమీదికి కప్పేసుకున్నాడు. అటువైపు తిరిగి ఒత్తిగిల పడుకున్నాడు.

"నన్ను వెళ్ళి చూచిరమ్మన్నారా పోనీ!"

"నీ యిష్టం—"

ఆమాట అతడన్న తీరు ఆమెకొక విసురుదెబ్బలా తగిలింది. ఆమె మనస్సు చిన్నబోయింది. లేచివెళ్ళి తలుపుగెడవేసింది. తిరిగివచ్చి మంచం మీద పడుకుంది.

వచ్చిన అతిథికి చివరిగదిలో ఏర్పాటుచేశారు. ఒకమంచం వాల్చారు; దానిమీద పక్కవేశారు. దర్బాన్ ఆనాటి వార్తాపత్రిక తెచ్చి మేజాబల్లమీద పెట్టాడు. అతిథిమాత్రం కుర్చీలో కూలబడ్డవాడు అలాగే కూర్చున్నాడు. కోటువిప్పలేదు; బూటువిప్పలేదు. సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూ కూర్చున్నాడు.

"తేనీరు తెమ్మంటారా బాబూ!"

"తేనీరా?" అన్నాడతడు అప్పుడే మెలకువ వచ్చినట్టు.

"అయ్యగారు నాస్తాచేసి ఇలా వస్తారు. ఇంకా స్నానంచేస్తున్నారు. ఆలస్యమైనందుకు క్షమాపణ చెప్పమన్నారు."

అతిథి కుర్చీలోనించి లేచాడు. కోటు విప్పాడు. "కాస్త.... అయిదు నిమిషాలు ఆగు" అన్నాడు నౌకరుతో. విప్పినకోటు అతనిచేతి కిచ్చాడు. బూటు లాళ్ళు విప్పుతూ "ఆబుట్టలో స్లిప్పర్లు ఉంటాయి చూడు" అన్నాడు.

నౌకరు స్లిప్పర్లు తెచ్చి ఆయనపాదాలదగ్గర ఉంచాడు. విడిచిన బూట్లు

తీసి అవతల పెట్టాడు. 'బ్రేక్ ఫాస్ట్' (ఉదయభోజనం) తెమ్మన్నారా ?" అని అడిగాడు.

"ఏదో ఒకటి...." అన్నాడు అతిథి యథాలాపంగా.

"టోస్టు ? (వేయించిన రొట్టె ?)"

"సరే, ఇక నువు వెళ్ళచ్చు."

నౌకరు వెళ్ళిపోయాడు. అతిథి తలుపువేసుకున్నాడు. వార్తాపత్రిక అందుకున్నాడు. మొదటిపేజి, రెండోపేజి, మూడోపేజి—అరనిమిషంలో పత్రిక యావత్తూ చదివేసి, మేజామీద పడేశాడు. పడేస్తూనే ఆగిపోయాడు. కంటికేదో అంశం కనిపించినట్టుంది. పత్రిక ముందుకు తీసుకుని శ్రద్ధగా చదువసాగాడు. సిగరెట్టు ముట్టించాడు. చాలసేపు పత్రికను ముందుంచుకుని చూస్తూనే ఉన్నాడు. చివరకు దాన్ని అవతలపెట్టాడు. జోరుగా సిగరెట్టు పీలుస్తూ గదిలో పచార్లు ఆరంభించాడు, సిగరెట్టు అయిపోయింది. మిగిలిన చిన్నముక్క ట్రేలో విసరివేశాడు, వెళ్ళి అలమారలోవున్న అద్దంముందు నిల్చున్నాడు. అద్దంలో చాలసేపు చూచుకున్నాడు. అప్పుడు వెళ్ళి పక్క తలుపు తెరచాడు. 'షేవింగ్ బాక్స్' (గడ్డంచేసుకునే సామాన్ల పెట్టె) తీసుకుని స్నానాలగదిలోకి వెళ్లాడు. ఈలోగా నౌకరు 'నాస్తా' (ఉపయభోజనం) తెచ్చాడు. అతిథి అక్కడ లేకపోవటం చూచి అతడు అనుమానిస్తూ కొంచెం సేపు అలానే నిల్చున్నాడు. అతిథి లోపలినించి వచ్చాడు కాసేపటికి. అతన్ని చూచి నౌకరు బెదిరినట్టు ఒక్కడుగు వెనక్కు వేశాడు. విస్తుపోయి చూస్తున్నాడు. అతిథి మందహాసంచేస్తూ అడిగాడు : "మీఅయ్యగారు, అమ్మగారు 'నాస్తా' అక్కడే చేస్తారా ?"

"ఇక్కడికే పిలవమన్నారా ?"

"వద్దు వద్దు."

"చిత్తం. తమ...."

"కార్డా?....ఇదిగో" అంటూ కోటుజేబులో ఉన్న నోటుబుక్కులోనించి తన పేరు అది ముద్రించివున్న కార్డు తీసి అతనికిచ్చాడు. "నే నీ సాయంత్రమే మళ్ళీ వెళ్ళిపోతాననికూడా చెప్పు" అన్నాడు.

కార్డు తీసుకుని, సలాంచేసి. నౌకరు అక్కడినించి వెళ్లిపోయాడు.

అతిథి తేనీరు కలుపుకున్నాడు. సిగరెట్ వెలిగించాడు. 'నాస్తా' చేస్తూనే ఒక్కొక్క గుక్క తేనీరుకూడా తాగుతున్నాడు.

చలిగావున్నట్టనిపించింది. లేచి శాలువ ఒకటి తీసి కప్పుకున్నాడు. మరోసిగరెట్టు వెలిగించాడు. పోయి పక్కమీద పడుకుందామా అనిపించింది. కాని 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ' పత్రిక తీసుకుని పడకకుర్చీలో విశ్రమించాడు.

కొంతసేపటికి నరేశుడు గదిలోకి వచ్చాడు. అప్పుడు అతిథి కన్నులు మూతపడ్డాయి. కునికిపాట్లు తీస్తున్నాడు. నరేశుడు చాల దగ్గరకు వచ్చిందాకా అతనికి అలికిడి తెలియలేదు. అప్పుడాత్రృతగా కుర్చీలోనించిలేచి నమస్కారం చేశాడు. నరేశుడు ప్రతినమస్కారం చేసి, కరచాలనంఇస్తూ "నన్ను నరేశ చంద్రుడు అంటారు. మిమ్మల్ని కలుసుకోగలిగినందుకు ఆనందిస్తున్నాను" అన్నాడు.

"క్షమించండి. అకస్మాత్తుగా ఇలా వచ్చాను. ఇప్పుడు నే నెక్కడో దూరాన దక్షిణదేశంలో వుంటున్నాను. నాటికి నేడు ఇటువైపు రావటం సంభవించింది. ఒకసారి ఇక్కడ ఆగి చూచి వెళ్లకపోతే బాగుండదనుకున్నాను. మూడు సంవత్సరాలు నేను తమ మిసెస్(భార్య)కు సహపాఠిని. ఇప్పుడామె నన్ను గుర్తుపట్టజాల దనుకుంటాను. కొన్ని సంవత్సరాలే గడిచిపోయాయికదా!"

"అలాగాండి!...అలాగనా?" అంటూ ఉన్నాడు నరేశుడు మధ్య మధ్య.

అతిథి సిగరెట్టు ఒకటి తీసి అందించబోయాడు. నరేశునికి సిగరెట్ అలవాటులేదు; 'పైపు' (చిలుముగొట్టం) పీలుస్తాడు. సిగరెట్ అందుకుని వెంటనే జేబులో పెట్టుకోబోయాడు. కాని అతడు నిప్పుపుల్ల గీసి ఎదురుగా పెట్టాడు. నరేశునికి సిగరెట్ తీసి వెలిగించుకోక తప్పలేదు. ఇద్దరూ ఆసీనులైనారు. "నా సహపాఠిని సుఖంగా, ఆనందంగా ఉన్నదనుకుంటాను" అన్నాడు అతిథి.

"తమరు ఇవాళే వెళ్లిపోతారా యేమిటి?"

"చిత్తం, వెళ్లాలి; చాల పనిఉంది. ఇక్కడికి వచ్చాక వెంటనే వెళ్ళిపోవటానికి మనసొప్పదనుకోండి. అయినా...."

"చిత్తం—చిత్తం!" నరేశుడు చిరునవ్వు నవ్వాడు!—"మీ దయవల్ల మేము సుఖంగానే ఉన్నాం. అయితే....మీకు మైసూరులో వ్యాపారం ఉన్నదన్నమాట! 'ఐ'సి....(అలాగా....)"

"ఏదో కొంచెంగా—ఏం, అప్పుడే వెడుతున్నారా?"

"వెళ్లి చూచి వస్తాను....మీ సహపాఠిని ఏంచేస్తోందో, ఇంకా ఇటు రానేలేదే...."

అతిథి మందహాసం చేశాడు. "వద్దు వద్దు. తొందరేంలేదు. ఆమెను శ్రమపెట్టకండి. అవకాశం చిక్కినప్పుడు ఆమే వస్తుంది."

"నేను ఆమెను శ్రమపెట్టకపోతే ఆమే నన్ను శ్రమపెడుతుంది, మిస్టర్ సహాయ్! ఈపాటికి ఆమె మిమ్మల్ని జ్ఞాపకంతెచ్చుకునే ఉంటుందను కుంటాను. నమస్తే!" అని నరేశుడు వెళ్లిపోయాడు.

అతిథి నుదురు ముడతలుపడింది. మరికాసేపటికి మోహిని గదిలోకి వచ్చింది. అయినా వెంటనే ఆ ముడతలు తొలగిపోలేదు. అతడు తాను కూర్చున్నచోటునించి లేవనేలేదు.

మోహిని సంకోచిస్తూనే వచ్చింది. అడుగడుక్కీ సంకోచం పెరుగు తూనేఉంది. పూర్వం ఎప్పుడో తనతోపాటుచదువుకున్నాడా? సహపాఠి! మిస్టర్ సహాయ్! ఏమో, ఆమెకు గుర్తుకు రావటంలేదే! ఒక్కొక్క అడుగే వేసుకుంటూ ముందుకు వస్తోంది. ఆమె రాక గమనిస్తున్నట్టుగా లేడా అతిథి. ఆమె కుర్చీకిఎదురుగా వచ్చింది. ఉలికిపాటుగా "ఎవరు? జితేన్!" అన్నది. అప్పుడు కలిగిందతనికి ఎవరో వచ్చారు అన్నస్పృహ.

"జితేన్ కాదు. 'సహాయ్' నా పేరు. అది బాగా జ్ఞాపకం పెట్టుకోవాలి; చాల అవసరం....సమయం తక్కువగాఉంది, పని చాల ఉంది....ఆ వార్తాపత్రిక చూడు, ఇంతవరకు నువ్వు చూడలేదనుకుంటాను. రాత్రి పంజాబ్ మెయిలు పడిపోయింది. అరవై ముగ్గురుమంది హతులు; రెండు వందల పదిహేనుమంది క్షతగాత్రులు. విన్నావా? 63గురు చనిపోయారు; 215మంది గాయపడ్డారు. అదిగో, వార్తాపత్రికలో ఉంది చూడు. అది అబద్ధం అని గాని, పొరపాటువ్రాత అని గాని భావించటానికి వీల్లేదు....

ఇప్పుడు చెప్పు మరి! నేను కొన్నాళ్లిక్కడ ఉండిపోవచ్చునా? జితేన్ కాదు; సహాయ్ నాపేరు."

మోహిని కొన్ని క్షణాలపాటు అతన్ని తేరిపారచూచింది. చూస్తూ చూస్తూనే అకస్మాత్తుగా కుర్చీముందు మోకాళ్ళమీద కూలబడిపోయి, తన రెండు చేతుల్లో అతనిచేయి గట్టిగా పట్టుకుని నొక్కుతూ "జితేన్!" అన్నది.

జితేంద్రుని కనుబొమలు బలంగా ముడిపడ్డాయి. "మోహినీ! ఒక్క సాహసకార్యం చేస్తావూ? నా జాడ తెలిపి, నన్ను పోలీసులకు పట్టించెయ్యి. నన్ను పట్టించినవారికి బహుమతికూడా ప్రకటించారు."

మోహినికి ఏమి జవాబు చెప్పటానికీ తోచలేదు. చివాలున లేచి నిల్చుంది. వెళ్ళి తలుపు గడియవేసి రావాలని ఆమె ఉద్దేశం. కాని గుమ్మం వరకు వెళ్ళేసరికి భర్త నరేశచంద్రుడు వస్తున్నాడు. చూచింది. క్షణకాలం ఆమె; స్తబ్ధచిత్తయై నిల్చింది. మరుక్షణమే నవ్వుతూ "వస్తున్నారా! నయమే; ఇంకొక్క నిమిషం ఆలస్యమైతే తలుపు మూసివుండేది"అన్నది.

ఆ వాక్యాల్లో ఆమె ఎట్టి భావాన్ని వ్యక్తీకరింపదలచిందో తెలియదు. కాని నరేశుడు ఆ మాటే వినిపించుకున్నట్టు లేదు. తిన్నగా లోపలికి వచ్చేశాడు. అతిథిని ఉద్దేశించి "క్షమించాలి మిస్టర్ సహాయ్! నేను ఇవాళ ఇంట్లో ఉండను. అయినా మీ సహపాఠిని మిమ్మల్ని ఇవాళే ప్రయాణమై వెళ్ళిపోనీదు అని నేను ఆశిస్తున్నాను. లేవకండి, కూర్చోండి, కూర్చోండి. ఏం? మీ ఆరోగ్యం కొంచెం—సరే, నేను వెడుతున్నాను. ప్రస్తుతం ఆమె మీ సహపాఠిని కాదనుకోండి. అయినప్పటికీ నా సహధర్మిణివల్ల మీకేవిధమైన ఇబ్బందీ కలగదనే నా నమ్మిక."

"అయితే కాసేపుకూడా ఉండరా యేమిటి? కూర్చుందురూ."అన్నది మోహిని.

"ఉహుఁ, ఇప్పుడు కాదులే మోహినీ!....మిస్టర్ సహాయ్! ప్రస్తుతం నేను వెళ్ళిపోవలసివచ్చినందుకు విచారిస్తున్నాను" అంటూ మిస్టర్ సహాయ్‌కి నమస్కారం చేశాడు, వెళ్ళిపోయాడు.

ఇప్పటివరకూ అతిథి ఏమీ పలుకలేదు. నరేశుడు వెళ్ళిపోయాక "ఆనందంగా వున్నావా మోహినీ!" అన్నాడు.

అతని కంఠస్వరంలోని తీక్షణతను మోహిని గమనించింది. "ఆఁ. ఆనందంగానే ఉన్నాను."

"ఆనందంగా ఉండదగిన స్థితే మరి! చూస్తున్నానుగా! అన్నీ వున్నాయి. భర్తకు నీమీద పూర్తివిశ్వాసం ఉంది. అనుమానానికి తావేలేదు. అయితే ఇదేనన్నమాటా....వివాహం అంటే?"

మోహిని సహించలేకపోయింది. మెడమీద చెయివేసి జితేంద్రుని కుర్చీలో కూర్చోబెట్టింది. తాను అతని కాళ్ళదగ్గర క్రిందనే తివాచీ మీద కూర్చుంది. అతని కుడిచేయి తన రెండు హస్తాల్లో ఇముడ్చుకుని "జితేన్!" అన్నది.

జితేన్ ఎదురుగా వున్న గోడపైపు చూస్తూ కూర్చున్నాడు....మాట, పలుకు లేకుండా....నిశ్చేష్టుడై. తన కుడిచేత్తో ఆమెను అలా ఆడుకో నిచ్చాడు. ఆమె చేసిన సంబోధనకు తానేమీ సమాధానం చెప్పలేదు. "ఎందుకు చేశావు ఆపని?" మోహిని అడిగింది కాతరకంఠస్వరాన.

జితేంద్రుడు తన చేయి వెనక్కు లాక్కున్నాడు. ఎదురుగాకూర్చున్న ఆ మోహినీస్త్రీవైపు కోపంగా చూచాడు; "అక్కడ వద్దు, ఎదురుగా వేరే కుర్చీలో కూర్చో నీ యిష్టంవచ్చిన తీరులో. అంతేగాని అక్కడ లే."

"నేను లేవను. ఎందుకు చేశా వా పని?"

"చేసిందేదో చేశాను. నువు ఇప్పుడు తమాషా చెయ్యబోకు. లే, సరిగా కూర్చో. ఏమిటి నీ ఉద్దేశం? స్పష్టంగా చెప్పు."

"నేను ఇక్కడినించి లేవనసలు. నువు రైలు కూలదోసినవాడివి.... ఇక్కడ....ఒంటరిదాన్నే....చంపిపారేయలేవూ? అంతమాత్రం విశ్వసించ లేకుండా ఉన్నావా నన్ను?"

జితేంద్రునికి కోపం రెచ్చిపోయింది. తన కుర్చీ వెనక్కు దూరంగా లాక్కున్నాడు. "విశ్వాసం! నువు నాకు ఎవరవనీ?"

మోహిని అక్కడేకూర్చునివుంది. "ఏం, నేను నీ....సమస్తాన్నీ...."

"నీ భర్తకు?"

"భార్యను....సరేగాని, పక్కవేస్తాను వచ్చి పడుకో. నీవొంట్లో బాగున్నట్టు లేదు."

మోహిని లేచివచ్చింది. అతని నుదురు, కణతలు పట్టుకుని చూచింది. అతడది అంతా సహిస్తూ కూర్చున్నాడు. అతని నుదురు చాల వేడిగా వుంది. "అరె, నీకు బాగా జ్వరం వచ్చేసింది. లేలే, లేచివచ్చి పడుకో" అన్నది.

తక్షణమే జితేంద్రుడు ఆమెచేయి దూరంగా నెట్టివేశాడు. "దయ చూపిస్తున్నావా ? వెళ్లువెళ్లు. దూరంగా వెళ్ళి కూర్చో."

మోహిని మళ్ళీ దగ్గరకు వచ్చింది. "దయ కాదు, నీకు జ్వరం వచ్చింది జితేన్ ! రాత్రంతా నీకు నిద్రలేనట్టుగా ఉంది. నువే దయవుంచి ఇలా నాదగ్గరకు వచ్చావు; వచ్చినవాడివి నిర్దయుడవు కాబోకు. విశ్రాంతిగా పడుకో."

తన నుదుటిమీదికి మరొకసారి వస్తోన్న ఆమెచేయి పట్టుకుని అవతలకు నెట్టివేశాడు జితేంద్రుడు "పో, అవతలికి పో" అని గర్జిస్తూ.

అతని కంఠస్వరంలోని తీక్షణతకు ఆమె ఒక అడుగు వెనక్కు వేసింది. మౌనంగా, నిశ్చేష్టయై అతనివైపే చూస్తూ ఉండిపోయింది.

జితేంద్రుడు మళ్ళీ మాటాడలేదు. అలాగే ఎదురుగావున్న గోడవైపు చూస్తూ కూర్చున్నాడు.

మోహిని వెనక్కు వెళ్ళి పక్కదులిపి, దిండు పెట్టింది. రగ్గు ఒకటి తలగడన పెట్టింది. "రా, వచ్చి పడుకో" అన్నది.

జితేంద్రుడు పక్కకు తిరిగి మోహినివైపు చూచాడు. అతని కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా ఉన్నాయి. క్షణం....రెండుక్షణాలు....కొన్నిక్షణాలు అలా నిప్పులు గ్రక్కుతూన్న కళ్ళతో ఆమెవైపు చూచాడు. తనకేమి కావాలో తనకే తెలియటంలేదు. ఆ చూపులు ఎదుర్కోలేని అసమంజస స్థితిలో ఆమె "ఇలా రారాదూ !" అన్నది.

"ఏమిటీ ?" గర్జిస్తున్నట్టుగా అడిగాడు జితేంద్రుడు.

"ఇక్కడికి వచ్చి పడుకో."

ఆమాట లతని చెవుల్లో దూరనేలేదు. వెంటనే లేచి వచ్చి మంచం

పట్టెమీద కూర్చున్నాడు. "పోలీసులకు కబురు తెలపటమేగా ! అంతమాత్రం చెయ్యలేవా మోహినీ ! నేనెంతో నమ్మకం పెట్టుకుని వచ్చాను."

"నమ్మకమా !"

"ఔను !"

"నోరు మూసుకో !"

"ఏం ? ఎంతోమంది నిర్దోషులు చనిపోయారు; గాయపడ్డారు. వాళ్ళ కోసమయినా నువు అంతమాత్రం చెయ్యలేవూ ? ఇంకా నన్నుగురించి నీకేమన్నా ఆశ వుందేమిటి ?"

"ఉహుం. ఉహుం. నేను చెయ్యలేను. నన్ను సతాయించబోకు."

జితేంద్రుడు ఒక వ్యంగ్యమందహాసం విసిరాడు. "నువు నాకు ఎంతో మేలుచేసినదానివౌతావు మోహినీ ! ఇప్పుడు విరమించుకున్నావంటే తరువాత పశ్చాత్తాపపడతావుసుమీ ! అవకాశాలు ఎల్లప్పుడు రావు."

"ఇంకా ఇలాగే నన్ను సతాయిస్తూ కూర్చున్నావంటే ఇప్పుడే ఉరి పోసుకు చస్తాను."

"ఏం ? ఎందుకూ ? ప్రేమిస్తున్నావా ? ఇలాంటప్పుడు ఆటంకపరిచేది ప్రేమే —" అతని కంఠస్వరం చాల పదునుగా ఉంది.

"ఔను, ప్రేమిస్తున్నాను. కాని నువు ఎవరవని ? వింటున్నావా.... ఏమైనా నువు పిరికివాడవు కావు —" అన్నదామె గంభీరముద్రదాల్చి.

జితేంద్రునికి బాగా రోషం వచ్చేసింది. "ఏమంటున్నావు ? ఆమాట అనటానికి సిగ్గెలా లేకపోయింది నీకు ?"

"ఉహుం. నాకు సిగ్గెందుకు ?" అంటూ అతన్ని పడుకోబెట్టేందుకు ప్రయత్నించింది.

"వద్దు-వద్దు" జితేంద్రుడు కటువైన కంఠస్వరాన చల్లనిశబ్దాలతో అన్నాడు : "నువు అక్కడ దూరంగా వెళ్ళి కూర్చో ముందు. నాకు జ్వరమే వచ్చిందనుకో.... నిజమే.... సరే, పడుకుంటాను. చింతేమీలేదు. కాని.... వింటున్నావా?.... నేను ఇక్కడికి వచ్చేటపుడు నిష్కపటంగా రాలేదు. కాని అది తిన్నగా జారిపోయింది. ఏమైనా ఇక్కడికి వచ్చినందుకు నేనేం పశ్చాత్తాపపడటం లేదు. ఎందువల్లనంటే.... ఇది అన్నిచోట్లకంటే చాల సురక్షిత

మైన స్థలం. నన్ను వెతుక్కుంటూ న్యాయం (జస్టిస్) ఇంటికి సోదా చూచేందు కెవరు వస్తారుగనక! ఇదేనా నువు పిరికితనం అంటున్నావు? మేము దాన్ని మహాసాహసం అంటాం. చెప్పు మరి: నిన్ను నేను విశ్వసించవచ్చునా?"

మోహిని కొంచెం దూరంగా కూర్చుంది. "విశ్వసించావు కాబట్టే వచ్చావు. కాని ఈయింట్లో నేను ఒక అవిశ్వసనీయురాలినైతే.... అందుకు మూల్యం నువు తరువాత చెల్లించగలవు.... అనే నా విశ్వాసం. ఇదే నా అసలైన విశ్వాసంకూడా. అంతమంది నిరపరాధులైన స్త్రీపురుషబాలబాలికల మరణానికి కారణభూతుడివౌతున్న సంగతి ముందుగా ఆలోచనకు రానే లేదా?"

జితేంద్రుడు కొంచెంగా నవ్వాడు. "లేదు. చావకుండా ఎవరుంటారు గనక? అందర్నీ చంపవలసినపనీ, పాపం ఆ ఒక్క భగవంతుని మెడకేనా చుట్టుకోవలసింది? ఆ మీ భగవంతుడికి మేముకూడా అప్పుడప్పుడు సాయ పడద్దూ? ఏమంటావు?"

మోహిని వెంటనే జవాబు చెప్పలేదు. అతని ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది.

"ఏమిటో ఆలోచిస్తున్నావు?"

"ఏమీలేదు. నువు ఏమిటో చేశావనుకుంటూన్నది కాసేపు మరచిపో. జరిగేదేదో జరుగుతుంది. అంతా కాలం నిర్వహిస్తుంది.... ఇలా అనుకుని నిశ్చింతగా పడుకో."

"కాలమా? అంటే నీభగవంతుడేనా?" పట్టుగా అడిగాడు జితేంద్రుడు.

"ఔను. భగవంతుడే."

జితేంద్రుడు నవ్వాడు. "మరి అలా చేస్తున్నందుకా భగవంతుడిని ఉరితీస్తారా?"

మోహిని గంభీరముద్ర తాల్చింది. "ఉచ్చు తగులుకుంటున్నది ఎప్పుడైనా మనలోని అతనికే."

జితేంద్రుడు ఆమాట విన్నాడు. వినిపించుకోనట్టు నటించాడు. కాసేపు మౌనంగావుండి చివరకడిగాడు : "నాకు ఉరిపడుతుంది ! ఏమంటావు ?"

"ఉరిబాధ నువ్వు ఇప్పుడుమాత్రం అనుభవించటంలేదా?" కరుణార్ద్రమైన కంఠస్వరాన పలికింది మోహిని : "అసలు ఉరి ఇదే. నిరంతరం బాధిస్తూన్న ఈ ఉరినించి నిన్ను నీవు ఎందుకు రక్షించుకునేందుకు ప్రయత్నించవు?.... ఏమంటావు? చెప్పు : ఇప్పటికీ నేను దూరంగానే కూర్చోనా? రమ్మంటున్నాను; వచ్చి పడుకోమంటున్నాను; కాస్త నిద్ర పట్టించుకోమంటున్నాను."

"నువ్వు నిద్రపుచ్చుతావా?"

"ఆఁ, నిద్రపుచ్చుతాను."

"చిచ్చికొడతావా?"

"ఆఁ, చిచ్చికొడతాను."

జితేంద్రుడు చాలసేపు నవ్వాడు. "నువ్వు నన్ను పిరికివాడన్నావు. ఆడది నిజంగా మగవాడిని పిరికివాడినిగానే తయారుచేస్తుంది."

"కాదు, వీరుడినిగాకూడా చేస్తుంది" అంటూ మోహిని మంచంమీద తలవైపున వచ్చి కూర్చుంది. అతన్ని చేతుల్లోకి తీసుకుని పడుకోబెడుతూ "అది, అలా పడుకో ఇక" అన్నది.

జితేంద్రుడు మాటాడకుండా పడుకున్నాడు. ఆమెచేయి తనచేతికింద ఒత్తి పట్టుకున్నాడు. "నువ్వు నన్ను ఈతీరువీరుణ్ణిగా చెయ్యలేవు మోహినీ, 'వీరమరణం', 'అమరవీరుడు' అనేవి కేవలం పదాలు; అంతే. నేను ఉరికంబం ఎక్కటానికి వీల్లేదు; చెయ్యవలసినపని చాలఉంది."

మోహినికి అతనిమీద మిక్కుటమైన సానుభూతి కలిగింది. "జితేన్! గాభరాపడబోకు. జరిగిందేదో జరిగింది. జరగవలసిందేదో జరక్కుండా ఆగుతుందా ? ఇక్కడ నేనుండగా నీకేం ఆపదరాదు. నిశ్చింతగా ఉండు. బాగా ఆరోగ్యం చిక్కేంతవరకూ నీ ప్రాణం నాచేతుల్లో సురక్షితంగా వుంటుంది. ఆతరువాతే నీది నీకు తిరిగి ఇచ్చేస్తాను. అప్పుడిక నీయిష్టం. ఉంచుకుంటే ఉంచుకో; పారేసుకుంటే పారేసుకో."

"నీకే ఇచ్చేస్తే పుచ్చుకుంటావా మరి!"

"నాకెలా ఇస్తావు? అసలు ఎవరిదగ్గరనించి లభించిందో వారికే తిరిగి సమర్పించుకోవాలిగదా?"

"సరేసరే, నన్ను నేను న్యాయస్థానంలో వెళ్ళి అప్పగించుకోవాలనా నీ ఉద్దేశం?"

"ఔను; దోషాలక్రింద నువు అణగారిపోతూ ఉండకూడదనే నా కోరిక. చేసినదంతా ముందుకు వచ్చి ఒప్పుకో. నీమీద బరువెక్కిపోయిన దోషాలు జారిపోతాయి, నువు తేలికగా ఉండగలుగుతావు. నా మాటల సత్యం ఆనాడు నీకు బోధపడుతుంది."

ఆమాట విని జితేంద్రుడు లోలోపలే శంకాన్వితుడైనాడు. దుప్పటి తీసి కప్పుకున్నాడు. "ఇక నేను నిద్రపోతాను" అన్నాడు.

మోహిని కన్నుల్లో ఒక గంభీరమైన వేదన తొణికిసలాడింది. "ఔను, నిద్రపో." అన్నది.

"నువు వెళ్ళిపోతావా ?"

"నీకు నిద్రపట్టినతర్వాత వెడతాను. ఇదిగో, తలదగ్గర బటన్ ఉంది. నొక్కావంటే నాకు గంట వినిపిస్తుంది; వచ్చేస్తాను."

జితేంద్రునికి త్వరగా నిద్రపట్టలేదు. మనసులో ఏవేవో అనుమానాలు గుంపులుగా వస్తున్నాయి. దుప్పటి మొగంమీదకూడా నిండుగా కప్పుకున్నాడు. మోహిని అక్కడే మౌనంగా ఒక అర్ధగంటసేపు ఉన్నది. చివరకు అతనికి నిద్రపట్టింది; ఆమె వెళ్ళిపోయింది.

మోహిని ఫోను తీసి మాట్లాడింది. "ఏమంపీ ! పని ఎక్కువగా ఉందేమిటి ?"

"చెప్పండి, ఏమిటి ఆజ్ఞ !"

వీలుగాఉంటే డాక్టర్ కపూర్‌ను ఒకసారి తీసుకురండి."

"డాక్టర్ కపూర్ ! ఎందుకూ ?"

"మీకు అక్కడ పని ఎక్కువ లేదుకద!....అతనికి ఆరోగ్యం ఏం బాగులేదు. అంటే....మన అతిథికి."

"అసలు ఎవరామహాశయుడు? నువ్వే డాక్టర్‌కు ఫోనుచేసి పిలిపించు కోరాదూ?"

"పిలిపించుకుంటాలెండి; కాని మీరుకూడా రాకూడదూ కొంచెం!"

"మీ మిత్రునివిషయమై నేనుకూడా శ్రద్ధవహించాలంటూరా? అవస రమా? ఉహూ౦, క్షమించాలి...."

"ఎగతాళికాదు. మీరు రావాలి....మోటారుకూడా లేదు."

"సరే, మోటారు పంపిస్తాను."

"ఇచ్చుకాలకేంలెండి. రద్దురూ!"

"చిత్తం, అలాగే!"

నరేశుడు వచ్చాడు. డాక్టర్ కపూర్‌కూడా వచ్చాడు. అంతా గదిలోకి వెళ్ళారు. ఆ సమయాన రోగికి జ్వరం పేలిపోతున్నది. ఒళ్ళు తెలియకుండా పడి నిద్రపోతున్నాడు. డాక్టరు రోగిని పరీక్షించాడు. "ఎప్పటినించీ ఇతనికి ఈ స్థితి?" అని అడిగాడు.

మోహిని జవాబు చెప్పింది: "మొన్న కొద్దిగా జ్వరంవచ్చింది; హాయిగానే ఉన్నారు; కొంచెం జలుబుచేసింది; అంతే. ఇవాళ జ్వరం తీవ్రంగా వచ్చేసింది; మీకు శ్రమకలిగించాం." అంటూ మోహిని భర్త వైపు తిరిగి "ఏమండీ! మొన్న కులాసాగానే ఉన్నాడుకదూ!"

భర్త డాక్టరువైపు తిరిగి ఇలా చెప్పాడు: "ఔను, మొన్న కులాసా గానే ఉన్నాడు. ఉదయం నేను చూచినప్పుడుకూడ సంతోషంగానే కనిపిం చాడు. ఇతడు నా బాల్యమిత్రుడు డాక్టర్‌గారూ!....ఎలావుంది పరిస్థితి?"

వైద్యపరిభాషలో డాక్టరు చెప్పిన సారాంశం ఇదీ: మళ్ళీ మామూలు ఆరోగ్యం రావటానికి చాల రోజులు పడుతుంది. ప్రాణభయమేం లేదు. జాగ్రతగామాత్రం ఉండాలి. ఇదిగో మందు రాసి ఇస్తున్నాను. తెప్పించి ఇవ్వండి....డాక్టరు వెళ్ళిపోయాడు.

"ఏమిటి విశేషం....?" నరేశుడు భార్యను అడిగాడు తమగదిలోకి వచ్చాక.

"విశేషమేముందీ?" మోహిని నవ్వింది: "మొన్న బాగా ఆరోగ్యంగానే ఉన్నాడు కదండీ!"

"ఔను, నిజమే...." నరేశుడుకూడా నవ్వాడు. "ఏమిటో సరిగా చెప్పరాదూ?"

"మీరే చూచారుగా! 104 డిగ్రీల జ్వరం ఉంది." నరేశుడు భార్య ముఖంలోకి జిజ్ఞాసాదృష్టి ప్రసరించాడు. "జంకుతావెందుకూ? చెప్పు సంగతేమిటో?"

భార్యకూడా భర్తముఖంలోకి ప్రశ్నార్థకంగానే చూచింది. చూస్తూ చూస్తూండగానే ఆమెలో కృతజ్ఞతాభావం పొడసూపింది. ముందుకువచ్చి ఆయన రెండుచేతులూ పట్టుకుంది. మరుక్షణమే తనముఖం అతని వక్షస్సీమలో దాచుకుంది. "ఎలాగైనా అతన్ని బ్రతికించాలి" అన్నది.

ఆమె తలపై మెల్లిగా నిమురుతూ నరేశుడు నవ్వాడు. "అయితే ఆ మహాశయుడిప్పుడు చచ్చిపోతున్నాడా? నాకుమాత్రం అలా తోచటం లేదుసుమీ!"

గట్టిగా తన భుజాల్ని కరచుకునివున్న భార్యను మెల్లిగా విడిపించి, ఎదురుగా నిల్చోబెట్టుకుని "మోహినీ! మోహినీ! ఇలా పైకిచూడు" అన్నాడు.

ఆమె ముఖం ఎత్తనేలేదు.

నరేశుడు ఆమె చుబుకం పుచ్చుకుని ముఖం పైకెత్తాడు: "నామీద నీకు నమ్మకం లేదా?....ఉంటే మరి, ఇప్పటికేనా చెప్పు సంగతేమిటో!"

ఆమె అలా అతనిముఖంలోకి చూస్తూఉండిపోయింది. చూచిచూచి చివరకు మళ్ళీ అతని వక్షోభాగంలో ముఖం దాచేసుకుంది.

"ఉహుఁ. ఇలా అయితే లాభంలేదు, నా రాణీ!" తన గుండెలో ఒదిగిపోయిన ఆమెను కొన్ని అడుగులు తీసుకుపోయి పడకకుర్చీలో కూర్చోబెట్టాడు. ఎదురుగా క్రింద మోకాళ్ళమీద కూర్చున్నాడు. "తప్పకుండా ఏదోసంగతి ఉండితీరింది. నువు విశదంగా చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది!"

అందుకు సమాధానంగా మోహిని తన ముఖాన్ని దోసిట్లో దాచుకుంది.

నరేశుడు కొన్ని నిమిషాలు అలాగే కూర్చున్నాడు. చివరకు లేచి గదిలో అటూ ఇటూ పచార్లు ఆరంభించాడు. మరికాసేపటికి కుర్చీఎదుట ఇంచుమించు రెండుగజాల్లదూరంలో ఆగాడు; "మోహినీ! నువ్వు అలా ముఖందాచుకోవలసిన అవసరం ఏమీ లేదు. ప్రేమహక్కు ప్రతివాడికీ ఉంటుంది. నీకు, నాకు, అతనికీ, అందరికీని. సరే, నేను వెళ్ళిరానా?"

మోహిని కదల్లేదు, మెదల్లేదు. తన్నుగురించి ఆయన అలా అనుకుంటాడని ఆమె ఏనాడూ ఊహించియుండలేదు. ఆమె ప్రయత్నం ఏమీ లేక పోయినా ఆమె ముఖంమీది దోసిలి ఇంకా అలాగే ఉండిపోయింది.

"వెళ్ళనా?"

మోహిని జవాబేమీ చెప్పలేకపోయింది.

"సరే, నేనొక నర్సును ఫోనుచేసి కనుక్కుంటాను. రోగికి సముచితమైన ఉపచారాలు జరుగుతూఉండాలి; అది చాల అవసరం. నర్సులైతే మంచి తర్ఫీదు పొంది వుంటారు. జాగ్రత్తసుమీ! అదేదో మామూలు జ్వరమే అనుకోవద్దు. డాక్టరుతో నేను మాటాడానుగా; ప్రాణభయం లేదనుకో. అయినా ఉపచారాదుల్లో లోటుగాని, పొరపాటుగాని జరిగిందంటే భయపడవలసిన పరిస్థితే ఏర్పడవచ్చు. నిన్నుగురించే నాకు భయంగావుంది. ఏమి అజాగ్రత్తగా ఉంటావోనని. ఏమరుపాటు ఏమాత్రం పనికిరాదుసుమీ! సరే, నేను వెడుతున్నాను మరి!"

మోహిని ఇంకా ముఖందాచుకునే ఉండలేకపోయింది. చేతులు అక్కడినించి విడిపోయాయి. కళ్ళు విశాలంగా విప్పారినవి. సావధానంగా వింటున్నది.

"ఇవాళ కేసులు చాల ఉన్నాయి. రాణీవారు తలుచుకోవటంవల్ల హాజరుకావలసివచ్చింది. ఇక సెలవైతే దాసుడు వెడతాడు మరి!" అంటూ నరేశుడు ఆమె ఆజ్ఞకోసం ప్రతీక్షించకుండానే గుమ్మంవైపు సాగిపోయాడు.

"ఉండండి....ఆగండి" అని బిగ్గరగా అనబోయింది మోహిని. ఆ పదాలు లోపలినించి ఎంతో జోరుగానే బయలుదేరాయి; కాని కంఠం వరకు వచ్చి ఆగిపోయాయి. బైటికి రానేలేదు. నరేశుడు నిర్విఘ్నంగా సాగిపోయాడు. మోహిని అలాగే కుర్చీకి అంటుకుపోయి కూర్చుంది. కొన్ని

క్షణాలవరకూ ఆమెకేమీ తోచలేదు. తనవ్యవహారం తనకే ఆశ్చర్యమని పించింది. కావాలని పట్టుదలగా పిలిచింది భర్తను ఇంటికి రమ్మని; ఆ యీ సంగతులన్నీ చెబుదామనుకుంది; బాధ్యతఅంతా ఆయనకే అప్పగింత పెడదా మనుకుంది. కాని తీరా సమయానికి—

తిన్నగా లేచింది. అలమరాలోనించి ఒక పుస్తకం తీసింది. అది పుచ్చుకుని కూర్చుంది. గడియారంలో పన్నెండున్నర అయింది. 'లంచి' (మధ్యాహ్నఫలహారాల) వేళ రెండుగంటలకు; పుస్తకం చదువుకుంటూ కూర్చుంది. కొంతసేపటికి ఆపుస్తకం అవతలపెట్టి ఇంకో పుస్తకం తీసు కుంది; తెరిచింది; చదివింది. అంతలోనే చదువుతున్న పేజీలో వేలుపెట్టి పుస్తకం మూసింది.

ఫోన్‌గంట మోగింది. ఆమె ఫోన్ అందుకుని "మిసెస్ నరేశ్" అన్నది.

"హలో డార్లింగ్! నర్సును ఏర్పాటుచేశాను. 'హోల్‌టైమ్' (ఎల్ల వేళలా ఉండేందుకే) ఆమెకు విశ్రాంతి ఇవ్వవలసిన సమయాల్లో ఇంకో నర్సుకూడా కావద్దూ మరి! అవసరమనే నా ఉద్దేశం. నువ్వేమంటావు. మరి!"

"అక్కర్లేదు."

పోనీ, ఆమెవచ్చాక ఆసంగతి ఆలోచిద్దాం. ఇకపోతే 'లంచి' (ఫలహారం) ఇక్కడికే పంపించు. నిజంగా ఇక్కడపని క్షణం తీరిక లేకుండా ఉంది."

"రారా ఇక్కడికి?"

"క్షమించాలి మోహినీ! ఇక్కడెన్ని కాగితాలు పడివున్నాయో ఏం చెప్పను? ఇక్కడికే పంపిద్దూ. నువు చాలామంచి...."

"సరే" అంటూ మోహిని ఫోన్ అవతల పెట్టేసింది. ఆమెకు మనస్సు కుంగిపోయినట్టుగా ఉంది. గడియారం చూచింది. ఇంకో పావు గంట మాత్రమే ఉంది. వెంటనే లేచింది. తినుబండారాలన్నీ టిఫిన్‌లో చక్కగా అమర్చింది. ఫ్లాస్కులో తేనీరు పోసి సిద్ధంగా ఉంచింది.

"అమ్మగారూ!"

గుమ్మంలో దర్బాన్ కనిపించాడు. "ఏమిటీ?" అని అడిగింది మోహిని,

"అతిథిగారు తమర్ని పిలుస్తున్నారు."

"ఒంట్లో ఎలా వుందిట?"

"మిమ్మల్ని రెండుమూడుసార్లు అడిగారమ్మా!"

"రెండుమూడుసార్లా? మొదటిసార్కికే ఎందుకు వచ్చి చెప్పావుకాదు?"

"చిత్తం, తమరు —"

"ఇదిగో, కాస్త జాగ్రతగా ఉండాలి...." వెంటనే వంటమనిషివైపు తిరిగి "వారికి అన్నీ వడ్డించి, తినిపించి మరీరావాలి సుమీ! నువు దగ్గిరే వుండు; తెలిసిందా!" అని, మళ్ళీ దర్బాన్‌వైపు తిరిగి "పద" అన్నది.

జితేంద్రునికి జ్వరం కొంచెం తగ్గింది. కొంచెం చెమట పట్టింది. మోహిని కుర్చీలాక్కుని మంచందగ్గరగా కూర్చుంది. "ఏమిటి, ఎలా వుంది?" అని అడిగింది అతని నుదుటిపై చెయిపెట్టి చూస్తూ, నవ్వుతూ.

"నీ కిప్పుడు తీరిక అయిందా?"

మోహిని నవ్వింది. "ఉహుఁ. నాకు తీరిక ఎక్కడ? మళ్ళీ వెళ్లాలి."

"మరెందుకు వచ్చావు?"

ఆమె మళ్ళీ నవ్వింది. "నాయిష్టం; వచ్చాను. నువు పిల్చావుకదా అనేం రాలేదు. ఇదిగో, ఇక నువు ఒంటరిగా ఉండనక్కర్లేదు. వారు ఒక నర్సును ఏర్పాటుచేశారు; వస్తుంది. ఆంగ్లోఇండియన్ కాదు; ఇంగ్లీష్ నర్సు. ఆమె ఎలాఉంటుందో చెప్పమంటావా?"

జితేంద్రుడు తన నుదుటిమీద వున్న ఆమెచేతిని దూరంగా తొలగించాడు.

మోహిని ప్రతిరోధం చేయలేదు. "చాల బాగుంటుంది!" అన్నది.

"చాల్లే ఊరుకో" విసురుగా అన్నాడు జితేంద్రుడు.

"నిజంగానే ఆమె చాలఅందంగా ఉంటుంది" అంటూ మోహిని కుర్చీలోనించిలేచి మంచంమీద అతని తలగడవైపు వచ్చికూర్చుంది, దిండు సరిజేస్తూ 'ఐస్ బ్యాగ్' (మంచుగడ్డసంచి) మూలాన అక్కడక్కడ తడిసి వుండటం చూచింది. వెంటనే దర్బాన్‌ను కేకవేసి పిల్చి మరోదిండు తెప్పిం

చింది. చుట్టుపక్కల వస్తువులూ అవీ చక్కగా సర్దింది. జితేన్‌ను ఏమీ మాటాడనీయలేదు. పని అంతా అయాక "ఊః. ఇక నా తీరుబాటు అయి పోయింది; వెళ్ళాలి" అన్నది.

"వెళ్ళు" అన్నాడు జితేంద్రుడు.

"నేను 'లంచి'కి (ఫలహారానికి) వెడుతున్నాను. నువు ఏమి ఆహారం పుచ్చుకుంటావు ?"

"ఆయన వచ్చివుంటారనుకుంటాను ?"

"ఔను, ఒకటింబావు అయింది. ఎందుకు రాకుండా వుంటారు ? నీకేం ఇబ్బంది లేకుండా ఉందికదూ !"

"లేదులే. నువు వెళ్ళిపోవచ్చు."

"సుమారు మూడుగంటలయేసరికి వస్తాను. వెళ్ళనా ?"

"ఏం రావద్దులే, వెళ్లు. రానేవద్దు అసలు."

ఇవతలకు వచ్చిన మోహిని మళ్ళీ అతని కాళ్ళదగ్గర వచ్చికూర్చుంది. "నా ఫలహారం ఇక్కడికే తెప్పించుకోనా పోనీ !"

"వద్దులే, వెళ్ళు."

"సరేలే ; ఇక్కడికే తెప్పించుకుంటాలే." అంటూ బటన్ నొక్క టానికి ఆమె కొంచెం వంగింది. జితేంద్రుడు కొద్దిగా లేచి ఆమె బుజం పట్టుకుని "ఏమిటా పని ? వెళ్ళు. ఆయన ఎదురుచూస్తూ కూర్చుంటారు" అన్నాడు.

మోహిని నవ్వింది. "కూర్చుంటే కూర్చుంటారు ఇవాళ ఒక్కనాడు. నేను ఇక్కడ తింటూవుంటాను ; నువు చూస్తూఉందువుగాని. అంతమాత్రం ఉత్సుకత నీకు ఉండకూడదా ? ప్రతి చిన్నవిషయానికీ అలా కోపం తెచ్చు కుంటావేం ?"

జితేంద్రునికి మరీ కోపం వచ్చేసింది. "నువు అక్కడికే వెళ్ళి ఫలహారం చెయ్యకపోయావంటే ఒట్టు !"

"నీ ఒట్టుకేంలే" అంటూ మోహిని బటన్ నొక్కింది. కాసేపటిలో దర్వాన్ వచ్చాడు. "లోపలికి పోయి నా ఫలహారం ఇక్కడికే తీసుకురమ్మని చెప్పు వంటమనిషితో" అన్నది.

దర్బాన్ వెళ్ళిపోయాడు. "మోహినీ!...." అన్నాడు జితేంద్రుడు.

"ఇదిగో, ఈ యిల్లు నాది. ఇక్కడ నీ ఆజ్ఞలేమీ చెల్లుబడికావు. నా యిష్టమే చలామణి కావాలి. నువు ఉన్నంతమాత్రాన ఈ గది యావత్తూ నీదే అనుకుంటున్నావు కాబోల్నే! కావాలంటే భోజనంకూడా ఇక్కడికే తెప్పించుకుని నేను తినలేనూ? ఇక్కడే తింటాను, చూస్తూఉండు. ఎవరు కాదంటారో చూస్తాగా!"

"మోహినీ! ఆయన అక్కడ కూర్చుని ఎదురుచూస్తూ ఉంటారు."

"కూర్చుంటే కూర్చోనీ. నన్నేం చెయ్యమంటావు? ఈగదిమీద నాకున్న అధికారం తేలిగ్గా వొదులుకుంటానేమిటి? నీ కెందుకు? నువు పడుకో; మాటాడబోకు."

జితేంద్రుడు గుడ్లు వొప్పజెప్పి మోహినివైపు చూస్తూ ఉండిపోయాడు. కొంచెంసేపటికి ఏమో మాటాడబోయాడు. మోహిని రెండు వేళ్ళు ఎత్తి పెదవివద్ద పెట్టుకుని చూపించింది. జితేంద్రుడు మళ్ళీ మాటాడలేదు. అనదలచుకున్న మాటేదో నోట్లోది నోట్లోనే ఇగిరిపోయింది. మౌనంగా ఉండిపోయాడు.

ఫలహారం వచ్చేసింది. వంటమనిషి మేజా తుడిచాడు. పళ్ళేలు దానిమీద సర్దుతున్నాడు. "అలా ఉండనీలే, నువు వెళ్ళిపో" అన్నది మోహిని.

అతడు వెళ్ళాడు. మరునిమిషంలో మంచినీళ్ళగ్లాసు తెచ్చి మేజామీద పెట్టి వెళ్ళాడు, మోహిని చూస్తూ కూర్చుంది. ఆమెచేయి రుమాలుతో మెల్లగా అతని పాదాలక్రింద నిమురుతూ ఉంది.

"మోహినీ! లేచి ఫలహారం చెయ్యి."

మోహిని ఇదివరకులాగే రెండు వేళ్ళు పెదవులదగ్గర పెట్టుకుంది. అంటే 'మాటాడబోకు' అని అర్థం.

ఈసారి జితేంద్రుడు మాటాడకుండా ఉండలేదు. తన కాళ్లు వెనక్కు లాగేసుకున్నాడు. "లేచి నీ ఫలహారంకానీ మొదట!" అన్నాడు.

"తింటాలే."

"ఇంకా ఎప్పుడు తింటావు? లే."

"ఆకలి లేదు."

"ఉన్నదిలే ఆకలి. లే, హంరంచెయ్యబోకు."

మోహిని ఒక నీరసపు చిరునవ్వు ప్రదర్శించింది. "అసలే లేదు ఆకలి."

జితేంద్రుడు ఆమెవైపు తదేకంగా చూస్తున్నాడు. అతని మనస్సుకు ఏమితట్టిందో ఏమో! "నేను భోజనం చెయ్యకూడదు. అందుకోసమని నువుకుడా...."

"కాదు కాదు. ఆకలే లేదసలు."

"మోహినీ!...."

"జితేన్! వారు నాకోసం ఎదురుచూస్తూ లేరక్కడ. ఇవాళ ఫలహారం ఆఫీసుకే తెప్పించుకున్నారు. నిజంగానే నాకు ఆకలిగాలేదు."

"కోపం వచ్చిందా?"

"ఔను బహుశా!"

"నామూలంగానే కదూ?"

"ఔను బహుశా...."

"మోహినీ! నువు...."

"లేదు, జితేన్. నువు మరోవిధంగా అనుకోకు. నీకు పూర్తిగా ఆరోగ్యం చిక్కేవరకూ వారు నిన్నిక్కడినించి కదలన్వియరు."

"వారికి తెలుసునా?"

"ఇవాళ చెబుదామనుకున్నాను. కాని వారు...."

"సరే, చెప్పేసెయ్యి. సూటిగా వెళ్ళి పోలీసులకు చెప్పెయ్యటం చాతగాకపోయిందేం? అందుచేత ఈ వంకరదోవ అవలంబించావన్నమాట. సరేలే, చెప్పులే" అన్నాడు జితేంద్రుడు ఒక వికృతకంఠస్వరాన.

"జితేన్!...." మోహినికి చాల ఆశ్చర్యం అయింది. ఇక మాటాడలేకపోయింది.

జితేంద్రుడు అటు ముఖంపెట్టి ఒత్తిగిలి పడుకున్నాడు. దుప్పటి తీసి నిండా కప్పుకున్నాడు.

మోహిని ఇక లాభంలేదనుకుని మంచం దిగివచ్చి కుర్చీలోకూర్చుంది. ఆవ్యక్తిపై ఆమెకు దయ ఏర్పడింది. అతడు హృదయంమీద ఎంతో బరువు

చేసుకుని వచ్చాడు; తన శరణు జొచ్చాడు. తనపై ఎంతో విశ్వాసం ఉంచు కొని వచ్చాడు. ఆ విశ్వాసంపట్ల ఆమెలో కృతజ్ఞత ఉత్పన్నమైంది. విశ్వసించినవాడు మరి దోషారోపణ చేస్తాడేం? దానికితోడు ఆమె ఇంకొకర్ని విశ్వసించకూడదన్న షరతేమిటి? ఆమెకు తన భర్తసంగతి బాగా తెలుసు. ఆయన ఆనందస్వభావంగల మనిషి. నీచత్వం అనేది ఆయనలో లేనేలేదు. ఆమెను అత డెన్నడూ ఏమీ తర్కించి అడగడు; ఏవిధమైన అనుమానమూ ఉండదాయనకు. ఏదైనా కలిగినా విశ్వసించడు. దూరంగానే ఉంచుతాడు దాన్ని; లోనికి పోనిచ్చి మనస్సును కలుషితం కానీడు. అటువంటి భర్తకు తెలియనీకుండా కొన్ని విషయాల్ని తాను మభ్యపెట్టి వుంచటమా? ఈ పరిస్థితి తలుచుకుంటే ఆమె మనస్సుకు బాధగానే వుంది. కచ్చితంగా చెప్పి వేద్దామనుకుంది: "మావారి దృష్టిలో నేనొక అవిశ్వసనీయురాలుగా తయారు కావటం నాకు కిట్టదు, జితేన్! ఇక నీ వ్యవహారం నువు చూచుకో, ఉంటే ఉండు; లేకపోతే వెళ్ళిపో. ఈ భువనమోహిని పూర్వపు భువనమోహినే, అయినా ఇప్పుడొకనికి ధర్మపత్నికూడాను; ఒక గృహానికి యజమానురాలు, ఒక నిర్ణీత ధర్మపరాయణ" అని. ఒకవేళ ఈ మాటలన్నీ ఆమె అతనితో చెప్పివేయగలిగినా .... అతనియెడల తాను నిర్దాక్షిణ్యం పూనగల ఉపాయమేమీ గోచరించటంలేదు. ముఖంనిండా దుప్పటి కప్పు కుని జితేన్ అటువైపు తిరిగి పడుకున్నాడు. ఊపిరైనా పీలుస్తున్నాడా? పైకి ఎంతో బిగువు, బెట్టు కనిపిస్తున్నా, లోపలమాత్రం వట్టి పిరికిగుండే. ఆసంగతి మోహిని గ్రహించింది. తాను సమక్షంలో వున్నంత సేపూ—అనంతకాలపర్యంతం—అతని యీ బెట్టు సడలిపోదు. చంటిపిల్ల వాడు మారాంచేసినట్టుగా మాటిమాటికీ కోపం తెచ్చుకుంటాడు. అతన్ని చూస్తోంటే ఆమెకు సమవేదన, సహానుభూతి కలుగుతున్నాయి .... ఆమెకొక భర్త వున్నాడు; చాల మంచివాడు; అమె ఆతనిసొత్తు; అతనితో కలసి ఆమె చక్కబెట్టవలసిన ధర్మక్షేత్రం వేరేఉంది. ఇట్టిస్థితిలో ఇతడు యే బలాన్ని ఆధారంచేసుకొని ఆమెను తనదాన్నిగానే భావించుకుంటూ ఇక్కడికి వచ్చి పడ్డాడు? వస్తేవచ్చాడు పోనీ; ఆమెకూడా తనదిగానే ఉన్నదా లేదా అనే అనుమానంలోకూడా పడుతున్నాడే! .... మోహిని మనస్సుకు చాలా బాధకలి

గింది.జితేంద్రుడు ఈనాడు ఏకాకి; నా అన్నవాళ్ళెవరూ లేరతనికి.ఒకప్పుడు మాత్రం ఎవరున్నారు గనక? దిక్కు-మొక్కు-లేని జన్మ; అలాగే పెరిగాడు; అలాగే చదువుకున్నాడు. అందరికీ చుట్టపక్కాలు, స్నేహితులు ఉంటారు. ఇతనికెవ్వరూ లేరు; ఎప్పుడూ ఒక్కడే. తనకుతానే అవలంబంగా బ్రతికి బట్టకట్టాడు. అతని కలలే అతనికి తోడునీడ.దీన్నే బహుశా ప్రతిభ అంటారేమో! వెర్రి అనికూడా బహుశా దీన్నే అంటారు. ఏమైనాగానీ, అతడెవరి సహాయాన్నీ తీసుకోలేదు; తానెవరికీ తోడై సాయంగా ఉండలేదు. మరీ ఒంటరివాడనటానికీ వీల్లేదు. ఒక దళంలో సభ్యుడు. తనతో కలిసి పనిచేసే వాళ్లు, అనుచరులు ఉన్నారు. కాని దళం అనేది ఏకాకిత్వాన్ని పెంచడానికి బదులు తుంచుతుందికూడానా? అందులో మానవుడు తనచుట్టూ తాను ఏదేదో పేర్చుకుపోవటమేగాని తననుతాను సమర్పించుకోలేడు. ఇచ్చుకోలేని స్థితిలో పుచ్చుకోటానికి ఏమిలభిస్తుంది? మోహినికి పూర్వపుసంగతులు జ్ఞాపకం వచ్చాయి. తానుకూడా వెంట ఉంటే ఆ నిప్పు ఏమయేది? అది ప్రజ్వలించడంకంటె అధికంగా ప్రకాశించేదికాదూ!....కాని ఈ ఆలోచనలన్నీ ఆమె దూరంగా త్రోసివేసింది. అప్పుడామెలో ఏవేవో స్వప్నాలు మెరుపుతీగల్లాగ అంతర్గర్భితాలై ఉండేవి: ఉండి ఉండి తళుక్కున మెరుస్తూ ఉంటాం. జడత్వంపొంది అడుగుకు దిగజారిపోయేటట్టు బరువుగా ఉండం. ప్రాణవాయువులా ప్రవాహశీలురమై, తరళమై, చిన్మయులమై....కాని అవంతా ఏనాటిసంగతో! తానిప్పుడొక సురక్షితము, ప్రతిష్ఠాత్మకము అయినవలయంలో వచ్చిపడ్డది. తన కన్నిహంగులూ, అన్నిసంపదలూ ఉన్నాయి. కాని....

ఇక ఆమె ఆపైని ఆలోచించలేకపోయింది. తనకిప్పుడు లేకుండా ఉన్నదేమిటో ఆమె ఊహించుకోలేకపోయింది. అడ్డంకులు లేవు; బాధలు లేవు; లేమిలేదు; సవాలులేదు. కాని ఇవన్నీ నకారాత్మకాలే. ఇవన్నీ లేకుండా వుండటమే సత్యమైన ఉనికి అనిపించుకుంటుందా? ఏమిటి....నిజంగా....? ....ఆమె అలా కుర్చీలో కూర్చుని శూన్యంలోకి చూస్తూ ఉంది....అభావం కూడా భావపూర్తికి అనివార్యమా? లేకపోవడం అనేది ఉన్నప్పుడేకాని ఉండటం అనేది పరిపూర్ణంకాదా? జీవించాలంటే మృత్యుసాధన అవసరమా? తోడుతోడుగా చస్తూవుండకుండా, కేవలం బ్రతికేవుండటం అయథార్థమా? అసంపూర్ణమా? — అని ప్రశ్నించుకుంటున్నట్టుగా ఉంది.

ఆమెకేమీ అర్థంకాలేదు. జితేంద్రుడు తనను తాను మూసివేసుకొని పడివున్నాడు. అతడు మృత్యుఉపాసకుడా? బహుశా ఆ ఉపాసన చాల గొప్పదేనేమో! కాని ఇంతకూ....

"జితేన్!"

జితేన్ మాటాడలేదు.

ఆమె లేచింది. మంచందగ్గరకు వచ్చింది. అతని మీదుగా వంగి ముఖంమీదినించి దుప్పటి తీసివేసింది. అతని చెంపకు చెయి ఆనించి ముఖం తనవైపు తిప్పింది. "సరే, ఇక నేను మాటాడనులే! ఏదీ కళ్ళుతెరు."

ఇదంతా జితేంద్రునికి పెద్ద ఎగతాళిగాఉంది. ఎవరూ తన సమీపంలో ఉండటం అతని కిష్టంలేదు. తన విధితో తానే యుద్ధం చేయగలడు, మధ్యలో మరొకరికి జోక్యం ఎందుకు? ఎవరికేం పని? ఈ యువతి—

"ఇదిగో, నే నెవరితోనూ ఏమీచెప్పను. ఇంకా నీకు భయం ఎందుకు?"

మరుక్షణమే జితేంద్రుడు ఆమెచేయి గట్టిగా పట్టుకుని అవతలికి విసిరికొట్టాడు. వెళ్ళిపో ఇక్కడినించి - తక్షణం నువు ఇక్కడినించి వెళ్ళిపో" అన్నాడు గర్జిస్తూ.

మోహిని క్రింద పడిపోయేంత పనైంది. విసురుగా చాల అడుగులు వెనక్కు తూలింది. చివరకు నిబ్బరించుకుని నిల్చింది. మళ్ళీ ముందుకు వచ్చింది. అతని కాళ్ళవైపు నిల్చుంది. "వెళ్ళిపోనా?"

"వెళ్ళు, వెళ్ళు, వెళ్ళు!"

ఆమె చిరునవ్వు ప్రదర్శించింది. "సరే అయితే. మళ్ళీ మూడు గంటలప్పుడు వస్తాను" అంటూ ఆమె పోబోయింది.

"నువు రానేవద్దు అసలు" జోరుగా అనేశాడు జితేంద్రుడు.

వెడుతూ వెడుతూ మోహిని ఒకసారి వెనక్కు తిరిగి చూచి చిరునవ్వు నవ్వింది. "బహుశా నర్సుతోపాటు అంతకంటే ముందే వస్తాను" అంటూ ఆమె వెళ్ళిపోయింది.

అనుకున్నట్టు నర్సు పరిచితురాలే. ఎప్పుడవసరంవచ్చినా ఆమెనే పిలుస్తారు. ఆమె అంటే అందరికీ మంచి నమ్మకం. ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది; వినయవతి; పనిలో మంచి నేర్పుగల మనిషి. మేటిల్డా ఆమె పేరు. మనం ఆమెను మిథిల అందాం. మిథిల ఒక ఉత్తరం తీసుకువచ్చి మోహినికి ఇచ్చింది.

పరస్పర నమస్కారాలు, కుశలప్రశ్నలు అయాయి. మోహిని ఉత్తరం చదువుకుంది. మడతపెట్టి దగ్గర వుంచుకుంది. "రోగివిషయమై వారు నీకేమైనా చెప్పారా ?"

"లేదు. ఉత్తరం మాత్రమే ఇచ్చారు."

"సరే, నేను చెబుతాను" అంటూ మోహిని లేచింది; మళ్ళీ కూర్చుంది, బటన్ నొక్కి గంట మ్రోగించింది. "నౌకరు వస్తాడు; వచ్చి నిన్ను రోగిదగ్గరకు తీసుకువెడతాడు.... అతడు మా ఆయనకు స్నేహితుడు. జ్వరం అని డాక్టరు అంటున్నాడు. కంగారేం లేదనే నా ఉద్దేశం. నీకేమన్నా వైపరీత్యం కనిపిస్తే నాకు తెలియజెయ్యి."

నౌకరు కుర్రాడు వచ్చాడు. "ఈమెను మన అతిథిగారి గదిలోకి తీసుకుపో" అన్నది మోహిని.

మిథిల వెళ్ళాక మోహిని ఫోన్‌చేసింది. భర్త ఆ సమయంలో అక్కడ లేడని కబురు వచ్చింది. 'వారితో ఒక్క నిమిషం ఫోనులో మాటాడమని చెప్పండి' అని మోహిని అన్నది. చెవికి ఫోను అలానే పెట్టుకుని నిల్చుంది. కొంచెం ఆలస్యమే అయింది. అక్కడ మున్షీ వచ్చి ఫోనులో చెప్పాడు : "బాబుగారు కేసు విచారణలో ఉన్నారు, కొంచెంసేపు అయాకగాని తీరిక చిక్కదు."

"వారికి తీరికచిక్కినప్పుడు కాస్త చెప్పండి : కొంచెం ఫోనులో ఇక్కడికి మాటాడమని."

మోహినికి మనస్సేమీ బాగాలేదు. అయిదారు నిమిషాలు అలాగే ఫోను మోగుతుందేమోనని ఎదురుచూస్తూకూర్చుంది. లాభం లేకపోయింది. చివరకు లేచి జితేంద్రునిదగ్గరకు వెళ్ళింది.

మిథిల వచ్చిననిమిషంనించే తన పనిలో నిమగ్న అయింది. నియమానుసారం చార్టు తయారుచేసి తగిలించింది. మేజాబల్ల చక్కగా సర్ది అన్నీ అమర్చింది. రోగి నోట్లో థర్మామీటర్ పెట్టింది. మోహిని వచ్చి మంచందగ్గర వున్న కుర్చీమీద చేతులు మోపి వెనుకగా నిల్చుంది. "నాడి చూచావా మిథిలా ?"

"ఇంకా లేదు" అంటూ చేతిగడియారంచూచుకుని థర్మామీటర్ తీసింది. చూచింది ; దులిపింది.

"ఎంత ఉంది ?

" 'టు పాయింట్ సిక్స్' (నూటరెండు డిగ్రీలపైన ఆరు పాయింట్లు."

మోహిని విన్నది. విని మందహాసంచేసింది. "ఎలా వుంది ?" అని అడిగింది జితేంద్రునివైపు తిరిగి.

అతడు ఇటువైపే చూడ్డం లేదు. పలకరించినా మోహినివైపు తిరగనే లేదు. ఒక్క మాటకూడా పలకలేదు.

మిథిల అతని చేయి అందుకుని నాడి పరీక్షించుతోంది. అతడు మిక్కిలి శాంతంగా, సౌమ్యంగా, ఎదురుగావున్న గోడపైనో, పైన కప్పు మధ్య ఏబిందువుమీదనో దృష్టి లగ్నంచేసి పడుకున్నాడు.

"ఎన్ని ?"

"నూటపన్నెండు."

"పన్నెండు !"

"చిత్తం !"

మోహిని కుర్చీ విడిచిపెట్టేసి ముందుకు వచ్చింది. జితేంద్రుని మంచంమీద కూర్చుంది. "చూచారా ! ఇప్పుడు ఇద్దరం ఉన్నాం. ఈమె మేట్రిన్లా; అంటే మిథిల. నా చెల్లెలు. రాత్రిపూట ఈమె వుంటుంది; నేను వెడతాను. వినిపిస్తోందా ? ఇవాళ సాయంత్రం...."

"సరే" అన్నాడు జితేంద్రుడు ఏదో అనాలికదా అని. ఆ 'సరే' అన్న పదంలో "నువు చెప్పినదంతా విన్నాలే. అయిందిగా.... ఇక దయ చెయ్యి" అన్నభావం వెల్లివిరుస్తోంది.

"పార్టీ ఒకటి ఉంది, వెళ్ళాలి. అబ్బ, ఈ పార్టీలతో....వాటి దుంపతెగ....ఏదీ ఇలాతే" అంటూ మిథిల చేతిలోనించి. దానిమ్మపళ్ళరసం పిండిన గ్లాసు అందుకున్నది మోహిని.

"ఇది కాస్త పుచ్చుకుందురుగాని, లేవండి."

మోహిని చేతిలో ఆ చిన్ని గాజుగ్లాసులో ఎర్రగా మెరుస్తూన్న రసం చూచాడు జితేంద్రుడు. అలా చూస్తూనే పడుకున్నాడు.

"లేవండి; లేవాలి" అంటూ మోహిని మిథిలవైపు తిరిగి "కాస్త ఇది పట్టుకో" అన్నది.

రసంగ్లాసు మళ్ళీ మిథిలకు ఇచ్చింది. రెండుచేతులూ అతని వీపు కిందికి పోనిచ్చి లేవదీసి కూర్చోబెట్టింది.

నిశ్చేష్టుడై గుడ్లు వొప్పజెప్పి చూస్తున్నాడు జితేంద్రుడు: "ఏం, ఎందుకు ?" అని అడుగుతున్నట్టు.

మోహిని అతన్ని బాగా కూర్చోబెట్టింది. ఒక చేత్తో అతన్ని పట్టు కుంది. కుడిచేత్తో రసంగ్లాసు అందుకుని అతని నోటిముందు పెట్టింది "పుచ్చుకోండి" అంటూ.

రెండుమూడు నిమిషాలవరకు అతనికేం తోచలేదు. గ్లాసు పెదవు లకు చాల దగ్గరగా వచ్చింది. అందులోనిరసం చాలా ఎర్రగావుంది. అతని చూపులు గ్లాసుమీద అతుక్కుపోయివున్నాయి.

"తీసుకోండి; తాగండి."

అతడా మాటలు విననేలేదో, వినినా అర్థంకాలేదో ; కాని చెయి చాచి గ్లాసు అందుకున్నాడు. గ్లాసు ఎత్తుకుని ఒక్కసారి అంగిట్లోపోసుకుని మింగే శాడు....అంతా ఒక్కగుక్కలో. మోహిని అతన్ని మెల్లగా పట్టుకుని దిండు మీద పడుకోబెట్టింది. రుమాలు తీసి అతని పెదవులు తుడిచింది. ఇంతలో ఫోను పుచ్చుకుని నౌకరుకుర్రవాడు గదిలోకి చక్కావచ్చాడు.

"ఏమిటిరా ?"

"అయ్యగారు ఫోనుచేస్తున్నారు."

మోహిని వచ్చి కుర్చీలో కూర్చుంది. ఫోను అందుకుంది. "ఊం, నేనే. చెప్పండి."

"నువ్వు ఇందాక పిల్చావుటగా; మున్షీ చెప్పాడు. దేనికి ?"

"మీరు అక్కడినించే పార్టీకి వెడతారా యేమిటి ? అదేమిటండీ ! ఆ దుస్తులతోనేనా ?"

"ఏం ? ఐరోపీయుల పార్టీగనకనా ? మన మంత్రిగారింట్లోనేగా !"

"విదేశీరాయబారులూ వాళ్ళూ వస్తారేమో !"

"వస్తేవస్తారు...."

"కాదులెండి; ఇక్కడికి వచ్చేవెడుదురుగాని. అదీగాక, నేను కూడా రానని మీరెలాగ అనుకున్నారు ?"

"మరి జబ్బుగావున్న మన అతిథి...."

"చెప్పానులెండి అతనికి : నేను వెడుతున్నాను పార్టీకి అని. వస్తారుకదూ !"

"చిత్తం, అలాగైతే సరే !"

"ఇప్పుడతనికి జ్వరం కొద్దిగా జారింది. నిన్న ఉన్నంత లేదు. తేలిగ్గానే ఉన్నాడు. చూడండి....ఇవాళ రాత్రికికూడా మిథిలను ఉండ మంటాను. కావాలంటే మన మోటారులో ఒకసారి ఇంటికివెళ్ళి మళ్ళీ వెంటనే తిరిగివస్తుంది. ఆమెను అడగమన్నారా మరి !"

"అడుగు. ఇబ్బందేముందీ ?"

ఫోనుమీద చెయిపెట్టి మోహిని మిథిలవైపు తిరిగింది. "ఇదిగో, మిథిలా, నీకు 'డబల్ డ్యూటీ' (రెండువేళలా పని) అప్పగించవలసి వస్తున్నది. ఏసంగతీ నిన్నడిగి చెబుతానన్నాను. ఏమంటావు ? చెప్పనా ఆయనతో ? కొంత డ్యూటీ నేనే పంచుకుందామనుకున్నాను. కాని చూస్తు న్నావుగా ! ఎటువంటి అవసరం వచ్చేసిందో ! నువు నా మంచి చెల్లాయివి మిథిలా ! సరేనా ? ఒప్పుకున్నట్టే కదూ !"

మిథిల మందహాసంచేస్తూ ఉండిపోయింది ; సమాధానమేమీ చెప్ప లేదు.

"చెప్పు మరి ! ఎమిటి ఆలోచిస్తున్నావింకా ?"

"చి త్తం. నేను—"

"హుం, రెండురోజులు ఎడమైతే పరవాలేదులెద్దూ. (ఫోను నోటి దగ్గర పెట్టుకుని) ఆమె ఒప్పుకున్నదండీ. ఇంకేం?"

"ఫోను మిధిలచేతికివ్వు కొంచెంసేపు."

"సరే, నామాట నమ్మకం లేదన్నమాట?....మిధిలా! ఫోను తీసుకుని నువ్వే ఆయనతో సూటిగా చెప్పేసెయ్యి."

మిథిల ఫోను అందుకుంది. "చిత్తం, నేనే, మిధిల....చిత్తం.... చిత్తం....అలాగే....సరే....చిత్తం...."

"ఏమన్నా రాయన?" అడిగింది మోహిని.

"ఏమీలేదు. అన్నారుకదా: "నీకు ఇబ్బందే ఔతుందనుకో.... అయినా మోహినితోపాటు నేనూ బ్రతిమాలుతున్నాను....మా ప్రార్థన అంగీకరిస్తావని ఆశిస్తున్నాను....క్షమించాలి...."

చెబుతూ మిథిల సిగ్గుగా, నమ్రతగా నవ్వింది. మోహిని మళ్ళీ ఫోను అందుకుని చెవిదగ్గర పెట్టుకుంది. "ఏమండోయ్....హలో....హలో.... అరె బందుచేసినట్టున్నారే!" వెంటనే ఆమె టెలిఫోన్ ఆఫీసు ద్వారా తిరిగి భర్తకు ఫోను చేసింది. "అప్పుడే ఫోను బందుచేశారెందుకండీ! నిజం చెప్పండి: పార్టీకి నన్నుకూడా రమ్మంటారా?"

"మోహినీ!—"

"నా ఉద్దేశం, బహుశా మీరు...."

"షటప్, (నోరుముయ్) మోహినీ! అయిదున్నరకల్లా తయారుగా ఉండు."

మోహిని ఆమాటకు ప్రసన్నచిత్తఅయింది. " అబ్బే, మరేంలేదు, అతనికి జ్వరం మళ్ళీ కాస్త ఎక్కువౌతున్నట్టుగా ఉంది. మీరు సరేనంటే...."

"కాని మిథిల వెళ్ళదుకదా; అక్కడే ఉంటుందిగా...."

"అయినప్పటికీ...."

"'లుక్ హియిర్' (ఇలాచూడు) మోహినీ! నువు నాతో రావాలి. పార్టీ చాల ప్రముఖమైంది....నీకు అదొక పరీక్షే అనుకో....తెలిసిందా?"

"రావలసిందేనంటారా?"

"చిత్తం రాణీ! రావలసిందే!"

"సరే...."

ఫోను ఆపేసి కుర్రవాడిచేతికి ఇచ్చేసింది. జితేంద్రుడు అంతా వింటూనే ఉన్నాడు. మౌనంగా, కదలకుండా పడుకున్నాడు. కాని చెవులు తీక్షణంగానే ఉన్నాయి. అక్షరంకూడా పోల్లుపోకుండా అంతా విన్నాడు. ఫోనుతీసుకుని కుర్రవాడు వెళ్ళిపోయాక మిధిలవైపు చూచి, వచ్చి తన తల దగ్గర కూర్చోమన్నట్టుగా సైగచేశాడు.

వెడదామా, వద్దా అని వెనుకముందాడుతూ నిల్చుంది మిథిల. వెళ్ళ లేదు. పక్కకు తిరిగి మోహినివైపు చూచింది.

"నేనంత అధమస్థితిలో వున్నానా? అస్తమానం నాకు ఉపచారాలు చెయ్యటానికంటూ ఒక వ్యక్తి దగ్గర ఉండాలా? నాకు ఇటువంటి వ్యవహారాలన్నీ అలవాటు లేదు. వింటున్నావా సిస్టర్! నాకివన్నీ అలవాటులేవు; నేను సహించనుకూడా. ఈవిధంగా నీ విశ్రాంతి నాకోసం బలి ఇచ్చుకోటం అనవసరం" అన్నాడు జితేంద్రుడు.

"చిత్తం" అన్నది నర్సు.

"ఏమిటది? అలా అంటారేం?" అన్నది మోహిని.

"దయచేసి తమరు మాటాడకండి.... ఇదిగో సిస్టర్! నువ్వు నామాట విను. ఆవిడతో ఏంపని? నాకీ భోగవిలాసాలు, ఈ అట్టహాసమంతా పనికి రాదు. ఏదో జ్వరం వచ్చింది, అదే పోతుంది. ఈ తమాషా అంతా ఎందుకూ?"

మోహిని కూర్చున్నచోటునించి లేచింది. దగ్గరకువస్తూ అన్నది: "మిథిలా! నీ పని నువుచూడు.... ఏమిటీ తమరు అనేది? ఈ తమాషా అంతా నాది. తమకు అలవాటు లేకపోవచ్చు; నాకు అలవాటే. మా ఇంట్లో రోగిప్రక్కన నర్సు లేకపోవటమంటూ ఉండకూడదు. నాది ఈ యిల్లు."

"అంటే?"

"అంటే.... ఇక్కడ నా పద్ధతిప్రకారం జరిగే వ్యవహారాలకు మీ రేమీ అభ్యంతరం చెప్పటానికి వీల్లేదు."

జితేంద్రుడు మోహినివైపు చూస్తూ ఉండిపోయాడు. ఆమె మంచం పట్టెమీద వచ్చి కూర్చుంది.

"ఏదో మామూలు జ్వరమేగా వచ్చింది నాకు !"

"చిత్తం, అదే—"

"నేనేం అవిటివాడిని కాదే !"

"చిత్తం, కాదు."

"నువ్వు—మీరు వెళ్ళాలిగా ; వెళ్ళిపోండి. విచారం ఎందుకూ ? ఈమె గారు కూడా...."

"నా వెళ్ళటంతో తమకేం సంబంధంలేదు. తమరు విశ్రాంతిగా పడుకోండి."

జితేంద్రుడు మనస్సులో కోపం పట్టలేకుండా ఉన్నాడు. తనపట్ల ఇతరులు దయచూపించటమనేది ఎంతమాత్రం సహించలేడు. మిథిలాదేవి.... తన పనిలో తాను పూర్తిగా నిమగ్నమై ఉంది. ఆమె ధ్యాస ఇటువైపే ఉన్నట్టులేదు. అయినా ఆమె ఉనికే అతనికి బంధనతుల్యంగా ఉంది. లేకపోతేనా....ఏంచేసేవాడో !

చివరకు మెల్లిగా గొణుగుతున్నట్టుగా అడిగాడు : "ఎక్కడికి వెడుతున్నావు ?"

"ఎక్కడికో వెడతాను. నీకు—"

"పార్టీకి వెడుతున్నావు కదూ !"

"నరకంలోకి వెడుతున్నాను."

ఆమాట విని జితేంద్రుడు మ్మాటాడలేదు. మోహినికూడా మౌనంగానే ఉంది. మిథిలమాత్రం అంతులేని పనిలో నిమగ్నమైనట్టుగావుంది. మోహిని కాసేపు మౌనంగానే కూర్చుని చివరకు నెమ్మదిగా "ఏం, వెళ్ళద్దంటావా ?" అని అడుగుతూ తన చేయి కంబళిలోపలికిపోనిచ్చి అతని చెయి పట్టుకుని ఒత్తింది. ఆచేయిని జితేంద్రుడు తన పిడికిలిలో బిగించాడు. ఆతనిచేయి వేడిగా, బలిష్ఠంగా ఉంది. అంతకుమించి జితేంద్రుడు మరేమీ మాటాడలేదు; మోహినిముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు.

అతని పిడికిలిలోనించి ఆమెచేయి త్వరగా విడుదల పొందలేదు. ఆమె తొందరగా లాగికోనూలేదు. కొంతసేపటికి పట్టు సడలగానే ఆమె లేచి నిల్చుంది. "త్వరగానే రావటానికి ప్రయత్నిస్తాను" అన్నది.

జితేంద్రుడు మరేమీ మాటాడలేదు. చూపులు కిందికి దించుకున్నాడు. తనలో తాను విలీనుడైనట్టు ఉండిపోయాడు.

"మిథిలా !" అంటూ మోహిని వెళ్ళిపోడానికి ఉద్యుక్తయై వెనక్కు తిరిగి "ఇదిగో, చూడు చెల్లాయీ! నేను వెళ్ళిపోతున్నాను. నీ గడియారంలో ఎంతైందో చెప్పు" అన్నది.

"అయిదూ పదిహేను."

"అయిదుంబావా ? అయితే వెళ్ళిపోతున్నాను. కావాలంటే నువ్వు మోటారులో ఒకసారి ఇంటికి పోయిరా. సరేనా ?" అంటూ మోహిని ఇక అక్కడ ఆగలేదు. వెళ్ళిపోయింది.

భర్త ఆమెకోసం గదిలో ఎదురుచూస్తూ కూర్చున్నాడు. ఆమె రాగానే "ఇదేమిటి ? ఇలాగే వచ్చేస్తావా ?" అన్నాడు.

"రెండు నిమిషాల్లో తయారై వచ్చేస్తాగా! తేనీరు పుచ్చుకోరూ మరి !"

"చాల బాగుంది. అయిదున్నరకల్లా బయలుదేరి వెళ్ళిపోవాలి. తేనీరు ఇక్కడే తాగేస్తే పార్టీ ఎందుకోసం ? అతిథిగారిదగ్గరనించి వస్తున్నట్టున్నావే !"

"ఔను. కంగారు పడకండి; ఇప్పుడే వచ్చేస్తాను."

నరేశచంద్రుడు పుస్తకాలెక్కువగా చదువడు. పుస్తకాల్లోనిసామగ్రి అతనికి చాల భారమనిపిస్తుంది. అది అతన్ని ఎక్కడికో అడుక్కి తీసుకుపోతున్నట్టు అనిపిస్తుంది—తత్వమేగాని, చిక్కు విడిపోవటమంటూ ఉండని లోతుకు—అంతా రహస్యమే తప్ప వెలుగు అంటూ కనిపించని అంతరాళానికి. తేలిగ్గా పైపైన ఉండటమే అతని కోరిక. గాలివైపు ముఖాలెత్తుకుని నవ్వుతూ ఉంటాయి పువ్వులు. నరేశుడు ఒక ముక్కాలిపీట ముందుకు లాక్కున్నాడు. కాళ్ళు దానికి తన్నిపెట్టాడు. వీపు సోఫాకు ఆనించాడు. అలా కూర్చుని కూనిరాగం ఆలాపన సాగించాడు. ఇంతలో అతనికేదో జ్ఞాపకం వచ్చింది. లేచాడు. జేబులో చెయి జొనిపి డబ్బీ తీశాడు. అందులోనించి సిగార్ తీసి ముట్టించాడు. పీలుస్తూ కూర్చున్నాడు. కూనిరాగం కూడా తీస్తునే ఉన్నాడు. ఇరవై నిమిషాలు దాటాక మోహిని గదిలోకి వచ్చింది

వస్త్రశృంగారం మనిషిని ఎలా తయారు చేస్తుందో ! ఆమె అదోరకంగా, చాల ఆకర్షణీయంగా కనిపించింది. ఇదివరకా మె స్త్రీ; ఇప్పుడు—

"ఏమిటి నీ ఉద్దేశం ఇవాళ ? నెత్తిమీదికి పెద్ద ముప్పే తెచ్చిపెట్టే ట్టున్నావే !" అన్నాడు నరేశుడు.

మోహిని మందహాసం చేసింది. "లేవండి; పోదాం."

నరేశచంద్రుడు ముగ్ధుడైపోయాడు ; "ఉహుఁ, నేను రాను."

"ఏం తమాషాచేస్తారండీ ! లేవండి."

"తమాషా ? నా కన్నులు పెట్టుకుని చూడు; నీకే తెలుస్తుంది. ఈ చంద్రబింబంముందు అక్కడ ఆముఖాలన్నీ నల్లబడిపోతే....చెప్పు మరి.... నేనేం చెయ్యాలి ?" అన్నాడు నరేశచంద్రుడు గంభీరముద్ర తాల్చి.

"సరేలెండి, పదండి. నేను వచ్చి గుమ్మంలో కలుసుకుంటాను. కొంచెం—"

"ఆఁ-ఆఁ, అలాగే-అలాగే...."

ఆమె అతని చేతులు పుచ్చుకుని లేవదీసింది. వెంటనే గబగబా వెళ్ళిపోయింది.

నరేశుడు కూనిరాగం తీస్తూనే పోర్చిలోకి వెళ్లాడు. హెటారులో ఎక్కి కూర్చున్నాడు. మోహిని జితేంద్రునిగదిలోకి వెళ్ళింది. "మిథిలా ! నావైపు ఒకసారి చూడు. బాగుందా ? ప్యాసైనట్టేనా ?" అన్నది వస్తూనే.

ఒక్క క్షణంసేపు మాత్రమే ఆమె సమాధానం అపేక్షిస్తున్నట్టుగా ఉండిపోయి, మరుక్షణమే మోహిని ముందుకు సాగిపోయింది జితేంద్రుని మంచందగ్గరకు.

జితేంద్రునిచూపులు ఆమెమీదే ఉన్నాయి—ఆమె మీద; ఆ అలంకారంమీద; ఆ ముఖంలోని ప్రసన్నతమీద ; అతిశయించిన ఆమె సౌందర్యం మీద.! దుస్తులు, సొమ్ములు ఎంతపనైనా చేయగలవు. మరో జన్మను ప్రసాదిస్తాయి నిజంగా; అతడు రెప్పవాల్చలేకపోయాడు. పత్తికాయల్లా గుడ్లు పెట్టుకుని చూస్తున్నాడు.

"చూచారా ! మీమూలాన ఇందాక ఆలస్యమైపోయింది. ఇంకా బాగా

ముస్తాబుకాలేకపోయాను. ఇలాగే వెడుతున్నాను మరి!" అంటూ మోహిని మందహాసంచేసింది.

ఆ మందహాసాన్ని జితేంద్రుడు చూడలేదు. అనాచ్ఛాదితమైయున్న కంఠసీమనుంచి చనుకట్టుకు పై భాగాన పరివ్యాప్తమైవున్న ఆమె కంఠమాల మీద అతని దృష్టి లగ్నమైవుంది. ఆకంఠమాల వన్నె తెలుపే. కాని అది ఏం తెలుపో బోధపడటం లేదు. దానిలో కాసేపు గులాబిరంగు, కాసేపు వంగపండురంగు మిలమిల లాడుతున్నవి. ఆ ముత్యాలకు ఒక రంగు కాదు కాబోలు! ప్రతి ముత్యంలోనూ అన్ని రంగులూ ఏకత్రితమై వున్నాయి. ఆకారాన్నిబట్టి అవన్నీ చక్కగా ఒక క్రమంలో గుచ్చారు, బాగుంది.

ఆమె అతని చూపులు గమనించింది. అప్పుడామెకు వొళ్ళు తెలిసింది. "ఇవిముత్యాలు. చూస్తావా?" అన్నదామె కంఠమాల పట్టుకుని.

"ముత్యాలా!" అన్నాడు జితేంద్రుడు ఆశ్చర్యంగా.

"నేను మళ్ళీ తిరిగివచ్చాక చూద్దువుగాని. ఇప్పుడు తొందరగా వెళ్ళిపోవాలి. అప్పుడే నిద్రపోయేవుసుమీ! పార్టీనించి రాగానే ఇక్కడికి వస్తాను....ఏమిటి? అలా చూస్తున్నావేం?"

జితేంద్రుడు చూపులు మరలించుకున్నాడు.

"నర్స్! ఏదీ మందు?...." అన్నాడు.

"ఇంకా టైము కాలేదు" అన్నది నర్సు.

"టైము కాకపోవటమేమిటి, అయింది" అన్నాడు జితేంద్రుడు మోహినిరాకతో తనకేమీ ప్రసక్తి లేనట్టూ, ఆమె అసలు అక్కడికి రావటం తనకోసం కాదన్నట్టూ.

"మందు నేనే ఇచ్చి వెడతాను. కాని, చూస్తున్నావుగా! ఆలస్యం లేదు; వెళ్ళాలి. అదిగో హారన్‌కూడా మోగిస్తున్నారు. సెలవు" అంటూ మోహిని గాలిలో ఈదుతున్నట్టుగా వెళ్ళిపోయింది.

జితేంద్రుడు ఆమెపైపే చూడనట్టుగా పడుకున్నాడు. తేలియాడుతూన్న ఆమె చీరమడతల్ని కన్నులు చూపించాయి; కాని అతడు చూడలేదు. తేలియాడే ఆ చీరమడతల్లోనించి వెలువడుతూన్న మధురధ్వనుల్ని వీనులు వినిపించాయి; కాని అతడు వినలేదు.

బిగ్గరగా అరిచాడు: "ఏదీ, మందు ఇవ్వవేం?"

# 7

వచ్చిందా అదీ ఇచ్చాక, సుమారు ఎనిమిదిన్నర గంటలకు కాస్త తీరుబాటు చిక్కింది నర్సుకు. అప్పుడు గదిలోనించి వెళ్ళిపోయింది. జితేంద్రుడు ఒక్కడే వున్నాడు గదిలో... మోహిని పార్టీనించి ఇప్పుడు వస్తుంది, ఇంకా సేపటికి వస్తుంది అని అనుకుంటూ. ఈసారి ఆమెకు కచ్చితంగా చెప్పెయ్యాలని అతని ఉద్దేశం; 'నీ సంసారబాధ్యతల్లో నువు ఉండిపో. నా మూలాన వాటికి విఘ్నం కలగనక్కర్లేదు' అని కచ్చితంగా చెప్పెయ్యాలనుకున్నాడు. తానింకా బాగా స్థైర్యం చిక్కబట్టుకుని ఉండాలి. ఈ జ్వరానికి లొంగిపోకూడదు. దాన్నే లొంగదీయాలి. జ్వరం అనేది మంచిది కాదు. పనిపాటల్లో ఉండవలసినవాడు జ్వరం పడకూడదు. చాల తప్పు. అయిదారు రోజుల్లో నాకు బాగా ఆరోగ్యం చేకూరాలిసిందే....ఆ యీ సంగతులన్నీ ఒక్కసారి మనస్సుకు జ్ఞాపకంచేసుకున్నాడు. తాను పూనుకుని నిర్వహింప దలచిన ఆ పనీ, ఇంకా చిన్నవి పెద్దవి, ఇతర బాధ్యతలూ....అన్నీ గుర్తుకు తెచ్చుకున్నాడు. కాని తొమ్మిదిగంటలైపోయింది; ఇంకా మోహిని రాలేదు. కాలం అతనికి ఎంతో విలువైనదిగా కనిపించసాగింది. బ్రతుకుకూడా విలువైనదే. తొమ్మిదిన్నరకూడా అయింది. ఎవరూ రాలేదింకా. ప్రజలు ఇళ్ళలో హాయిగా సుఖభోగాలు అనుభవిస్తూ ఉంటారు. కాని ప్రపంచంలో బోలెడన్ని సమస్యలు ఉన్నాయి. వికాసం, అభ్యుదయం సాధించాలి. మనిషి అయినవాడు నడుం బిగించి పరిష్కరించవలసిన సమస్యల్నీ, సాధించవలసిన వికాసాన్నీ సమన్వయం చెయ్యొద్దూ!....పది అయిపోయింది. జితేంద్రుడు అటూ ఇటూ చూచాడు. ఎక్కడో ఏదో చప్పుడౌతున్నట్టుగా ఉందే! నేనేమన్నా కునికిపాటు తీశానా? ఆ సమయంలో మెల్లిగా చప్పుడు గాకుండా ఎవరన్నా వచ్చి తిరిగి వెళ్ళిపోలేదుకద!....అతడు మనస్సుకు నిబ్బరం తెచ్చుకున్నాడు. మనసులో ఏవేవో కర్తవ్యాల్ని నిర్ణయించుకున్నాడు. తప్పకుండా ఈ జ్వరంలోనించి బైటపడవలసిందే; ఆ యీ కర్తవ్యాలన్నీ నెరవేర్చవలసిందే. ఇంతలో ఎవరివో అడుగుల చప్పుడు వినిపించింది. జితేంద్రుని చెవులు అటువైపు వెళ్ళనే వెళ్ళాయి. వాళ్ళంతా

చెవులైనాయి క్షణకాలం. వెంటనే దుప్పటి కప్పుకుని అటువైపు తిరిగి ఒత్తిగిల పడుకున్నాడు.

నర్సు లోపలికి వచ్చింది. తలుపు వేసింది. "నిద్రపోయారేమిటి?" అన్నది మృదువైన తీయని కంఠస్వరాన.

జితేంద్రునికి లోలోపల ఏదో భగభగమండుతూ లేవబోయింది. కాని వెంటనే తన్ను తాను నిగ్రహించుకున్నాడు. నిద్రపోతున్నట్టు అలాగే పడుకున్నాడు. "ఓ! నిద్రపోయినట్టున్నారే, సరే, లేపటంఎందుకు!" అనుకుంది తనలో తాను పైకి వినిపించేట్టే.

జితేంద్రుడు అలాగే పడుకున్నాడు క్షణకాలంపాటు. బూటుమడమల చప్పుడు ఇట్టి ఆమె నర్సు అని స్పష్టంగా తెలిసినతరువాత ఉలికిపడ్డట్టుగా మేల్కొని "ఎవరదీ?" అన్నాడు.

"ఎవరులేరు, నేనే" అన్నది నర్సు మెల్లగా, దగ్గరగా వచ్చి.

"ఏం? ఎందుకూ? ఏం కావాలి?"

"బహుశా 'డిస్టర్బ్' (నిద్రాభంగం) చేశాను కాబోలు. క్షమించండి, కొంచెం టెంపరేచర్...."

జితేంద్రుడు ఆమెచేతిలోనించి ధర్మామీటరు చిరాకుగా లాక్కొని నోట్లో పెట్టుకున్నాడు.

నియమితకాలం దాటాక నోట్లోనించి ధర్మామీటర్ తీసి ఆమెకు అందిస్తూ "ఇదిగో తీసుకో. మళ్ళీ నన్ను 'డిస్టర్బ్' (నిద్రాభంగం) చేయబోకు. నాకు నిద్ర వస్తున్నది" అన్నాడు.

మిథిల ధర్మామీటర్ అందుకుని చూస్తోంది. జితేంద్రుడు ఆమెవైపు చూస్తూ "ఎంత?" అని అడిగాడు.

మిథిల ధర్మామీటర్ దులుపుతూ "తక్కువే, ఒకటిన్నర" అన్నది.

"అంతేనా? నాకు జ్వరంలేదు, ఏంలేదు. మిసెస్‌గారితో చెప్పేసెయ్యి. నాకేం పరవాలేదు. ఆమెగారు శ్రమపడనక్కర్లేదు.. వినిపిస్తోందా? ఆమె ఏమాత్రం శ్రమపడనవసరంలేదు."

"చిత్తం—"

"తెల్లవారగానే చెప్పేసెయ్యి. లేకపోతే ఇప్పుడే వెళ్ళి చెప్పు. పార్టీనించి వచ్చేవుంటుంది."

"చిత్తం—"

"వచ్చిందా పార్టీనించి."

"చిత్తం."

"వచ్చిందా? అయితే వెళ్ళి ఇప్పుడే చెప్పేసెయ్యి: నేను చాల హాయిగా నిద్రపోతున్నానని."

"చిత్తం."

"మంచిది. పంకా తగ్గించేసెయ్యి. లైటుకూడా ఆర్పు. నువు ఎక్కడ ఉంటావు?"

"ప్రస్తుతం ఇక్కడే వున్నాను."

"నీ పడక ఎక్కడ?"

"ఇక్కడ పక్కనే గది ఉంది...."

"సరే వెళ్ళు. పడుకో."

"అప్పుడేనా?"

"అయితే లైటు ఉండనీ లే" అంటూ జితేంద్రుడు ఒత్తిగిలి పడుకున్నాడు. నిద్రపోవటానికి ప్రయత్నించాడు.

నర్సు బైటికి వెళ్ళి ఒక నవల తెచ్చుకుంది. కుర్చీలో చదువుకుంటూ కూర్చుంది.

జితేంద్రుని మెదడులో ఏవేవో ఆలోచనలు వేగంగా ఒకటొకటి పెనవేసుకుంటూ సందడిచేయసాగాయి. అతడు వాటిని సుస్పష్టంగా గ్రహించలేకపోతున్నాడు. వాటిని విడివిడిగా ఏర్పరించి అవగాహన చేసుకోలేకపోతున్నాడు. ఇంతకూ అవి ఆలోచనలు కాదు; వాటికొక ఆకారంలేదు; నిర్దిష్టమైన రూపంలేదు. ఏదో ఒకరూపం ఏర్పడుతున్నట్టుగా కనిపించి అంతరించి పోతున్నది, అనేక రూపాలు ఒకటొకటి ఒరసికొని గజిబిజిగా అపరూపం తయారౌతున్నది. వాటివల్ల తలనొప్పి పుట్టటం తప్ప వేరే ప్రయోజనం లభించటంలేదు. "నర్స్!" అంటూ పిల్చాడు.

"చి త్తం" అంటూ తలెత్తి చూచింది నర్సు.

"నీకు కొంచెం శ్రమ ఇస్తున్నాను. క్షమించాలి. ఆ తోలుపెట్టెలో 'ప్యాడ్' ఉంటుంది; ఇలా తీసి ఇవ్వు. స్టాంపులు అతికించిన కవరుకూడా ఉంటుంది చూడు. నీకు ధన్యవాదాలు...."

"ఉత్తరం రేపు రాయవచ్చులెండి. ఇప్పుడు విశ్రాంతిగా...."

"నువు చాల దయావతివి. రెండు పంక్తులు రాస్తాను...."

కాగితం అందుకుని అప్పటికప్పుడు జితేంద్రుడు ఉత్తరం ఒకటి రాశాడు. "ఈ చేరువలో ఎక్కడేనా ఉత్తరాలపెట్టె ఉంటుందనుకుంటానే!"

"రేపు ఉదయం పోస్టుచెయ్యొచ్చులెండి."

"నీకు పుణ్యం ఉంటుంది: ఇదిగో నర్స్! ఇది తీసుకుపోయి దర్వాన్‌కు ఇచ్చి పంపించు." అంటూ ఉత్తరం కవరులో పెట్టాడు; అతికించాడు. పైన చిరునామా రాశాడు. నర్సుకు ఇవ్వబోయి కొంచెం అనుమానించాడు. కాని మరుక్షణమే ఇచ్చేశాడు. ఆరాత్రే ఆ వుత్తరం వుత్తరాల పెట్టెలోకి వెళ్ళిపోయింది.

మర్నాడు ఉదయం మోహిని రాలేదు. రెండుగంటలప్పుడూ రాలేదు. మూడు దాటింది; నాలుగున్నరఅయింది. ఆమె రానేలేదు. హఠాత్తుగా జితేంద్రునికి సంతోషం పొంగింది. నర్సుతో ఇలా అన్నాడు: "నువు చెప్పేశావు కదూ! భేష్! మంచిపనిచేశావులే, ఇదిగో! నాకు ఆరోగ్యం చక్కబడుతూనే ఉంది. ఇవాళ ఇప్పుడుకూడా ఒకటిన్నర కంటే ఎక్కువ లేదుగా!"

"చిత్తం—"

"ఇదిగో! నువు చదువుతున్న ఆ పుస్తకం ఏమిటి?"

"చిత్తం, ఏదో...."

"సరే, నువు చెప్పేశావు కదూ! ఆమె ఏమన్నదీ?"

"చిత్తం...."

"—ఏమన్నది నీతో ఆమె?"

"నేను—ఆమెగారు పనిలో ఉన్నారు. బహుశా రెండుమూడు రోజులవరకు రావటానికి వీలుపడదేమో! క్షమాపణ చెప్పమన్నారు."

జితేంద్రునికి ఆకబురు కటువుగానేతగిలింది. అయినా ఇలాఅన్నాడు :
"ఆమె ఈబాయలకు రావలసిన అవసరం ఏం లేదని నువు చెప్పలేదా ?"

"చెప్పలేదు—"

జితేంద్రునికి కోపంవచ్చింది. "ఏం? చెప్పనేలేదా ?....సరే, ఉత్తరం పోస్టులో వెళ్ళినట్టేనా ?"

"దర్బాన్ ఉత్తరాలపెట్టెలో వేసే వుంటాడు."

"దయచేసి ఆ సంగతి కాస్త కనుక్కో. ధన్యవాదాలు అర్పిస్తాను."

రెండుమూడు రోజులు గడిచిపోయాయి. మొదట మోహిని చాలానే భయపడింది. ఆనాటి జ్వరతీవ్రత చూచేసరికి చాల ప్రమాదమే సంభవింప వచ్చునని ఊహించింది. రోజులు గడుస్తున్నకొద్దీ భయం తగ్గిపోయింది ; పరవాలేదులే అనుకోసాగింది. మొదటినాటి తన ప్రవర్తన రెండోనాటికి తనకే ఎబ్బెరికంగానూ, అసహజంగానూ పొడగట్టింది. పార్టీనించి వచ్చేసరికి బాగా పొద్దుపోయింది. జితేంద్రునివద్దకు వెళ్ళాలన్న ధ్యాసకూడా ఆసమయాన ఆమెకు ఎక్కువగా లేనిమాట నిజమే. పార్టీలో చాలమంది పరిచయమైనారు. అక్కడివినోదాలు, ఉల్లాసం....అవన్నీ ఆమెను మరో ప్రపంచంలోకి గొంపోయాయి. ఇంటికి వచ్చేసరికి చాల అలసిపోయినట్టనిపించింది. బాగా విశ్రాంతి తీసుకోవలసిన అవసరం ఏర్పడింది. సగం చేసి మిగిలిపోయిన ఇంటిపనులుకూడా అలాగే విడిచిపెట్టేసింది. తెల్లవారినతరువాత నర్సు వచ్చి అతనికి జ్వరం వెనక్కు మళ్ళిందనీ, ఇక త్వరలోనే ఆరోగ్యం చేకూరగల దనీ కబురు చెప్పింది. మోహిని నిశ్చింతగా తన దైనందిన కార్యాల్లో నిమగ్న అయింది. భారమంతా నర్సుకే విడిచిపెట్టింది ; తాను ఆదుర్దా పడటం అనవ సరం అనుకుంది.

ఈ నూత్నప్రకరణం తన జీవితచరిత్రలో ఒక భాగంగా మోహిని పరిగణించటంలేదు. ఇదేదో ప్రక్షిప్తమైన ఒక సంఘటన. ఆకస్మిక సంయోగంద్వారా సంభవించినటువంటిది. అతడేదో చేశాడొకపని. అదొక పెద్ద అపరాధంగాపరిగణించి ప్రభుత్వం అతనికోసం వెదుకుతున్నది. చట్టం, న్యాయం అతనికి విరుద్ధంగా ఆక్రోశిస్తున్నాయి. ఈ సంగతి అంతా మోహినికి తెలుసు. కాని ఆవ్యవహారానికీ తన జీవితానికీ ఏవిధమైన సంబంధమూ

ఉన్నట్టు ఆమెకు స్ఫురించటం లేదు. ఏదో సంయోగవశాత్తు తనమీదికి వచ్చి పడ్డాడు ఇలాగ. అతన్ని తాను ఉపయోగించుకోవాలనీ....తనకు భర్తమీద, భర్తకు తనమీద ఉండదగిన విశ్వాసం ఇతోధికంగా పెంపొందే నిమిత్తం అతన్ని ఇంట్లో తమతోపాటు అట్టిపెట్టుకోటం అవసరమని ఆమెకు ఇదివరకు ఒక భావన కలిగివుంటే వుండవచ్చు. కాని ఇప్పుడా భావన తొలగి పోయిందామెకు. పైగా అదొక వ్యర్థప్రయాసగాకూడా తోచింది. 'ఒకప్పు డలా ఎందుకనుకున్నానా!' అనికూడా ఆశ్చర్యపోయింది. ఇక అతన్ని గురించి ఏమీ పట్టించుకోకుండా నిశ్చింతగా ఉంటున్నది. నర్సు ఒకతె ఉన్నది కదా! ఆవిడే చూస్తుంది అంతాను. తనకేం బెడదలేదు. అనవసరమైన.... పిలవనిపేరంటంలాంటి....కొనితెచ్చున్నట్టుగా ఉన్న....లేనిపోని కర్తవ్యం అది....తన కెందుకూ? వొదిలిపోవటమే మంచిది....ఇలా అనుకుంటూ మూడురోజులు గడిపింది; అచాయలకే వెళ్ళలేదు. మనస్సుకు కష్టంగానే ఉండేది; కాని పట్టించుకునేది కాదు.

నాలుగోనాడు వెళ్ళింది జితేంద్రుని దగ్గరకు. ఈసారి ఒక సంకల్పం మనసులో పెట్టుకునే వచ్చింది. జితేంద్రుని ఆరోగ్యం పూర్తిగా బాగుపడ లేదు. అయినా ఇదివరకుకంటే కొంచెం నయం. "రండి" అన్నాడు ఆమెను చూడగానే.

మోహిని అతని పిలుపుకు సమాధానం చెప్పలేదు. వస్తూ మధ్యలో ఆగింది. "మిథిలా! నువు వెళ్ళి కొంచెం విశ్రాంతి తీసుకో పో" అన్నది నర్సుతో.

నర్సు ముఖం ఎత్తి మోహినివైపు చూచింది. మోహిని తనమాట చెప్పేసి ఆమెవైపు చూడకుండా ముందుకు సాగిపోయింది. మిథిల మారు మాట పలక్కుండా బైటికి వెళ్ళిపోయింది;

తన పిలుపుకు మోహిని మారుపలక్కపోయేసరికి జితేంద్రుని హృద యం క్షోభించింది. మోహిని మంచందగ్గరకు వచ్చింది. "వచ్చావా? రా!" అన్నాడు జితేంద్రుడు.

"ఎలా వుంది ఆరోగ్యం?"

"బాగానే వుంది. కాని —" అంటూ మోహినిముఖంలోకి చూచిన తర్వాత వాక్యం పూర్తిచెయ్యలేకపోయాడు.

"చెప్పు, ఆపేక్షావేం ?"

"మీరు ఇలా.... ఏమిటి సమాచారం ?"

"మీ మిత్రుడెవడో ఇక్కడికి వచ్చిట్టు విన్నాను. నిజమేనా ?"

జితేంద్రుని కనుబొమలు వంకర తిరిగాయి. "ఔను."

"మీకేమధికారం ? అలాగ...."

జితేంద్రుడు ఒక్క క్షణం ఆగి అన్నాడు : "నేనిక్కడ ఖైదీనా ?"

మోహిని అతనికెదురుగా కుర్చీలో కూర్చుంది. "మీకు జ్వరం వచ్చింది; జ్వరంతో ఉన్నారు. అది వేరే విషయం. కాని మీ మిత్రుల్ని ఇక్కడికి కూడా పిలిపించుకుంటున్నారేమిటి? ఎక్కడినించి వచ్చింది మీకా సాహసం ? ఇక ముందెన్నడూ అలా చెయ్యకండి. ఆ సంగతి చెప్పి పోదామనే ఇలా వచ్చాను. ఈ యిల్లెవరిదో మీకింకా అర్థంకాలేదా ? మోహినిదే, నిజమే. కాని ఇంకొకరిదికూడాను. అసలు వారిదే. వారి కారణంగానే నాది అయింది. ఇంతమాత్రం చిన్నవిషయంకూడా తెలుసుకోలేరన్న సంగతి నాకు తెలిసేవుంటే...."

"మించిపోయిందేమీ లేదులెండి. ఇప్పటికైనా మీరు చెయ్యదలచుకున్నది చెయ్యొచ్చు. అనుగ్రహిస్తే ఇప్పుడే లేచి వెళ్ళిపోగలను."

"ఎక్కడికి వేంచేస్తారు ?"

"ఈయిల్లు దాటాకకూడా ఇంకా ప్రపంచం ఉన్నదనుకుంటాను?...."

"అంతేగాని, మీ మిత్రుల్ని ఇక్కడికి పిలిపించుకోటంమాత్రం మానెయ్యరన్నమాట !"

"ఎందుకు మానెయ్యాలి ? మీ యిల్లు సురక్షితంగా ఉండేందుకోసమేనా ?"

మోహిని అతని ముఖంలోకి స్థిరంగా చూచింది : " 'ఈ యిల్లు నేలమట్టం చెయ్యాలనే మీ కోరిక' అని నేను భావించవచ్చునా ?"

ఆమె స్థిరదృష్టిని జితేంద్రుడు చూచాడు. ఆమెమాట విన్నాడు. మోహినివైపు అలా చూస్తూ చూస్తూ ఉంటే అతనిలో ఏమిభావం పొటమ

రించిందో చెప్పలేం; లోపలి బిగువు సడలిపోయింది. తన స్థితి తనకే అర్థంకాలేదు. ఇంతసేపటినించీ సగంలేచి కూర్చుని వున్నాడు. ఇప్పుడు పూర్తిగా పడుకున్నాడు. అన్నాడు: "మోహినీ! ఇది 'కోరిక'లకు సంబంధించిన విషయం కాదు. నా కోరికలవల్ల, నీ కోరికలవల్ల అయ్యేదేముంది? కోరిక లేకపోతేకూడా అయ్యేదేమీ ఉండదు. 'వెళ్ళు, నన్ను పోలీసులకు పట్టించెయ్యి' అని మొదటే నీకు నేను చెప్పాను! ఇవాళ నువ్వు ఆ పని చెయ్యగలవు, ఇంకేం? రా, నన్ను కూల్చివెయ్యి. నీ కా ధైర్యం లేకపోతే నేనేంచెయ్యను? ఎవరో ఒకరు కూలిపోవలసిందే. నువుగాని, నేనుగాని చేయగలిగిందేమీలేదు. నన్ను కూల్చేస్తావా కూల్చెయ్యి. లేకపోతే.... ఇదిగో మరోసారి చెబుతున్నాను.... నీ యిల్లు కూలిపోతుంది. ఈసంగతి తెలిసేనా యేమిటి నువు నాకు శరణు ఇచ్చావు? మెళుకువగలవాడిని గనుకనే నేను ఇలా వచ్చాను. అంతమాత్రం మెళుకువ నీకెందుకు లేకపోయిందీ? అందువల్లనే నీ యిల్లు కూలిపోవటం ఆరంభమయింది."

మోహిని దూకుడుగా అన్నది: "వాగబోకు. జ్వరం కాస్త వెనకబట్టిందోలేదో, మళ్ళీ దుడుకుతనం పోతున్నావు." మళ్ళీ కంఠస్వరం తగ్గించి ఇలా అన్నది: "కొంచెం తిన్నగా మాటాడు" అంటూ లేచి వెళ్ళి తలుపు లోపల గడియవేసి వచ్చింది. "నర్సు ఈ చాయలే ఎక్కడో ఉండదూ! అంతమాత్రం ఆలోచించలేవూ?"

ఆమాట విని జితేంద్రుని బిగువు ఇంకా తగ్గిపోయింది. దిండుమీద తలపెట్టుకుని సాఫుగా పడుకున్నాడు. "ఔను మోహినీ! నాకటువంటి ఆలోచనలేమీ ఉండవు."

మోహిని వచ్చి కుర్చీలో కూర్చోలేదు. మంచంపట్టెమీద తలదగ్గర కూర్చుంది. "ఇదిగో, నామాట విను. ఇంకెవర్నీ ఇక్కడికి పిలిపించబోకు. చూడు.... ఇటు నావంకచూడు! చెప్పు, ఇక నెవర్నీ పిలిపించవుగద!"

జితేంద్రుడు ఆమెవంక చూడలేదు. ఇంటి కప్పువైపు చూస్తూ పడుకున్నాడు. సమాధానం చెప్పలేదు.

"నాయింటి క్షేమమే ఆలోచిస్తున్నాననుకోకు. నీక్షేమంకూడా చూచుకో. నువు ఇక్కడ జ్వరంతో పడివున్నావు. బైట ఏం జరుగుతున్నదో

ఏమో నీకేమన్నా తెలుసా? చాలా హంగామా సాగుతోంది. రైలు దానంతట అది పడలేదు. ఎవరో కూలదోశారనే తెలియవచ్చింది."

జితేంద్రుడు వింటూ పైకి చూస్తూ పడుకున్నాడు. క్రిందివిషయాలేమీ తన కక్కరలేనట్టు.

"ఇంతకూ ఎవరా వచ్చింది ఇక్కడికి ?"

అతడు జవాబు చెప్పలేదు.

"ఎలా వచ్చాడు ? తనే కబురు తెలిసి వచ్చాడా ? నువు కబురు చేశావా ?"

అతడు పైకి చూస్తున్నాడు. అక్కడ పైన కప్పులేదు; మరేదో ఉంది. కప్పు మాయమైపోయింది; దానిస్థానే అనంత అగాధ శూన్యావకాశం కనిపిస్తున్నది. అందులో అతడేమి చూస్తున్నాడో మరి ! చూస్తూ చూస్తూ చిరునవ్వు నవ్వాడు. ఆ చిరునవ్వులో తెలియరాని భావమేదో తొణికిసలాడింది. తానెక్కడ వున్నాడో అక్కడ తాను లేనట్టుగా అనిపిస్తున్నది కాబోలు అతనికి !

మోహిని అతని కణతలు పట్టుకుని తనవైపు తిప్పుతూ "ఇటు చూడు. వింటున్నావా ?.... ఊఁ, ఇప్పుడు చెప్పు."

జితేంద్రుడు ఆమె వైపు ముఖం తిప్పాడు. ఆమె తనకు అంతచేరువలో ఉన్నసంగతి అప్పుడే తెలిసినట్టు 'వెళ్ళి ఆ కుర్చీలో కూర్చో' మంటూ వేలితో సైగచేశాడు.

మొదట అతని కన్నులకు చూపు ఉన్నట్టేలేదు. అది చూచి మోహిని భయపడ్డది. అతనిలో ఒక వ్యక్తి అంటూ లేనట్టు, విక్షిప్తజీవిలా కనిపించాడు. కాని క్రమేణా అతని కన్నుల్లో సహజమైన చూపు వచ్చింది. అప్పుడామెకు మనసు కుదుటపడింది. అతని చేతిసంజ్ఞ ననుసరించి ఆమె లేచి కుర్చీలో వచ్చి కూర్చుంది — ఏమి చెబుతాడో విందామని ఎదురుచూస్తూ.

"నువు ఆరాత్రి మళ్ళీ రాలేదు మోహినీ ! అప్పుడొక కంఠమాల ఉందికదూ నీ మెడలో ! అది ముత్యాలహారం, ఔనా ? ముత్యాలు చాల కాంతివంతంగా ఉన్నాయి. నిజంగా ముత్యాలేనా ?"

మోహిని సాశ్చర్యంగా వింటూ కూర్చుంది.

"నిజమైన ముత్యాలేనా ? ఎందుకడుగుతున్నానంటే కృత్రిమపు ముత్యాలుకూడా ఉంటాయిగా ! నిజమైన ముత్యాలేనా అవి ?"

"నిజమైనవి కాకపోతే మాయవి అనుకున్నావా ?" అన్నది మోహిని నీరసంగా నవ్వుతూ. అతడలా ఎందుకడుగుతున్నాడో ఆమెకు అర్థంకాలేదు.

"నాకు తెలియక అడిగాను మోహినీ ! కంఠమాల ఎంతవుంటుం దేమిటి ? పదివేలు ఉంటుందా ?"

"బహుశా ఉండచ్చు. నాకు తెలియదు."

"అయితే నువు అడిగేది ఏమిటీ ? ఇక్కడికి వచ్చింది ఎవరు అని కదూ ! వాడు మంచివాడు కాదు. నాలాంటివాడే ; చాల చెడ్డవాడు. వాడు రాకూడదనేకదూ ?....అసలు ఎవరూ రాకూడదనేకదూ నీ ఉద్దేశం ?"

"మళ్ళీ అలా అడుగుతావేం ? ఎవరూ రాకూడదిక్కడికి."

"నువ్వు ఇన్నాళ్ళూ ఇక్కడికి రానేలేదు. ఎలా వస్తావులే. పనిఎక్కువగా ఉందికాబోలు. దురదృష్టవంతుడిని, జ్వరతీవ్రత తగ్గిపోయింది. ఎవరికి మాత్రం ఏం కష్టం ? మీ నర్సు ఒక యంత్రం. అందుచేత ఒక మిత్రుడిని పిలిపించుకున్నాను. ఎవరూ రాకుండా ఉండాలంటే మరి...."

"నర్సును మార్పించెయ్యనా పోనీ ?"

వద్దు వద్దు ! ఆ వచ్చినవాడు దొంగ, బందిపోటుదొంగ, వాడు రాకూడదనేగా మోహినీ !....నీ ఉద్దేశం ?"

"జితేన్ !...."

"ఎవరూ రారులే....ఆ కంఠమాల ఇచ్చేస్తావా మరి !"

మోహిని గుడ్లు వొప్పజెప్పి చూస్తూ ఉండిపోయింది.

"ఇయ్యవా ?"

మోహిని ఏమీ మాటాడలేదు.

జితేంద్రుడు నవ్వాడు. "నీ కా ముత్యాలపేరు చాల బాగుంది. నువు పెట్టుకుంటే ఆనాడు చూచానుగా ! ఎంతో బాగుంది. ఔనౌను, ఇవ్వద్దులే మోహినీ !"

"జితేన్ ! మతివుండే మాటాడుతున్నావా ?"

జితేన్ ఇంకా బిగ్గరగా నవ్వాడు. "భయపడబోకులే : హారంకోసమే అంత భయపడతావా ?"

మోహిని ఒక చేత్తో అతని నోరు మూసింది. మరోచేత్తో బటన్ నొక్కి గంట మోగించింది. అతని వాగుడు....ఆ లక్షణాలు... ఆమెకు అనుమానాస్పదంగా తోచాయి.

## 8

ఆమె బటన్ నొక్కుతూంటే అతడు అడ్డుపెట్టలేదు, వద్దనలేదు. పైగా అతని కన్నుల్లో తృప్తి, సంతోషం, శాంతి ఉబుకుతున్నాయి. ఆమె అతని నోటిమీదినించి చెయి తీసింది. అతడు చాల సౌమ్యంగా మందహాసంచేశాడు. "నువు భయపడిపోయావు. కాని పిచ్చివాణ్ణో, వెర్రివాణ్ణో అయే ఆలోచన నాకు మాత్రం లేదు...."

మోహినికి అలాటి భయమే కలిగింది. కాని ఇప్పుడు అతని ముఖం లోని సౌమ్యస్థితి చూచి విస్మితురాలైంది.

"పైగా తలుపు మూసివుంది, నువ్వే గడియవేసి వచ్చావు. ఆమాట మరచిపోయావు కాబోలు !"

మోహిని ఆ మాటలు విన్నది. కాని వెంటనే అర్థమైనట్టు లేదు. అట్టె అతనిముఖంలోకి చూస్తూ ఉండిపోయింది.

"పైగా నువ్వే బటన్ నొక్కి గంట మోగించావు. ఎవరైనా గుమ్మం లోకి వచ్చివుంటారు. ఏమిచెబుతావు సమాధానం ?...."

ఇప్పుడు మోహినికి పరిస్థితి అర్థమైంది. విచలిత అయింది మనిషి. తటాలున లేచి నిల్చుంది. ఇంతలో బైట ఎవరో తలుపుమీద కొట్టినచప్పుడు కూడా వినిపించింది.

"అదిగో, వింటున్నావా ?...."

వింటూ మోహిని ఇక అక్కడ ఆగలేదు. గబగబా వెళ్ళి తలుపు తీసింది. గుమ్మంలో నర్సు ఎదురుగా నిల్చివుంది. ఆమె తలవంచుకుని, మోహినిని పలకరించకుండానే లోపలికి వచ్చేస్తున్నది.

మోహిని ఆకస్మికంగా నవ్వింది. "ఏం, మిథిలా! ఇంకా పుస్తకంలోనే ఉన్నావాయేమిటి?" అని అడిగింది.

మిథిల తలెత్తి చూచింది. ఆమె పెదవులమీద చిరునవ్వు అనేది ఏమన్నా ఉన్నదా? పైకిమాత్రం ఏమీ కనిపించినట్టులేదు. "ఉహుఁ." అన్నది.

"నీ రోగితో వేగటం కష్టమే మిథిలా!" అంటూ మోహిని పూర్వంలాగే నవ్వింది. "నేను నిజంగా గాభరాపడిపోయానుసుమీ! అవాకులు, చవాకులు ఏంపేలేస్తున్నారనుకున్నావు? నేను...."

జితేంద్రుడు మధ్యలో అందుకున్నాడు; "ఇదిగో సిస్టర్! నాకు పిచ్చెత్తిందని ఆమె ఊహ. కంఠమాల గురించి ప్రసంగం వచ్చింది. ఈమె ఆనాడు వేసుకుంది, ముత్యాలకంఠమాల, జ్ఞాపకంలేదూ! దాని ఖరీదెంతో ఈమెగారికి తెలియదు. నాకూ తెలియదు. కాని దాన్ని ప్రశంసించే హక్కు మనకు లేదూ? ఏం సిస్టర్!"

మోహిని వింటూనే ఉంది. అతడలాగే ఇంకా ప్రసన్నంగా ముఖం పెట్టి అంటున్నాడు; "మిథిలా! ప్రశంసించే హక్కు నీకూ ఉంది. అసలు అటువంటి సొమ్ములు ఎందుకు పెట్టుకుంటారో నువ్వే చెప్పు మిథిలా! లోకులు చూడాలనీ, ప్రశంసించాలనీ కాదూ!"

"ఏం సొమ్ములూ?" అమాయికంగా అడిగింది మిథిల.

"అదే, ఆ ముత్యాలపేరు! సరిపోయిందిలే, నీకు జ్ఞాపకమేకదూ? అయితే నేననేది పెట్టుకోటం వ్యర్థమే అయిపోయిందన్నమాట! కాని.... ఏం మహాశయా! అదితమ ఈర్ష్యకు గురిఅయినట్టుందే.... ఈర్ష్య అనేది మన ఆడవాళ్ళ సొత్తుకదా మిథిలా!...." అన్నది మోహిని.

"మాకు అందం తెలియదు; విలువే తెలుస్తుంది. అందమైన కంఠదేశాన హారంకూడా అందంగా ఎందుకుండదూ! అందవిహీనమైన వస్తువుకు అక్కడ తావేలేదు అసలు. కాని ఇంతకూ ప్రముఖవిషయం ఏమంటే - దాని ఖరీదు పదివేలు ఉంటుందా? మేము గొప్పగొప్ప వస్తువులన్నీ రూపాయలపరంగా లెక్కగట్టే ఆలోచిస్తాం.... సిస్టర్! ఒకటి అడుగుతాను: క్షమించాలి, నీకుఇక్కడ రోజుకెంత గిట్టుతోంది?"

సిస్టర్ జితేంద్రునిముఖంలోకి చూస్తూ నిల్చిపోయింది. మళ్ళీ మోహిని వైపు తిరిగి చూచింది—'ఉన్మాదప్రలాపంలాగానేవుందే! ఏమిటిదంతా ?' అని అడుగుతున్నట్టు.

మోహినికూడా మిథిలముఖంలోకి చూస్తూ ఉండిపోయింది—'ఇంచు మించు నీ అభిప్రాయమే నా అభిప్రాయం' అని చెబుతున్నట్టు.

"పదివేలంటే సామాన్యమా ? మన హిందూదేశంలో బోలెడంత మంది పూటకు గతిలేకుండా ఉన్నారు. సగటున మనిషికి రోజుకు ఆరుపైసలైనా గిట్టుతున్నదో లేదో చెప్పలేం. ఈ పదివేలరూపాయల్లో ఎన్ని ఆరు పైసలు ఉన్నాయో లెక్కవేసి చెప్పవచ్చు ; కష్టమైన లెక్క కాదది. శ్రీమతి గారూ ! అది చాల తేలికలెక్క. మీరు జవాబు చెప్పగలరనుకుంటాను. సిస్టర్ ! నువ్వయినా చెప్పవచ్చు...."

మోహిని స్తబ్ధచిత్తయై చూస్తూ, వింటూ ఉంది. చివరకు ముందుకు వచ్చి ఒక చేయి మంచంపట్టెమీద ఆనించి కూర్చుంది. కొంచెం వంగి, "కంఠమాల తీసుకురానా ? చూడాలని ఉందా ?" అని అడిగింది.

"ఎందుకూ ?" అన్నాడు జితేంద్రుడు ఆమెముఖంలోకి చూస్తూ.

"ఎవరేనా కొనుక్కుంటారేమో, అమ్మేసి డబ్బుచేద్దాం. కొనుక్కున్నవాళ్ళు ఏం చేసుకుంటారు ? మెడలో పెట్టుకుంటారు; లేకపోతే దాచుకుంటారు. డబ్బు అయితే ఎందుకైనా ఉపయోగిస్తుంది. ఈ వస్తువులన్నీ షోకుకోసమేగా ! ఆ షోకు తీర్చుకునేందుకే కొందరు డబ్బు పారేస్తూ ఉంటారు. మేము ఆ పదివేలూ అందుకోసమే తగలబెట్టాం కాబోలు ! తగలబెడితేనే ఆ 'హారం' వచ్చివుంటుంది మాకు....ఇంతకూ హారం తీసుకురానా ?"

విని జితేంద్రుడు ఆమెవంకచూస్తూ ఏమీ మాటాడలేదు. మోహిని వెనక్కు తిరిగి "మిథిలా ! డాక్టర్ కపూర్‌గారికి ఫోనుచేసి పిలు; వస్తారు" అన్నది. మళ్ళీ అతనివైపు తిరిగి "నిజం చెప్పు : నీ కా ముత్యాలహారం కావాలా ?" అని అడిగింది.

ఒక్క క్షణంసేపు జితేంద్రుడు పరితృప్తములైన నేత్రాలతో ఆమె వైపు చూచాడు. "డాక్టర్‌కు కబురుపెడుతున్నావెందుకు ? నాకు పిచ్చెత్తి

పోతున్నదనే కదూ....నీ ఆలోచనలు! అలా వున్నప్పుడు ఇంకా నన్ను అడగటం దేనికి ?"

"ఏమో, నేనేమి ఆలోచిస్తున్నానో, ఎందుకు ఆలోచిస్తున్నానో నాకే తెలియటంలేదు. జితేన్ ! నువు మామూలుస్థితిలోకి రావాలి."

"మామూలుగా కనిపించకపోతే పిచ్చే అన్నమాట!" అంటూ జితేంద్రుడు నవ్వాడు, "మీవంటివాళ్ళదగ్గర డబ్బు మితిమించి ఉంటోంది. కొందరిదగ్గర అసలే వుండటంలేదు. మరికొంతమంది ఉన్నారు; అటు ఉన్నవాళ్ళూకాదు, ఇటు లేనివాళ్ళూకాదు, మధ్యరకంవారు. వాళ్ళు ఏం చేయాలో నువు చెప్పగలవా ? తెలివిగలవాళ్ళయితే వాళ్లు చెయ్యవలసింది ఒకటే పని : ఉన్నవాళ్ళదగ్గరనించి లేనివాళ్ళకు అందిస్తూ ఉండాలి. ఇటువంటి సమర్థులు కొద్దిమందే ఉన్నారు. మధ్యరకంవాళ్ళలో చాలమంది లేనివాళ్ళను పిండి, పిప్పిచేసి, సారాన్ని ధనవంతులకు అందిస్తూ ఉన్నవాళ్ళే. ఇదంతా నీకు తెలుసు; కాని ఇదంతా గుర్తుకుతెచ్చుకోకుండా ఉండటంలోనే నీకు ఆనందం ఉంది. ఒకపని చేయి : శుభ్రంగా నన్ను పిచ్చాసుపత్రికి పంపించు. నీ కే యిబ్బందీ లేకుండాపోతుంది. నిశ్చింతగా ఉండవచ్చు. నిజంగా మీరు మంచి నేర్పు, సామర్థ్యం కలవాళ్లు సుమీ! పేదల్నీ, ప్రపంచాన్నీ గుప్పెట్లో అట్టిపెట్టుకుని ధర్మార్థాలు రెండూ సాధిస్తున్నారు. మీ భగవంతుడూ మీకు దక్కుతున్నాడు, లౌకికవ్యవహారాలూ సాగిపోతున్నాయి."

"జితేన్ !" అన్నది మోహిని విస్తుపోయిచూస్తూ.

జితేంద్రుడు ఒక్క క్షణం మాత్రమే ఆగి, "మోహినీ! నిజంగానే నాకు డబ్బు అవసరంగా ఉంది" అని బైటపెట్టేశాడు.

"కాబట్టి నన్నడిగి పుచ్చుకోవాలనేగా నీ ఉద్దేశం! కాని నీకు తెలుసుగా! నే నా హృదయంలేని ధనికవర్గానికి చెందినదాన్నే. నీపనికోసం నాదగ్గరనించి ఒక్క దమ్మిడీకూడా నీకు దొరకదనుకో. అంతేకాదు, నీ మిత్రుడుగాని, అనుచరుడుగాని ఎవరైనాసరే, ఏపనిమీదనైనాసరే, ఇక్కడికి వచ్చాడంటే మాత్రం....నేను ముందే చెబుతున్నాను....అతని క్షేమం విషయమ్మై నాకేమీ పూచీలేదు."

"తరిమిగొట్టేస్తావా అతన్ని ? పట్టిస్తావా పోలీసులకు ?"

"ఆఁ, తరిమిగొట్టేస్తాను. పట్టిస్తాను."

జితేంద్రుడు కొంచెంసేపు తన ఆలోచనలో తాను మునిగిపోయినట్టు పడుకున్నాడు. చివరకు "మోహినీ !" అని పిల్చాడు. అతని కన్నులు నిప్పులు చెరుగుతున్నాయి.

మోహిని అతనిముఖంలోకి స్థిరంగా చూచింది.

"ఆకృప ఇప్పుడే ఎందుకు చూపించవు మోహినీ ; నీకు నా పీడా వదిలిపోతుందిగా !" అన్నాడు జితేంద్రుడు....ఏ భావావేశంలో ఉన్నాడో.

"అట్టే వాగబోకు. ఒక సంగతి అడుగుతాను చెప్పు. ముత్యాలు నువ్వెప్పుడూ చూడలేదా ? రత్నాలూ వజ్రాలూ పొదిగిన నగలు నువు అసలు చూడనేలేదా ఎప్పుడూ ?"

"లేదు-లేదు, చూడలేదు."

"అవి వట్టి రాళ్ళే. కాని చాల అందంగా వుంటాయి. చూస్తావా ?"

"మోహినీ !" అన్నాడు, అంతే.

"రాళ్ళతో పిల్లలు ఆడుకుంటారు. భాగ్యవంతులుకూడా ఆడుకుంటారు. ఆ రాళ్ళకు సహజంగా అందం వుంది. మరికొంత అందాన్ని....మన కోరికల్నీ కళాదృష్టినీబట్టి మనం కల్పిస్తాం. ఇకపోతే నువు...."

"మోహినీ !" దూకుడుగా అన్నాడు జితేంద్రుడు.

"నువు ఒప్పుకోవన్నమాట ! సరే పోనీ, తీసుకువస్తాను ; కాని వర్గ భేదం, వర్గకలహం....ఆ గొడవంతా నా నెత్తికి ఎత్తబోకు. అవన్నీ పైపై మాటలు. నేను ఆనాటి మోహినినే కాదూ ఇప్పటికీ ? లేక నువ్వేమన్నా మారిపోయావా ? పోనీ, ఇప్పటి నీ స్వరూపం ఏమిటో విడమరచి చెప్పు. ధనం నాదేం కాదు ; నా మనస్సే కొంతవరకు నాది. ఔను, కొంతవరకే. ఎవరికైనా అంతే. ఎవరి మనస్సు వారికి పూర్తిగా స్వాధీనంలో ఉండదు. అది పరిసరాల్లోని ఇతర మనస్సులను అంటిపెట్టుకుని వుండకతప్పదు...."

వింటున్నాడు జితేంద్రుడు. అతనిపై పిడుగుల వర్షం కురుస్తున్నట్టుంది. చివరకు అన్నాడు : "ఇక ఒకటి రెండు రోజుల్లో వెళ్ళిపోగలననుకుంటాను. ఇప్పటికే చాలవరకు నయమైపోయింది నాకు."

"డాక్టర్ కపూర్ వస్తారుగా ! అడిగి కనుక్కుందాం."

ఇంతలో నర్సు వచ్చింది. "ఫోన్‌లో మాటాడి రావటానికి చాల ఆలస్యం అయిందేం మిథిలా ?" అడిగింది మోహిని.

"డాక్టర్‌గారు ఆపరేషన్‌లో వున్నారు."

"ఏమన్నారు ?"

"మూడుగంటలయాక వస్తారుట."

"సరే....ఇదిగో, మిథిలా ! మీరోగి కొంచెం లేచి అటూ ఇటూ తిరగటానికి అనుజ్ఞ ఇస్తావా ? నాలుగు అడుగులు వేసినంతమాత్రాన ఇబ్బందేమీ ఉండదనుకుంటానే !"

"చిత్తం."

"ఏమిటి ? ఇబ్బంది ఉంటుందా ?"

"లేదులెండి."

"లేదుకదూ !" అంటూ మోహిని జితేంద్రునివైపు తిరిగి "రండి, నా లైబ్రరీదాకా తీసుకుపోతాను....ఏం, మిథిలా ! తీసుకువెళ్ళనా ? వారికిష్టమైన పుస్తకం ఏదైనా తెచ్చుకుంటారు. ఊరికే పొద్దు ఎలాపోతుంది మరీ !" అన్నది.

మిథిల వెంటనే అంగీకారం సూచించలేదు. 'వ'ద్దని స్పష్టంగా చెప్పనూ లేదు. ఆమె ముఖంలోని భావం స్వీకృతి కాదు ; నిరాకృతి అయితే అవచ్చు.

"సరే నీయిష్టం. డాక్టర్ కపూర్ వచ్చినతరువాత చూద్దాంలే....కొన్ని పుస్తకాలేమైనా పంపించనా ? ఏంపంపను ? నవల...."

జితేంద్రునికి మాటాడ్డం ఇష్టంలేదు. కాని సమాధానం చెప్పవలసి వచ్చింది. "సరే" అన్నాడు.

"అమ్మగారూ !" అంటూ నౌకరు కుర్రవాడు వచ్చాడు. మోహిని వెనక్కు తిరిగి చూచింది.

"అమ్మగారూ ! అయ్యగారు పిలుస్తున్నారు."

"వచ్చారేమిటి ? ఎప్పుడూ ?"

"ఇప్పుడే."

ఆమె వెళ్ళాలనుకుంటూనే ఆగింది. "ఇప్పుడే వస్తున్నానని చెప్పు" అని అతన్ని పంపించింది. కాని ఇక్కడామె కేమీ పనిలేదు. భర్తగారి భర్తృత్వంపట్ల పత్నిగారి పత్నీత్వం తన ప్రతిష్ఠను ప్రదర్శించినట్టయింది ఆ మాటల్లో. పిలుపు వచ్చాక తాను వెళ్ళవలసిందే, తప్పదు. అయినా 'వస్తున్నానని చెప్పు' అని నౌకరు కొక ఆజ్ఞ జారీచేయించింది....ఏమిటో అది!....

"మిథిలా! మూడుగంటలయాక అంటే ఎప్పుడనీ? సరిగ్గా ఎప్పుడు వచ్చేదీ డాక్టరుగారు చెప్పలేదా?" మోహిని అడిగింది.

"రోగుల్ని చూడ్డానికి బయాలుదేరుతారుగా! మూడుంబావు, మూడు న్నర మధ్య వస్తారనుకుంటాను."

మోహిని ఆ మాట వినిపించుకోనేలేదు. రోగి దగ్గరికు వెళ్ళింది. "నాకిక సెలవా?"

"థాంక్యూ! (ధన్యవాదాలు!)"

"రండి రండి, దయచెయ్యండి. తమరు దయతో శ్రమచేసి ఇలా వచ్చినందుకు ధన్యవాదాలు" అన్నాడు నరేశచంద్రుడు, మోహిని గదిలోకి రాగానే, సోఫాలో కూర్చున్నవాడు లేచి, మిక్కిలి ప్రార్థనాపూర్వకంగా రెండు చేతులూ కలిపి చాచి సోఫావైపు చూపిస్తూ....'దయచెయ్యండి, ఆసీనులుకండి'....అని గౌరవం నెరపుతున్నట్టు.

"బలేవారండీ మీరు! ఒక్క నిమిషం ఓపికపట్టలేరూ?"

"చిత్తం, ఎలా ఓపికపట్టమంటారూ? ఇంతకూ ఎలావుంది మా పోటీదారుగారి స్థితి?"

మోహిని మందహాసం చేసింది. "చాలవరకు లబ్ధకాముడైనట్టే."

"ఏమండోయ్, అయితే ఇక నాకు పనిలేకుండా చేస్తారన్నమాటా?" అంటూ కోటు విప్పి అవతల విసరివేశాడు. 'టై' ముడి సడిలించాడు. కాళ్ళు కిందికి చాచి సోఫాలో విశ్రాంతిగా కూర్చున్నాడు. "రాణీగారూ! తమరుకూడా దయచెయ్యండి" అన్నాడు.

మోహిని సోఫాలో కూర్చోలేదు. సోఫాచివర కొయ్యచెయ్యిమీద ఆన్చింది. "ఇవాళ తొందరగానే వచ్చేశారే! ఏమిటి కథ!" అన్నది.

"ఏముందీ? ఓపికపట్టలేకనే. సరాసరి ఆగదిలోకే వచ్చేద్దామను కున్నాను. కాని ఇద్దరు మాటాడుకుంటూన్నప్పుడు మధ్యలో వెళ్ళటం మర్యాదలక్షణం కాదని ఆగిపోయాను....ఇవాళ మహా ఉడికిపోతోంది కదూ!"

"ఉడికిపోతోందా?"

"ఇప్పుడే బైటినించి వచ్చాను కదూ! బహుశా అందువల్లనే మోళ్లే!....ఇదిగో ఆ నీ మహాశయుడు ఇంకా ఎన్నాళ్ళుంటాడిక్కడ?"

"ఇప్పటికతని ఆరోగ్యం చాలవరకు బాగుపడినట్టే."

"నీవతన్ని ఎరుగుదువా అసలు! బాగా ఎరుగుదువా?"

"ఆఁ, బాగానే ఎరుగుదును. ఎందుకూ?"

"ఏమీలేదు. ఆ రైలుపడిపోయిన సమాచారం లేదూ! ఆనాడు నీకు కూడా చెప్పానే; దానికంతకూ కారణభూతుడైన వ్యక్తి ఈ పట్నంలోనే ఎక్కడో ఉన్నాడని పోలీసులు అభిప్రాయపడుతున్నారు. ఆ చడ్డా లేడూ.... యస్.పి. (పోలీసుసూపరింటెండెంటు).... ఇప్పుడే 'బార్ రూమ్'(లాయర్లం దరూ విశ్రాంతిగా కూర్చుండేగది)లో కలిశాడు. 'మీయింట్లో ఎవరో జ్వరంగా ఉన్నారట ఎవరాయన?' అని అడిగాడు. 'ఎవరూకాదు; ఒక బావమరిది' అని చెప్పాను. 'ఏం జ్వరం?' అని అడిగాడు. నేను నవ్వి, 'డాక్టరును కనుక్కొని చెబుతాశ్రే' అన్నాను. 'బావమరిదిమీద మీకు చాల గౌరవం, శ్రద్ధ ఉన్నట్టు కనిపిస్తుంది!' అన్నాడు. నేను మళ్ళీ నవ్వి 'ఏ శ్రద్ధ అయినా అతనిచెల్లెలికేగాని నాకేవిధమైన ప్రమేయమూలేదు'అనిబదులు చెప్పాను. ఇలా ఏవేవో మాటలుసాగాయి. అతడు కాసేపుఊరుకుని 'ఇదిగో బారిస్టర్‌గారూ! చాలకాలమైంది మీరుతేనీటివిందు వాగ్దానంచేసి. మరిఎప్పుడూ పిలవరేం?' అన్నాడు. 'మాయింట్లో ఏరోజయినా, ఏవేళయినా తేనీటివేళే. మీరు ఎప్పుడైనా రావచ్చు' అన్నాను. 'చిత్తం, అలాగేవస్తాను, మీ బావమరది కూడా ఉన్నాడాయెను. ఒకసారికలుకోవచ్చుకూడా. అన్నా, చెల్లెలు — ఇద్దరూ దొరుకుతారు' అన్నాడు. అతడు ఎలాంటి మొండిపిండమో తెలుసునా?.... ఇంతకూ ఈ మహాశయుడు ఇంకా ఎన్నాళ్ళుంటాడిక్కడ?"

"సంపూర్ణంగా ఆరోగ్యం చిక్కనిదే ఎలా వెడతాడు ? మీరు మాత్రం ఎలా పొమ్మంటారు ?"

"జానాను.... సరేలే."

"ఈ చడ్డా మనింటికి ఇదివరకెన్నడూ రాలేదుకదూ !"

"లేదు. వస్తే ఇదే మొదటిసారి. అతడు పట్నంవచ్చి రెండేళ్లౌతుంది. నాన్నగారంటే అతనికి చాల గౌరవం. కాని ఎక్కువ చనువు, రాకపోకలు లేవు."

"సరేకానిండీ! మీ రక్కడికి.... రత్నాలవ్యాపారి దగ్గ"కు వెళ్ళారా?"

"రత్నాలవ్యాపారి దగ్గరకా ? నన్నొక్కడినే వెళ్ళమంటావా ?"

"చూస్తూనే ఉన్నారుగా ! నేనుకూడా రావాలంటే—నాకసలు ఇంట్లో నించి కదిలేట్టుందా ?"

"నా కా గొడవంతా సరిగ్గా తెలియదుమరి ! హారం నీది ; తయారు చేసేది అతను. అందచందాలు ఎలా వుండాలో నీకు తెలుసు. కాని నీకు ఆసక్తి తగ్గిపోయినట్టు కనిపిస్తుంది! అతనిదగ్గర నగలు చాల బాగున్నాయని నేనంటే నువ్వేమన్నావు ? 'నన్ను మ్యూజియంకింద తయారుచెయ్యకండి' అన్నావా లేదా ? జ్ఞాపకం ఉందా ?"

"అప్పుడు అంటే అన్నానేమోగాని పచ్చలైతే బాగానే ఉంటాయండీ. పచ్చలహారం నాకొకటన్నా లేదు కూడాను."

"ఈ ఆడవాళ్ళకు నిమిషానికొక మాట ! నీయిష్టం. కబురుచెయ్యి ; నగ తీసుకువచ్చి చూపిస్తాడు చూద్దువు గాని."

"ఇప్పుడే కబురుచెయ్యమంటారా ?"

"నీయిష్టం, నన్నడగాలా ?"

మోహిని లేచి రత్నాలవర్తకుడికి ఫోనుచేసింది. ఆ పెద్ద మరకతం పొదిగిన పచ్చలహారమున్నా, ఇంకా అటువంటివేమన్నా ఉంటే అవిన్నీ తీసుకుని సాయంత్రంలోగా రమ్మని చెప్పింది.

ఫోనుదగ్గరనించి వచ్చేసి భర్తగారి కోటు తీసి వంకెకు తగిలించి, బూటు లాళ్ళు విప్పింది. కాళ్ళు పారచాచి నరేశుడు అలాగే కూర్చున్నాడు.

ఏమీ మాటాడలేదు. బూట్లుతీసి ఆమె అవతలపెట్టింది. స్లిప్పర్లు తెచ్చి పాదాలకు తొడుగుతూ అడిగింది: "మీరు ఉంటారుకదూ ఆసమయంలో?"

"ఏసమయంలో?"

"రత్నాలవర్తకుడు వచ్చినప్పుడు."

"నేనా? చెప్పలేను. ఎప్పుడు వస్తాడు?"

"వచ్చినప్పుడే."

"అబ్బ! మీ ఆడవాళ్ళపనులన్నీ ఇలాగే వుంటాయి. వచ్చినప్పుడా? ఏమో, నామీద నమ్మకం పెట్టుకోకు. అయినా ఇటువంటి సందర్భాల్లో నా అవసరం ఏముంటుంది? డబ్బు కావలసివచ్చినప్పుడే మగవాడి అవసరం. మగవాడంటే డబ్బు మోసుకురావలసిన ఎద్దు అన్నమాట.... నగవిషయం నీకు తెలుసు; ఆ వ్యవహారం నీచేతిమీదుగానే జరిగిపోతుంది. అయ్యో భగవంతుడా! ఈ దాస్యం మాకు వొదిలిపోయి 'ఇకనామిక్ ఇండిపెన్‌డెన్స్' (ఆర్థికస్వాతంత్ర్యం) ఎన్నడు వస్తుందోకదా! ఆడవాళ్లు సంపాదించుకు రావటం, మగవాళ్లు ఖర్చుచేస్తూఉండటం — అలా అయితే ఎంతబాగుం టుంది? దురదృష్టవంతుడైపోయినాడు మగవాడు. ఖర్చుచేసే అధికారం అతనికి ఏమాత్రం లేదు. రూపాయలు తెస్తూఉండటం, భార్యగారి చేతుల్లో పోస్తూ ఉండటం, ఇంతకూ రాణీగారూ! మీకెప్పుడూ 'ఇకనామిక్ ఇండి పెన్‌డెన్సు' (ఆర్థిక స్వాతంత్ర్యం) వచ్చేది? రానీ, తస్సదియ్య, అది రాగానే మహారాణులై సాగించే అధికారం అంతా ఎగిరిపోతుంది! టైపిస్టు గరల్‌గా చేరి, సంపాదిస్తూ సాగిద్దురుగాని ఈ జల్సాలన్నీ...."

"అలాగే, అలాగే! అయిందా మీ వ్యాఖ్యానం?....మీరుకూడా దగ్గరుండి చూస్తే బాగుంటుంది."

"నువు వకాల్తా పరీక్ష ప్యాసైనావుకదా మోహినీ! ముందుకు వచ్చి ప్రాక్టీసు పెట్టరాదూ! అప్పుడు నేను వచ్చి 'నాకు రత్నపు గుండీలు చేయించిపెట్టరూ?' అని అడుగులాను."

"అప్పుడు నేనేమంటానో తెలుసునా? 'టీ తయారైందా? ఊఁ, తీసుకురా!' అంటాను... టీ పట్టుకురమ్మంటారా?" అన్నది మోహిని ఒక విచిత్రపు మందహాసం ప్రదర్శించి.

# జితేంద్రుడు

నరేశుడు నవ్వాడు: "ఇదిగో, మీకు ఎన్నోసార్లు విన్నవించు కున్నాను: పనివున్న సమయంలో నామీద ఇటువంటి అత్యాచారానికి పూను కోవద్దని. ఇంతకూ మానవుడి బుద్ధి ఎలాంటి దనుకున్నావు? ఎప్పుడుపడితే అప్పుడు అటు ఒరిగిపోతూనేవుంటుంది."

మోహిని ప్రసన్నచిత్తయై తేనీటియేర్పాట్లు చేయడానికి లోపలికి వెళ్ళింది. నరేశుడు సోఫాలో చారబడి కూర్చున్నాడు గంభీరముద్రదాల్చి.

అతనిది ఒక చిత్రమైన స్వభావం. పెళ్ళి అయిననాటినించీ మోహినిని హృదయపూర్వకంగా స్వీకరించాడు. ఆమెను అతడెప్పుడూ ఏవిధమైన ఒత్తిడీ చెయ్యడు. ఒక్కమాటకూడా అనేవాడు కాదు. ఇరవై రెండు సంవత్సరాలయువతికి ఏమాత్రమో కొంత పూర్వచరిత్ర ఉండకపోదు. ఈ వర్తమానానికి వెనుక భూతకాలంకూడా ఉంది. ఉంటే ఉండవచ్చు; ఉండవలసిందేనని నరేశుని అభిప్రాయం. కాని పెళ్ళిచేసుకున్న హేతువు పురస్కరించుకొని భర్తకు భార్య పూర్వచరిత్రవిషయమై ఉత్సుకత, అనుమానం ఉండవలసిన అవసరం లేదని అతని ఊహ. అది సముచితం కాదనికూడా అతని నమ్మకం. అదంతా తెలుసుకుందామన్న రసపిపాస అతనిలో ఏనాడూ కలగలేదు. తన అధికృతి అధికారం తరచు గుర్తుకుతెచ్చుకోవలసిన అవసరం అతనికి కలిగించకుండానే మోహినికూడా ప్రవర్తించింది. మొదటినించీ అతని మనసు కనిపెట్టి తదనుగుణ్యంగానే నడుచుకుంటున్నది. హృదయంలో అందరాని లోతులున్నట్టుగాగాని, ఒక రహస్యమయ ఆవరణలో వున్నట్టుగా గాని ఏమాత్రమూ కనిపించేదికాదు. దాపరికం ఏమీలేని స్వచ్ఛస్ఫటికంలాగే ఉండేది. కేవలం అతని అనుగామినిగా మాత్రమే ఉండేదికాదు. అలా అయితే ఇబ్బందిగానే ఉండేది. అన్నింటిలోను కల్పించుకుంటుంది: ఎక్కడ చూచినా తానుగా మెలగుతుంది; ఒళ్ళూ, మనస్సు దాచుకోటమంటూ ఎప్పుడూ లేదు. అలాగని ఏ రగడా తెచ్చిపెట్టేదికాదు. పరిపూర్ణ సమైక్య భావంతోనే ఉండేది. మోహిని వర్తమానస్థితి అతనికి సుస్పష్టంగా, సులభంగానే గ్రాహ్యం అయింది. అది అతనికి చాలు. అంతకుమించి భూతభవిష్యత్తులు తడివి చూడాలన్న వాంఛ అతనికి కలగలేదు. అతడు న్యాయవాది; నవ్వుతూ పేలుతూ సముల్లాసంగా ఉంటాడు. అతని సమ్ముఖంలో మోహిని

భర్తృవాల్లభ్యాన్ని చూరగొన్న గర్వంతో అతని పరిపూర్ణవిశ్వాసతరాంగాల మీద సానందంగా తేలియాడుతూ ఉంటుంది. అట్టి ఆమె మూర్తి అతని హృదయంలోనించి ఎడబాయదు. పెళ్ళి అయి నాలుగు సంవత్సరాలు అయింది. నాలుగు సంవత్సరాలూ ఒక్క క్షణంలా గడిచాయి. గడిచిపోతున్నాయన్న సంగతికూడా తెలియకుండా గడిచిపోయాయి. నాలుగు దీర్ఘ సంవత్సరాలు గడిచినా ఆమె అతని దృష్టికి పాతపడలేదు. అదే అతనికి చాల ఆశ్చర్యమనిపిస్తూ ఉంటుంది. విదేశాల్లోని తన గతజీవితం దృష్ట్యా 'జీవితానికి (అర్థాత్తూ, ప్రేమకు) స్థిరత్వం అనేది బహుశా అసంభవం' అని అతనికొక అభిప్రాయం ఉండేది. విదేశాల్లో అతడు గడిపినజీవితంలో విశిష్టత ఏమీలేదు. అందరిలాగే తానూ గడిపాడు. అందరి పంథాలాంటిదే తన పంథాకూడాను. అర్థాత్తూ పరివర్తనే జీవిత నియమం. జీవితమే ప్రేమ. కాగా ప్రేమ నియమంకూడా పరివర్తనే. కాని ప్రేమ అనేది తనలోనించే పరివర్తలను సృష్టించుకుని, తిరిగి వాటిని తనలోనే అంతర్హితం చేసుకుంటుందనే భావం అతనికి పూర్వం ఉండేదికాదు. అటువంటి ప్రేమను అతడెరుగడు. నాలుగు సంవత్సరాలు గడిచాక ఈనాడు ఒక్కసారి వెనక్కు తిరిగి పోల్చిచూచుకుంటే—ఎన్నడూ అనుకోని ఒక క్రొత్త బ్రతుకుదాట తనకు లభ్యమైనట్టు అనిపిస్తూఉంటుంది. కాని ఇవాళ అకస్మాత్తుగా ఆ విమల నీలాకాశంలో అకారణంగా ఏదో మబ్బు పట్టుకొస్తున్నదా? అతడు తన మనస్సునంతా వెమకి వెమకి చూచాడు. ఎక్కడా ఏమీ మాలిన్యం తగల లేదు. కాని నల్ల మబ్బులు నలుపులోనించే తయారై రావు. మరెలా వస్తాయి? పరిశుద్ధమైన తెలుపులోనించే తయారై వస్తాయా!

"అరె, ఏమిటది? అలా అయిపోయారేం? ఇటు చూడండి, టీ వచ్చేసింది" అన్నది మోహిని ట్రే బల్ల మీద పెడుతూ.

"ఆఁ, ఆఁ, అదేమిటి? దాని పేరు ...తురీయలోకం! అక్కడికి వెళ్ళిపోయాను. అక్కడినించి ఒక్కసారిగా ఈ తేనీటిలోకి ఊడిపడాలంటే—కాస్త వ్యవధానమన్నా ఇవ్వవూ?"

"ఓహో! అలాగా! అక్కడ మీరు ఎవరివెంట విహరిస్తున్నారు? ఈ మోహిని ఇక్కడ ఈ తేనీటిపాతాళలోకంలోనే ఉందిగా!"

"ఎవరో ఒకసమ్మోహనాంగి దొరికింది. ఇప్పుడు కళ్ళు తెరచి చూద్దాను కదా! ఆ సమ్మోహనాంగి ఈ మోహనాంగే అని తెలుస్తున్నది."

"దొరగారు కవిత్వం చెబుతున్నారే! ఇంకేంవకాల్తా సాగుతుందీ?"

"ఆ నీ సమ్మోహనాంగిలో ఈ బారిస్టర్ విలీనమైపోతే నష్టమేంలేదు. ఇదిగో, మా పోటీదారు....అహఁ, కోప్పడకోకండి....పోనీ మా సైదోడు జ్వరంతగ్గి తేలిగ్గానే ఉన్నాడుగా! మనతోపాటు ఇక్కడికి టీకి రాకూడదూ?"

ఆమాట విని మోహిని భర్తవైపు చూచింది.

"పిలిపించవద్దంటాః ఏం?"

"ఇప్పుడే—"

"ఇప్పుడే చెబితివిగా, చాలవరకు ఆరోగ్యంగానే ఉన్నాడని. పో, పిల్చుకురా."

"ఎవరితోనైనా కబురుచెయ్యమంటారా?"

"కబురుచెయ్యటం ఎందుకూ? నువ్వే వెళ్ళి వెంటబెట్టుకురా."

మోహిని బటన్ నొక్కి గంట మోగించింది.

"ఎందుకూ? అదేమిటి?"

మోహిని ముఖంలో గంభీరముద్ర వచ్చింది. సమాధానం ఏమీ చెప్ప లేదు. నౌకరు వచ్చాడు. "ఇదిగో! అతిథిగారి గదిలోకి వెళ్ళి, అయ్యగారు టీ తాగుతున్నారు; తమర్నికూడా దయచెయ్యమంటున్నారు అని చెప్పు. వస్తే వెంటబెట్టుకురా" అని ఆజ్ఞాపించింది మోహిని.

"మోహినీ!" అన్నాడు నరేశుడు నౌకరు వెళ్ళిపోయాక.

మోహిని కనుబొమల్లో పడ్డ ముడి ఇంకా విడలేదు. తేనీరు కలుపుతూ ఉంది. ఆమెచూపులు తేనీటిగిన్నెలమీదే ఉన్నాయి. ముఖమెత్తలేదు.

"మూడొకప్పు?"

విననట్టుగా ఉండిపోయింది మోహిని.

"మోహినీ! నామాట వినిపించటమేలేదాయేం?"

"వినబడుతోందిలెండి...."

నరేశుడు మరి మాటాడలేదు.

నౌకరు తిరిగి వచ్చాడు : "ఏం ? ఏమైంది ?" అన్నాడు నరేశుడు కోపంగా.

"ఒకటి రెండు రోజుల్లో ఆరోగ్యం ఇలాగే బాగా చక్కబడితే వచ్చి దమదర్శనం చేసుకుంటానన్నారు. కృతజ్ఞతానమస్కారాలు చెప్పమన్నారు."

"సరే, పో" అన్నాడు నరేశుడు బర్తరఫ్ చేస్తున్న భావంతో.

నౌకరు వెళ్ళిపోయాడు : మోహిని తేనీరు కలుపుతున్నది ?

"ఏం ? ఇవాళ మాటాడ్డమే మానేశారే మీరు !" అన్నది మోహిని మధ్యలో.

"ఏమీ లేదు....నువు వెడితే మిస్టర్ సహాయ్ వచ్చేవాడేనని నా ఉద్దేశం."

"సహాయ్ !"

"నువు వెళ్ళి అతన్ని ఎందుకు తీసుకురాలేకపోయావు ? చెప్పు, మోహినీ !"

కించిత్తు కోపపుచూపు చూచింది మోహిని; మాటాడలేదు.

"పోనీలే, అతడింత దగ్గరగా రావటం నీకు ఇష్టంలేదు కాబోలు ! కాని టీకి అతడుకూడా వచ్చి కూర్చోటంలో అసహజం ఏముంటుందీ ?"

"మీరు మరీ ఇవాళ అలా మారిపోయారేం ?"

నరేశుడు చిరునవ్వు నవ్వినట్టుగా అన్నాడు; అతడు నీ పాతమిత్రుడల్లే ఉన్నాడు.... ?"

"ఔను, ఐతే ?....చెప్పండి ఏమిటో ?...."

"చెప్పేదేముందీ ?" నరేశుడు స్పష్టంగా నవ్వుతూ అన్నాడు: "అతణ్ణి ఇప్పుడు అంత మిత్రుడుగా భావించనట్టున్నావు ; నామూలాన్నేనా ?"

"ఔను. మీమూలాన్నే. సరేనా ?"

"అరె, నీకు కోపంవచ్చేసిందే : కాని కోపగించుకోవలసిన అవసరం ఏముంది ఇందులో ? నూటికి నూరుపాళ్ళు నేను నీవాడినైనప్పుడు

నూటికి ఒక్కపాలుకూడా నువు నన్ను పరాయివాణ్ణిగా భావించవు. కాని చూస్తున్నాను : నువు భావిస్తున్నట్టున్నావు ! ఏమంటావు ? నిజమేనా ?"

"ఇవాళ ఏదో 'రేసు' (పందెంలో) ఓడిపోయి వచ్చినట్టున్నారు. అంతేనా ? కాబట్టే ఇంత తొందరగా వచ్చారు."

"నీకు మిత్రుడైనవాడు నాకూ మిత్రుడైపోవలసిందే. చెప్పు మరి.... !"

చటుక్కున అడ్డువచ్చి "శత్రువెందుకు కాకూడదూ ?" అన్నది మోహిని ఈషత్తు స్మితభావంతో.

నరేశచంద్రుడు పకపక నవ్వాడు. "శత్రువైపోవాలనేనా యేమిటి బహుశా నువు కోరుకునేది ? కాని శత్రువుగా భావించటం—నాకు చాత కాదు బాబూ ఆ పని. ఇంకేం ? ఇప్పుడు వెళ్ళి పిల్చుకురద్దూ !"

మోహిని నవ్వింది. "తేనీరంతా మీరే తాగేశారుగా ! ఇంకెందుకోసం పిల్చుకురావటం ?"

"అరె !" తేనీటిపాత్ర ఆడించి చూచి నరేశచంద్రుడు అన్నాడు : "భలేదానివేనే నువ్వు ! రెండుకప్పులకంటె ఎక్కువ నాచేత తాగించబోకు అని ఎన్నిసార్లు చెప్పాను నీకు ?....అయితే సరే, అక్కడికే పోదాం పద !"

"వద్దు."

"ఏం ?" అన్నాడు నరేశుడు, లేచి బయలుదేరబోతూ ఆటంకపరచ బడినవాడు వలె.

"ఇంతకూ మీ మనసులో మాటేమిటో పైకి చెప్పరాదూ ?" అన్నది మోహిని అతని ముఖంలోకి స్థిరంగా చూస్తూ.

"అబ్బో ! నీ ముఖంలోకి గాంభీర్యం వచ్చేసింది. అందుకు నేను పాత్రుణ్ణి కాను....సరే, ఒక పనిచెయ్యి, ఫోన్ ఇలా అందుకో."

ఈయన లోతు తెలుసుకొనడం అసంభవం—అని మోహిని తెలుసుకుంది. అతని హృదయంలో అడుగుప్రదేశం అనేది వుంటేకదూ లోతు తెలుసుకోటానికి ? ఏదైనా ఉంటే మునిగి బయటికి లాగవచ్చు, కాని అక్కడ

వాస్తవంగా ఏమీలేదు. మోహిని కొంచెం సిగ్గుపడుతూ "ఇప్పుడేగా కోర్టు నించి వచ్చారు! మళ్ళీ ఫోన్ ఎందుకులెద్దురూ— పోనీండి." అన్నది.

"అబ్బ, ఇలా అందించుదూ! రెండు ఆలోచనల బరువుతో నేను ఉండలేను."

మోహిని నవ్వింది. "అయితే నన్నంత తేలికమనిషికింద కట్టేశారన్న మాట. హూఁ, పట్టినపట్టు నెరవేరాలిసిందే కాబోలు!" అంటూ లేచి ఫోన్ తెచ్చి యిచ్చింది.

"నగలవర్తకుణ్ణి పిలిపించు, మాటాడాలికాస్త...." అన్నాడు నరేశ చంద్రుడు.

"ఏమిటి?"

"అతని కేసు ఒకటి వుంది ఇవాళ విచారణకు. నీకూ తెలుసుగా, అతని కేసు!"

"సరే, పిలవండి అయితే."

"అరె, పిలిపించవోయ్, కొద్దిగా...."

మోహిని పిలిపించింది. నరేశుడు 'హ్యాంగర్' పుచ్చుకున్నాడు. "ఏం లాలాసాహెబ్! మా నగ ఎప్పుడుతెస్తారు ఏమిటి? ఇప్పుడు ఇంటి దగ్గరే ఉన్నాను. ఇంకా రెండుగంటలవరకూ మాత్రమే ఉంటాను. ఈలోగా మీరు తెచ్చినాసరే, ఎవరిచేతనైనా పంపించినాసరే, చూస్తాను. మీరు వర్తకులు. నేను నాణ్యం తెలిసినవాడిని కాదు. అయినా....అలాగా....సరే.... ఆఁ ఆఁ....అదనంగా రెండు మూడు నగలుకూడా వెంట తీసుకురండి.... తీసుకోడానికేముందిలెండి....సరే, చూస్తాంగా....ఇదిగో, చూడండి, మా యింట్లో అశాంతి రగులకుండా చేయదలచుకుంటే ఆలస్యం చెయ్యకూడదు సుమీ...."

మోహిని చివాలున భర్తగారిచేతుల్లోంచి 'హ్యాంగరు' లాగేసింది కోపంగా. ఫోన్ బంద్ చేసేసింది. "ఇదేనా కేసు అన్నారు?"

"కేసు! ఆసంగతి నువు మాటాడనిస్తేకదూ!"

"దొరగారి శాంతికి భంగకరంగా నేనేం చేస్తున్నానో తెలుసుకో వచ్చునా?"

"ఆఁ ఆఁ, అవశ్యం తెలుసుకోవచ్చు. దానికేం? కాని....ఆసంగతి.... రాణీగారు నిలువుటద్దంముందు నిలబడి అడిగితే బాగుంటుంది. నన్నేమడుగుతారూ? .... దానికి జవాబు అక్కడైతే స్పష్టంగా రాసివుంటుంది ఏమనంటే...."

"వాగబోకండి" అంటూ ఫోన్ యథాస్థానంలో పెట్టేసి వచ్చి, ట్రే తీసుకుని వెళ్ళిపోయింది మోహిని.

వీలైనంతవరకు భర్తకు ఉపచారాదులన్నీ మోహిని తాను స్వయంగానే చేస్తుంది. తనకూ భర్తకూ మధ్య సాధ్యమైనంతవరకు నౌకర్ల అవసరం రాకుండానే చూస్తూ ఉంటుంది. భర్తకిది మొదట నచ్చలేదు. కాని ఆమె తన అలవాటు మానుకోలేదు. పుట్టింట్లో వున్నప్పుడుకూడా ఆమె అలాగే ప్రవర్తించేది. తన తల్లిని ఆమె చూడలేదు, ఎరగదు. కాని మొదటి నించీ ఆమె తల్లిగారి పద్ధతుల్లో నడుస్తూ వచ్చింది. కర్తవ్యం అని కాదు. కర్తవ్యమైతే జ్ఞప్తిలో వుంటుంది; అందుచేతే విస్మృత మౌతుకూడా ఉంటుంది. ఆమె వ్యవహారం....అది....సహజసిద్ధమైనట్టిది. భర్తకు చెయ్యవలసిన ఉపచారాలన్నీ నౌకర్లకు అప్పగించెయ్యవచ్చునన్న భావం ఆమె తల్లికి ఉండేదేకాదు. అలా నౌకర్లకు అప్పగించటంవల్ల చాలానే వెసులుబాటు ఉంటుంది. హాయిగా, తీరిగ్గా గడపవచ్చు కాలం. నౌకర్లేమైనా పొరపాటు చేస్తే కోప్పడవచ్చు, బెదరించవచ్చు, అట్టహాసం చాల చెయ్యవచ్చు. నౌకర్లు అనేకులుఉంటారు. అదుపుఆజ్ఞల్లో వుంటారు. భార్య అయితేఒక్కతే. మధ్యమధ్య ఒకొక్కప్పుడు బద్ధకించి కాదనవచ్చు. అయితే ఆమెతల్లికి నిషిద్ధమైన లక్షణాలు భువనమోహినిలో కొన్ని లేక పోలేదు. కోరిఅడిగినవి ఎన్నో ఆమె భర్తకు చేసిపెట్టదు; ఇష్టంలేని వస్తువేదో చేసి పట్టుకువచ్చి బలవంతాన తినిపించేవరకూ ఊరుకోదు. ఇలా చేస్తూంటే వారిద్దరిలోనూ అదొకరకమైన తీయని బిగువుతనం అనుభవానికి వస్తూ ఉంటుంది. నౌకర్లద్వారా అయితే ఇది సంభవం కాదుకదా! కేవలం నౌకర్లకు అప్పగించేస్తే పనిపాటలు దిద్దినట్టు చక్కగా సాగిపోతూ ఉంటాయి. తనకెంతో స్వేచ్ఛ, స్వతంత్రం ఉంటాయి. లేకపోతే ఏముందీ? పరాధీనురాలువలె పతిరాక కెదురుచూస్తూ ఉండటం; వచ్చాక ఆజ్ఞలకోసం సమక్షంలో కనిపెట్టుకుని

వుండటం; అంతేగా! నౌకర్లవల్ల కలిగే ఇన్ని ప్రయోజనాలు ఆమె తల్లి గారి ఊహకు తట్టలేదు; మోహిని ఊహకూ తట్టలేదు. ట్రే తీసుకురావటం, తీసుకుపోవటం నౌకర్లకే అప్పగించేస్తే....ఆ సమయం వృధాపోకుండా భర్తతో చక్కని రచనాత్మకమైన, ఉపయోగాత్మకమైన చర్చల్లో గడప వచ్చునే! కాని అంత చదువుకున్నాకూడా మోహిని ఆమాత్రం తేలికవిషయం కూడా గ్రహించగలిగినట్టు కనిపించదు. 'వద్దులే, అలా అట్టిపెట్టేసెయ్యి, నౌకర్లు తీసుకుపోతారులే' అని భర్త రెండు మూడుసార్లు వారించి చూచాడు. కాని ప్రయోజనం లేకపోయింది. ఊరుకున్నాడు. ఇదంతా ఆమెలోని సంస్కృతిలోపం అని భావించి 'హుం, పాపం;' అని జాలిపడుతూవచ్చాడు కొంతకాలం. కాని క్రమశః ఆ 'సంస్కృతిలోపం'మీదే అతనికి అపేక్ష పెరుగసాగింది; దాని నీడలో తానొక బాలకుడైపోయాడు.

మోహిని వెళ్ళినతరువాత సిగరెట్టు వెలిగించాడు. కాళ్ళు చాచి కూర్చు న్నాడు, నిశ్చింతగా, హాయిగా. ఇంటికి వచ్చేసరికి తన స్వత్వాలన్నీ వొదిలి పోయి ఒకవిధమైన తృప్తి అనుభవానికి వస్తుంది. ఇది అతనికి ప్రీతికరం గానూ, ఆశ్చర్యకరంగానూ ఉంటుంది. బైట అయితే జబర్దస్తీగానేఉంటాడు; అదిరిస్తూంటాడు, బెదరిస్తూంటాడు, ఆజ్ఞాపిస్తూఉంటాడు; వ్యక్తిత్వంలో బిగువు, స్వాభిమానం తొణికిసలాడుతూ ఉంటాయి. తాను ఫలానా అన్నట్టు వ్యక్తమౌతూ ఉంటాడు బైట. కాని యింట్లో మాత్రం అతి తేలికగా ఆ 'నేను' అన్నదాన్ని కోల్పోతాడు. ఆ 'నేను' లేకుండాపోవటంలోనే చెప్ప టానికి వీల్లేనంత జీవనసార్థకత గోచరిస్తున్నది. ఇది చాల చిత్రమైన విషయం. అతని మనస్సులో మోహిని అంటే ఎటువంటి భావం ఉన్నదో చెప్పలేం. అసలేభావమూ లేదా? ఆ లేకపోవటంలోనే అన్ని భావాలూ ఉన్నాయా? అసలు ప్రత్యేకంగా ఏ భావమూ లేదనే చెప్పాలి! పైగా మోహిని అంటే అతనికి భయంకూడాను. కాని ఎల్లప్పుడూ కాదు. నిర్భ యంగా, నిస్సంకోచంగా తన పాదాలు చాచి ఆమె కాళ్ళమీదనో, పక్కన కుర్చీమీదో పెడతాడు ఒక్కొక్కప్పుడు. లాళ్ళు విప్పమంటాడు. బూట్లు తీసి యథాస్థానంలో పెట్టమంటాడు. కాని ఒక్కొక్క సమయంలో ఆమె కనుబొమలు వంకరతిరిగాయంటే అతడు ప్రాణికిపోవటమూ కద్దు; మరొక

ప్పుడు ఆమెమాటను దేన్నైనా సరే, ఏసమయంలోనైనాసరే, రద్దుచేసి పార వేయడమూ కద్దు. ఈ వైపరీత్యం ఏమిటో తనకే అంతుచిక్కటంలేదు. అసలు అంతుచిక్కేటంత అంతరం ఒకటి అగుపిస్తేనా !

మోహిని తిరిగివచ్చింది. "ఒక్కసంగతి చెప్పండి : ఇప్పుడు టైమెంతైంది ?"

"టైమా ? పన్నెండుంబావు" అన్నాడు నరేశుడు తన చేతిగడియారం చూచి.

"అయితే పన్నెండింటికా టీ త్రాగటం మీరు ?"

నరేశుడు అపరాధిలా ముఖం పెట్టాడు.

మోహిని నవ్వింది. "మూడు కప్పులు తాగేశారు. ఇంకా భోజనమేం చేస్తారు ?"

"మూడా ? పన్నెండుగంటలైందనీ, టీ తాగేసమయం కాదనీ ముందే చెప్పకపోయినావు ! నీ వ్యవహారం ఏం బాగులేదు. ఎందుకు తెచ్చావు టీ ?"

"తప్పంతా నాదే కదూ ! సరే, ఇవాళ భోజనానికి ఆలస్యం ఔతుంది లెండి. వంటమనిషికి జ్వరం వచ్చింది. ఆకబురు నాకు ఆలస్యంగా అందింది. నేనేమో మీ సహాయ్‌గారిదగ్గర దిగబడిపోయాను."

"అరె, ఆసంగతి నాకు ముందుగానే తెలియజేస్తే ఆలస్యంగానే వచ్చేవాడినిగా ! పనినష్టం కాకుండానూ ఉండేదే !"

"కబురుచేద్దామని అనుకుంటూ ఉండగానే మీరు వచ్చేశారు. పని నష్టం అవనే అయింది. సహాయ్‌గారిదగ్గరకు వెడదామా మరి ఇప్పుడు ?"

"నగలవర్తకుడు ఎంతసేపటికీరాడేం, దౌర్భాగ్యుడు !"

"వస్తే అతడూ వస్తాడులెండి."

"అక్కడికా ?"

"అయితేయేం ? కాని మనదగ్గరవున్న వస్తువులుకూడా కొన్ని వర్తకుడికి చూపించాలి, ఇలా ఉండాలి నమూనా అని అతనికి తెలిసేందుకు. పెట్టెకు పెట్టె అక్కడికి తీసుకుపోవలసివచ్చేట్టుందే !"

"ఔనౌను, వర్తకుడిని రానీమొదట."

కాసేపటికి నగలవర్తకుడు వచ్చాడు. తెచ్చిన హారం చూపించాడు. మధ్యలో పెద్ద మరకతం ఒకటి బిగించిన పతకం ఉంది. చుట్టూ రత్నాలు చక్కగా కూర్చి వున్నాయి. పతకం ప్లాటినమ్‌తో తయారైంది. ఇంకా అతడు తెచ్చిన రత్నపుగాజులు, లోలాకులు మొదలైనవన్నీ చూపించాడు.

అన్నీ చూచింది మోహిని. కాని ఆమెకాసమయాన వాటియందు విశేషమైన అభిరుచియేమీ కలగలేదు. హారం విషయంలో....మధ్యనున్న పచ్చలరాయి ఇంకా కొంచెం పెద్దదిగా వుంటే బాగుంటుందనిమాత్రంఅన్నది. దానికి అటూ ఇటూ వున్న రత్నపు పూసలు దానికి అంటుకుని కాకుండా కొంచెం దూరంగా వుండాలనికూడా సూచించింది.

"ఔను. తమరు చెప్పిన రీతి కూడా మంచిదే. అలా తయారుచెయ్యమంటే....కాని ఈతీరులో వున్నా మీకు...."

వర్తకునిమాట వినిపించుకోకుండా మోహిని భర్తవైపు తిరిగి "అయినా ఇప్పుడీ వస్తువు మన కేమంత అవసరం?" అన్నది.

"మనం ఆర్డరుఇచ్చాం. రావ్‌సాహెబు కష్టపడి తయారుచేసి పట్టుకొచ్చాడు. నువ్వేమో...."

మోహిని వర్తకునివైపు తిరిగి "ఏంరావ్‌సాహెబ్! నేను చెప్పినట్టు ఇంకొంచెం పెద్ద మరకతం వేసి ఎప్పుడు తయారుచేసి పట్టుకొస్తావు? పూసలుకూడా ఇంకా ఉరువుగా ఉండాలి."

"అంతకంటె పెద్ద మరకతం చప్పున దొరకదమ్మా! వెతకాలి. కాని ఇదైనా...."

వెంటనే నరేశుడు అందుకుని "ఇదిగో రావ్‌సాహెబ్! ఒక్క పని చెయ్యి. ఈ మూడు వస్తువులు....అంటే ఈ హారం; పుష్యరాగాలు, రత్నాలు తాపటంచేసిన గాజులు, లోలాకులజత ఇక్కడ వుంచేసెయ్యి. ఇక పోతే ఆమె కోరినవస్తువు వీలైనంత తొందరలో తయారుచేసి పట్టుకురా. ఖరీదు —"

"దానిదేముందండి. ఎలాబడితే అలాగే చూచుకోవచ్చు. ముందు మీకు నచ్చితే—"

"సరే అయితే" అంటూ నరేశుడు మోహినివైపు తిరిగి "ప్రస్తుతానికి ఈ మూడు వస్తువులూ అట్టిపెట్టుకో, ఏం?" అన్నాడు.

మోహిని ఒక అసమంజసస్థితిలో పడిపోయింది. తనకు కావలసింది ఒక చక్కని పచ్చలహారం; అంతే. కాని ఇదేమిటి? పరిస్థితి ఇలా వచ్చేసింది, ఇన్నెందుకూ? ఆమె యేమీ మాటాడలేదు.

"ఏం? ఇంకేమన్నాకూడా కావాలంటేచెప్పు; తీసుకుందాం."

"వద్దు."

ఆమె కంఠస్వరం గమనించి నరేశుడు వర్తకునితో ఇలా అన్నాడు: "రావ్‌సాహెబ్: ఈ మూడు వస్తువులూ ఇక్కడ ఉంచేసెయ్యి. ఆమె కోరిన పచ్చలహారం తయారుచేసి పట్టుకువచ్చాక చూద్దాం. ప్రయత్నించి చక్కగా తయారుచెయ్యాలిసుమీ!"

వర్తకుడు ప్రయత్నలోపం ఏమీ చెయ్యననీ, భగవంతుడు మేలు చేస్తే సాధ్యమైనంత త్వరగానే తయారుచేసి పట్టుకొచ్చి హుజూర్‌వారికి సమర్పించుకుంటాననీ నచ్చబలికి, సలాంచేసి, తన పెట్టెబేడ సర్దుకుని సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

"ఏం, మోహినీ! ఏమిటి?"

"ఇవన్నీ మనం పుచ్చుకోటంలేదుగా! ఎందుకు వుంచిపొమ్మన్నారు?"

"పుచ్చుకోటంలేదూ! భలే మాటే.... పుచ్చుకోటం లేదులే. కాని నువు ఇలారా" అంటూ నరేశుడు పెట్టె తెరిచాడు. హారం రెండుచేతుల్లో పట్టుకున్నాడు. "ఇదిగో, ఇలా రా. దగ్గరకు రా."

"మీరన్నీ ఇలాగే చేస్తారు."

"ఇలారద్దూ."

"నాచేతికి ఇవ్వండి ఇలాగ" అంటూ మోహిని చెయి చాచింది.

"ఊఁహూఁ, నాముందుకు వచ్చి తల వంచవలసిందే. నేనెవరిననుకున్నావు, ఏమిటి కథ!" అంటూ లేచాడు. హారం మోహిని మెడలో అలంకరించాడు. పచ్చలరాయి తాపటంచేసిన ఆ పతకం కంఠానికి క్రిందుగా, వక్షోభాగానికిపైగా తళుకులీనుతూ నిల్చింది.

మోహిని లజ్జావిలసితముఖి అయింది.

"ఆహాహా! ఏం చెప్పాలి!" అన్నాడు నరేశుడు.

ఆతరువాత....అయిష్టంగానే ఇష్టపడుతూన్న మోహిని చేతులకు రత్నపుగాజులు తొడిగాడు. చెవులకు లోలాకులు తగిలించాడు. రెండు చేతులతోనూ మోహిని దేహాన్ని తనయెదుట నిలువబెట్టుకుని ఎగాదిగా చూచాడు. చివరకు సోఫాలో కూర్చున్నాడు. "ఇదిగో, కొంచెం నాలుగు అడుగులు దూరంగా వెళ్ళి నిల్చో; మరీ దగ్గరైతే అంత రుచి కనిపించటం లేదు."

అతని ఆనందాన్నీ, అధికారాన్నీ కుంటుపరచటం మోహినికి ఇష్టం లేదు. తానిప్పుడొక వ్యక్తి కాదు; ఒక వస్తువులా అయిపోయింది. అతడేమి అంటే అదే మన్నించింది; అతడేమి చెబితే అలాగే చేసింది. నాలుగైదు అడుగులు వెనక్కు వేసి నిల్చుంది. "ఊఁ, సరేనా?" అన్నది.

అతడామెను పైనించి కిందికీ, కిందినించి పైకీ తెగచూచాడు. "వారె వాహ్! ఏమి అందం! పర్తకుడు ఆ నగ భలే బాగానే తయారుచేశాడు సుమీ! ఆహా!"

"ఇక వెళ్ళిపోనా?"

"టైమెంతైందో చూడు" అంటూనే తన చేతిగడియారం చూచుకున్నాడు నరేశుడు, "ఒకటిన్నరయింది. అబ్బో! ఇం భోజనానికి ఆలస్యం ఉందా యేమిటి? వెళ్ళి చూడు."

మోహిని అయిదుగజాలదూరంలో ఉంది. ఇప్పుడు అక్కనించి తొలగింది. తొలగి గాజులు తీసివేయటానికి ఉపక్రమించింది.

"అదేంపని?"

"భోజనం తయారైందేమో వెళ్ళి చూచివస్తాను."

"నువు చేస్తున్న పనేమిటి? వద్దు, తీయొద్దు. ఉండనీ. ఎంతఅందంగా వున్నాయో చూడు!"

మోహిని తనప్రయత్నం మానేసింది. బొమ్మలు అలా వుంచుకునే అక్కడినించి లోనికి వెళ్ళిపోయింది.

తిరిగి వచ్చి 'ఇంకా కొంచెంసేపు ఓపికపట్టాలి' అని చెప్పింది.

"అయితే మన అతిథిగారి ఆరోగ్యం ఎలావుందో కాస్త వెళ్ళి చూచి వద్దాం రా, ఏమంటావు ?"

"సరే, వెళ్ళిరండి."

"అదేమిటి ? నువు కాస్త దారిచూపించవూ మరి !"

"నేనక్కడనించి ఇందాకనేగా వచ్చాను !"

"అయితే ఏం ? నాతోకూడా రాకూడదూ మళ్ళీ."

"సరే అయితే, వస్తాను" అంటూ ధరించిన సొమ్ములు తీసివేయ బోయింది. 'వ'ద్దని మళ్ళీ అభ్యంతరపెట్టాడు భర్త, "అదేంపని? ఇప్పుడే తిరిగి వచ్చేద్దాం" అంటూ.

"మీరు వెళ్ళిరండి. నేనెందుకూ రెండోమాటు ?"

"అదిగో మళ్ళీ అదేమాట ! భలే !" అంటూ చేయిచాచి ఆమె మణి కట్టు గట్టిగాపట్టుకుని లాక్కుపోసాగాడు.

"అబ్బ ; వొదిలిపెట్టండి, వస్తున్నాగా !"

గదిలో అతిథి పక్కమీద పడుకుని పుస్తకం ఏదో చదువుకుంటు న్నాడు. అంతకుముందే పథ్యం పెట్టారు ; విశ్రాంతి తీసుకోవలసినసమయం అతనికి. నర్సుకూడా దగ్గరలేదు. తను ఉండవలసిన ఆవశ్యకత లేదనుకుంది కాబోలు ! గదిలోకి నరేశుడు ముందుగా వచ్చాడు ; వెనుకనే మోహినిఉంది. అడుగుల చప్పుడు వినిపించగానే అతిథి పుస్తకం అవతలపెట్టేశాడు. గుమ్మం వైపు తిరిగి చూచాడు. "హలో ! మిస్టర్ సహాయ్ ! 'హౌడూయూడూ ?' (ఎలా ఉన్నారు ? కులాసాయేనా ?)" అని అడిగాడు నరేశుడు వస్తూనే.

నరేశుడు ఇంకా దగ్గరకు రావాలని ప్రతీక్షిస్తున్నవాడులా జితేంద్రుడు వెంటనే జవాబు చెప్పలేదు. ఒక అడుగు వెనకాల మోహిని కనిపించింది. దూరంనించే అతనికి కనిపించాయి : ఆమె చెవులకు పెట్టుకున్న లోలాకుల తరళకాంతిపుంజాలు. అటువైపే ఎక్కువగా చూడలేదతను. ఆమెయైనా తన్ను చూచి నమస్కారం చెప్పలేదు. ఆమెచూపులు ఎదురుగా, విస్పష్టంగా ప్రసరించటంలేదు. అస్పష్టంగా క్రిందికి చూస్తున్నాయి.

"మిస్టర్ సహాయ్ ! కులాసాగా ఉన్నదా వంట్లో ?"

సహాయ్ సగంవరకు దుప్పటి కప్పుకునే వున్నాడు. కొంచెం మోచేతి

మీదుగా లేచి కూర్చున్నాడు. నరేశుడు చేయి అందిస్తూ "ఎలా వుంది? కులాసాయేనా?" అని అడిగాడు.

అందించిన చేయి తన రెండుచేతుల్లోనూ పుచ్చుకుని సహాయ్ అన్నాడు: "మీ దయవల్ల కులాసాగానే ఉన్నాను."

నరేశుడు కుర్చీలో కూర్చున్నాడు. అంతలో ఏదో జ్ఞాపకం వచ్చినట్టు వెనక్కుతిరిగి "మోహినీ! కుర్చీ తెచ్చుకో. అరె, నర్సు ఏదీ?" అన్నాడు.

మోహిని కుర్చీ ఒకటి లాక్కుని భర్తకు వెనకప్రక్కగా కొంచెం దూరాన కూర్చుంది.

"ఇదివరకుకంటే చాలనయమే. ముఖం పూర్వంలా లేదు; తేటగానే ఉంది. ఇంకొక్క వారంఅయితే వొంటికి బలంకూడా చేకూరుతుంది. నర్సు మంచిదే కదూ! మీకు నచ్చిందిగా!" అన్నాడు నరేశచంద్రుడు.

"చిత్తం—"

"మీ సహపాఠకురాల్ని అడిగి తెలుసుకుంటూనే వున్నాను మీ క్షేమ సమాచారాలు. మీ ప్రయాణంవిషయమై మరేం తొందరపడకండి...."

జితేంద్రునిచూపులు క్రిందికి వున్నాయి. ఆ కుర్చీ అడుగుభాగం కనిపిస్తున్నది. అందులో ఎవరో కూర్చుని వున్నారు. అవి కుర్చీకాళ్ళు. వాటికి ముందు చీర ముడతలు. వాటికింద రెండు పాదాలు. ఆ పాదాలకు చెప్పులు. చాల చిన్నవిగ ఉన్నాయి పాదాలు. పలచగాకూడా ఉన్నాయి. ఆ పాదాంగుళుల నఖాలు మామూలుకు మించిన మెరుపుదనం చిలుకుతున్నాయి. మెల్లిగా చూపులు పైకి లేచాయి. ఆ కూర్చున్న ఆవిడచేయి తొడమీద వెల్లికిలా ఉంది. మరో చేయి దానిమీద బోరగిలివుంది. చూపులు మాటిమాటికీ పైకి లేవాలని ఉబలాటపడుతున్నాయి—ఇంతలో వినిపించాయి నరేశునిమాటలు: "ప్రయాణంవిషయమై మీరేం తొందరపడకండి, బాగా ఆరోగ్యం, బలం చేకూరినదాకా ఆ మాటే తలపెట్టవద్దు. ఇక్కడ మీకేం కష్టం లేదుకద!"

ఇప్పుడు అతిథి హఠాత్తుగా పైకి చూచాడు. అటు కుర్చీవైపు చూపులుపోయాయి. "ఈమెగారిదయవల్ల నాకిప్పుడేమీ కష్టంలేదు"

అతని చూపులు అటువైపు వెళ్ళి అక్కడ క్షణమాత్రమే నిల్చాయి.

ఆమె ముఖం గులాబిరంగులో లేదు. అక్కడేదో విశిష్టత తొణికిసలాడు తున్నది. చెవులకున్న లోలాకుల కాంతులేగాక మరేదో వేరే ఉన్నది. వక్షో భాగంపైన అనాచ్ఛాదితంగా ఉన్న కంఠదేశాన కూడా ఏదో ఉన్నది. అతని చూపులక్కడ క్షణమాత్రంగా నిల్చి తిరిగి వచ్చేశాయి. ఆమె భర్తవైపు చూస్తూఉన్నది. కుర్చీలో కూర్చున్న ఆవిడవేనా క్రింద ఆ పాదాలు ?.... మామూలుకన్న చిన్నవిగా కనిపిస్తున్న ఆ పాదాలు ?....గోళ్లు మామూలుకన్న ఎర్రగా ప్రకాశిస్తున్న ఆ పాదాలు !....

"మీ బంధువులకుగాని ఎవరికన్నా టెలిగ్రాం ఇవ్వమన్నారా ?" నరేశచంద్రుడు అడిగాడు.

"ఎందుకూ ? అవసరంలేదు. రెండుమూడురోజుల్లో నేనే వెడుతు న్నానుకద !"

"ఉహుఁ. అదేంమాట ! రెండుమూడు వారాలనండి. ఏమైనాగానీ, రెండుమూడు రోజుల్లోనే వెళ్ళటానికి వీల్లేదు."

అతిథి చూపులు మళ్ళీ కుర్చీకాళ్ళదగ్గరకు వెళ్ళాయి. మెల్లిగా పైకి లేచాయి. చేతులపైదాకా వెళ్లాయి....ఏమిటి అవి ? మణులు, పుష్యరాగాలు తాపటంచేసివున్న గాజు అతని చూపుల్ని క్షణమాత్రంగా బంధించేసింది. వెంటనే చూపుల్ని బలవంతాన కిందికి దించేసుకున్నాడు.

"మిస్టర్ సహాయ్ ! ఇందాక మేం టీ తాగుతూ కబురుచేశాం ; మీరు రాలేదు."

అతిథి నరేశునివైపు చూచాడు. "ఒకటిరెండు రోజుల్లో నే నటు వంటి అదృష్టానికి అర్హత సంపాదించుకోగలనని ఆశిస్తున్నాను."

"మీరు లేచి నడవగలరనే నా నమ్మకం. కాస్త లేచి అటూ ఇటూ తిరుగుతూ ఉండటం మంచిది. కాళ్ళు దారికి వస్తాయి. ఆనక మూడుగంట లప్పుడు టీకి వస్తారుకదూ ? కబురుచేస్తాను."

అతిథి మోహినివైపు చూచాడు. "ఆమెను అడగండి. ఆజ్ఞ అయితే...."

మోహిని నవ్వింది. "అభ్యంతరమేముందీ ?"

"నేను ఆమెగారి అధీనంలోవున్న రోగిని. వారి ఆజ్ఞ నేను కాదన లేను" అన్నాడు అతిథి నరేశునివైపు చూస్తూ.

మోహిని భర్తవైపు తిరిగి "రాగలరనుకోండి. అయినా ఇంకా విశ్రాంతిగా పడుకోటమే మంచిదికాదూ!" అన్నది.

"కాదు, మంచిదికాదు" అన్నాడు మరుక్షణమే నరేశుడు. ఒకవేళ మంచిదనుకుంటే—టీ ఇక్కడికే తెప్పిద్దాం. ఇక్కడే తాగుదాం."

"సరే. అలాగే" అన్నది మోహిని. మళ్ళీ వెంటనే నవ్వుతూ "చూచారా! రెండు దాటిపోయినట్టుందే!" అన్నది.

నరేశుడు గడియారం చూచుకున్నాడు. ఇక క్షణంకూడా ఆగలేదు. కోర్టులో అప్పీలు కేసు ఒకటి ఉంది; తొందరగా వెళ్ళిపోయాడు.

# 10

భర్త వెళ్ళిపోయాక మోహిని జితేంద్రునికి ఎదురుగా కుర్చీలో వచ్చి కూర్చుంది. "బహుశా నీకింకా తెలియదు కాబోలు! నువు ఇక్కడవున్నట్టు పోలీసులు పసిపట్టారు."

జితేంద్రుడు విన్నాడు; కాని ఏమీ మాటాడలేదు. కేవలం ఆమె వంక చూస్తూ ఉండిపోయాడు.

"ఏమిటి అలాచూస్తావు? నీసంగతి నువు ఆలోచించుకోవేం?"

"అది కొత్తగా కొన్నావేమిటి?"

"ఏమిటది? హారమా? అదేనా చూస్తున్నావిందాకటినించీ? ఔను. కొత్తది కొన్నాను. ఇంకా తీసుకోలేదనుకో....కాని వింటున్నావా? నువు చాల ఆపదలో ఉన్నావు."

"ధర ఎంత వుంటుంది?"

"ఇంకా ధర నిర్ణయం కాలేదు. చూస్తావా? చూడు" అంటూ మోహిని మెడలోని హారం తీసి అతని చేతికి ఇచ్చింది. అతడు విచారంగా అటు తిప్పి, ఇటు తిప్పి చూచాడు దాన్ని. చివరకు దోసిట్లో అట్టిపెట్టుకుని అలాగే చూస్తున్నాడు. రెండు నిమిషాలపాటు మోహిని అతన్ని అలాగే చూడనిచ్చింది. "ఏమిటి ఆలోచిస్తున్నావు?" అని అడిగింది చివరకు.

దానికి సమాధానంగా జితేంద్రుడు "ఇదిగో, నీ హారం నువుతీసుకో" అంటూ ఇవ్వబోయాడు.

మోహిని హారం తీసుకోలేదు. "నే నడిగిందేమిటో విన్నావా?.... ఏమిటి ఆలోచిస్తున్నావు అని అడుగుతున్నాను."

"ఏమీలేదు....ఎంత వుంటుంది దీని ధర?" అన్నాడు జితేంద్రుడు మెల్లగా.

"సరిగ్గా ఇంకా తెలియదు. సుమారు మూడువేలదాకా ఉంటుంది.... ఇంకా ఇవి చూచావా? లోలాకులు, గాజులు. ఇవన్నీ కలిసి ఇంచుమించు ఎనిమిదివేలదాకా ఉండవచ్చు. ఇంతకూ మేము....నువు నులిమివేయదలచు కున్న ధనస్వాములం." అంటూ ఆమె లోలాకులు, గాజులు కూడా తీసి అతని దోసిలిలో పెట్టింది. పెట్టనిచ్చాడు జితేంద్రుడు, ఏమీ మాటాడలేదు.

"చెప్పవేం? నులిమివేద్దామనుకుంటున్నావుకదూ!" మోహిని నవ్వు తూనే ఉంది. "కాని ఈ వస్తువులే మమ్మల్ని నులిమివేస్తూ ఉన్నాయి. చూప రులకు ఆడంబరంగా కనిపించేట్టు తళుకుబెళుకులు పోతున్నాం; మమ్మల్ని మేము ఎక్కడ తెలుసుకోగలుగుతున్నాం?....సరేగాని, నీ వ్యవహారం ఏమి టదీ? పాముపుట్టను చుట్టివేశారు. నువ్వింకా ఎరగవు కాబోలు! పోలీసులకు పత్తా తెలిసింది. ఈ యింట్లో అని గాకపోయినా ఈ పట్నంలోనే ఉంటున్నా వని నిశ్చయంగా అనుకుంటున్నారు.

"అనుకోనీ. ఇవిగో, తీసుకో నీ వస్తువులు. డాక్టర్‌గారు ఎప్పుడు వస్తారు?" జితేంద్రుడు అడిగాడు అన్యమనస్కుడులా.

"వస్తూ ఉండాలి" అంటూ మోహిని తన వస్తువులు పుచ్చేసుకుంది. కాని ధరించలేదు. అతనిముఖంలోకి చూస్తూ కూర్చుంది. అతడు మనసు దాచుకోకుండా సుపరిచితంగా ఉండాలని ఆమెకోరిక. అతని గుండెమీద ఇప్పటికే చాల బరువు ఉంది. దాన్ని ఇంకా అనవసరంగా అధికంచెయ్యటం ఆమెఉద్దేశం కాదు. వీలైనంతవరకు ఆ బరువు తొలగించి అతని హృద యాన్ని ఉల్లాసపరచవలెననే ఆమె అభిలాష. కాని అతని అంతస్సు కాస్త అలా పైకి కనిపించినట్టుగా కనిపించి మళ్ళీ లోపలికే దిగిపోతూ ఉంది. దాన్ని బాగా వెలికి లాగవలెనన్న ఉద్దేశంతోనే ఆమె ఇలా పలుకరించింది:

"చెప్పు మరి : మా ధనికవర్గాన్ని ఏమిచెయ్యాలని నీ ఉద్దేశం? 'లిక్విడేట్' అంటే సమూలంగా అంతరింపజెయ్యాలనేగా ! కాని ఇదా పద్ధతి దానికి ?"

జితేంద్రుడు ఆమెవైపు స్థిరంగా చూస్తున్నాడు. ఆ చూపులో తీవ్రత, దృఢసంకల్పం ఉన్నాయి. కొంతసేపు అలా చూచి, చూపు దించేసుకున్నాడు. ఏమీ మాటాడలేదు.

"మాటాడవేం మరి ! ఈపద్ధతిలో సానుకూలం ఔతుందా నీ పని ? రైలు కూలదోశావు ; ఆ యీ గందరగోళపు పనులేవో చేశావు. అటువంటి మార్గంలో నీకు మనశ్శాంతి అనేది లభిస్తుందా అసలు ?"

"వాగబోకు !" జితేంద్రుడు దూకుడుగా అన్నాడు. 'అమ్మయ్య ! నోట్లోనించి మాట వచ్చిందికదా ఆఖరుకు'—అని మోహిని సంతోషించింది.

"నేను ఊరుకోను. నేను అడిగేదానికి—"

అతని కంటి సైగ ఆమె చూచింది. దాని భావం సుస్పష్టమే. ఆమె నాలుక కొరుక్కుంది. అరె ! తానెంత మూర్ఖురాలు అయింది ! ఇప్పుడామె దృష్టి నర్సువైపు వెళ్ళింది. గదిలో నర్సు ఉండగా తాను ఇలా మాటాడిందేమిటి ? "మిథిలా ! నిన్నెంతయినా ప్రశంసించవలసిందే. నువు వత్తి మూగిమొద్దులా వుంటావు. నువు ఉన్నదీ లేనిదీకూడా తెలియకుండా ఉంటావు. మేమేమో....ఏం ? వెళ్ళిపోతున్నావేం ?" అన్నది మోహిని.

"అవసరమైతే గంట మోగించండి, వస్తాను" అంటూ క్లుప్తంగా జవాబు చెప్పి వెళ్ళిపోతూన్న నర్సును చూస్తూ "భలే చిత్రమైన పిల్ల !" అన్నది మోహిని.

జితేంద్రుడన్నాడు : "ఈమెను ఇప్పటికిప్పుడు సెలవిచ్చి పంపించెయ్యరాదూ ?"

"ఎందుకూ ?"

"ఎందుకా ? నీకు బుద్ధిలేదు—"

"క్షమించు జితేన్ !"

"నాచేత వాగిద్దామనికదూ నీ ఉద్దేశం ? ఏం వాగమంటావు చెప్పు ? మీ ధర్మాలు, ఉపదేశాలు నాకు అక్కర్లేదు. మీకు కావాలి అవన్నీ. ఎందు

వల్లనంటే——మీకు బొచ్చెడంత ధనం ఉంది; బోలెడంత తీరుబాటు ఉంది. నేనిప్పుడు మీయింట్లో వున్నాను. మీ దయమీద ఆధారపడి వున్నాను. అందు కని? ఏమిటి నీ ఉద్దేశం? ఆనాడు కంఠమాల, ఈనాడు ఈ 'హారం'—— ఇంతకూ ఏమిటి నీ వ్యవహారం? నాకు కోపం తెప్పించాలనా? నాకు ఆశ పెడదామనా? తళుకుబెళుకులన్నీ నాకు చూపించాలనా? ఇంకేం? చూశాలే; ఇక వెళ్ళిపో. నా రొంపిలో నన్ను ఉండనీ. మీకు కష్టం తెప్పించటం నాకు ఇష్టంలేదు. మిమ్మల్ని మీరే నేలమట్టం చేసుకుంటున్నారు. ఆసంగతి నువ్వు ఇందాక చెప్పావు. అది నిజమే. భోగవిలాసాల్లో ఉంటారు మీరు. అంతకు మించి మీకు చెయ్యవలసిన పనేమీ ఉండదు. అదే మీ వలయం. అందు లోనే మీరు గిర్రున తిరుగుతూ ఉంటారు. దానికిబైట ఏంజరుగుతూందో మీకు అక్కర్లేదు. ప్రజలు దుఃఖాల్లో మగ్గుతుంటే మగ్గనీ, చస్తే చావనీ; మీ యీ భోగవిలాసాలకు సామగ్రి ఎక్కడినించి వస్తున్నదో తెలుసునా? తెలియకేం? బాగానే తెలుసు. కాని ఆసంగతి గుర్తుకు తెచ్చుకోటం మీకు ఇష్టంలేదు. అదే మంచిదిలే; అలాగే కాలక్షేపం చెయ్యండి.... ఇందాక ఏమిటీ అడిగావు? ఆ యీ గందరగోళపుపనులవల్ల ఏమౌతుందీ అనా? ఏమీ కాదని నాకు తెలుసు. కాని అందువల్ల మీవంటివాళ్ళకు నిద్ర మెళుకువ వస్తుంది. బహుశా ఆ నిద్ర వదలకూడదేమో! ఇంకా గాఢం అయిపోవా లేమో! అదే పెద్ద నిద్రగా మారాలేమో! కాని నాదే పొరపాటు అనుకుం టాను. నిద్రే కావలసినవాడు ఎందుకు మేలుకుంటాడు. పెద్దనిద్రే కావల సినవాడికి కళ్ళు తెరుపుళ్ళు ఔతాయా? కాని తదితరులు ఇంకా చాలమంది ఉన్నారు వేరే. మీ ఆధిక్యతను, అధికారాన్ని తలమీద పెట్టుకుని మోస్తూ ఆ బరువుకింద నీచాతినీచమైన పరిస్థితుల్లో మగ్గుతూన్నవాళ్ళు. వాళ్ళ నైచ్యం మీదే మీ ఉచ్ఛస్థితి ఆధారపడి వుంది. వాళ్ళను మేలుకొలపాలి. వాళ్ళు మేలు కొని 'ఇదంతా పచ్చిమోసం' అని తెలుసుకోవాలి. వాళ్ళ చెవుల్లోకి జొరబడ గలవి ఢాంఢామ్మను ప్రేలుడు ధ్వనులే; శాస్త్రాలు, ఉపదేశాలు లాభంలేదు. మీరుమాత్రం అహింసాసిద్ధాంతాన్ని పట్టుకుని కూర్చోండి. చీమలకు పంచ దార మేపుకుంటూ, హారాలు ధరించి, చల్లగా కబుర్లు చెబుతూ, కాఠిన్యాన్ని విమర్శిస్తూ వుండండి. మేముమాత్రం కఠినంగానే వ్యవహరిస్తూ ఉండాలి.

మాపని అంతే. ఇంతవరకు సాగిన నాటకాలు, బూటకాలు ఇక చాలు. వాటికింద లక్షలాది ప్రజలు నలిగిపోయారు. డబ్బు పూజింప బడుతూ ఉంది; మోసం సభ్యతకింద చలామణీ ఔతున్నది. మీ సొత్తు అయిపోయింది ప్రపంచం. ఈవిధంగా ప్రపంచం ఇక సాగటానికి వీల్లేదు. ధర్మం అనే ముసుగులో దాగివున్న కూపం బయటపడిపోయింది. సత్యం బట్టబయలైంది. మీరు మత్తుమందు పోసి ప్రపంచాన్ని వెర్రిపుల్లమ్మనుగా తయారుచేశారనేదే ఆ సత్యం. ధర్మంద్వారా ధనం వస్తుంది; ధనంద్వారా ధర్మం నిలుస్తుంది అంటూ మీరు చెప్పే శాస్త్రమే ఒక పెద్ద షడ్యంత్రం. దాన్ని పూర్తిగా విచ్ఛిన్నంచెయ్యక తప్పదు. ఆ కృషిలో ప్రాణాలే పోవచ్చు; నిరపరాధులే బలి కావచ్చు. కాని నిజమైన ప్రబోధం తద్వారా లభ్యంకావల సిందే....ఆఁ, ఇందాక పోలీసుల్ని గురించికదూ ఏమిటో అంటున్నావే! ఎప్పుడు తీసుకువస్తావు వాళ్ళను?"

మోహిని మాటాడకుండా కూర్చుని అంతావిన్నది. అతని హృద యంలో అణచియుంచబడిన సామగ్రి యావత్తూ బైటికి పొర్లివస్తున్నదికదా అనేదే ఆమెకు ఊరట. ధోరణిమాత్రం ఆమెకు నచ్చలేదు.

"పోలీసులు ఎప్పుడు వస్తున్నారేమిటి? చెప్పవేం?"

"నీకేమన్నా పిచ్చెత్తిందా? పోలీసులు రావటంలేదు, ఎవరూరావటం లేదు."

"ఎందుకు రావటంలేదు? అంతమాత్రం ధర్మాచరణకూడా మీకు చేతగాకపోయిందా? నేరాలు జరక్కుండా మీ బారిష్టర్ దొరగారైనా న్యాయ సంరక్షణకు పూనుకోలేకపోయారా? న్యాయం మీమీద ఆధారపడివుంది. న్యాయాన్ని మీరే కాపాడాలి. ప్రపంచంలో ఎవరియిష్టం వచ్చినట్లు వాళ్ళు చేస్తూ ఉంటే చూస్తూ ఊరుకుంటూ ఉన్నాడు పైన భగవంతుడు. మీరూ అలానే చూస్తూ ఊరుకుంటారా? భగవంతుని ధర్మం వేరు, భక్తుల ధర్మం వేరు. భగవంతుడు తానై స్వయంగా ఏమీ చేయడు; భక్తులద్వారా చేయి స్తాడు. ఆయనధర్మంలో ఈ స్వల్పభాగమైనా మీరు నిర్వహించలేకపోతు న్నారా? ఇక్కడ ఒక దుష్టుడు ఉంటే వీడికి దండన ఇవ్వలేరూ! ఇంత మాత్రంకూడా చేతగాకపోయినతర్వాత మీరుండి ఏం లాభం?....అయినా

మీరింత పెద్దపొరపాటు చేసివుండరనే నా నమ్మకం. మీరు తప్పకుండా పోలీసులకు కబురుచేసే వుంటారు."

వింటూంటే మోహినికి బాగా రోషం వచ్చేసింది. "ఔను. కబురు చేశాం. ఏం చేస్తే?"

"మరి ఈ నాటకమంతా ఎందుకు? నాకు మంచి ఇప్పిస్తున్నట్టు, రోగమేదో నయంజేయిస్తున్నట్టు, నర్సును నియమించటం, ఇతర్ల ఉపచారాలమీద బ్రతుకవలసిన ఒక అవిటిపీనుగునైనట్టు... ఎందుకూ ఈ నయగారాలన్నీ? సాఫుగా చెప్పెయ్యరాదూ: 'నిన్నిక్కడ నిలిపివేశాం, బండికి దారం చుట్టినట్టు. పోలీసులచేతిమీదుగా కేసు బనాయించబడుతుంది" అని. నేనింకా అర్థంచేసుకోలేకపోయానుసుమీ...."

"జితేన్!"

"జితేన్ అనేవాడు ఎవడూ లేడిక్కడ. నాపేరు సహాయ్. అంత మాత్రం జ్ఞాపకంఉండదూ నీకు?"

మోహినికి భయం కలిగింది. "నీకు దండం పెడతాను. శాంతించుదూ! నువు తొందరగా వెళ్ళిపోదలచుకుంటే—సరే, అలాగే వెళ్ళిపోదువుగాని. కాని ఇటువంటిపరిస్థితిలో డాక్టర్‌గారు వచ్చి చూస్తే ఏమంటారు? కొంచెం శాంతపడు. నేనెవరితోనూ ఏమీ చెప్పలేదు. నీకు తెలుసు ఆసంగతి. అయినా ఏమిటిది నువు ఇలా అయిపోయి...."

మోహిని జితేంద్రునివైపు చూస్తూనే ఉంది. అతడు అకస్మాత్తుగా మాటాడ్డం మానివేశాడు. కన్నులు ముద్దగట్టుకుపోయినట్టుగా ఉన్నాయి. స్తబ్ధంగా ఉండిపోయాడు. చూస్తూండగానే కన్నులు చెమ్మగిలినవి. కన్నులు కన్నీళ్ళతో పెనగులాడుతున్నట్టుగా వున్నాయి. నిప్పును వర్షించగోరుతున్నాయి కళ్ళు; కాని వాటిల్లోనించి నీళ్ళే రాసాగాయి. మోహిని గాభరాపడింది. మంచంమీదికి వచ్చి దగ్గరగా కూర్చుంది. జితేంద్రుడు స్తబ్ధచిత్తుడులా చూస్తూ ఉన్నాడు కొంతసేపటివరకు. అతని నుదుటిపై చేయివుంచి రాస్తున్నది మోహిని. ఉండిఉండి అతడు వెక్కివెక్కి ఏడువసాగాడు. దోసిలిలో ముఖం కప్పుకున్నాడు. కొంతసేపటివరకూ తన్నుతాను సంబాళించుకోలేకపోయాడు. కడుపులోనించి పొంగిపొంగి వస్తున్నది దుఃఖం. ఆపుకుని,

ఆపుకుని కన్నీళ్లు విడుస్తున్నాడు. వెక్కి-వెక్కి రోదిస్తున్నాడు. మోహిని ఒక చిత్రపు బొమ్మలా చూస్తూ ఉండిపోయింది. అతడు లోలోపల ఎందుకంత మథనపడుతున్నాడో ఆమెకు బోధపడటంలేదు. ఒక్కొక్కప్పుడు మనిషి ఏమీ చెయ్యలేని ఒక చిత్రమైన స్థితి దాపురిస్తూ ఉంటుంది. ఒడ్డున నిల్చుని గుడ్లు వొప్పగించి చూస్తూ ఉండటమే తప్ప ఎదుటివాని వేదన తెలుసుకో లేము ; తగ్గించనూలేము. లోలోపల తెములుతూ ఒక్కొక్కప్పుడు మనిషికి అటువంటి నిరుపాయ నిస్సహాయస్థితిని తెచ్చిపెట్టే ఆ వస్తువు ఏమిటో అర్థం కాదు.

నిమిషాలు గడిచిపోతున్నాయి. దోసిట్లో ముఖంపెట్టుకుని పక్కమీద బోర్లా పడుకున్నాడు జితేంద్రుడు. అతన్ని ఆనుకుని ఆ మంచంపట్టెమీదనే కూర్చుని సాశ్చర్యంగా చూస్తున్నది మోహిని. కాని మోహిని అతనికి ఎంతో దూరాన ఉన్నట్టుగా ఉంది. ఆవ్యక్తికూడా ఆమెకు ఎంతో దూరం గానే ఉన్నట్టుగా ఉన్నాడు. మధ్యన అనుల్లంఘనీయమైన ఒక మహా శూన్య సాగరం ఉబికిపడుతూ ఉంది. అందులోని ఒక అణువుకూడా అవగాహన కావటంలేదు. ఏం చెయ్యటానికి, ఏం మాటాడ్డానికి తోచటంలేదు మోహి నికి. ఏంమాటాడినా ఏంచేసినా ఆవలిగట్టుకు అందేలాగు ఉన్నదా ఏమాత్ర మైనా ?

చివరకామె మెల్లిగా అతని బుజాలమీద చెయివేసి తట్టుతూ "జితేన్ ! జితేన్ !" అని పిల్చింది విచారభరితమైన కంఠస్వరాన.

కాని జితేన్ శరీరంలో చైతన్యం ఉన్నట్టే లేదు. ఆమెమాట లతనికి వినిపించినట్టే లేదు.

"జితేన్ !" మళ్ళీ పిల్చింది మోహిని పూర్వంకన్న ఎక్కువ హృదయావేగంతో.

ఆ పిలుపు ప్రయోజనం ఒక్క క్షణంసేపు ఏమాత్రమూ కనిపించ లేదు. మరుక్షణంలో అతని శరీరం హఠాత్తుగా లోలోపల ఏదో పొంగు తున్నట్టుగా కదిలింది. వేగంగా కదిలింది. మళ్ళీ తీవ్రంగా వెక్కి-వెక్కి ఏడువసాగాడు జితేన్.

అలాగ అతనిలోనించి దుఃఖం ఆపుకోటం దుస్సాధ్యమై పొర్లిపొర్లి

వస్తూఉండటం చూచింది మోహిని. ఏమిచెయ్యటానికీ ఆమెకు తోచలేదు. అతని శరీరంమీదినించి తన చెయ్యి ఇవతలకు తీసేసుకుంది. విస్తుపోయి నిస్తబ్ధంగా చూస్తూ కూర్చుంది. మిక్కిలి వివశురాలై పోయింది. తానక్కడ ఉండటం అనవసరం అనిపించింది. ఉన్నా లేనట్టుగానే ఉంది. అతని హృదయంలోనించి ఆవేదన ఉబికిఉబికి ఉద్రిక్తంగా బయటపడుతున్నది. అటువంటప్పుడు అక్కడ తన ఉనికి అసంగతం, అయథార్థంగా ఉంది. జితేంద్రుడు అలాగే బోర్లా పడుకునివున్నాడు. సడి చప్పుడు లేదు. సమగతిలో సాగుతూన్న ఉచ్ఛ్వాసనిశ్వాసాల చప్పుడు ఒక్కటే వినిపిస్తున్నది. వాటివల్ల శరీరం కొంచెంగా లేస్తూ పడుతూ ఉంది. చూచి చూచి చివరకు మోహిని లేచింది. బొమ్మలన్నీ రుమాలులో మూటగట్టుకుని అక్కడినించి వెళ్ళిపోయింది.

తన గదిలోకి వెళ్ళి నౌకర్లకు హెచ్చరికలు జారీచేసింది : "ఆయన్ను జాగ్రత్తగా కనిపెట్టి వుండండి ; విడిచిపెట్టద్దు. ఈలోగా డాక్టరుగారుకూడా వచ్చి చూస్తారు. తప్పనిసరిగా అవసరం అని తోస్తే వచ్చి నన్ను కలుసుకుంటారు. నాకు తలనొప్పిగా వుంది ; అందుచేత అక్కడికి రాలేకపోయాననని చెప్పండి." నౌకర్లకు ఇలా హెచ్చరికలు చెప్పి తాను మంచంమీద పడుకుంది. బొమ్మలమూట అక్కడొక కుర్చీలో విసరిపారేసింది. ఆమెకు నిజంగానే తలనొప్పిగా వున్నది.

తరువాత డాక్టరు వచ్చాడు. రోగి పరిస్థితిచూచి చాల సంతోషించాడు. అప్పుడే ఇంత బాగా నయం ఔతుందని ఆయన అనుకోలేదు. రోగి మానసికస్థితికూడా బాగానేఉంది. నాడి బాగానే కొట్టుకొంటూంది. రక్తప్రసరణ నిర్దుష్టంగానే ఉంది. రోగిని అభినందించాడు. నర్సుకు ధన్యవాదాలు చెప్పాడు. తన కృషి ఫలించింది ; సంతోషంకలిగింది. కాగా వెంటనే వెళ్ళిపోడానికి ఉద్యుక్తుడుకాలేదు. ఇంటియజమానురాలితో కలిసి మాటాడ్డం అవసరమనుకున్నాడు. ఆమెకు ఒంట్లో కులాసాగాలేదని కబురు తెలిసింది. అందువల్లనే ఆమెను తప్పకుండా చూచి మరీ వెళ్ళాలని పట్టుపట్టాడు. చివర కతడు మోహిని సమక్షంలోకి వెళ్ళి తాను రోగిని చూచాననీ, చాల ఆరోగ్యంగా ఉన్నాడనీ కబురుచెప్పాడు. మోహిని గంభీరముద్ర

తాల్చి మంచంమీద కూర్చుంది. సుస్తీగావుండి లేవలేకపోయినందుకు క్షమాపణ చెప్పుకుంది. డాక్టరు తెచ్చిన కబురుకు సంతోషం ప్రకటించింది. అతడామెను అభినందించాడు. ఆమె అభినందనాన్ని అతనికే అప్పగిస్తూ "అంతా మీ దయే" అన్నది. "శరీరస్థితే కాదు, అతని మానసికస్థితికూడా చాల ఆరోగ్యంగా ఉన్నది—శాంతంగా, సౌమ్యంగా, ప్రసన్నంగా" అన్నాడు డాక్టరు. మందహాసయుతనమస్కారపూర్వకంగా ఆమె ఆ మంచికబురు గ్రహించింది.

"మీకు ఒంట్లో బాగాలేదని విన్నానే! ఎలావుందేమిటి?"

"ఏమీలేదులెండి. కొంచెం బద్ధకంగా వుంది; అంతే."

ఇంతలో నౌకరు ఒకడు ఫోన్ తెచ్చి ఆమెముందు బల్లమీద పెడుతూ "అయ్యగారు ఫోన్ చేస్తున్నారు. ఇంతకుముందుకూడా రెండుసార్లుపిల్చారు" అన్నాడు.

మోహిని ఫోన్ చేతిలోకి తీసుకుంది. "హలో!....మోహిని."

"ఏమిటికథ? ఒంట్లో బాగులేదుటగా! తలనొప్పి తగ్గిందా?"

"సుస్తీ ఏమీలేదు. బాగానే ఉన్నాను. కొద్దిగా నిద్రమత్తు అనిపించింది; అంతే."

"మిస్టర్ సహాయ్ గదిలో అందరం కలిసి టీ తాగుదాం అనుకున్నాం! ఏమంటావుమరి? ఎలావుంది అతని స్థితి?"

"డాక్టర్ గారు ఇక్కడే వున్నారు. ఫోను వారిచేతికిస్తున్నాను. మాటాడండి."

"వద్దు వద్దు, ఇదిగో! ఉహుఁ—"

కాని మోహిని ఫోన్ డాక్టరుచేతి కిచ్చేసింది. డాక్టరు సవిస్తరంగా చెప్పాడు: రోగి ఆరోగ్యంగురించి. ఆయన చెప్పినదంతా నరేశుడు ఓర్పుగా విన్నాడు; చివరకు మళ్ళీ ఫోన్ మోహినికివ్వవలసినదిగా కోరాడు.

"....అదేమిటి మోహినీ! అనవసరంగా పాపం, డాక్టరుగార్ని దిగబెట్టేశావేం? అసలు నేను చెప్పదలచుకున్న విషయం ఏమిటంటే: ఒకవేళ సాయంత్రానికి తేనీటిసమయంలో నేను హాజరు కాలేకపోయినట్టయితే నా పక్షాన నువు సహాయ్ కి క్షమాపణ చెప్పు."

"అలాగే."

"ఇదిగో! మిస్టర్ చద్దా నన్ను కొరుక్కు తినేస్తున్నాడు. ఇంత వరకూ మాటలతో జరుపుకొస్తున్నాను. ఇవాళరాత్రి డిన్నర్(విందు)కు పిలవనాయేమిటి ?"

"వద్దు."

"నేనూ అదే అనుకుంటున్నాను. వద్దులే. సాయంత్రంవేళకు అతన్ని ఇంకెక్కడికన్నా దారి తప్పించి తీసుకుపోతాలే. ఇక అంతే మార్గం. నువు మరోలా అనుకోకపోతే ఒక సంగతి చెబుతాను ; ఏదో ఉపాయం చెయ్యరాదూ : ఆ మహాశయుడు అక్కడినించి కదలిపోయేలాగు !"

"అలాగే....మీరెప్పుడు వస్తారు ఇంటికి ?"

"చెప్పలేను. నాకోసం కాచుకుని ఉండద్దు."

"సరే."

"డార్లింగ్ ! వాతావరణం ఇలావుంది మరి! ఎక్కువ శ్రమపెట్టుకోకు శరీరాన్ని. ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకో."

"థాంక్యూ ! (ధన్యవాదం !)"

ఫోన్ బందుచేసింది మోహిని. "డాక్టర్‌గారూ ! మీరోగి ఇప్పుడిక బాగా లేచి తిరగవచ్చునంటారా ?" అని అడిగింది పక్కకు తిరిగి.

"లేచి కొంచెమో గొప్పో అటూ ఇటూ తిరక్కుండా ఉంటే ఎలాగ ?"

"ఇప్పుడు టైమెంతైంది డాక్టరుగారూ ?"

"టైమా ? నాలుగున్నర."

"సరే....నమస్కారం డాక్టరుగారూ... " అంటూ మోహిని నౌకర్ని పిలిచి "టీ తయారుచేయించు. రెండు 'టీ'లు !" అని పురమాయించింది. మళ్ళీ డాక్టరువైపు తిరిగి అన్నది : "డాక్టరుగారూ ! మీరలా వెడితే ఆయనతో చెప్పండి : కొంచెం లేచి అటూఇటూ తిరుగుతూ ఉండాలి అని."

"తప్పకుండా చెబుతాను."

"ఉండండి, మీరుకూడా టీ తాగి వెళ్ళుదురుగాని !"

డాక్టరు ఉండలేదు. ధన్యవాదం చెప్పేసి వెళ్ళిపోయాడు.

డాక్టరు వెళ్ళాక ఆమె కొంతసేపు ఊరికేనే కూర్చుంది ఆలోచిస్తూ.

తాను ఏమి ఆలోచిస్తున్నదో ఆమెకే తెలియదు. చిక్కుపడ్డ దారాలవలె గజిబిజిగా వున్నాయి ఆలోచనలు. విడివిడిగా విస్పష్టంగా లేవు. అయినా ఆ యీ ఆలోచనవల్ల ప్రయోజనం ఏమీ లేదనిపించిందామెకు. మెదడు ఆలోచిస్తూఉంటుంది; జరిగేదేమో జరుతూనే ఉంటుంది. మన ఆలోచనలప్రకారం ఏదీ జరగదు. తనకు తానై అన్నీ జరిగిస్తూన్న శక్తి ఏదో బోధపడేదికాదు. ఈ జితేన్ సమస్య ఎంతకూ అంతుపట్టటంలేదు. ఎంత ఆలోచించినా చిక్కు విడటంలేదు. "ఎవరక్కడ ? ఇలా రా !" అన్నదామె హఠాత్తుగా. నౌకరు వచ్చాడు. "మన అతిథిగారువున్న గదికి వెళ్ళు. నేను పిల్తున్నానని చెప్పు. వెంటబెట్టుకుని తీసుకురా" అన్నది.

అది విని నౌకరు వెళ్ళిపోయాడు. కొంతసేపటివరకు మోహిని స్తబ్ధంగా కూర్చుంది. చివరకు లేచింది. ఇనుపపెట్టె తీసింది. అందులోనించి చిన్నపెట్టె ఒకటి తీసి మేజామీద ఉంచింది, కుర్చీలో పడివున్న రుమాలు మూట దానిమీద పెట్టింది. తాను మంచంమీద కాకుండా సోఫామీద వచ్చి కూర్చుంది. తాను తననించి విడివడటానికి వాంఛింది. కాని మనస్సు చంచలమైన వస్తువు; విద్రోహి. అది స్థిరంగా ఉండనే ఉండదాయెను.

నౌకరు తిరిగివచ్చాడు. "ఏం ?" అన్నది మోహిని.

"చెప్పానమ్మా !"

"వెంటబెట్టుకుని ఎందుకు తీసుకురాలేదూ ?"

"దయచెయ్యండి అని చెప్పాను అమ్మగారూ ?"

మోహినికి చాల కోపం వచ్చేసింది. "దయచెయ్యండి అని చెప్పటమేమిటి ? ఒక్కరూ ఎలా వస్తారనుకున్నావు ? ఈ గది అయన ఇదివరకెప్పుడేనా చూచారా అసలు ?"

నౌకరు సాశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు. అమ్మగారికి అంత కోపం రావటం అత డిదివరకెన్నడూ ఎరగడు. రెండుమూడు వాక్యాలు తప్ప ఆమె అధికంగా ఎన్నడూ మాటాడేదికాదు. "అలాగే అమ్మగారూ !" అన్నాడు నిర్ఘాంతపోయి.

"అలాగే యేమిటి ? వెళ్లు. అక్కడే వుండు. వెంటబెట్టుకు తీసుకురా."

నౌకరు వెళ్ళిపోయాడు. కాని ఎవరూ రాలేదు. తేనీరు వచ్చింది. అయిదారు నిమిషాలు గడిచాయి. తేనీరు చల్లబడిపోయింది. కాని ఎవరూ రానేలేదు. చాలసేపు బటన్ నొక్కి గంట మోగించింది. నౌకరు వచ్చాడు. లోపలి అవేశం అణచుకుంటూ అన్నది: "అతిథిగారిదగ్గరకు పోయి, తేనీరు చల్లారిపోతున్నదనీ, అమ్మగారు ఎదురుచూస్తూ కూర్చున్నదనీ చెప్పు."

ఆమె లేచింది. పెట్టెమీది రుమాలుమూట తీసింది. మూడు వస్తువులూ పెట్టెలో పెట్టేసింది. మళ్ళీ ఎదురుచూస్తూ కూర్చుంది. నిమిషంమీద నిమిషం దాటిపోతున్నాయి. ఇంతలో తన భర్తగారి ఆఫీసునించి బంట్రోతు ఒకడు వచ్చి సలాంచేశాడు; కవరొకటి ఇచ్చాడు. మోహిని ఆకవరు పుచ్చుకుని దానివైపు అదేపనిగాచూడసాగింది. అటు తిప్పింది, ఇటు తిప్పింది; చివరకు మొహరులోని అక్షరాలు చదవటానికి ప్రయత్నించింది.

"నాకిక సెలవా అమ్మగారూ!"

మోహిని తలెత్తిచూచింది. ఆజ్ఞ అయితే వెళ్ళిపోతానంటున్నాడు బంట్రోతు. "సరే, వెళ్ళు" అన్నదామె.

ఆ కవరు అలాగే కొంతసేపు చేతిలోనే పెట్టుకుని చూస్తూకూర్చుంది మోహిని. చూస్తూచూస్తూండగానే ఆమె మెదడుకు వేడెక్కింది. ఆమె లేచింది. విసురుగా లేచింది. ఆ లేవటంలో ఆమె పిక్కలు సోఫా అంచుకు అంటివున్నాయేమో అది తన చిన్ని చక్రాలమీద నాలుగైదు అంగుళాలు వెనక్కు జరిగింది. లేకపోతే ఎదురుగావున్న మేజానూ, ఆ మేజామీది టీ కప్పులనూ త్రోసిపారవేయాల్సివచ్చేది.

ఆమె లేచి, ఒక్క క్షణంకూడా ఆలస్యం చెయ్యకుండా మిక్కిలి వేగంగా అతిథివున్న గదివైపు వెళ్ళింది. గుమ్మందగ్గరవున్న నౌకరును వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించింది. లోపలికి వచ్చింది. మిథిలవైపు చూచి "నర్స్! దయచేసి నువు కొంచెం బయటికి వెళ్ళు" అన్నది.

అటువంటి కంఠస్వరం మిథిల ఇదివరకెన్నడూ వినలేదు. ఆమె తలెత్తి ఒక్కసారి మోహిని ముఖంలోకి చూచింది. ఇక ఒక్క క్షణంకూడా ఆలస్యం చెయ్యకుండా బయటికి వెళ్ళిపోయింది. మోహిని వెళ్ళి తలుపు లోపల గడియవేసి వచ్చింది.

జితేంద్రుడు మాట పలుకు లేకుండా ఇదంతా చూస్తూఉన్నాడు.

మోహిని గడియవేసి తిరిగి వచ్చింది. మంచంపక్కనే ఠీవిగా సాగి నిల్చుంది. చేతిలోని కవరు అతనిముందుకు విసరివేసింది. "ఏమిటిది? అడగవచ్చా నేను?"

గద్దిస్తున్నట్టుగా వున్నదామె కంఠస్వరం—"ఎటు తప్పించుకోటానికీ సావకాశం లేదు నీకు" అన్నట్టు. జితేంద్రుడు కవరు చేతిలో పట్టుకుని వున్నాడు. చించి చూడాలన్న ప్రయత్నమేమీ చెయ్యలేదు. ఆమె కంఠస్వరం లోని గద్దింపుకు విచలితుడైనాడు.

# 11

"ఏమిటిదీ అని అడుగుతున్నాను. ఈ యింట్లో వుంటూ మాకెవరికీ తెలుపకుండా ఎవరెవరినో పిలిపించుకుని మాటాడ్డం, ఎవరెవరితోనో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగిస్తూఉండటం.... ఇటువంటివ్యవహారంపనికిరాదు. ముందే చెప్పాను నీకు ఆ సంగతి. అయినా ఏమిటి ఈ ఆగడం?" అడిగింది మోహిని ఏపుగా నిల్చుని.

జితేంద్రుడు మెల్లిగా లేచి దిండు ఆధారంచేసుకుని కూర్చున్నాడు. ఆమెకువున్న తొందర, ఆవేశం అతనికి లేవు. కవరు అతనిచేతిలోనే ఉంది. అది విప్పేందుకుగాని, చదివేందుకుగాని అతడేమీ తొందరపడటం లేదు. "నీ ఉద్దేశం ఏమిటి ఇంతకూ?" అని అడిగాడు.

మోహిని నిల్చునేవుంది. "నీ ఉద్దేశం ఏమిటీ అని నేనడుగుతున్నాను."

"ఇక్కడినించి వెళ్ళిపోవాలని నా ఉద్దేశం."

"వెళ్ళిపోవచ్చు."

"కరుణించావు, బాగుంది.... ఇది నీదగ్గరే అట్టిపెట్టుకో" అంటూ జితేంద్రుడు కవరు ఆమెవైపు విసిరాడు. అది మోహినికి తగలకుండా క్రింద పడిపోయింది. మోహిని దాన్ని తీసుకోలేదు; దానివైపే చూడలేదు. జితేంద్రునివైపు చూస్తూఉంది.

"అది మొదట నీచేతికే చిక్కింది. నాకు ఇవ్వకుండావుంటే పోయేదిగా! నాకు వచ్చిన ఉత్తరం నాకిచ్చెయ్యటం తప్పుగాతోచే దాన్ని నలిపి,

చించి, తగలబెట్టెయ్యకపోయావూ ? తప్పు సరిదిద్దినట్టు అయేదిగా ! ఎందుకు చెయ్యలేదా పని ?" అడిగాడు జితేంద్రుడు.

మోహిని సాశ్చర్యంగా అతనివైపు చూస్తూ ఇలా అన్నది : "నీ ఉత్తరం నీకు ఇయ్యకుండానా ? అటువంటి పనులు నేను చేసేదాన్ని అనేనా నీ ఊహ ? ఇక్కడ వుంటున్నంతకాలం నువ్వు నన్నంతమాత్రం విశ్వసించవచ్చు" చూస్తూచూస్తూండగానే మోహినికి ఆవేశం వచ్చేసింది. "విశ్వసించలేవా ? సరేపోనీ ! నీ గొడవలతో, నీ హస్తలాఘవంతో ఇతర్లనుకూడా చిక్కుల్లో పెడతావేం ? అదేం పని ?"

జితేంద్రునికికూడా ఆవేశం వచ్చింది. "ఇతర్లనా ? అంటే నిన్ను చిక్కుల్లో పెడుతున్నాననేగా ! వచ్చిననాడే విస్పష్టంగా చెప్పానుకదూ నీకు. నన్ను ఇక్కడ అట్టిపెట్టుకున్నావు. చిక్కు నువ్వే తెచ్చుకున్నావు. నేను తలపెట్టిన కార్యకలాపాలు ఎటువంటివైతేయేం ? అవి మంచివో, చెడ్డవో నీతో చర్చించవలసిన అవసరంలేదు నాకు. ఒక దృష్టితో చూస్తే ఈ నీ తొందరపాటంతా తప్పే. కాని ఆ విషయం అలా వుంచు. అయిందేదో అయిపోయింది. నేటికి నీ అనుజ్ఞ అయింది. ఇంకా ఎక్కువకాలం నేనిక్కడ వుండేదిలేదు. తమరు నిశ్చింతగా ఉండండి."

"నిశ్చింతగా ఉండమంటూ నాతో చెప్పటానికి నీకు సిగ్గెలా లేకపోయిందో ! బైట పోలీసులు ఎలా వలలువన్ని పొంచివున్నారో నీకోసం ! తెలియదుకాబోలు నీకు ! నేనిక్కడ నిర్భయంగా కూర్చుని నిన్ను వాళ్ళకు వొప్పగించేసేదా ?.... ఉహుం. నువ్వు ఇవాళ వెళ్ళనక్కర్లేదు."

"ఏం ? ఎందుకు వెళ్ళనక్కర్లేదు ? నీకు ఇష్టం లేదనా ? నువ్వెవరు అసలు ?"

"జితేన్ ! నువ్వు నోరుమూసుకుని పడివుండలేవా ?" చాలకోపంగా అన్నది మోహిని.

"ఇక్కడ నాకీ ఖైదు అంత కఠినతరమైనదన్నమాట ! మాటాడేందుకూడా వీల్లేదేం ? ఎవర్నీ పిలిపించుకుని మాటాడకూడదు. ఎవరికీఉత్తరం రాయకూడదు. ఇప్పుడు తెలుస్తున్నది : నోరుకూడా మెదిలించటానికి వీల్లేదు. కేవలం ఈ యిల్లు నీది కాబట్టేనా ఈ ఆజ్ఞలన్నీని ?"

"జితేన్!" అణచుకుంటున్న తీవ్రస్వరంతో అరిచింది మోహిని.

జితేన్ నవ్వాడు. "భేష్, మేము స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నాం! భలే బాగుంది మా స్వాతంత్ర్యం! ప్రభుత్వాల్ని తలక్రిందులు చేస్తాం, ఈ ఆడవాళ్ళ ఆజ్ఞల్ని శిరసావహిస్తాం!"

"ఏమిటా పిచ్చివాగుడు జితేన్! స్పృహలో వున్నావా అసలు?"

"ఆఁ-ఆఁ. ఇంకా నేనిక్కడ ఉండవలసిన అవసరం లేనంత మంచి స్పృహలోనే ఉన్నాను. మీరు నాకోసం పడిన శ్రమకు—"

"జాగ్రత్త! ఈవిధంగా నువు వెళ్ళటానికి వీల్లేదు."

"ఏవిధంగా వెళ్లాలి మరి?"

"ఏవిధంగా వెళ్ళాలో ఆలోచిద్దాం. సక్రమమైన యేర్పాట్లు చేసిగాని నిన్ను పంపించటానికి వీల్లేదు. ఆతరువాత నువ్వేమన్నా చేసుకో, నీ ఇష్టం. ప్రస్తుతానికి నా పొరపాటువల్ల నువు పోలీసులకు పట్టుపడ్డావన్న మాట మాత్రం రాకూడదు."

"ఓహో! నువు నన్ను రక్షించాలని చూస్తున్నావన్నమాట! ఇప్పటికే నీ అనుగ్రహాలు చాలా పొందాను. వద్దు వద్దు. నా యేర్పాటు నేను చూచుకుంటానులే."

"ఇదిగో జితేన్!" మోహిని కంఠస్వరం ఆజ్ఞాపిస్తున్నట్టుగా ఉంది. "నీ సొంత యేర్పాట్లేమీ పనికిరావు ఇక్కడ. నా మోటారు నిన్ను ఈ జిల్లా దాటించి అవతల దిగబెట్టి వస్తుంది. ఆతరువాత నువ్వూ, నీ స్వాతంత్ర్యం, ఏమన్నాకాండి. అంతవరదాకామాత్రం కాస్త ఓపిక పట్టు. నువు ఇక్కడ ఉండదలచలేదని చెప్పావుకదూ! నేను ఉంచుకోదలచలేదుకూడాను. నిన్ను ఉంచుకోవాలని నేను అనుకుంటున్నట్టు నువు అపోహ పడబోకు. ఇప్పుడు నీకు జ్వరం నయమైంది. నీ క్షేమం నువు చూచుకోగలవు. నీ మూలాన నేను ఈయింట్లో నిత్యం ఒకఅబద్ధపుముసుగు కప్పుకోవలసివస్తున్నది. అది నాకు హర్షదాయకమైన విషయంకాదు. బైట ఎక్కడో నీవు, నీ అనుచరులు మీ మెడలకు మీరు బిగించుకోటానికి నాగపాశాలు ఉచ్చులు పన్ని అట్టిపెట్టుకున్నారు. వెళ్లి ఆ ఉచ్చుల్లో పోయి పడుదువుగాని. ఇంకానిన్నెంతకాలమో నేనిక్కడ ఆపను. ఎవడి కర్మ వాడు అనుభవించక తప్పుతుందా?

ఒకరి కర్మను ఇంకొకరు తప్పించలేరు. కాని నువు ఇక్కడ వచ్చి పడ్డావు. కాబట్టి నామూలాన నీకు ఆపద సంభవించకూడదు. నువు బాగా తెలిసిన వాడివే.ఆమాట అంటూంటే నాకే సిగ్గౌతున్నది.ఎందువల్లనంటే....ఇద్దరమూ ఒకప్పుడు ఒకేచోట చదువుకున్నాంకదూ! నాకు తెలుసు: నువు నన్ను చిక్కుల్లో దించవు అని. అయినా నాకు అర్థంకావటంలేదు; ఏమిటి ఇలా అయిపోతున్నావు —"

వెంటనే జితేంద్రుడు అందుకుని ఇలా అన్నాడు: "మోహినీ! నువు శ్రీమతివి. బుద్ధిమంతురాలివైనావు. సంభ్రాంత మహిళవు. సంసారబాధ్యతలు గలదానివి. కులగౌరవం, మర్యాద కాపాడవలసినదానివి. నాకు తెలుసు. కాని అందువల్ల నామీద అనుగ్రహం చూపించటానికి పూనుకోకు. నీ సర్వస్వం నీదగ్గరే సురక్షితంగా ఉంటుంది. నీ గౌరవాని కేమాత్రమూ భంగం రాదు. నన్ను అంతమాత్రం విశ్వసించు. ఎవడికైతే నువు ఈ జిల్లాబైటికి తీసుకుపోయి విడిచిపెట్టి వద్దామనుకుంటున్నావో వాడే స్వయంగా వెళ్ళిపోతాడు దూరంగా....నీ ఊహకందనంత దూరంగా. ఏదో వచ్చాను ఇక్కడికి. ఎందుకంటే—నీలో ఏకొంచెమైనా మిగిలివుందేమో ననుకున్నాను. కాని చూచానుగా, అయిపోయింది. మళ్ళీ ఆ పొరపాటు నేను చెయ్యను. నువు ఏ ప్రపంచంతో సంబంధం కలిగివున్నావో ఆప్రపంచంతో నా కేవిధమైన సంబంధమూలేదు. నా ప్రపంచం వేరు. అక్కడ సుఖం, విశ్రాంతి అనేవి నామమాత్రంగాకూడా లేవు. నువు సుఖంగా హాయిగా ఉన్నావు; చూచాను. ఉండగలవు అలాగ. సరే, ఇంకా నాకు తెలుసుకోవలసిందేమీలేదు. కాబట్టి ఇక నువు వెళ్ళిపో. నావిషయమైగాని, నన్ను పంపించే ఏర్పాట్లవిషయమైగాని నువ్వేమీ ఆలోచించనక్కర్లేదు. ఆ గొడవ పెట్టుకున్నావంటే ఒట్టు, చెబుతున్నాను. నాగపాశాలు ఉచ్చులు నేను పోసుకున్నాను. నా కర్మ నేనే అనుభవిస్తాను. నీ కొంగు వాటినుండి దూరంగా, పవిత్రంగా ఉండుగాక! సరేనా? ఇంకా నీకేంకావాలి చెప్పు. గౌరవం కావాలి; పవిత్రత కావాలి; ఔనా?....నేను పొరపాటే పడ్డాను మోహినీ! అటువంటి వస్తువులన్నీ నీకు నచ్చవు అనుకున్నాను. వాటిని మించి నీకు కావలసింది వేరే ఉన్నదనుకున్నాను. పూర్వపురోజులు దాటిపోయాయిగా! అప్పుడు....పోనీ, ఇప్పు

దెందుకా సంగతులు ? విస్మృతిలో పడిపోయాయి ; అదే మంచిది. అవన్నీ చిన్నతనపు కలలని ఇప్పుడు నువు భావిస్తున్నట్టున్నావుకదూ ! అదంతా పట్టి పనికిమాలిన భావుకత, నేలవిడిచిన సాము అనేగా నీ ఉద్దేశం ? ఆనాటి తలపు లన్నీ పటిష్ఠములైనవికావు ; భ్రమతోకూడినవి ; అంతేనా మోహినీ ! నా మాట నిజమేకదూ ! ఇప్పుడు నీదగ్గర సామర్థ్యం, పటిష్ఠత ఉన్నాయి. నా వంటి మనిషివి కాదు నువు ఇప్పుడు. హోదాగలదానివి అయినావు. గౌరవ నీయురాలి వనిపించుకున్నావు. పుస్తకాలన్నీ నీవి అవతల పారేసివుంటావు. రచన, కవిత్వం — అన్నీ వొదులుకుని వుంటావు. అవన్నీ చిన్నతనపు పనులు. అంతేనంటావా ? ఇప్పుడు నీకు 'సొసైటీ' (సమాజం) ఉంది ; గృహబాధ్యతలు ఉన్నాయి ; సంపన్నవర్గానికి ఉండే మానమర్యాదలు ఉన్నాయి. పూర్వం అయితే హద్దుల్లో ఇముడని తలపులు ఉండేవి ; అవే మన సమస్తప్రపంచంగా అనిపించేవి. ఇప్పుడవేమీ లేవు. ఎందువల్ల ? అవి అసత్యాలు గనుక ? అసత్యాలేకదూ అవి ? అన్నీ అబద్ధాలేగా? నువు ఇప్పుడు పరమసత్యంలో కుదురుకున్నావు. కాబట్టి అవన్నీ పచ్చి అబద్ధాలే. ఆడుతూ పాడుతూ, నవ్వుతూ పేలుతూ, సుఖసంతోషాల్లో తేలియాడుతూన్న వారి మధ్య ఉంటున్నావు నువ్విప్పుడు. మీకు కావలసినవన్నీ విస్తారంగాఉన్నాయి. దుస్తులు, సామానులు అన్నీని. బోలెడంత ఆదాయం. ఆటలు, పాటలు, నవ్వులు, వినోదాలు, సుఖాలు, ఆనందాలు ఇటువంటి సత్యపదార్థాల్లో కాల క్షేపంచేస్తున్నావు. ఇవే సత్యం, నిత్యం కదూ ? ఇకపోతే మిధ్యాతుల్యము లైన తదితరవిషయాలతో నీకేంసంబంధం? సరే కానీ, నిన్ను నేను కాదనటం లేదు, నిన్ను నేను అడ్డగించేదీలేదు. నీదారినే నువు పో. జితేన్ అనేవాడిని నువు మరచిపో. నేను జితేన్‌ను కాదు ; నువు ఎన్నడూ ఎరగని సహాయ్‌ని. అలాగే అనుకో....నీ మార్గానికి వ్యతిరేకమైనపని నువ్వెందుకు చెయ్యాలి ? అదేమిటి ! కుర్చీ లాక్కుని కూర్చోవాలనే ఆలోచన కలిగిందేమిటి నీకు ? అలాగే నిల్చున్నావంటే ఎత్తునించి జారే చీవాట్లు, మందలింపులు ఎక్కువ జోరుగా వస్తాయి."

మోహిని వంగి కవరు అందుకున్నది. ఎదురుగా కుర్చీలోకూర్చుంది.

చెయిచాచి ఉత్తరం అతనిముందు మెల్లిగా ఉంచింది. "తీసుకో. చదువుకో, అందులో ఏముందో."

"చాల్లే నీదయ!....చదువుకోవలసిన అవసరం ఏం లేదు."

"ఎందుకనీ?"

"దానికి జవాబు రాయవలసిన అవసరంకూడా లేదు."

మోహిని చిరునవ్వు నవ్వింది. "కోపగించుకోకు. ఆ వుత్తరంలో ఏముందో తెలుసుకోవలసిన అవసరం నాకు ఉంది."

ఉత్తరం అలా దూరంగానే పడివుంది. జితేంద్రుడు దాన్ని తాకనైనా లేదు. "అక్కడే వుందిగా. తీసి చదువుకో" అన్నాడు.

మోహిని నవ్వింది. "ఇదిగో జితేన్! చదవాలనుకుంటే తీసి చదువుకోగలను. నువు అనుకుంటున్నావేమో—"

"లేదు లేదు. నేనేమీ అనుకోటంలేదు. అదిగో తీసుకో ఉత్తరం. దాన్ని నాకు ఇవ్వనక్కర్లేదు. అదేదో పెద్ద కుట్రకు సంబంధించినదని అనుకుంటున్నావుకాబోలు! ఏమికుట్రో ఏమిటో సంగతి తెలుస్తుందిగా! తీసుకుని పట్టుకుపో. ఇంకా నువ్విక్కడ కూర్చోనక్కర్లేదు."

కాసేపటివరకూ మోహిని మౌనంగానే ఉన్నది. చివరకిలా అన్నది: "మూడునాలుగురోజులనించీ నీలో మార్పు కనిపిస్తున్నది. సంగతేమిటో చెప్పు: నాలో ఏంచూసి నీకంత కోపం వస్తోందో...."

"నేనే ఒక ఖైదీని. నాకు కోపం ఏమిటి నా మొఖం? కోపం వచ్చి మాత్రం ఎవర్ని ఏంచేస్తాను గనక?"

"ఔను. కోపంవల్ల అయేదేమీ వుండదు. కోపం అనేది దుఃఖాన్ని మాత్రమే ప్రసాదిస్తుంది. ప్రసాదించటం ఏమిటి? తనే స్వయంగా దుఃఖంగా మారిపోతుంది. నువ్వంతటనువ్వే ఇక్కడినించి వెళ్ళిపోటానికి ప్రయత్నించబోకు. అందువల్ల చాల ఇబ్బంది ఉంది. నాకు చాల దుఃఖం కలిగించినవాడివౌతావు." అన్నది మోహిని ఆర్ద్రకంఠస్వరాన.

ఆమెకంఠస్వరంలోని ఆర్ద్రత అతన్ని స్పృశించింది, అన్నాడు: "నువ్వెందుకు మనస్సును కష్టపెట్టుకుంటావు మోహినీ! నాకు వుండే ప్రమాదాలు నాకు ఉంటాయి; దానికేం? కాని నేను నీకు అనర్థదాయకుడివౌతున్నానన్న

వ్యాకులత నా మనస్సులోనించి తీసివేయగలవా? నామూలాన నీమనసుమీద ఎంత మిక్కుటమైన బరువు పడిందో నాకు తెలియదా? పైగా నాపేర వచ్చే ఉత్తరాలన్నీ నీయింటికే వస్తున్నాయి. ఈ ఉత్తరం ఇలా వచ్చిందంటే నేను నిర్దోషినని చెప్పుకోటంలేదు. అసలు దోషం అనేది నాస్వభావంలోనే వుంది. నిర్దోషంగా నేను ఉండలేను. నా స్వభావంనించి నేను వేరైపోవటం నాచేత కాదు. నా దారివేరు. ఇలా ఇప్పుడు నీదారికి నేను అడ్డంరావటం నాదే పొరపాటు. ఇద్దరువ్యక్తు లున్నారంటే ఎవరిమార్గం వారిదే. తెలిసికూడా నేను ఇలా చేశానేమిటి? మనకు వృత్తిలో భేదం; భిన్నవర్గాలకు చెందినవాళ్ళం; అంతా భేదమే. అయినా నాకేమన్నా పిచ్చెత్తిందా? ఏదో ఆత్మీయత అనుకుంటూ కూర్చున్నానేమిటి ఇక్కడ! క్షమించు. నా మార్గాన్ని నేను ఎలా త్యజించగలను? కాని నేను నా మార్గాన వున్నంతకాలం ఉత్తరాలు, ఒకటి కాదు, బోలెడన్ని వస్తూనే ఉంటాయి. నాతో కలిఫి మాటాడేందుకు అనేక మంది వస్తూనేఉంటారు. కాని అవన్నీ ఇక్కడ సాగటానికి వీల్లేదుగా! ఆ సంగతి నువ్వూ చెబుతున్నావు; నేనూ గమనించాను. కాని అవన్నీ సాగటానికి వీల్లేకపోతే ఇక నేను చెయ్యవలసిన పనేమిటి? నాకేం బోధపడటం లేదు మరి! సుఖశాంతిసంయుతమైన యీ మీ ప్రపంచాన్ని పెల్లగించి పారెయ్యటం....అదే నా పని. అంతకుమించి వేరేపని నాకేమీ లేదు. మీ రనుభవిస్తూన్న ఒక్కొక్క గుప్పెడు సుఖం వేలాది ప్రజల్ని దుఃఖాగ్నిలోకి నెంటి వేస్తున్నది...."

"ప్రస్తుతానికి లెక్చర్ ఆపులే జితేన్! మరొకప్పుడు చెపుదువుగాని. ఇక నేను వెళ్ళాలి."

"చాల సంతోషం. వెళ్ళిపో. ఒంటరిగా ఉండనీ నన్ను."

మోహిని కొంచెం గంభీరముద్రతాల్చింది. "జితేన్! అందరికీ ఒకటే మార్గం ఉండదనీ, ఒకరొకర్ని చిన్నచూపు చూడ్డం మంచిదికాదనీ నువు అన్నమాట సముచితమే. ఇందాక తేనీటికి పిలిస్తే రాలేదేం?"

"ఎందుకు రావాలి? అదే ఆలోచించవలసిన విషయం. ఎంత ఆలోచించినా నాకేం కారణం కనిపించలేదు. అందుచేత రాలేదు."

"మావారికి చాల కష్టమనిపించింది."

"నీకు కష్టం అనిపించలేదుగా! నాకు కావలసింది అంతవరకే."

"జితేన్! నువ్వు ప్రతివిషయాన్నీ వాదనలోకి ఈడుస్తావేం? నీకు మొదటినించీ వున్న అలవాటే అది. ఇప్పుడు మరీ ఎక్కువైపోయింది."

జితేన్ చిరునవ్వు నవ్వాడు. నీరసమైన చిరునవ్వు! వ్యంగ్యభరితమైన చిరునవ్వు! "చూస్తున్నాను: నువ్వు మంచి మంచి ఉపదేశాలు ఇవ్వగలవు. కృతజ్ఞుడను."

"జితేన్! ఏమిటది మరీ అలా అయిపోతున్నావు?"

"ఏమీలేదు. దయచేసి ఇక వెళ్ళు."

"ఔను. నేను వెళ్ళవలసిన పనీ ఉంది. కాని ఇందాకనే మావారు ఫోనులో మాటాడారు. పోలీసు సూపరింటెండెంటును ఏదోవిధంగా దారి తప్పించి ఏ రెస్టారెంటుకో తీసుకువెళ్ళారు. లేకపోతే ఎకాయెకి ఇక్కడికే వచ్చి వుండేవాడు. నీ క్షమావేశాలూ, నీ ఉత్తరాలూ ప్రమాదాన్ని మరీ సన్నిహితంచేస్తాయి! ఇంతమాత్రం తెలుసుకోలేవేం?"

"దయచేసి తమరు వెళ్ళండి."

"సరే, నువ్వుమాత్రం భయపడబోకేం...."

"నమస్కారంచేస్తాను, వెడుదురూ!"

"జితేన్!"

"అబ్బ! వెళ్ళండీ, వెళ్ళిపోండి!"

--

"ఇక్ష్...! నేను తలుపు తీసేస్తున్నాను" అంటూ లేచాడు జితేంద్రుడు.

మోహిని ఏమీ చేయలేకపోయింది. జితేంద్రుడు మంచందిగి, తివాచీ మీద నడుచుకుంటూ వెళ్ళి గడియతీశాడు. అక్కడే నిలబడి బైటికి చెయి చూపిస్తూ "ఊఁ, దయచేయండి" అన్నాడు.

క్షణమాత్రంగా మోహిని స్తబ్ధచిత్తయై కూర్చుంది. పరిస్థితితిలకించి వెంటనే లేచింది. నిశ్శబ్దంగా గదిలోనించి బైటికి వెళ్ళిపోయింది. వెంటనే జితేంద్రుడు తలుపు మూశాడు. గడియవేశాడు. తిరిగివచ్చి పక్కమీద పడుకోకుండా ఇటునించి అటు, అటునించి ఇటు పచార్లు చేయసాగాడు.

గదిలో సగభాగం ఖాళీగానే ఉంది. మిగతాభాగం తివాచీ పరచివుంది. ఆ మూలనించి మంచందగ్గరికి ఖాళీనేలమీద ఎన్ని అడుగులు పడుతున్నాయో లెక్కించుకుంటున్నాడు. చాలసార్లు లెక్కబెడుతూ నడిచాడు. ప్రతిసారీ లెక్కమారకుండా అన్నే అడుగులు పడుతున్నాయి. అది అతనికి ఆశ్చర్య మనిపించింది. కొంతసేపటివరకూ అలా పచార్లు చేస్తున్నాడు. ఆసమయంలో అతనికా గదిగాని. గదిలోని వస్తువులుగాని ఉన్నట్టేలేదు. ఆ అడుగుల్లో తన మార్గాన్ని కొలుస్తున్నట్టుగా వున్నాడు. ఇంతలో మళ్ళీ మామూలు ప్రపం చంలోకి వచ్చాడు. గది, గదిలోని వస్తువులు స్ఫృహకు వచ్చాయి. మంచం పట్టెమీద పడివుంది ఒక కవరు. కనిపించింది. వెంటనే దాన్ని అందుకు న్నాడు, చదివాడు. కొంతసేపు దానిమీది చిరునామా చూస్తూ ఉండిపో యాడు —చప్పున అర్థంకాలేదేమో నన్నట్టు. చూస్తూచూస్తూండగానే అతని మనస్సులో ఒక సంకల్పం నిశ్చయమైపోయింది. కాళ్ళకు స్లిప్పర్లు తొడు క్కున్నాడు; తలుపుతీసుకుని బైటికి వచ్చాడు.

మోహిని తన గదిలోకి వెళ్ళింది. తేనీటి సామగ్రి ఇంకా అక్కడ అలాగే వుంది. బటన్‌నొక్కి జోరుగా గంట మోగించింది "ఏమిటి? ఇవన్నీ ఇలాగే వుంచావేం?" అని నౌకరుమీద కోప్పడ్డది. "మళ్ళీ తేనీరు పట్టుకురా! ఏదైనా తింటానికికూడా...." అని ఆజ్ఞాపించింది. ఆనాడు అంతవరకూ తాను భోజనం చెయ్యలేదన్న విషయం గుర్తుకువచ్చింది. భర్త ఒంటరిగానే గబగబా కాస్త ఎంగిలిపడి వెళ్ళిపోయినట్టున్నాడు. తానేం చేస్తూంది? ఏం చేసిందో ఏమో తనకే అర్థంకాలేదు. నౌకరు ట్రే తీసుకు పోయాడు.. ఆమె సోఫాలో కూలబడ్డది. మేజామీద సొమ్ములపెట్టె అలాగే వుంది. ఇనుపపెట్టెలోనించి అది బైటికి ఎలా వచ్చిందో ఆమెకు వెంటనే స్ఫురణకు రాలేదు. చేసేపని ఏమీ లేకపోయినందువల్ల ఆమె సొమ్ములపెట్టె తెరిచింది. ఒక్కొక్కవస్తువే అందులోనుంచి తీసి చూస్తూ కూర్చుంది. చూడ్డం, మేజామీద విడిగా పెట్టటం-అదీ పని. సొమ్ములన్నీ మంచి కాంతి వంతంగా ఉన్నవి; చాల విలువైనవికూడాను. చూస్తూచూస్తూండగానే మేజాబల్ల యావత్తూ ఒక చక్కని ప్రదర్శనరంగం అయిపోయింది.

ఈ సమయంలో వచ్చాడు అతిథి లోపలికి. అతడిలా వస్తాడని మోహిని అనుకోనేలేదు. తాను వస్తున్నట్టు ముందు కబురుచెయ్యకుండానే అప్పటికప్పుడు సంకల్పించుకుని అతడు వచ్చాడు. మోహినిరవంత అసమంజసస్థితిలో పడిపోయింది. సిగ్గుపడ్డది. చేతిలోని నగ పక్కన పెట్టేసింది. మర్యాదార్థంగా కూర్చున్నచోటునించి లేవబోయింది. ఇంతలోనే అతడామెను సమీపించి "ఇదిగో మీవస్తువు అక్కడ మరచిపోయి వచ్చారు" అంటూ కవరు ఆమె ఒడిలో వేశాడు.

"కూర్చో" అన్నదామె కవరు అందుకుని.

అతిథి కుర్చీ వెనుకభాగంమీద మోచేతులు ఆనించి కొంచెంగా వంగి "వద్దు వద్దు. నేను మీకు శ్రమకలిగించను. నేనుండగా నా ఎదుటనే మీరు ఆ ఉత్తరం విప్పి చదవాలని నా కోరిక" అన్నాడు.

"కూర్చోరాదండీ, టీ వస్తోంది."

"మీరు చదవకపోతే ఇలా ఇవ్వండి, నేనే చదివి వినిపిస్తాను."

"సరే, అది చూద్దాంలెండి. కూర్చోండి ముందు" అంటూ మోహిని లేచింది.

"ఎక్కడికి వెడుతున్నావు ?"

మోహిని కూర్చున్నచోటునించి లేచి మేజా చుట్టుతిరిగి వచ్చి, ఆ కుర్చీ కాస్త ముందుకు లాగి, దానిమీదవున్న మెత్త చేత్తో దులుపుతూ "ఇలా కూర్చోండి, నేను ఇప్పుడే వస్తున్నాను"అంటూ గదివిడిచి లోపలికి వెళ్ళింది.

అతన్ని ఆ గదిలోకి తెచ్చి దిగబెట్టిన నౌకరు వెంటనే వెళ్ళిపోయాడు. అతడు వెనక్కు తిరిగి చూచాడు; ఎవరూ లేరు. ఎదురుగా చూచాడు; అక్కడా ఎవరూ లేరు. అతడు ఇంకా నిలబడే వున్నాడు. ఎదురుగా మేజామీద సొమ్ములపెట్టె తెరచివుంది. ఆ సొమ్ముల పేర్లన్నీ అతనికి సరిగా తెలియవు, కాని అవి అతని కన్నులను ఆకర్షించాయి. కొంచెంసేపు వాటివంక చూస్తూ నిల్చున్నాడు. చివరకు చూపులు మరలించుకుని గదిచుట్టూ చూచాడు. ఒకపక్కన టెలిఫోను ఉంది. దానికి చేరువగా ఇనుపపెట్టె చాల పెద్దదే ఉంది. దాని తలుపులు ఓరగా వేసివున్నాయి. చూపులు అటు వెళ్ళాయో లేదో, వెంటనే తిరిగి వచ్చేశాయి. మనసులో ఏదో ఆలోచన

తట్టింది. ఒక్క క్షణం అనిశ్చితంగా వుండిపోయాడు. చివరకు గబగబా ఇనుపపెట్టెదగ్గరకు నడిచి వెళ్ళాడు. దాని తలుపులు రెండు చేతులతో పట్టుకుని లాగి తెరిచాడు. ఒక్కసారి పైనించి కిందికి, కిందినించి పైకి పరికించాడు. మళ్ళీ తలుపులు మూశాడు. పక్కనేవున్న టెలిఫోను అందుకున్నాడు. టెలిఫోన్ ఆఫీసుద్వారా ఎక్కడికి కావాలో అక్కడికి కనెక్షన్ తెచ్చుకున్నాడు. ఎవరితో మాటాడుతున్నాడో మనకు తెలియదు. ఇక్కడనించి తాను ఇలా చెప్పాడు: "నాకు ఆరోగ్యంగానే ఉంది. అంతా సవ్యంగానే సాగుతున్నది. ఇంకా నేనిక్కడ ఉండిపోవలసిన అవసరం లేదు. ఇవాళే, ఔను, రాత్రి మూడుగంటలకు. రెండు కార్లు కావాలి; నువ్వేమీ అడగబోకు; చెప్పినట్టు చెయ్యి. రెండు కార్లు; సుమారు రెండు, మూడు గంటల మధ్య. అంతే....ఆc. అంతా సవ్యమే...."

గబగబా ఒక్క నిమిషంలో చెప్పేశాడు ఇదంతా. వెనక్కు తిరిగి చూచాడు. ఎవరూ లేరు చుట్టుపక్కల. సొమ్ములన్నీ విడివిడిగా పడి వున్నాయి మేజామీద. గదిఅంతా నిశ్శబ్దంగావుంది. మోహిని ఇంకా రాలేదు. బహుశా టీ పట్టుకు రావటానికివెళ్ళింది కాబోలు! అతడు తిన్నగా మేజాదగ్గరకు వచ్చాడు, సొమ్ములవంక చిత్రంగా చూస్తూ నిల్చున్నాడు.

ఇంతలో మోహిని వస్తున్నట్టు చప్పుడైంది. అతిథి అటువైపు తిరగలేదు. సొమ్ములన్నీ ఒక్కొక్కటే అటు త్రిప్పి, ఇటు త్రిప్పి చూస్తున్నాడు తన్మయుడై.

మోహిని లోపలికి వచ్చింది. టీ ట్రే బల్లమీద పెడుతూ "టీ వచ్చేసింది, రా కూర్చో" అన్నది.

అతడప్పుడు కంఠహారం చేతిలో పుచ్చుకుని పరికిస్తున్నాడు. మోహిని వైపు తిరిగి "ఇవన్నీ నీవేనా?" అని అడిగాడు.

"ఔను నావే" అన్నది మోహిని ప్రసన్నముఖియై.

"పెళ్ళిలో పెట్టినవా?"

"కొన్ని తర్వాత చేయించుకున్నవీ ఉన్నాయి. రావేం? కూర్చో."

అతడు కంఠహారాన్ని యథాస్థానంలో పెట్టేశాడు. వచ్చి కుర్చీలో

కూర్చుంటూ అన్నాడు. "పెళ్ళిలో చాలానే దొరుకుతాయల్లేఉందే! నిజంగా పెళ్ళి అనేది మంచిదేనేమోనని తోస్తున్నది. ఏం మోహినీ!"

మోహిని నవ్వింది. "ఎంతమంచిదో ఏమో నీకేం తెలుస్తుంది. నువు ద్రాక్షపళ్ళు పుల్లన అంటావులే....ఊఁ టీ కలపనా?"

"థాన్క్యూ! (ధన్యవాదాలు!)" అంటూ 'కెటిలు' (తేనీటిపాత్ర) లోనించి రెండు కప్పుల్లో టీ డికాక్షన్ పోశాడు అతిథి. మోహిని పాలు పోసింది—"రెండా?" అని అడుగుతూ.

"రెండు, మూడు, నాలుగు, ఓపిక ఉన్నన్ని. ఉల్లాసభరితమైన అవకాశం దొరికినప్పుడు నేను వెనక్కు తగ్గేవాడినికాదు. ఎంతముందుకు కావాలంటే అంతముందుకు పోగలను."

"సరే పుచ్చుకో. ఇప్పటికి రెండు కప్పులు చాల్లే, ఇంత ఘాటైన పానీయం కొద్దిగానే పుచ్చుకోవాలి. జితేన్! నువు ఎందువల్ల ఇంత ఘాటుగా తయారైనావు?"

"ఎదురుగానే ఉన్నావుగా! పోనీ, ఘాటుగా కాకపోతే తియ్యగానే తయారుచెయ్యరాదూ! నీచేతిలో చిక్కివుంటే తియ్యగానే తయారుచేసి వుండేదానివి. సరేగాని....ఇదిగో ఉత్తరం; విప్పి చదవమన్నావా? లేక అందులో ఏముందో చెప్పనా? నువు తరువాత తీసి చదువుకుందువుగాని! ఏం? చెప్పనా?"

"చెప్పు."

"నేను ఎప్పుడు వచ్చేదీ తెలియజెయ్యమని రాశాడు. డబ్బుకావాలిట—అదీ ఉత్తరంలోవున్న విషయం."

మోహిని ఆ మాటలు విన్నది. "ఇదిగో, ఇది పుచ్చుకో. నువ్వేమీ తినటమేలేదేం అసలు!" అంటూ ప్లేట్ అతని ముందుకు నెట్టింది.

ప్లేట్లోనించి తీసికొని కొంచెం తింటూ "డబ్బు ఎందుకు కావలసి వచ్చిందో అడగవేంమరి?" అన్నాడు.

"నేనెందు కడగాలి?"

"ధనం మీదగ్గరే వుందని మా అందరి వుద్దేశం."

మోహిని నవ్వింది: "మీకు ఇవ్వటానికి కాదుగా!"

జితేంద్రుడుకూడా నవ్వాడు. "మేముమాత్రం తీసుకోటానికే ఉన్నాం!"

"అదే తమాషా మరి! అందుకనే న్యాయచట్టం ఏర్పడింది. మాకు ఇవ్వటానికి ఇష్టంలేనంతకాలమూ మీ 'తీసుకోదలచినవాళ్ళం'తా అలా దూరంగా ఉండిపోవలసిందే. మిమ్మల్ని అలా దూరంగా ఉంచేందుకే న్యాయచట్టం."

"కాని నేను మరి దగ్గరికే వచ్చేశానే. అంటే తప్పు అయిందన్న మాట. అయింది మరి! ఇంక చేసేదేముంది?"

మోహిని నవ్వింది. "అయిందేమోలే! కాని నువ్వేమీ తినటంలేదేం? ఈ 'సాండ్‌విచ్' (ఒకరకమైనపండివంట) జబ్బుతో ఉన్నవాళ్లుకూడా తినవచ్చు. నేనుమాత్రం తినకుండా ఊరుకోలేను బాబూ! నీమూలాన నేను ప్రొద్దుటినించీ ఆకలితో చచ్చిపోతున్నాను."

అతిథి కొంచెం సాండ్‌విచ్ తీసుకుని నోట్లో పెట్టుకున్నాడు. కాని అన్యమనస్కుడులా కనిపించాడు. "ఈ ఉత్తరంలో పోలీసులనుగురించి కూడా వుంది మోహినీ! ఏమేమి యేర్పాట్లు చేసుకుని ఎలా ఎలా ఎక్కడెక్కడెక్కడ పొంచివున్నారో — ఆ సమాచారమంతా ఉంది."

మోహినీ అని అతడు సంబోధించిన కంఠస్వరం వినేసరికి ఆమె తలెత్తి అతనివైపు చూచింది.

"అప్పుడప్పుడు నాకేమనిపిస్తూవుంటుందో చెప్పనా మోహినీ! ఎందుకీ జంజాటమంతా, చప్పున చచ్చిపోతే బాగుండునే అనుకుంటూ వుంటాను."

"జితేన్!"

"ఔను మోహినీ! లూటీలు, దొంగతనాలు, అన్నీ తుందుడుకు వ్యవహారాలేగా! ఇంతకంటే మనిషి చచ్చిపోతే మంచిదికాదూ!.... ఇదిగో, కొంచెంగా తాగేందుకు పిసలైన పానీయం ఏదైనా ఉందా? టీ కాదు."

"ఏం కావాలి? నవ్వుతూ అడిగింది మోహిని.

"కొంచెమైనాసరే చాలు; తాగి, అమ్మయ్య అని తృప్తి అనుభ

వింపగల పానీయం కావాలి. ఉంటే కొంచెంగా తెచ్చిపెడుదూ! చాలరోజులైంది రుచిచూచి; నిజంగా మోహినీ!"

"ఇంకా నీకు సరిగా బలం చేకూరలేదు."

"అందుకనే అడుగుతున్నాను మోహినీ! ఔను, బలం రావాలి; బోలెడంత పని వున్నది చెయ్యవలసింది. నన్ను వేధించబోకు; వెతికి పట్టుకురా...."

మోహినిహృదయం కరిగింది. కొన్ని చుక్కలతోమాత్రమే తృప్తి పడాలిసుమీ అని షరతుపెట్టింది. వెళ్ళి షాంపైన్ తీసుకువచ్చింది. తెచ్చింది గాని సీసా అతనిచేతికి ఇవ్వలేదు. కొన్ని చుక్కలుమాత్రం పోసి ఇచ్చింది. వాటితో అతనికి తృప్తి కలుగలేదు. ఇంకా కొన్ని చుక్కలు బ్రతిమాలి పోయించుకుని తాగాడు. మోహిని సీసా చేతిలో పుచ్చుకుని దూరంగా వెళ్ళి నిల్చుంది. "ఇంకొక్క చుక్కకూడా నేను ఇవ్వను జితేన్. ఊహుఁ. ముందు వెనుకలు చూడవేం?" అన్నది.

"నీకు తెలియదులే మోహినీ! నా శరీరం నీరసంగా వుంది. నాకింకా చాల బలం కావాలి. చాల బలం కావాలి. బయట ఎంత పని వున్నదను కున్నావు?"

ఇంతలో టెలిఫోనుగంట మోగింది. మోహిని వెళ్ళి విన్నది. అవతల వైపు భర్తమాటాడుతున్నాడు. "మిస్టర్ చడ్డా వట్టి మూర్ఖంగా ప్రవర్తిస్తున్నాడు. నాతోపాటు ఇంటికికూడా వచ్చేట్టుగానే ఉన్నాడు. నువు ఇప్పుడేమి చేస్తున్నావు?"

"టీ త్రాగుతున్నాను....మన అతిథిగారుకూడా ఇక్కడే వున్నారు నా గదిలో."

ఈ మాట విని అతిథి తాను కూర్చున్నచోటునించి లేచాడు. చెప్పకుండా వెళ్ళిపోడానికి ఉద్యుక్తుడైనాడు. వెళుతూవెడుతూ విన్నాడు మోహిని ఫోనులో భర్తకు చెబుతున్న వాక్యాలు: "ఏమిటీ?....ఔను, నేనే పిల్చానండీ!....చెబుతున్నాను కదూ నేనే పిల్చాననీ...." ఆతరువాత ఇంకా ఆమె ఏమిచెప్పిందో వినిపించటానికి, అతడక్కడ వుంటే కదూ! వెళ్ళేపోయాడు.

మోహిని ఫోనులో మాటాడుతూనే ఉంది. "నాకిక్కడ వంట్లో కులా

సాగా లేదని చెప్పండి అతనితో. వచ్చే ఆదివారం రమ్మనండి. ఆనాడు బ్రిడ్జి ఆటకూడా వేసుకుందాం."

ఫోన్ బందుచేసి ఆమె వెనక్కు తిరిగిచూచింది. అతిథి వెళ్ళిపో యాడు ; లేడక్కడ.

# 12

ప్రపంచంలోనే చాల ప్రపంచాలు ఉన్నాయి. మనిషిలో చాలమంది మనుషులు ఉన్నారు. అసలు చైతన్యంలోనే ఒకదానిపై ఒకటిగా పొరలు చాల ఉన్నాయి. అందుచేత అసలు తత్త్వమనేదినిర్దిష్టమూ, నిశ్చితమూ కాదు; దానికి ఒక రూపమూ లేదు. అది ఏమిటో చెప్పనలవికాదు.'అనిర్వచనీయం' అనవలసిందే. ఉన్నది ఒక్కటే; కాని వ్యక్తమై, దృశ్యమానం కావలసి వచ్చేసరికి భిన్నత్వం గోచరమౌతున్నది. ఇది ఒక జగత్తు అని భావిస్తున్నాం; ఈ భావనబట్టే ఇది జగత్తు ఔతున్నది. భావం అనేది మాయ. కనుక జగత్తు అనేది మిథ్య. తత్త్వము మాయావృతమయ్యే ఉండక తప్పదు. 'నేను ఉన్నాను, నువు ఉన్నావు' అని భావించుకుంటూ మనం అనుభవిస్తూన్న ఆనందానికి హేతువు అదే. అదే భ్రమ. ఎవరి భావాల్నిబట్టి వారు నడుచు కుంటూ వుంటారు. అందుచేత ఎప్పటికప్పుడు కొత్తకొత్త పేచీలు ఉత్పన్న మౌతూ ఉంటాయి. బహుశా 'ఉనికి', 'ఉండుట' అనేవి భ్రమలే కావచ్చు....సరే, ఎందుకీ గొడవ ? ఈ ఊహాపోహలవల్ల ప్రయోజనం ఏమిటి ?

అతిథికి జబ్బుగా వుండినందువల్ల ఒక నర్సును నియమించటమైంది. ఆ పక్కనే ఆమె పడుకోటానికి ఒక గది వుంది. మూడునాలుగు రోజుల నించీ రోగి పరిస్థితి చాల బాగానే ఉంది. 'ఇక అనుక్షణమూ కనిపెట్టుకుని వుండనక్కర్లేదు; నేను త్వరలోనే వెళ్ళిపోవచ్చు' అని నర్సు అనుకుంటూ ఉన్నది. ఈమె ఒక చిత్రమైన వ్యక్తి. కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉన్నాయి ఆమెలో. ఎంతో అణకువగా, నమ్రతగానే ఉంటుంది. కాని ఎంతో లోతు గల మనిషి. ఆమెకు కళ్ళేవున్నాయి; నాలుక లేదు. నాలుకలేని నారీమణి

అంటే నమ్మటానికి వీల్లేని విషయం. కాని ఈమాట ఈ నర్సువిషయంలో ఋజువయిందనే చెప్పాలి. "ఈ రోగి కేవలం రోగిమాత్రిమే కాదు; ఏదో విశేషం ఉంది ఇతనిలో" అని ఆమె కంటికి కనిపిస్తూనే ఉండేది. కాని ఆ 'విశేషం' ఏమిటో త్రవ్వి తెలుసుకుందామని ఆమె అభిలాషపడదు. కాని ఆ 'విశేషం' అనబడేది దానంతట అదే ఆమె కన్నులముందు వచ్చి నిల బడుతోంది...తన్ను తాను బట్టబయలుగా ప్రస్ఫుటంచేసుకుందామనే కోరు కుంటున్నట్టు. ఆమె కన్నులు ఎలాచూస్తూ ఉంటాయో, చెవులు అలా వింటూనే వుంటాయి. నాలుకమీదినించి మాటపలకటానికి కావలసిన శక్తి కూడా చూడ్డానికీ, వినటానికీ వినియోగపడుతుంది కాబోలు! ఆ కళ్ళు లోతులు చూడగలవు; ఆ చెవులు నిశ్శబ్దాన్నికూడా వినగలవు.

సాయంత్రం అతిథి తన గదిలోకి తిరిగి వచ్చాడు. అతనిలో ఏదో మార్పు వచ్చినట్టు నర్సు చూచింది. అతని కన్నుల్లో కొత్త వెలుగొకటి ఉన్నది. ముఖకవళికలో కాఠిన్యత ద్యోతకమౌతున్నది. అది గమనించి నర్సు తన పని తాను చూచుకుంటూ ఉండిపోయింది. పలుకరించలేదు.

రోగి ఆమెను దగ్గరకు పిల్చాడు. మెల్లిగా, తియ్యని కంఠస్వరాన ఇలా అన్నాడు ఇంగ్లీషులో, చిరునవ్వు చిలుకుతూ: "నేనిప్పుడు బాగా ఆరోగ్యంగానే ఉన్నానుకదూ! నువు చూపిన అనుగ్రిహానికీ, పడిన శ్రమకూ చాల కృతజ్ఞుడను సిస్టర్! ఇన్నాళ్ళతరువాత నువు ఇక హాయిగా విశ్రాంతి తీసుకోవచ్చు."

ఇంత ఆప్యాయంగా అతడు ఇదివరకెన్నడూ ఆమెతో మాటాడి వుండలేదు. ఆమె ఒక్కటేముక్కలో జవాబు చెప్పింది: "ధన్యవాదం!"

"నీకు ఏమి ఇవ్వటానికీ నాకు శక్తిలేదు. అందుకు నేను చాల విచా రిస్తున్నాను. కాని నిన్ను నేను మరచిపోను సిస్టర్!"

ఇలా మాటాడుతున్న రోగి పరిస్థితి ఆమెకు అవగాహన కాలేదు. "మీకు నేను అభ్యంతరప్రాయంగా వుండకుండా నా గదిలోకి నేను వెళ్ళి పోవాలనా మీ వుద్దేశం?" అని అడిగింది.

ఇది అసంగతమైన ప్రశ్నలా అనిపించింది. రోగి ఆమె ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు. "అలాచేస్తే నువు చాల దయచూపించిన దాని వౌతావు" అన్నాడు చివరకు.

ఆమాట విని నర్సు తనలో తాను నవ్వుకుంటూ అచ్చోటు వీడి పోతున్నది. గుమ్మంవరకు వెళ్ళకముందే రోగి ఆమెను మళ్ళీ పిల్చాడు "నేను ఇప్పుడక్కడినించి బాగా కడుపునిండా తినే వస్తున్నాను. ఈరాత్రికి నాకిక అన్నపానాలేమీ అక్కర్లేదు. మీరు నన్నేమాత్రం డిస్టర్బు చెయ్యబోకండి" అని చెప్పాడు.

నర్సు ఆమాటలు విన్నది. మారు పలుకలేదు క్షణమాత్రంగా అక్కడ ఆగింది. తరువాత గుమ్మందాటి వెళ్ళిపోయింది. ఆరాత్రి ఆమెకు సరిగా నిద్ర పట్టలేదు. ఆమె ఏవిధమైనఅలికిడీ వినలేదనిచెప్పజాలదు. కాని తనకర్తవ్యపు హద్దులు దాటి వెళ్ళవలసిన అవసరం ఆమెకు కనిపించలేదు. రాత్రి ఇంకా మూడవజాము దాటకముందు జరుగరాని సంఘటన ఏదో జరుగుతున్నట్టుగా ఆమెకు అనుభూతమయింది. సూచనలను ఆమెకు గాలి అందజేస్తున్నట్టుగా ఉంది ! అకారణంగా, అనిర్దిష్టంగా అతీంద్రియశక్తిద్వారా ఆమె కా ఆభాస లభిస్తున్నదేమో ! కాని ఆమె లేవలేదు ; ఏమీచెయ్యలేదు. రాత్రి గడిచిపోయింది ; తెల్లవారింది. గదిలోనించి బైటికే రాలేదు. తెల్లవారినతరువాత కూడా ఆమె ఏమాత్రమూ తొందరపడలేదు. ప్రొద్దెక్కింది. సుమారు ఎనిమిది గంటలయాక కాబోలు ఆమె రోగిగదిలోకి వెళ్ళింది. ఆమెకు ఆశ్చర్యం కలిగింది—ఊహూఁ, ఆశ్చర్యంకలగలేదు—రోగి గదిలో లేడు. తన కర్తవ్యం కాబట్టి అన్నిచోట్లా వెదకి చూచింది. నిన్న సాయంత్రంనించి ఇప్పటివరకూ గడిచిన కాలాన్ని సమాలోచన చేసుకుంటూ ఒంటరిగా గదిలోనే నిల్చుంది కొంతసేపు. తన కర్తవ్యం కాబట్టి యజమానురాలికి కబురు చెప్పేందుకు లోపలికి వెళ్ళింది.

యజమానురాలు రోజూ తొందరగానే లేస్తుంది. స్నానాదికృత్యాలన్నీ నిర్వర్తించుకుంటుంది. ఆమెకు ప్రత్యేకం ఒక గది ఉంది. గదేమిటి, అభ్యంతరమందిరం అనవచ్చు. ప్రసాధనమందిరమైనా, పూజాగృహమైనా అదే. పూజాపునస్కారాల అలవాటు ఆయింట్లో లేదు. అందుచేత ఆమె దాన్ని తన అభ్యంతరమందిరంగా ఉపయోగించుకుంటోంది. ఎవ్వరికీ తెలియకుండా ఆమె అందులో ప్రతిరోజూ ఒక అరగంటసేపు నిశ్శబ్దంగా కూర్చుంటుంది. ఆమె లోపల చీరో, సొమ్ములో సింగారించుకుంటున్నదని ఇతర్లు

అనుకుంటూ వుంటారు. వాళ్ళు అలా అనుకోవటమే ఆమె మనస్సుకు తృప్తి. అందులోకి వచ్చేందుకెవరికీ అనుమతిలేదు.

నర్సు బైటనే నిల్చుని ఆమెకోసం ఎదురుచూస్తున్నది. ఆమెకన్నులు తీక్షణంగా వున్నాయి. ఆచూపులు అటూ ఇటూ తిరుగుతాయి ; చూచినట్టే ఉండవు ; కాని సమస్తం చూస్తాయి. నర్సుకు బహుశా తెలుసునేమో ! మౌనంగా ఎదురుచూస్తూ నిల్చుంది.

మోహిని గదిలోనించి వచ్చింది. తల విరబోసుకుని వుంది. వొంటి మీద చీరతోపాటు కేవలం ఒక్క రవికమాత్రమే తొడుక్కుంది. బొమ్మ లేమీ లేవు. అంతకుముందే స్నానంచేసింది. శుచిగా, శాంతంగా, గంభీరంగా వుంది ముఖకవళిక. అది చూచి వివేకవతి మిథిల రవంత చకిత అయింది.

మందహాసపూర్వకంగా మోహిని ఇంగ్లీషులో అడిగింది : "ఏమిటి చెల్లెలా ! ఇలా వచ్చావు ?"

"మేడమ్ ! గదిలో రోగి లేడు ; కనిపించటంలేదు" అన్నది మిథిల ఇంగ్లీషులోనే.

మోహిని విన్నది ; కాని సంగతి ముమ్మందు తెలుస్తుందిలే అన్న భావంతో కాబోలు ముఖవైఖరిలో ఏవిధమైన భావమూ ప్రకటించలేదు. అలా మామూలుగానే నిల్చుంది.

నర్సే మాటాడవలసివచ్చింది. "అక్కడంతా వెదకి చూచాను. ఇక్కడికేమైనా వచ్చారేమో ననుకున్నాను...."

మోహిని నవ్వింది : "ఇంకా అతనికి బాగా ఆరోగ్యం చిక్కలేదను కుంటున్నావా యేమిటి ?....నువు ఎప్పుడు లేచావు ?"

"ఇంతకు ముందే, ఒక అరగంట ఔతుంది. నా గదిలోనించి లేచి వెళ్ళి చూచాను."

"ఇంతకు ముందేనా ?...." అంటూ మోహిని చిరునవ్వు నవ్వి ఊర్కుకుంది.

నర్సుకు కష్టం కలిగింది. తాను మతిమంతురాలిననే ఆమె నమ్మకం. కాని మోహిని అలా నవ్వుతుందేం ? ఏమిటి ఆమె భావం ? ఓడిపోయిన

మనిషికి వలె ఆమె హృదయంలో విద్వేషం రగులుకోసాగింది. ఒక్క క్షణంసేపు పెదవి కదల్చకుండా మోహినివైపు చూచింది.

"నీకు నేను ఎంతైనా కృతజ్ఞురాలను మిథిలా! నీచేతి పరిచర్య చాల దుర్లభమైనటువంటిది. నువ్వేమీ విచారపడనవసరంలేదు. నీరోగి——" అంటూ మోహిని మిథిలవైపు చూచింది——"ఇంకా నీ పరిచర్య స్వీకరించ వలసిన స్థితిలో లేడు. బహుశా నువు తొందరగా వెళ్ళాలనుకుంటున్నా వేమో! మోటారు సిద్ధంగానే వుంది. నీకెప్పుడు అవకాశంగావుంటే అప్పుడే వెళ్ళు. అయ్యగారితో చెప్పాను. 'పేమెంటు' (నీకు ఇవ్వవలసిన డబ్బు) వారే ఇచ్చేస్తారు."

అంటూ మోహిని మిథిలతో కరచాలనం చేసి వీడ్కోలు చెప్పింది.

మిథిలకు ఆశ్చర్యమైంది. కాని ఆశ్చర్యప్రకటనకైనా అవకాశం ఏదీ? మోహిని అక్కడ ఆగకుండా మరోగదివైపు వెళ్ళిపోయింది. ఈ వ్యవహారం మిథిలకు చిన్నతనమనిపించింది. కాని తన మనోభావం ఏమాత్రం పైకి కనిపింపనీయలేదు. అక్కడనుంచి బయలుదేరి గృహయజమానిగారి గదివైపు వెళ్ళింది. అక్కడ వున్న నౌకరు చెప్పాడు అయ్యగారు స్నానం చేస్తున్నారు అని. మిథిల కొంతసేపు ఎదురుచూస్తూ ఉండింది. చివరకు అయ్యగారు వచ్చారు. కాని ఆమెవైపు ముఖం తిప్పి చూడనేలేదు. అద్దంలో టై సరిగ్గా ఉన్నదో లేదో చూచుకుంటూ "ఏమిటి సిస్టర్!" అనిఅడిగాడు.

వెంటనే ఏమి మాటాడ్డానికీ తోచలేదు మిథిలకు. అయ్యగారు అద్దంలో ముఖంచూచుకుంటూనే "'క్విక్ సిస్టర్!' తొందరగా! సంగతేమిటో ఒకటి రెండు ముక్కల్లో చెప్పేసెయ్యి" అన్నాడు.

నర్సు జంకుతూ గొంకుతూ వుండిపోయింది. నరేశుడు వెనక్కు తిరిగాడు——కోపం ముంచుకొస్తున్నవాడువలె.

నర్సు చెప్పనారంభించింది: "తమ మిత్రుడు, ఆయన...."

"ఊం, అయితే?"

"——బహుశా వెళ్ళిపోయినట్టున్నారు."

"'దట్స్ గుడ్!' మంచిది. నీకు ధన్యవాదాలు సిస్టర్!"

"చి త్తం. ఆయన——"

"నువ్వు చేసిన సేవ నిజంగా ప్రశంసించతగింది....సరే, సిస్టర్!" అంటూ నర్సుని అలా వొదిలేసి మరోవైపు నడిచి వెళ్లాడు.

నర్సు ఇంకా చేసేదేముంది? అక్కడినించి వెళ్ళిపోవలసిన పరిస్థితి ఏర్పడింది. వెంటనే తన గదికి వెళ్ళింది. తన వస్తువులు, సామానులు అన్నీ సర్దుకుని, సిద్ధంగానేవున్న మోటారులో ఎక్కి తన ఇంటికి వెళ్ళిపోయింది. లోలోపల మనసులో మంటగానే వుంది—తాను ఓడిపోయినట్టు, తన బుద్ధి చాకచక్యాన్ని ఎవరో అపహరించినట్టు.

* * * *

ఇవాళ ఉదయంనించీకూడా మోహినికి మనస్సేమీ బాగులేదు. రాత్రి కూడా బండపెట్టినట్టు బరువుగానే ఉండిందేమో! ఉదయాన్నే లేచి మెల్లా లోకి వచ్చి చూచేసరికి ఘోరమైన సందేహం ఒకటి మాడు పగలగొట్టినట్టు మెదడులో ఉత్పన్నమైంది. జరగకూడని సంఘటన ఏదో జరిగినట్టు తోచింది. గది అంతా కలయజూచింది. గుర్తులన్నీ స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నాయి; కాదనుకోటానికి అవకాశం ఎక్కడా లేదు. తాను నమ్మలేకపోతున్న ఆ సంశయమే మనసులో ఉద్బుద్ధమై, క్రమేణా విస్తరించి, 'ఔను నిజమే' ననిపించేట్టుగా తయారైంది. ఈ సంశయాన్ని మనసులోనించి సమూలంగా తీసివెయ్యాలనే అప్పటికీ ఆమె ఆతృత. తొందరగా ఇనుపపెట్టె దగ్గరకు వెళ్ళింది. తలుపులు ఇట్టే వచ్చేశాయి లాగేసరికి. ఎంత నేర్పుగా తీశాడో మరి తాళం! ఎక్కడా దెబ్బగొట్టినట్టుగాని, సొట్ట పడినట్టుగాని లేనేలేదు. సొమ్ములపెట్టె బయటికి తీసి చూచింది. దానిలో డబ్బీలు చాల మాయమైనాయి. మిగిలినవి చిందరవందరగా పడివున్నాయి. ఆ డబ్బీలు తెరచి చూచింది. వాటిలోని వస్తువులు యథాతథంగానే వున్నాయి. ఇక సొమ్ముల పెట్టె ఇనుపపెట్టెలో పెట్టేసింది. మెల్లగా అతిథి గదివైపు నడిచి వెళ్ళింది. అతిథి లేడక్కడ. ఇంకా చీకటిగానే ఉంది. తాను అటు వచ్చినట్టు ఎవరూ చూడలేదు. తలుపులు మూసివేసి తిరిగి వచ్చేసింది. ఎవర్నీ నిద్ర లేపలేదు; ఏమీ అడగనూలేదు. ఎవరికంట పడకుండా, అతి రహస్యంగా, ఇంతపని ఎలా జరిగిందీ అని ఆమెకు ఆశ్చర్యం కలిగింది. దొంగతనం అనేది అంత తేలికైనపనేంకాదే! బంగళాబైట ఇరవైనాలుగు గంటలూ ఛౌకీదారు

ఉంటాడే! ఏం ముసించింది వాడికి? నౌకర్లంతా ఏమైనట్టు? పైగా ఈ నర్సు ఎంతో మతిమంతురాలే! ఆమెకేం వచ్చిందీ? ఏమైనా మోహిని ఏమాత్రమూ వ్యగ్రత ప్రకటించలేదు. తిన్నగా తన గదికి తిరిగి వచ్చేసింది. మనసులో మాత్రం చాల కష్టంగానే ఉంది. ఎవరో తనను ఒక్క పిడికిలి పోటు పొడిచి, తనలోని అమూల్యవస్తువేదో ఎత్తుకుపోయినట్టు బాధగానే వుంది లోపల. కొంతసేపటివరకూ ఆమె కేమిచేయటానికీ తోచలేదు. దొంగలు, దొంగలని బిగ్గరగా కేకలువేద్దామా అన్నంత ఆందోళనగా వుంది కడుపులో. కాని ఆమె అలా కేకలు వేయలేదు. భర్తనుకూడా లేపలేదు. ఏమీ చేయలేదు. అలవాటుప్రకారం స్నానాది కాలకృత్యాలు నిర్వర్తించుకుని పూజాగృహంలో వెళ్ళి కూర్చుంది.

ఆమె పూజ ఎలా చేస్తుందో, ఏమైనా చదువుతుందో మనకు తెలియదు. ఏమిచెయ్యాలో, ఎలా చెయ్యాలో మనకేం తెలుసు? భగవంతుడంటే ఎవరో, అతన్ని ఎలా ఆరాధించాలో మనం ఎరగం. ఎదురుగా ఎవరన్నా వుంటే అతనితో ఏదన్నా చెప్పుకోటం పెట్టటం సాధ్యమౌతుంది. కాని భగవంతుడితో ఎవడుగాని, ఏదిగాని చెప్పుకోటం పెట్టటం ఎలా సాధ్యమో మనకు బోధపడదు. ఉనికిగలవాడైతే మనం ప్రార్థించగలం. ఉనికితెలియనివానిని ప్రార్థించటం, పూజించటం కొంతమంది ఎలా చేస్తారో ఆభగవంతునికే తెలియాలి. కాని మోహిని గంట గంటన్నరసేపు అలాగే కూర్చునివుంది. చివరకు బైటికి రాగానే మిథిల కనిపించింది. ఆ యిద్దరి సంభాషణ ఇదివరకే చదివాం.

రోజుకన్నా ఇవాళ ఆలస్యం అయింది. అందుకు తానేదో తప్పుచేసినట్టనిపించింది. ఇంతసేపటినించీ నరేశుడు ఏం చేస్తున్నట్టు? ఆమె వెంటనే తేనీరు, ఫలహారాలు తయారుచెయ్యమని వంట మనిషికి పుర్మాయించి భర్త గదివైపు వెళ్ళింది. "ఏమండీ! ఇవాళ నాస్తా చెయ్యటానికి రారా ఏమిటి?" అన్నది గుమ్మంలోనించే.

"వస్తున్నా; వస్తున్నా."

ఆజ్ఞాపాలనవ్యగ్రత గర్భీకృతమైవున్న అతని పలుకులకు ఆమె సిగ్గు

పడ్డది. కాని "చప్పున లేచి రండి మరి! ఎంత పొద్దెక్కిందో తెలుసా?" అన్నది దురుసుగా.

"మీరు మరీ సోమరిపోతులండీ!...." అంటూ ఇలాగ కొన్ని కఠిన మైన మాటలే అనాలనిపించిందామెకు. కాని ఇంత ఆలస్యం కావటానికి నిజంగా తనదే తప్పు అన్న భావంతో అంతదూరం వెళ్ళలేకపోయింది.

సాధారణంగా లోపలి వరండాలోనే నాస్తాచేయటం అలవాటు. "లోపలి వరండాలోకి రండి" అన్నది మోహిని వెడుతూ.

"చిత్తం, అలాగే."

మోహిని వరండాలోకి వచ్చింది. మేజామీద ఆ ఉత్తరం అలాగే పడివుంది. చూచి ఆమె చకితురాలైంది. ఉదయం ఆమె దృష్టికి అది తగ లనేలేదా? అప్పుడే దాన్ని అక్కడినించి ఎందుకు తీసివెయ్యలేదు? ఏమో, తనకే అర్థంకాలేదు. వెంటనే ఉత్తరం చేతిలోకి తీసుకుంది. అట్టె చూచింది దానివంక ఒక్క క్షణంసేపు. ఇప్పటివరకూ ఆమె వంటిమీద ఒక్క రవిక మాత్రమే ఉన్నది. తలవెంట్రుకలు విరబారి వున్నాయి. కుర్చీమీదవున్న మెత్త ఎత్తి ఉత్తరాన్ని దానికింద పెట్టేసింది. ఆకుర్చీలో తానే కూర్చుంది.

"అదేమిటి? ఏమన్నా అలిగారా యేమిటి? వెంట్రుకలు అలా విర బోసుకున్నారేం? పేదవాళ్ళమీద కాస్త దయచూపండి మరి!....అన్నట్టు.... ఇందాక వచ్చిందామె....మీ మిథిల...." అంటూ భర్త వచ్చాడు.

"ఎవరూ?"

"మిథిలేకదూ ఆవిడపేరు? ఏమిటో చెప్పింది మరి! నేను సరిగా వినిపించుకోలేదు....ఏమిటి కథ ఇవాళ! అచ్చం దేవకన్యలా ఉన్నావు సుమీ! వల్కలాలేగాని, దుకూలాలు ఎరగనట్టు...."

ఇంతలో ట్రే పుచ్చుకుని నౌకరు వచ్చాడు.

నౌకరు వచ్చాడన్న ధ్యాసే లేదా ఆమెకు? లేక, అతడు మనిషి కాదు, ఒక యంత్రం అనుకున్నదా? బిగ్గరగా అంటున్నది భర్తతో: "అంత పసందుగా ఉన్నానా?"

"వాహ్‌వాహ్, ఏం అడుగుతారు....ఏం చెప్పమంటారు....!"

నౌకరు ట్రే అక్కడ పెట్టేసి వెళ్ళిపోయాడు.

"ఊం, ఏమిటి కథ? సెలవివ్వండి."

"అతడు వెళ్ళిపోయినట్టున్నాడు."

"ఎవరు? మీ మహాశయుడా? ఆసుపత్రినించి డిశ్చార్జి (విడుదల) కావటానికి అనువైన ఆరోగ్యం చేకూరిందిగా!"

"ఆఁ...." మెల్లిగా అన్నది మోహిని.

"భేష్, మంచిపనే చేశావు. నిన్న అనుకున్నాం; ఇవాళ చేటగొట్టేశావు. శహబాష్, ఇక చడ్డాగాడు రానీ, వాడి బాబు రానీ...."

మోహిని టీ కలుపుతున్నది. ఆ యీ ఫలహారాలు విడివిడిగా ప్లేటులో అమర్చి అతనిముందు పెట్టింది. టీ కప్పు కూడా అతనిముందు ఉంచింది. తానుకూడా ఒక కప్పులో టీ కలుపుకుని కొంచెం కొంచెం చప్పరిస్తూ కూర్చుంది. ఏమీ మాటాడలేదు.

"చెప్పేశాను 'మా బేగంసాహెబాకు వొంట్లో బాగాలేదు ఇవాళ, వచ్చే ఆదివారం విందుకు వద్దువుగానిలే' అని. గింజుకున్నాడు చాల. కాని ఏం చేస్తాడు?....సరేగాని ఆ మహాశయుడిని నువు ఎలా పంపించేశావు చెప్పు. ఇలా తప్పుకునే మనిషిలా కనిపించలేదే నాకు!"

"ఆరోగ్యం కలిగిందికదూ?....మిథిల ఏం చెప్పిందీ?" మెల్లగా అడిగింది మోహిని.

"ఏమో, ఏం చెప్పిందో! అటువంటివాళ్ళ నోట్లో నోరుపెట్టడం నాకు ఇష్టం ఉండదు. ఆమె ఏమి చెప్పిందో ఎవడు విన్నాడు అసలు!"

"నామీద ఏమీ నేరంచెప్పలేదూ?"

"వోయ్, నాతోనా?"

"మీకు కళ్లు ఎక్కడవుంటాయో ఏమో! మీ యిల్లంతా దోపిడీ అయినాకూడా మీకు చీమకుట్టదా యేమిటి?" కోపంగా అన్నది మోహిని.

"నా యిల్లు అయితే కదూ రాణీగారూ! ఎవరియిల్లు దోపిడీ అయితే వారి యిల్లేపోతుంది. మీరు స్థిరంగాఉన్నారు; మాకు అదే పదివేలు."

విని మోహిని మొగం చిట్లించింది. తనపై భర్తకు అంత తిరుగులేని నమ్మకం వుండటం దుస్సహమనిపించిందేమో!—"ఇదంతా కాపలా కాస్తూ కూర్చోటం నాకు చేతకాదండీ. కాస్తా కూస్తా? లంకంతయిల్లా!

ఇంటినిండా నౌకర్లా! ఈ గదులన్నీ కనిపెట్టుకుని చూస్తూ వుండటం నావల్ల కాదబ్బా! పైగా ఎక్కడపడితే అక్కడ బోలెడంత సరంజామా. పనికి వచ్చేవి, పనికిరానివి ఎన్నోసామానులు! కొద్దిపాటి యిల్లు, కొంచెంగా సామాను ఉంటే ఏభయమూ లేకుండా హాయిగా వుండవచ్చునే! ఈమాట మీకెన్నాళ్ళకీ తోచదా అసలు! ఉచ్చనీచాలతో విభక్తమైన యీ లోకంలో అడుగడుక్కీ ఈ అంచనాలు, మాటమాటకీ బడాయిలు, గౌరవమర్యాదల సవాళ్ళు...."

"మోహినీ! ఏమిటిదంతా? నీకేమన్నా...." అన్నాడు నరేశుడు ఒక్క నిట్టూర్పు విడిచి.

మోహిని ఒక్క క్షణంసేపు ఊరుకుని ఇలా అన్నది: "మీరేమీ తినరేం? అలా ఊరికే కూర్చున్నారేం? ఇది రుచిచూడండి కొస్త!"

నరేశుడు ఆ చూపిన పదార్థాన్ని తీసి మొత్తం నోట్లో వేసుకున్నాడు. నమిలి మింగుతూ "ఊఁ, సరేనా? ఇక చెప్పు సంగతేమిటో!" అన్నాడు.

మోహిని మాటాడలేదు. ఖాళీకప్పు అందుకుని అందులో టీ పోస్తున్నది.

"అదేమిటి? ఇంకా పోసేస్తున్నావేం?"

"తీసుకోండి, వేడిగానే ఉంది."

నరేశుడు మరి మాటాడలేదు. నిండుకప్పు ముందరికి తీసుకున్నాడు. కొంచెం కొంచెం చప్పరిస్తూ కూర్చున్నాడు.... మోహిని ఏం చెబుతుందో విందామని ప్రతీక్షిస్తూ. కాని మోహిని హృదయంలోని సందడి ఎవరికి తెలుసు? పైకి ప్రశాంతంగానే ఉన్నా లోపల బడబానలం రగులుకుంటోంది. నరేశుడు టీ చప్పరిస్తూ మౌనంగానే వున్నాడు. వ్యస్తచిత్తయై మోహినీ మౌనంగానే ఉంది. నిశ్శబ్దంగా కొంతసేపు గడిచింది.

"చడ్డాను పంపించండి, సాయంత్రం ఎప్పుడైనాసరే" అన్నది మోహిని హఠాత్తుగా, అసంగతంగా.

"చడ్డానా? అతన్ని నువు ఎరగవుగా!"

"ఇదివరకు చూచే వుంటాను. కనిపిస్తే గుర్తుపట్టగలను. అతడు మన అతిథివిషయంలో చాలకుతూహలంగా వున్నాడుగా. అతనికి ఆరోగ్యం

చిక్కి ఇక్కడినించి వెళ్ళిపోయాడన్న సంగతి మనమే ముందు చెపితే బాగుండదూ ?"

"నేను చెబుతాలే."

"కాదు కాదు. ఇక్కడికే పంపించండి."

నరేశుడు నవ్వాడు. "సరే అయితే. కాని ఒక్క సంగతి: నువు గనక డిప్లొమేటిక్ సర్వీస్‌లో చేరావంటే వాళ్ళంతాకూడా నిజంగా నీ ప్రజ్ఞకు దిగ్భ్రాంతిచెందవలసిందే."

"ఇంకేం, చేర్పించండి డిప్లొమేటిక్ సర్వీస్‌లో. జీతం వెయ్యిరూపాయలు. చేర్పిస్తారా మరి !" అన్నది మోహిని నవ్వుతూ.

"అమ్మో, ఇప్పటికే మాపని అంతంతమాత్రంగా ఉంది. అప్పుడైతే రాణీగారి తలపులోకికూడా రాకుండా పోనూ ? వద్దులెండి." అంటూ నరేశుడు కూర్చున్నచోటునించి లేచాడు. మోహిని కూర్చున్న కుర్చీకి వెనుకగా వచ్చి నిల్చున్నాడు. ఆమె తల నిమురుతూ అన్నాడు: "యూమస్ట్ నాట్ వర్రీ మోహినీ! యూ మస్ట్ నెవరీ వర్రీ! (నువు మనస్సుకు వ్యథపెట్టుకోకు మోహినీ! ఏమాత్రం వ్యథపెట్టుకోకు!)"

ఈమాటలకు మోహిని కరిగిపోయింది. అతని చేయి పుచ్చుకుని తన బుగ్గకు అంటించుకుని కూర్చుంది. ఏమీ మాటాడలేదు.

కృతజ్ఞతాభావం నిండిపోయిన హృదయంతో నరేశుడూ అలాగే నిల్చున్నాడు. చివరకు అక్కడినించి కదిలి ముందుకు వచ్చాడు. "ఇక నేను వెడతాను, మోహినీ! అలాగే పంపిస్తాను చడ్డాను."

నరేశుడు వెళ్ళిపోతున్నాడు. "మాట, ఇలా రండి" అన్నది మోహిని. అంటూ కూర్చున్నచోటునించి లేచి, నరేశుని ఇనపపెట్టె దగ్గరకు తీసుకుపోయింది. తలుపు తీసింది. సొమ్ములపెట్టెను చూపిస్తూ "దాన్ని ఇవతలికి తీయండి" అన్నది.

నరేశుడు తీసి, ఆజ్ఞాపాలనంచేస్తున్నవాడల్లే మెజామీద పెట్టాడు.

"పెట్టె తెరచి చూడండి."

నరేశుడు పెట్టె తెరిచాడు.

"అలా చూస్తారేం? అందులో వస్తువులు తీయండి.

నరేశుడు ఒక్కొక్క డబ్బీ వ్రేళ్ళతో స్పృశించాడు. ఇటూ అటూ కదిలించిపెట్టాడు.

"సరే, ఇక నేను వెడతాను."

"చూచారా ? అన్నీ ఉన్నాయా ?"

"ఎందుకు ఉండవు అన్నీ ? ఇక నాకు టైములేదు. నన్నువెళ్ళనీ

మోహిని గంభీరముద్రతాల్చింది. "అన్నీ లేవు. నాలుగు పోయాయి."

"పోతే నన్నేం చేయమన్నావు ? నన్ను అలసట పెట్టబోకు. అది నీ వ్యవహారం. నీకు తెలియాలి. అన్నీపోతేమాత్రం నాకేం ? అయినా నాకు చెప్పటం ఎందుకూ ? నాకెందుకూ ఈ శిక్ష. తీసెయ్యి ఇవన్నీ నాముందు నించి. లేకపోతే—" అంటూ నరేశుడు విసురుగా అక్కడినించి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతోన్న భర్తవైపు చూస్తూ స్తబ్ధంగా ఉండిపోయింది మోహిని.

# 13

సందులోనించి ఇంకో సందు వెడుతుంది. అక్కడ అన్నీ పక్కా యిళ్ళే. అయినా పూరికొంపలకన్నా అధ్వాన్నంగా ఉంటాయి. సూర్యరశ్మి అనేది ఎప్పుడో బహుశా కాసేపు కనిపిస్తుందేమో ! అక్కడ నివసిస్తున్నవాళ్ళు సంఘంలో మాననీయులుగా చలామణి అవుతున్నవాళ్ళు కాదు. ఏదోవిధంగా బ్రతకటం, ఎలాగో కాలక్షేపంకావటం....అంతే వాళ్ళకు కావలసింది. పట్నంలో ఇటువంటి సందులు, ఇంత కళ్మలం ఎందుకో మరి ఇలా ఉంటాయి ! ఇటువంటి సందుగొందులే లేకపోతే పట్నం అనిపించుకోదేమో ! ఈ మురికి పేటల్లో వెలుతురు అనేది వుండదు ; చీకటి కమ్ముకుని వుంటుంది. గాలి రాదు ; వీధుల్లో తేమ ఆరదు. పట్నం శోభావంతంగా వుండాలంటే ఇటువంటి మురికిపేటలు తప్పనిసరిగా అవసరం. ఉన్నత రమణీయ భవనాలతో ఈ మురికిపేటలకు తిన్నని సంబంధమే ఉన్నది. అవీ, ఇవీ పరస్పరాధారితాలు. మేడలు, భవనాలు సుసంపన్నంగా వుండాలంటే పూరికొంపల మురికిపేటలు సమృద్ధంగా వుండటం అవసరం.

ఆ సందువెంబడి రెండు ఫర్లాంగులు నడిచాక ఎడమవైపునించి మరో

సందు వెడుతుంది. అటువైపు కొంతదూరం వెడితే ఒక బొగ్గులదుకాణం ఉంటుంది. లోతుగా గొయ్యిలో వున్నట్టుగా ఉంటుంది అది. అక్కడినించి తిన్నగా మరో చిన్నసందు వెడుతుంది. పొడుగాటి సొరంగంలా వుంటుంది అది. అందులోనించి ఇద్దరు మనుషులు మాత్రమే పక్కపక్కగా నడిచి వెళ్ళగలరు ; అదీ చాల కష్టంగానే. చిన్న నీటి కాలువ ఒకటి అందులోనించి ప్రవహిస్తూ కిందికి పోతుంది. అక్కడక్కడమాత్రం కొన్ని బండలు వేసి వుంచారు నడిచి పోవటానికి. అంతకుతప్పితే మొత్తంమీద సందు యావత్తూ జలమయమన్నమాటే. మనం ఇప్పుడు అందులోనించే వెళ్ళాలి.

సుమారు ముప్పయి అడుగులు వెళ్లాక ఒక ఖాళీ ఆవరణ కనిపిస్తుంది. అందులో మూడువైపులా గదులు ఉన్నాయి. ఎదురుగా కనిపించే యిల్లు కూడా కొంచెం బాగానే వుంటుంది. అక్కడ చాలమంది నివసిస్తున్నట్టే కనిపిస్తుంది. అందరూ పనిపాటల్లో వ్యగ్రచిత్తులై వున్నట్టు కనిపిస్తారు. ఒక ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే—మురికిగా వున్నవాళ్లుగాని, మాసిన బట్టలు కట్టుకున్నవాళ్లుగాని ఎవరూ లేరక్కడ. చాలమంది యువకులే. అక్కడ కొన్ని సంసారాలు కాపురం ఉన్నట్టు కనిపించదు. మరేదో వ్యవస్థ సాగుతున్నట్టు తోస్తుంది.

ఆయింటి మేడమీదిభాగంలో మూడు గదులున్నాయి. వాటిలో ఒకటి చాల పెద్దది. అది మెట్లకు దగ్గరగా ఉంది. ఆగదిలో ఒక యువకుడు సగం చేతుల బనీను తొడుక్కున్నాడు, మోకాళ్ళవరకూవున్న పంట్లం ధరించాడు, మేజాముందు ఒక కొయ్యకుర్చీలో కూర్చున్నాడు. కుర్చీలో మెత్తలేదు ; మేజామీద గుడ్డలేదు. ఎడమవైపున 'ఏష్ ట్రే' (సిగరెట్టుబూడిద రాల్చేపాత్ర) వుంది. ఎదురుగా మేజామీద కాగితాలు ఉన్నాయి. ఒక మంచి ఫౌంటెన్ కలం పుచ్చుకుని ఏమిటో రాస్తున్నాడు. ఎడమచేతిలో వెలుగుతున్న సిగరెట్టు ఉంది. రాస్తూ రాస్తూ మధ్యమధ్య కాస్త ఆగుతున్నాడు. సిగరెట్టు దమ్ము పీలుస్తున్నాడు. మళ్ళీ వంగి కలం ఆడిస్తూన్నాడు. అన్నీ అరతావు కాగితాలు. రెండుమూడు కాగితాలు రాయటం అయిపోయింది. వాటిని ఎడమ పక్కన వేరుగా పెట్టాడు. వాటిమీద గాలికి ఎగరకుండా ఒక రాయిముక్క పెట్టాడు.

యువకుడు మంచి ఆరోగ్యంగా, బలిష్ఠంగావున్నాడు. కాని కాయపారు శరీరం. అతన్ని మనం ఎరిగేవున్నాం; ఐతే తాను ఇంకా ఎక్కువ ఆత్మ సంబంధి అయినట్టు కనిపిస్తాడు. లోగడ ప్రకరణంలో వివరించిన సంఘటనలు జరిగి రెండువారాలు దాటాయి. కాని ఇప్పుడతడు సహాయ్ కాదు; జితేంద్రుడూ కాదు. గుణాతీతుడు, సంజ్ఞారహితుడునైన స్థితప్రజ్ఞుడు, ఆత్మ నిర్భరుడులా ఉన్నాడు. తానొక నియంత. పరిస్థితి అనబడేది తనకులోకువే. అతనిచుట్టూ వున్న పరిస్థితి శూన్యమే. ఆ మధ్యలో ఉనికిగలవాడు తాను.

ఈసారి అతడు చాలసేపు రాయటం ఆపివేసి అలాగే ఖాళీగా కూర్చున్నాడు. ఈ ఖాళీసమయం ఎందుకు ఊరికే పోవాలి అన్నట్టు అతని ఎడమ చేతి వ్రేళ్లసందున ఇరుక్కుని వున్న సిగరెట్ అదేపనిగా పొగ కక్కుతూ ఉంది. సిగరెట్ అలా కాలి, కాలి, వేలికి నిప్పు అంటుకునేంతవరకూ వచ్చింది. అప్పుడతడు ఆ సిగరెట్‌ముక్కను గట్టిగా నులిమి ఆర్పేశాడు. ఆ తరువాత ఒక్క క్షణంసేపుకూడా ఊరుకోలేదు. తలవంచి వేగంగా రాసుకుపోతున్నాడు. ఈసారి నిరాటంకంగానే సాగిపోతున్నది రచన. అడ్డుఆలోచనలేమీ రాలేదు; అనుమానం ఏమీరాలేదు. జంకులేదు, గొంకులేదు. ఒక పేజీ పూర్తిఅయింది; కాగితం తిప్పాడు; రెండోపేజీకూడా ఆరంభించాడు. అది కూడా పూర్తి అయింది. కాగితం తీసి అవతల పెట్టేశాడు. మూడోపేజీ కూడా సగం పూర్తి అయాక దాన్ని అలా కుడిపక్కకు నెట్టాడు. రాయటం పూర్తిఅయిన కాగితాలన్నీ కలిపి చివరిదానిమీద పెట్టాడు. ఆ బొత్తిమీద ఒక రాతిముక్క ఉంచాడు. అప్పుడొక ఆవలింత తీశాడు. కాళ్లతో మేజాను కొంచెంగా ముందుకు నెట్టేసి తాను లేచి నిల్చున్నాడు.

గదిలో ఎక్కువ సామానేమీ లేదు. ఒక మూల వెదురు మంచం ఉంది. దాని కాళ్ళకట్టవైపు ఒక జంపకానా పరిచివుంది. తలవైపున ఒక ముక్కాలిపీట ఉంది. దానిమీద ఒక సిగరెట్ టిన్ వుంది. అతడొక సిగరెట్ తీసి వెలిగించాడు. దమ్ములు పీలుస్తూ గదిలో పచార్లు ఆరంభించాడు. పచార్లు చేస్తూచేస్తూ గదివెనుకవైపు ఉన్న ద్వారందగ్గరకు వెళ్ళి గడియతీశాడు. "క్షమించాలి; ఇప్పుడు నేను ఉన్నానిక్కడ. నువు రావచ్చు" అన్నాడు.

ఒకటి రెండు నిమిషాలు గడిచాక అవతలవున్న గదిలోనించి ఒక స్త్రీ

వచ్చింది. ఆమెను స్త్రీ అనవలసిందే. బాలిక అనటానికి మనసు ఒప్పుకోదు. వయసు ఎక్కువేం లేదు. కాని ఆమె మనస్సు బాల్యాన్ని అతిక్రమించేసింది. ముఖవైఖరి రమణీయంగానే వుంటుంది; శాంతంగా, నిండుగా. అసలు వంగదేశానికి చెందిన మనిషిలా తోస్తుంది. కాని ఉత్తరప్రదేశపు మనిషిలా కనిపించేందుకుగాను వస్త్రధారణ ప్రయత్నపూర్వకంగా తీర్చి దిద్దుకున్నట్టుంది. చీరగట్టిన తీరులో విదూర్యం కనిపిస్తూనే ఉంది. వస్తూనే "అయిపోయిందా రాయటం?" అని అడిగింది హిందీలో.

విపిన్ (ఇక్కడ అతనిపేరు విపిన్) వెంటనే వెనక్కు తిరిగాడు, ఆమెవైపు వీపు పెట్టి "అయిపోయింది. అవిగో, కాగితాలు తీసుకుపో. ఇప్పుడే టైపుచేసి పంపించెయ్యాలని చెప్పు" అన్నాడు.

"ఇప్పుడేనా? కొంచెం మీరు...."

"తిన్నీ!"

అంతే అతడు పలికింది. ముఖం ఎత్తి ఆమెవైపు చూచాడు. ఆ చూపులో అనుల్లంఘనీయమైనది ఏమున్నదో! తిన్నీ ఆ చూపుకు ఎదురు నిలువలేకపోయింది. కాగితాలు తీసుకుంది. మేజామీద ఒకమూల పడివున్న క్లిప్ అందుకుంది. కాగితాలకు క్లిప్ తగిలించి, అవి తీసుకుని వెంటనే మెట్లు దిగి వెళ్లిపోయింది.

విపిన్ పచార్లు చేస్తున్నాడు. సిగరెట్ కాలికాలి చివరంటవచ్చింది. అప్పుడు దాన్ని ఒక మూలకు విసిరిపారేశాడు. మళ్లీ తిరిగివచ్చి దాన్ని చెప్పుకింద పెట్టి రాచాడు. ఇక అక్కడే దాన్ని వొదిలేసి ఇవతలకువచ్చాడు. రెండునిమిషాల్లో తిరిగి వచ్చేసింది తిన్నీ.

"అవి చాల అవసరమైన కాగితాలు తిన్నీ!" అన్నాడు విపిన్. ఆమె యేమీ మాటాడలేదు. ముఖం ముడుచుకుని ఉంది. గది బైటికి ఎక్కడో చూస్తూ సాగిపోయింది. అతనిముందునుంచి వెడుతూ, తన పైటచెరగు అతనికి తగలకుండా తప్పించుకుని తీక్షణంగా వెళ్ళిపోయింది. "ఇదిగో...." అన్నాడు విపిన్. ఆమె ఆగిపోయింది. అతడు ముందుకువచ్చి ఆమెను రెక్కపుచ్చుకుని తీసుకువచ్చి మంచంమీద కూర్చోబెట్టాడు.

తిన్నీ కూర్చుంది.

"నువు అలా వుంటావేం తిన్నీ!"

ఆమె యేమీ మాటాడలేదు.

"నన్నుగురించి నువ్వేమీ భయంపెట్టుకోకు. నేనొక అడివి మనిషిని, చూస్తునే ఉన్నావుగా! నాకు భోజనానికి పొద్దెక్కుతున్నదనీ, పొద్దుపోతున్న దనీ....అటువంటి తహతహ ఉండదు. ఏదో బ్రతకటానికే కదా భోజనం! ఎప్పుడేది దొరికితే అది పొట్టలో వెయ్యటమే పని. ఇప్పుడు తొమ్మిదిన్నర అయిందనికదూ నీ ఆరాటం? ఔనౌను! తొమ్మిది, పది, పదకొండు ఔతూనే ఉంటాయి. కాని అరె....ఒక్క సంగతి మరచిపోయానుసుమీ!....మా తిన్నీ చాల మంచిదికదూ! ఇదిగో, నువు కొంచెం వెళ్ళి....ఇవాళ ముగ్గురు ఆగంత కులు రానైవున్నారు. మొత్తం నలుగురికి భోజనం యేర్పాట్లు చెయ్యమని పఠాన్‌తో చెప్పు. ముగ్గురూ, మరొకడూ తెలిసిందా? ఆ ఒకడూ నేనన్న మాట! మిగతావాళ్ళు ముగ్గురు."

మారుమాటపలక్కుండా తిన్నీ లేచి మెట్లుదిగి వెళ్ళిపోయింది. పఠాన్‌తో కబురుచెప్పి తిరిగి వచ్చేసింది.

ఈసారి విపిన్ తన హృదయంలోని కృతజ్ఞతాభావాన్ని ఆపుకోలేక పోయాడు. ముందుకు వచ్చి ఆమె దారికి అడ్డంగా నిల్చున్నాడు. "కోపం వచ్చిందా తిన్నీ!"

ఒకవేళ నిజంగా కోపంగానే ఉన్నా....అతని కంఠస్వరంలోని మార్దవం వచ్చి సోకేసరికి తనజన్మ ధన్యమైనట్టుగా తిన్నీ భావించుకుంది. "ఉండండి, అడ్డం లేవండి" అన్నది దురుసుగా.

విపిన్ పక్కకు తప్పుకున్నాడు. అతని కృతజ్ఞత ప్రసన్నతలో స్నాన మాడింది. గదిలో మెల్లగా పచార్లు ఆరంభించాడు. అసలు ఈవ్యక్తి అప్పు డప్పుడు తన స్థితికి తానే ఉద్విగ్నుడైపోతూవుంటాడు. ఈ లోకపు పోక డేమిటో, ఏ న్యాయాన్ని అనుసరించి పరిస్థితులు సాగుతూ ఉంటాయో బోధ పడదు. అపాత్రుడికే అన్ని హంగులూ లభిస్తూ ఉంటాయి. పాత్రతగలవాడికి ఏమీ ఉండదు. ఏముంది తనలో విలువ? అంత లెక్కించవలసిన మనిషి కాదు తాను. అయినా తానే లెక్కకు వస్తున్నాడు; తాను ఒక్కడే. ఇక్కడ తాను వున్నాడు. తన ఆదేశానుసారం సర్వం నడిచిపోతూవుంది. తన

భ్రూభంగిమలను కనిపెట్టుకునే వుంటున్నారు మిగతావాళ్ళంతా. కాని తాను లోలోపల ఎంతో అశక్తుడు; విచలితుడు; విశీర్ణుడు. అయినా ఏమిటిది, ఎవ్వరికీ లేని గౌరవం తనకు? అందరూ తననే సమాదరిస్తున్నారు; తన మ్రోల నతమస్తకులై వుంటున్నారు.

"కాస్త వెళ్ళి ముఖం, కాళ్లు చేతులు కడుక్కోండి!"

విపిన్ వెనక్కు తిరిగి చూచాడు. తిన్నీ గుమ్మంలో నిల్చుని అలా అంటున్నది. కృతజ్ఞతాభరితహృదయంతో అతడామెవైపే చూస్తూ నిల్చు న్నాడు స్తబ్ధంగా. ఏమంటానికీ, ఏమి చెయ్యటానికీ వెంటనే తోచిందికాదు అతనికి.

అతనిలోని ఆత్మప్రభావమే ఇతర్లకు శక్తినీ, ఉత్తేజాన్నీ ప్రసా దిస్తున్నదని అతనికేం తెలుసు? ఆ క్షణాన తిన్నీకి....తానొక తుచ్ఛవ్యక్తి అనీ, అతడొక మహాత్ముడనీ....విస్పష్టంగా బోధపడింది. "వినిపిస్తోందా, లేచి ముఖం కడుక్కోరేం?" అన్నది.

"అలాగే."

తిన్నీ వెనక్కు వెళ్లిపోయింది. కాని ఆమెకు తెలుసు: అతని కేవిషయమూ జ్ఞాపకం ఉండదు. ఎప్పుడేది మరచిపోతాడో చెప్పలేం. ఒక బొక్కెనలో నీరు నింపి, తుండుగుడ్డ భుజంమీద వేసుకుని, ఒక చేత్తో పీట పట్టుకుని తెచ్చింది. విపిన్ గదిలో ఒక మూల తూముదగ్గర పెట్టింది అన్నీని.

"ఇదేమిటి? నేను వస్తూనే ఉన్నాగా!"

తిన్నీ వినిపించుకోలేదు. సబ్బుబిళ్ల, పళ్ళపొడి, బ్రష్, నాలుక గీచు కునే బద్ద....అన్నీ తెచ్చి అక్కడ పెట్టేసి మాటాడకుండా వెళ్లిపోయింది.

విపిన్‌కు కోపం వచ్చేసింది. "ఏమిటి ఈపని అంతా నువు? నేనే మన్నా అవిటివాడిననుకున్నావా? ఎందుకు తిన్నీ నువు...."

ఆమాటలు వింటూనే మాటాడకుండా వెళ్ళిపోయింది తిన్నీ.

విపిన్ తిరుగుబాటేం చెయ్యలేదు. తిన్నగా వెళ్లి పీటమీద కూర్చు న్నాడు, దంతధావనాదికృత్యాలు నిర్వర్తించుకుంటూ. అతడింకా పీటమీదినించి లేవలేదు. ఈలోగా తిన్నీ వచ్చి స్టూల్‌మీది వస్తువులన్నీ తీసేసి, దాన్ని బెంచీకి దగ్గరగా లాగింది. ఆ బెంచీమీద ఎవరేనా కూర్చోటానికి మెత్త

అమర్చి వుంది. మంచాన్ని మేజాకు రెండోవైపున వాల్చి జంపకానా పరిచింది. విపిన్ దంతధావనాది కార్యాల్లో నిమగ్నుడై వున్నాడు.

అహూయమానులైన ముగ్గురు వ్యక్తులు మెట్లెక్కి పైకి వచ్చేసరికి విపిన్ తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ "రండి రండి" అన్నాడు.

ఆ ముగ్గురూ మాటాడుకుంటూ లోపలికి వచ్చారు. ఒకడు స్టూల్‌మీద వెళ్లి కూర్చున్నాడు. మిగిలిన యిద్దరూ వచ్చి మంచంమీద కూర్చున్నారు.

"క్షమించాలి ; ఇప్పుడే వస్తున్నా" అంటూ విపిన్ గబగబా వెళ్లి తూముదగ్గర గోడకువున్న రాతి అలమారలోనించి దువ్వెన, అద్దం తీశాడు. తొందరతొందరగా తల దువ్వుకుంటూ హఠాత్తుగా "తిన్నీ !" అని కేక వేశాడు.

ఎదురుగా కనిపిస్తూన్న అవతలగదిలో ఒకమూల కూర్చుని నాస్తా తయారుచేస్తున్నది తిన్నీ. ఇప్పుడు వెనక్కు తిరిగి చూచింది.

"చూడు, ఇలా చూడు —" విపిన్ తన చెంపలు గడ్డం తడివి చూపుతూ "నాకు జ్ఞాపకం చెయ్యలేదేం నువు ? ఇప్పుడు వాళ్లముందు నేను ఎంత మొరటుగాఉంటానో చూడు.... "అంటూ అర్ధోక్తిలో వచ్చినవారివైపు తిరిగి "చూడండి, ఎంత ఇబ్బంది వచ్చిందో ! అబ్బ ! మూడురోజులైంది గడ్డం చేసుకుని" అన్నాడు.

తిన్నీ చూచింది, విన్నది ; ముఖం తిప్పుకుని తన పని తాను చూచుకుంటోంది.

"ఇదిగో, ఆనక రెండుగంటలప్పుడన్నా జ్ఞాపకంచెయ్యి. మరచిపోకు సుమీ" అని పలికి విపిన్ ఆ ముగ్గురు మిత్రులవద్దకు వచ్చాడు.

"శూర్‌జీ ! చూచావుకదూ ఆ కాగితాలు ! వాటిని ఇవాళ పంపించెయ్యాలి. సరిగా ఉందికదూ !"

"ఆఁ ఆఁ. చేతన్‌కు ఇచ్చాను టైపు చెయ్యమని."

"నువ్వేమన్నా కబురు తెచ్చావా వీర్‌జీ ! పోలీసుల వ్యవహారం బాగా రభసగానే ఉందా ?"

"ఆఁ, రభసగానేఉంది. కానిసంగతేమిటో సరిగ్గా బోధపడటంలేదు."

"ఏమిటంటావు ?"

"ఏమిటో ఇంకా బై టికి బాగా పొక్కటంలేదు. పదిహేను రోజు లైందికదా ! ఆ నగలు తీసుకుపోయి మనం ఎందుకు సొమ్ముచేసుకో కూడదూ ?"

"ఔను విప్పా ! నిజమే. అలానే చేసేద్దాం" అన్నాడు మూడోవ్యక్తి.

ఈ నలుగురు వ్యక్తులకూ రహస్యసంజ్ఞలు ఉన్నాయి. ఆ ముగ్గురి పేర్లూ వరుసగా శూన్, వీర్, ధీర్. ఆ ముగ్గురినీ పేర్లకు పక్కన 'జీ' తగిలించి సంబోధిస్తూ ఉంటాడు విపిన్. అతనిపేరు మాత్రం విప్పా. విపిన్‌కు వికృతి అన్నమాట. ఈ పేరుకు మాత్రం పక్కన 'జీ' తగిలించరు.

ధీర్ పలికిన మాటవిని విపిన్ మౌనం వహించాడు. ఇంతవరదాకా కూర్చోనేలేదు.

మళ్ళీ అన్నాడు ధీర్‌జీ: "ఇక ఇబ్బందేమీ వుండదు. నగల్ని బైటికి తీసుకుపోయి డబ్బు చేసుకోవచ్చు ; పరవాలేదు."

విపిన్ సమాధానం చెప్పలేదు. పైగా అక్కడినించి లేచి పక్క గది లోకి వెళ్ళాడు. "ఏదీ, కొన్ని పళ్ళాలు నాకుకూడా ఇవ్వు. నేనూ తీసుకు వస్తాను" అన్నాడు తిన్నితో.

"నేనే తెస్తున్నాగా ! అంత ఆకలిగా వున్నదా యేమిటి ?"

"ఔను, ఆకలిగానే వుంది. ఏవీ, ఇలా తే" అన్నాడు విపిన్, ముఖంలో గంభీరముద్రతాల్చి.

"మీరు పదండి. నేను తెస్తాను. ఇంకా ఆలస్యం ఉంది."

"ఎంత ఆలస్యం ?"

"వెళ్ళండి, చెప్పానుగా—నేను వస్తున్నానని ?"

"అయినంతవరకు నాకు ఇలా ఇచ్చెయ్యి." అంటూ విపిన్ పాదాల మీద గొంతుకూర్చున్నాడు, మోకాళ్ళమీద మోచేతులానించి, గడ్డం తన దోసిలిలో అదుముకుని "సొమ్ములు నీదగ్గర వున్నాయికదూ ! ఇప్పుడు వాటికి స్థలం మార్చాలి" అన్నాడు.

తిన్ని అతనివైపు కోపంగా చూచింది. "ఆపదలమారిసొమ్ము నేను ఆట్టిపెట్టుకోను అసలు."

"కొంచెం తిన్నగా మాటాడు....అవి ఎప్పుడైనా పెట్టుకుని చూచావా ?"

ఆమె కన్నుల్లో ఏదో వ్యథ ద్యోతకం అయింది. అతడడిగిన పాడు పశ్నను సహిస్తూ మౌనంగా ఉండిపోయింది.

విపిన్ వెంటనే అందుకుని "నిజమే తిన్నీ ! అవన్నీ డబ్బుగలవాళ్లు వొంటినిండా దిగవేసుకునే ఖరువులు. అవన్నీ లేకుండా బీదవాళ్లు సాదాగా వుండటమే మంచిది....ఊఁ. తొందరగా కానీ...." అంటూ పళ్ళేలు చేతిలోకి తీసుకుంటూ "విన్నావుకదూ ! చోటు మార్చాలి" అన్నాడు.

రెండుచేతుల్లోనూ పళ్ళేలు పుచ్చుకునివస్తూ విపిన్ యూరంనించే "మీరు చాల ఆకలిగావున్నారు, నాకు తెలుసు. పదిగంటలకా నాస్తా చేయటం ? కాని ఏంచెయ్యను మరి ! నిన్న చెప్పినమాట ఇవాళ మరచే పోయాను. కానీండి. పుచ్చుకోండి" అంటూ వచ్చాడు.

"మీరుకూడా కూర్చోండి. పళ్ళేలు అవే వస్తాయిలెండి."

"ఇప్పుడే వస్తాగా !" అంటూ విపిన్ మళ్ళీ లోపలికి వెళ్ళి మరిరెండు పళ్ళేలు పట్టుకువచ్చాడు.

ఆ ఎల్యూమినియమ్ పళ్లాల్లోని పూరీలు హల్వాపట్ల సమానన్యాయం సాగిస్తూ....అప్పటికప్పుడు సొమ్ములు పట్టుకుపోయి డబ్బు చేతిలోవేసుకు రావాలన్న ప్రతిపాదన ఇంచుమించు నిర్ణయమైపోయినట్టే మాటాడుకోటం సాగించారు ఆ ముగ్గురూ. కాని ఆ విషయమై విపిన్ ఏమీ మాటాడ్డంలేదు. తనముందున్న పళ్ళెంలోని సామగ్రి ఆ ముగ్గురిపళ్ళాల్లో పంచుతూవున్నాడు. తాను కాస్తయినా తినటంలేదు. ఈ సంగతి ఆ ముగ్గురు గమనించినట్టేలేదు.

ఈలోగా తిన్నీ నాలుగు టీకప్పులు తెచ్చి వారిముందు పెట్టింది. కప్పులకింద సాసర్లు లేవు. విపిన్ తన కప్పు నోటికెత్తుకుని కొంచెంకొంచెం చప్పరిస్తున్నాడు.

టీకప్పులు రాగానే అందరూ తేనీటిసేవనలో ఉండిపోయారు. ఎవరూ ఏమీ మాటాడలేదు. ఇప్పుడు గమనించారు ఆముగ్గురూ : విపిన్ ఊరికే తమవైపే చూస్తూ, ఏమీ మాటాడ్డంలేదన్నసంగతి. కొంచెం అసమంజస స్థితిలో పడ్డారు ముగ్గురూ.

"ఇంతవరకూ మీరేమీ మాటాడలేదు. మీ ఉద్దేశం ఏమిటి ?" ధీర్‌జీ అడిగాడు.

"నాఉద్దేశం ఏముందీ ? సొమ్ములకు కొంత విలువ అంటూ ఉంది. అన్నింటికీ విలువ ఉంటుంది. అయితే మనకు అసలు విలువ కావాలి. మిగిలిన విషయాలు అనవసరం. కాని....ఎందువల్లనో మరి, సొమ్ములు పోయాయి అన్న అలజడే ఎక్కడా కనిపించకుండా వుందేం ? ఏమిటబ్బా కారణం ?" అన్నాడు విపిన్.

"అదంతా పోలీసులచాతుర్యం అయివుంటుంది. బైటికేమాత్రం పొక్కనీకుండా గుట్టుగా వ్యవహరిస్తున్నారల్లేవుంది" అన్నాడు వీర్‌జీ.

"ఆపని అంతా నీది మరి ! ఆ గుట్టుమట్టులన్నీ ఎక్కువగా గ్రహించలేదా నువు ?....వాళ్ళయింట్లో సంగతులెలావున్నాయి ?"

"గొడవేమీ ఉన్నట్టులేదు. మనం ప్రమాదం గడిచినట్టే ననుకుంటాను."

"ఒక్కపని చెయ్యాలి మనం...." అన్నాడు విపిన్. అతని కనుబొమలు ముడతలుపడ్డాయి.

తళతళలాడుతూ మెరుపుతీగ హఠాత్తుగా ఎక్కడినుంచి వస్తుందో కదా ! చుట్టూ అంధకారమే ; అంతా శూన్యమే. ఆ శూన్యంలో ఎక్కడ దాగివుందో తాను. ఒక్కసారిగా ఉబికిపడుతుంది ; జిలుగువెలుగుతో ఆకాశాన్ని చీల్చుకుంటూ తళతళా మెరుస్తుంది ; చుట్టూ దీప్తిమంతం చేస్తుంది. విపిన్‌విషయంలో ఇప్పుడదేవిధంగా జరిగింది. రెండు శూన్యపులోతులు, రెండు కటికిచీకట్లు రాపిడిపడి వెలుగు ఉబికినట్టు ఒక తీక్షణమైనప్రకాశం అతనిలో మెరిసింది.

విపిన్ నుదుటిమీద ముడుతలు ; కన్నుల్లో ఉద్వేగములేని దీప్తి ; "చెయ్యగలరా మరి !" అన్నాడు ఉపహాసపూర్ణమైన....అవజ్ఞాభరితమైన కంఠస్వరాన.

"చెయ్యలేనిదంటూ ఏముంటుందీ ? చెప్పండి, ఏమిచెయ్యాలో" అన్నారు ముగ్గురూ ఒక సవాలును ఎదుర్కొంటున్నట్టు.

విపిన్ వాళ్ళముఖాల్లోకి చూడ్డమేలేదు. వాళ్ళ తలలకుపైగా, దూరంగా

ఏమిచూస్తున్నాడో మరి! "నగలు పట్టుకుపోయి, వాటిని డబ్బుకింద మార్చె య్యాలని మీరు అభిప్రాయపడుతున్నారు. బంగారపువర్తకునిదగ్గరగాని, షరాబుదగ్గరగాని వాటి సరైనవిలువ మీకు లభించదు. బంగారంకన్నాకూడా 'ప్రీతి' అనే వస్తువు ఒకటి వేరేఉన్నది. దాని విలువ అపారం; ఇంత అని లెక్కబెట్టలేం. బంగారపు అసలువిలువలో సగమైనా ఇవ్వడు షరాబు. కాని వాటిమీద ఎక్కువగా ప్రీతిగలవాళ్లు ఉంటారు. వాళ్ళకు ఆనగలు అమూల్య ములు. చూచారుకదూ! ఇవి ఎంతధర పలుకుతాయని మీ ఉద్దేశం?"

"ఎనిమిదివేలు దొరికితే ఎక్కువే."

"ఎనిమిదివేలా?" తూస్కారింపుగా అన్నాడు విపిన్, "యాభైవేలు రావలసిందే."

అతడు పలికిన ఆ కంఠధ్వనికి ఆముగ్గురూ భయవిచలితులైనారు.

"ఔను. యాభైవేలు! ఒక్క దమ్మిడీకూడా తగ్గకూడదు. కేవలం యాభైవేలేకాదు....పైగా....ఉన్నదా మరి ధైర్యం మీకు?"

ముగ్గురూ తలెత్తి విపిన్‌వైపు చూస్తున్నారు. అతడు వాళ్ళముఖాల వంక చూడ్డంలేదు. ఎక్కడో అవతలకు చూస్తున్నాడు. ఒక దేవత అనిపిం చేట్టు ఉన్నాడు. తుప్పత ఎక్కడా లేదు. ఎక్కడో తన్మయుడైనట్టు సూచి స్తున్న ముఖవైఖరి! ఆ ముఖఫలకంలో ఒకానొక ఆత్మీయసౌందర్యం ప్రతిఫలిస్తున్నట్టుగావుంది. అతడొక స్వప్నంలో సమావిష్టుడైవున్నట్టు తోచింది ఆముగ్గురికి. దుర్జయుడు! దుర్జేయుడు! అటువంటి మహనీయు డైన పురుషుడు ఆదేశించిన కార్యాన్ని సానుకూలంచేసినప్పుడే తమ పౌరు షం కృతార్థమైనట్టు....అని తోచింది ఆ ముగ్గురికీ.

"ఊహుఁ, ఒక్క దమ్మిడీకూడా తగ్గటానికి వీల్లేదు. ప్రజలు కూటికి లేక చస్తూవుంటే, ఎవరో కొద్దిమందిమాత్రం వేలు, లక్షలు విలువగల బంగారంమీద, రత్నాలమీద సుఖాసీనులై సౌందర్యం, సభ్యత అంటూ కులుకుతారా? నామాట అంతే. ఒక్క దమ్మిడీఅయినా తగ్గటానికి వీల్లేదు. మీరేమంటారు?"

ఆముగ్గురూ ఏమీ మాట్లాడలేదు. కాని మౌనంలోనే వారి అంగీ

కారమూ, నిశ్చయమూ ప్రస్ఫుటంగా ప్రకటితమైనాయి. మాటల్లో ఇమిడి నప్పటికంటేకూడా ఎక్కువ ప్రస్ఫుటంగా ప్రకటితమైనాయి.

“అదీసంగతి! అప్పుడు మనకు ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది. దేశం మనమీద పెట్టుకున్న ఆశలు ఫలిస్తాయి. విప్లవం మనచేతుల్లో చక్కగావర్ధిల్లుతుంది. ఆపదలే మనకు ఆటలు; ఆలాగేవుండాలి. ప్రాణాల మీద తీపిగలవాడికి జీవితపురుచి అర్థంకాదు. మృత్యువుతో ఆటలాడుకునే వాని మనుగడే మనుగడ.... ఈ నగల యజమానురాలిని పట్టుకు తీసుకు రావాలి. ఇదిగో వీర్‌జీ! నువు పోలీసులను కనిపెడుతూవుండు....‘పోలీసు మీకు సంరక్షకుడైతే, ఈతుపాకిగుండు మాకు ఈశ్వరుడు’ అని భాగ్యవం తులకు గట్టిగాచెప్పండి. భయంవల్ల ఆమె ఇంకా పోలీసులకు రిపోర్టుచేసి వుండదు. రిపోర్టు వెళ్ళివుండకపోతే మంచిదేకదా! ఇకముందుకూడా పోలీసు లకు రిపోర్టుచెయ్యనని ఆమె ఖరారుగాచెబితే నగలు ఆమెకు తిరిగి ఇచ్చి వెయ్యచ్చు. కాని యాభైవేలరూపాయలు చేతిలో వేయించుకున్నతర్వాతనే. బంగారం, రత్నాలు పోగేసుకుని చూస్కోమనండి. పూజించుకోమనండి. లేక కుళ్ళబెట్టుకోమనండి. తరువాత ఏంచేసుకుంటే మనకేం? అవి తినేపదార్థా లేంకావు. గౌరవాధిక్యతకోసం, కూడబెట్టి దాచుకునేవి. ఆ వ్యసనంలోనే పడి కొట్టుకోనీయండి. కాని డబ్బు అయితే బాగా ఉపయోగిస్తుంది. దిక్కు లేనివాళ్ళకు దిక్కు చూపిస్తుంది. ఆకలితో అలమటిస్తున్నవాళ్ళకు అన్నం పెడుతుంది. వింటున్నావా వీర్‌జీ! నువుకూడా శూర్‌జీ! నువ్వున్నా ధీర్‌జీ! యాభైవేలరూపాయలకు ఒక్క దమ్మిడీ తక్కువతెచ్చినా సరే మీరెందుకూ పనికిరారన్నమాటే. జీప్‌కారు ఉండనేఉందిగా! ఆమెను మన అడవిలోకి అలా తీసుకుపోండి. ఏమరుపాటున ఉండవద్దు. మరచిపోవద్దు. మీమీద ఒకకర్తవ్యం ఉంది. ఆజ్ఞాపాలనలో ఏమరుపాటు రానీయవద్దు. ఆడవాళ్ళలా భయపడవద్దు. మమతకు లొంగిపోవద్దు. ఆవిడ పోలీసులమీదే భరోసాపెట్టుకునివున్నట్టయితే మీరున్నారు, మీ తుపాకులున్నాయి; నేను చెప్పేదేముందీ? ఏసమయంలో ఎలా ప్రవర్తించాలో మీకు తెలిసేవుంది. ఆమె నన్నుగురించి అడిగితే అడుగవచ్చు. నా ఆజ్ఞనే మీరు నిర్వర్తిస్తున్నామని చెప్పండి. నాకు చాలపను

లున్నాయి; తీరిగ్గాలేనని చెప్పండి....ఈపని సానుకూలంకావటానికి మీ కెన్నాళ్ళు కావాలి?"

ఈవిధంగా చెబుతూన్న విపిన్ ఒక అలౌకికస్థాయిలో వున్నట్టు కని పించాడు. ఒక అశరీరుడువలె, కేవలం భావనాశరీరుడువలె ఉన్నాడు. ఈ లోకంలోగాక, మరేలోకంలోనో ఉన్నవాడులా గోచరించాడు. హద్దులుగల పరిస్థితి నతిక్రమించి సీమాబద్ధముగాని ఆకాంక్ష అనే కేంద్రంలో నిల్చి మాటాడుతున్నట్టుంది అతని ముఖముద్ర.

అతనిలోని మానసికావస్థచేత మిగిలిన ముగ్గురు ప్రభావితులైనారు. వారి భావనలు వికసించాయి. విపిన్ చేస్తున్న సవాలుచేత దెబ్బతిన్నస్వాభి మానంగలవారై పులకితశరీరులైనారు. ఒక్క చిటికెలో ఈపని యావత్తూ చేసెయ్యాలి. యాభైవేలరూపాయలనగదు తెచ్చి ఈ నాయకశిఖామణి పాద పద్మాలముందు సమర్పించాలి. ఈ మహాకార్యం ఎలా సానుకూలం చెయ్యాలో... ఆ పద్ధతి యావత్తూ ఒక చిత్రంలా వాళ్ళ మనోనేత్రంముందు గోచరం అయింది.

"మీరు ఎన్నాళ్ళు గడువిస్తే అన్నాళ్ళలోనే" అన్నారు.

"ఒక్కవారం చాలా?"

"మీ ఆజ్ఞ అయితే అంతేచాలు."

"బాగా ఆలోచించండి. ఇంకా ఎక్కువగడువు కావలసివస్తే ముందే చెప్పండి...."

ఆమాట వినేసరికి ఆముగ్గురి అభిమానం ఇంకా కొంచెం దెబ్బ తిన్నది. ఒక్కవారంకూడా అక్కర్లేదు. ఈ లోపుగానే చూస్తారుగా మా చాకచక్యం ఎంతవరకు ఉన్నదో!" అన్నారు ముగ్గురు సగర్వంగా.

గుండెలో దయపుట్టినవాడులా విపిన్ నవ్వాడు. "ఏమిటి మీరు చూపించదలచుకున్న చాకచక్యం? తుపాకి పేల్చి చంపేస్తారా? మీవంటి వాళ్ళు చెయ్యదగిన ఘనకార్యం అదే. నాకు తెలుసు. కాని అలా చెయ్యవద్దు. అలాచేస్తే ఓడిపోయినట్టే. ఓడిపోయినతర్వాతనే అలా చెయ్యండి. కాని మీరు ఓడిపోరు" అంటూ ఎల్యూమినియం ప్లేటు అందుకుని దానితో టీ కప్పుమీద టపటప మోగించాడు. అదివిని తిన్నీ అక్కడకు వచ్చింది.

"తిన్నీ ! ఈ శూర వీర ధీర శిఖామణులకు తేనీరు ఒక్కొక్క కప్పే సరి పోతుందనుకున్నావా ? ఇంకా పట్టుకురా !" అన్నాడు.

తిన్నీ బల్లమీద ఖాళీకప్పులు అందుకుంటూ చూచింది : విపిన్ కప్పులో ఇంకా టీ సగంపైగానే ఉంది. అతని పళ్లెంచూచికూడా తెలుసుకో వలసింది తెలుసుకుంది. విపిన్‌సంగతి తిన్నీకి బాగానే తెలుసు. పైకి ఏమీ అనకుండా గుక్కిళ్లుమింగుతూ పళ్లాలు, కప్పులు అన్నీ పోగుచేసుకుని వెళ్లి పోయింది. మళ్లీ తేనీరు తయారుచేస్తూ కూర్చుంది లోపల.

ఈ తిన్నీసంగతి పాపం అడగబోకండి. ఈమె తండ్రి ఈమెను పాతికరూపాయలు పుచ్చుకుని అప్పగించేశాడు విపిన్‌కు. తల్లి ఏనాడో చనిపో యింది. తండ్రికి పాతికరూపాయలు కావలసివచ్చాయి. విపిన్ ఇచ్చేశాడు. ఆ పిల్ల ఇతని అధీనంలోకి భయపడుతూ భయపడుతూ వచ్చింది. వచ్చికూడా మూడుసంవత్సరాలు గడిచిపోయాయి. ఇప్పుడామెకు పందొమ్మిదిసంవత్సరాల వయస్సు. అయినా ఇతడంటే ఆమెకు భయం బాగా హెచ్చనూలేదు ; పూర్తిగా సమసిపోనూలేదు. అతన్ని ఈప్రపంచంతో ఏమీ సంబంధం లేకుండా ఎక్కడికో అడవిలోకి ఏకాంతంగా తీసుకుపోయి, అక్కడ ఒక మందిరం కట్టించి, అందులో అతన్ని ప్రతిష్ఠించి, నిత్యం పూజించుకోవాలని ఆమె అభిలాష. ఏ స్వార్థమూ ఎరుగని ఇటువంటి తపస్వి ప్రపంచంలో నభూతో నభవిష్యతి అని ఆమెనమ్మకం. పందొమ్మిది సంవత్సరాల చిన్న వయస్సే. అయినా ఈ చిన్నవయస్సులోనే తండ్రిదయవల్ల ప్రపంచం చాలానే చూచింది. ఈ ప్రపంచం తానెరిగినదే, అలాగే వుంది. కాని ఈ వ్యక్తిమాత్రం ఎక్కడినించి ఊడిపడ్డాడో ఆమెకు బోధపడటంలేదు. ఈయన ఈ ప్రపంచానికి సంబంధించినమనిషికాదు. ఈప్రపంచం తనకు అక్కర్లే నట్టుగా వుంటాడు. తిన్నీకూడా అతని కక్కర్లేదు. ఏమీ అక్కర్లేదు అత నికి. అతని మనస్సు ఎక్కడా ఒకచోట నిల్చివున్నట్టు ఆమె ఎరగదు. ఈ సమస్తాన్నీ అధిగమించి ఎక్కడవుంటాడో మరి ! అన్ని అవస్థల యందు అతన్ని గమనిస్తూనే ఉంది ఆమె--మిత్రులతో సరససల్లాపాల్లో వున్న ప్పుడు, మధుపాన మాంసాహారసమయాల్లో, భోగవిలాసాల్లో వున్నప్పుడు, దైన్యదారిద్ర్యబాధల్లో, తనతోడి అత్యంత శారీరికసాన్నిధ్యంలో, రాత్రి

ఏకాంతవేళలో, పగలు వెలుగు[illegible]లో....కాని ఎప్పుడుచూచినాసరే, మనిషి ఎక్కడ వుంటున్నాడో అ[illegible]డు. అభావంలో ఐశ్వర్యవంతుడు లాగ, వైభవస్థితిలో విప[illegible]స్తున్నవాడులాగ కనిపిస్తాడు. అతని కెంతో దగ్గరగావున్నాకూడా, తానతనికి నిజంగాఎంతోదూరాన, సముద్రాల అవతల వున్నట్టు తోస్తూవుంటుంది. అతనికి దూరంగా వెడితే, నిజంగా అతడు తన అంతస్సులోనే మిక్కిలి దగ్గరగావున్నట్టు అనిపిస్తుంది.

తిన్నీ ఏమీ తెలియని అమాయకురాలు అనటానికి వీల్లేదు. జ్ఞానం, విజ్ఞానం అనబడేవి ఆమెకు తెలియకపోవచ్చు. కాని అతనిచుట్టూవున్న పరిస్థితులన్నీ కలుషములు, కల్మషములు అని ఆమెకు తెలుసు. అతడు బైటికి వెళ్లాడంటే పట్టుబడిపోతాడు; జైల్లోవేస్తారు; ఉరికూడాతీస్తారు అని ఆమెకు తెలుసు అతడు నిజంగా అధమాచరణుడు, పాపవర్తనుడు అయితే కావచ్చు. కాని ప్రభుత్వం అతన్ని వెనకిపట్టుకుని, జైల్లోవేసి, చంపివారే యాలని ఎందుకు తహతహలాడుతున్నదో, అతనిలోవున్న ఆ దోషంఏమిటో ఆమెకు అవగాహనకావటంలేదు. బహుశా ప్రపంచం తన్నుతానే తెలుసుకోజాలదుకాబోలు!—అని అనుకుంటూ ఉంటుందామె.

రెండుకప్పుల్లో టీ పోసి తీసుకుపోయి అక్కడపెట్టి తిరిగి వచ్చేసింది తిన్నీ మాటాడకుండా. ఇంకోరెండు కప్పుల్లోకూడా టీ నింపి తీసుకువచ్చి అక్కడపెట్టి వెళ్ళిపోతోంటే విపిన్ అన్నాడు: "ఇదేమిటి నాలుగెందుకూ? నేనెప్పుడేనా రెండు కప్పులు తాగానా?"

"ఇవాళ తాగండి" ఆమెకంఠస్వరం వ్యథాభరితమైవుంది. ఆ వ్యథ విపిన్‌ను స్పృశించింది. "ఎందుకు తిన్నీ! ఇవాళ ఏంప్రత్యేకత ఉందనీ?" అన్నాడు.

"అయితే వొదిలేయండి పోనీ."

"కాదు, తాగుతాలే. ఇలా ఇవ్వు. అంతగాచెబుతున్నావు మరి!"

విపిన్ మందహాసంచేశాడు. ధన్యురాలినైనాననుకుంది తిన్నీ లోలోపల. ఎప్పుడూకూడా సాధారణంగా అతనివల్ల ఆమెకుకలిగే మనోల్లాసం చాల స్వల్పమే.

# 14

ఫోనులో కబురువచ్చింది; స్వాగతంఇచ్చేందుకు అన్నియేర్పాట్లు చేసుకుని సిద్ధంగావుంది మోహిని: యస్. పి. ని ఒంటరిగా కలిసి మాటాడాలని ఆమెవుద్దేశం. అతడు మంచి కాయపుష్టిగలవాడు, అట్టహాసం ఎక్కువ. సుమారు నలభై సంవత్సరాల వయస్సు వుంటుంది. ఆమె యిచ్చిన స్వాగతానికి కృతజ్ఞత తెలుపుకున్నాడు. "మిమ్మల్ని ఎక్కడో ఎప్పుడో చూచినట్టుగా ఉంది. ఇక్కడికి రావాలని నరేశ్‌బాబును చాలాసార్లు వేధించాను. కాని ఆయనకు తీరుబాటు ఎక్కడిదీ పాపం! మీరు నన్ను రమ్మన్నట్టు ఇవాళే చెప్పారాయన. నా అదృష్టం ఫలించినట్టు సంతోషంతో ఇలావచ్చాను" అన్నాడు.

మోహిని చద్దాకు తన గదిలోనే స్వాగతం ఇచ్చింది. ఫలహారాలు అవీ అక్కడికే తెప్పించింది. "ఔను. మావారు చాలసార్లు చెబుతూవచ్చారు. 'దీనికి ఆలోచన ఎందుకూ? ఇది వారి స్వగృహం కాకపోయిందా? ఎప్పుడు పడితే అప్పుడు రావచ్చు' అన్నాను నేను. మీరే తటపటాయించినట్టు కనిపిస్తుంది. మీకు ఇక్కడ అభ్యంతరం ఏముంటుంది చెప్పండి. మా ఇంటికి ఈమధ్య ఒక అతిథి వచ్చాడు. రావటమేమిటి, జబ్బుపడటమేమిటి? అతనికి ఆ యీ వుపచారాలు చేస్తూ నాకు తీరికే లేకుండాపోయింది. ఇవాళ కాస్త తీరుబాటుచిక్కింది. వెంటనే మిమ్మల్ని పిల్చుకురండని మావారికి చెప్పాను."

చద్దా వ్యాకులత ప్రకటిస్తూ అడిగాడు: "అతిథి వెళ్ళిపోయాడేమిటి? ఎప్పుడూ?"

మోహిని నవ్వింది. "మనిషికి జ్వరం అనేది విడిచిపెట్టకుండా ఎల్లకాలం ముసించుకుని వుండాల్సిందేనంటారా?"

"అవునులెండి, అవునులెండి. కాని నిన్నటివరకూ వెళ్లుతాడని అనుకున్నట్టులేదే!"

"ఇంకొక్కక్షణంలో ఏమౌతుందో తెలియదుకదా, నిన్నటి మాటెందుకూ? స్త్రీచిత్తం, పురుషుని భాగ్యం భగవంతునికే తెలియదు, మానవునికేం తెలుస్తుంది? 'స్త్రీణాంచ చిత్తం, పురుషస్య భాగ్యం దేవో న జానాతి కుతో మనుష్యః' అని మన గ్రంథాల్లో రాశారుకదా!" అన్నది మోహిని మందహాసపూర్వకంగా.

ఈధోరణిలో కొంతసేపు సంభాషణసాగింది. "అది సంస్కృత లోకోక్తి కాబోలు ! మా పోలీసువాళ్ళకు సంస్కృతంతో ఏమిసంబంధం ఉంటుందీ ? నరేశ్‌బాబు మీ అతిథినిగురించి చెబుతూనే వుండేవారు. బాగా జ్వరంపడ్డాడేమిటి ?"

"ఆరోజు వచ్చాడా ! వెంటనే వెళ్ళిపోదామనే అనుకున్నాడు. కాని ఎనిమిదిరోజులు ఉండిపోవలసివచ్చింది. చాలరోజులే వున్నాడు."

"ఎటువైపు వెళ్ళినట్టు ?"

"ఎక్కడో మైసూరులో ఏదో వ్యాపారం చేస్తున్నట్టు చెప్పాడు. అక్కడికే వెళ్లాడేమో !"

"పోనీలెండి. మిసెస్ నరేశ్ ! సంస్కృతభాషలో చాల ప్రముఖమైన విషయాలే వున్నట్టు అందరూ చెబుతారు. నిజమేనా ?"

"ఔనౌను. మీరు సంస్కృతం ఎందుకు నేర్చుకోకూడదూ ! ఇప్పటికైనా వయసు యేం మించిపోయిందని ? నేర్చుకుంటే త్వరలోనే వస్తుంది."

"లేదులెండి, ఇంకా మాకు చదువు గిదువు వచ్చేదేమిటి ? పెట్టేదేమిటి ? విజ్ఞానంతో మాకేం సంబంధంలేదు....ఒక విషయం చెబుతా వినండి ; చాల తమాషాఅయిన వ్యవహారం లెండి. కొంతమంది కుర్రవాళ్లు ఎలా తయారౌతారనీ ! బహుశా వాళ్ళను అదుపులోపెట్టేవాళ్ళెవరూ పైన ఉండివుండరు. లేకపోతే బాగా దెబ్బలు తిని ఇలా తయారౌతారో ! వాళ్లకు ఇంకేం పనిఉంటుందీ ? నాయకులమౌదామనుకుంటారు కాబోలు ! అటువంటి ఒక మహాశయుడికోసం మేం తెగవెతుకుతున్నాం. ఆ మహనీయుడు ఈ పట్నంలోనే వచ్చి దూరినట్టు గట్టిగా తెలిసింది. కాని పదిలక్షలకుమించిన జనసంఖ్యవుంది ఈ పట్నంలో. వెంట్రుకలుకాదుకదా !— దువ్వెన పుచ్చుకు దువ్వేస్తే పేను బయటపడిపోటానికి ? అందరూ పెద్దమనుషులేనయ్యే. రకరకాలపెద్దమనుషులు ! రకరకాల స్వాతంత్ర్యం ! ఇది స్వతంత్రయుగం. కాని ఈ స్వతంత్రాన్ని అణచిపెట్టివెయ్యవలసినపని మా పోలీసులమీద పడింది. ఇది మా దౌర్భాగ్యం. మీఅభిప్రాయం ఏమిటి మిసెస్ మోహినీ ! అది మా దౌర్భాగ్యం అంటారా, కాదంటారా ? కుర్రవాళ్లు, యువకులు — ఉడుకునెత్తురాయెను. అతిశయించిన ఆవేశాలు కాకపోతే యేమిటి మరి !

చెడో మంచో ఒక దారిలో పడ్డాక వాళ్ళ రక్తపుపొంగు ఎవరాపగలరు?.... నేనుమాత్రం అటువంటివాళ్లను చూస్తే చాల గర్వపడతాను చెప్పద్దూ. ప్రపంచం మాటుమణిగినప్పుడు వాళ్లు లేచివస్తారు. వాళ్లు చూపించే శౌర్యానికీ, చమత్కారానికీ మనం ముగ్ధులమైపోవలసిందే. దేశమాతకు సుపుత్రులంటే వాళ్లే నిజంగా. నేను పోలీసుఉద్యోగంలో వున్నానుగాబట్టి ఈయువకులను ఏమాత్రం రక్షించననీ, నులిమిపేయటమే నా పని అనీ మీరు భావిస్తున్నారా యేమిటి? పొట్టకోసం నౌకరీ చెయ్యాలిగా! ఉద్యోగధర్మం ఏదో విధంగా నిర్వహించాలి. అంతేగాని, నిజం చెబుతున్నాను మిసెస్ మోహినీ! నాకూ హృదయం వుంది; స్వాతంత్ర్యం విలువ నాకూ తెలుసు; దానికోసమైన కర్తవ్యమూ నేను గుర్తించగలను....మీ అతిథిపేరేమన్నారూ?"

ఆకస్మికంగా వచ్చిన అ ప్రశ్నకు మోహిని క్షణమాత్రంగా విచలిత అయింది. కాని వెంటనే నిగ్రహించుకుంది. నవ్వుతూ "మీరు మాకెంతో సన్నిహితులుకదా! మా యింటికి వచ్చిన అతిథిపేరేమిటో ఇంతవరకూ మావారివి అడిగి తెలుసుకోనేలేదా? అదేమిటండీ! అడగనేలేదా మా వారిని మీరు?"

చడ్డా తన ప్రతిభను కోల్పోలేదు. "ఔనౌను, ఇలా గొడవల్లో పడి కొట్టుకుంటూ పేరుకూడా అడిగి తెలుసుకోలేదు. ఎలాగూ ఇక్కడికి వస్తాను కదా, వచ్చినప్పుడు...."

"నేను చెబుతాలెండి. మిస్టర్ సహాయ్ అతనిపేరు. ఇందాక 'తమాషా వ్యవహారం' అంటూ చెప్పారే! పోలీసులు తమ కర్తవ్యంలో ఏవిధమైన లోపమూ రానీయకూడదు. ఆసంగతి నేను గట్టిగా చెబుతున్నాను. ఈ మన సమాజవ్యవస్థను యావత్తూ ధ్వంసీపటలం చేసివెయ్యాలని కూర్చున్నపిళ్లతో మీరు లోలోపల చేతులు కలుపుతున్నారన్న విషయం నాకింతవరకూ తెలియదుసుమండీ! కర్తవ్యం కర్తవ్యమే. లోపాయకారీగా చేతులుకలపటం తప్పే. నేరస్తులపట్ల సానుభూతి పనికిరాదు. అది చాలపెద్దనేరం. చూడండి, సూపరింటెండెంటుగారూ! వాళ్లు లూటీలు, దొంగతనాలు విచ్చలవిడిగా చేస్తూ దేశంలో అరాజకపు పరిస్థితులు తెచ్చిపెడుతున్నారు. అటువంటివాళ్లను మీరు క్షమించి ఊరుకోటమేకాకుండా, చాటుమాటున రెచ్చగొడుతున్నారుకూడా

నన్నమాట! మీ మాటల్నిబట్టి అదే అర్థమౌతున్నది. మీరొక బాధ్యతగల పోలీసు ఆఫీసరు. మీరే ఇలా మెత్తమెత్తగా ఊరుకుంటే ఇక మేము ఎవరి మీద ఆశపెట్టుకుని యేంలాభం? మేమంతా శాంతిభద్రతలు కోరుతున్నాం. ప్రభుత్వచట్టంమీద, పోలీసుశాఖమీద భరోసాపెట్టుకుని వున్నాం. మీరు ఉన్నారుకదా అని మేము నిశ్చింతగా వుంటున్నాం. ఇప్పుడిక మేము యేమను కోవాలి? 'లాభంలేదు; పోలీసులు లోలోపల వట్టి పిరికివాళ్లే. మా ఆస్తి పాస్తులు, మానమర్యాదలు మట్టిగలిసిపోవలసిందే' అని నిశ్చయంచేసుకో మంటారా! మా యిల్లంతా బాగా పరీక్షగా చూచి మరీవెళ్లండని చెబుదామనే మిమ్మల్ని రమ్మని కబురుచేశాను. నాకూ అనుమానంగానే ఉంది. పైగా ఒక దొంగతనంకూడా జరిగింది మాయింట్లో. కొంచెం విలువైన నగలే దాచి పెట్టిన పెట్టె ఒకటి ఎత్తుకుపోయారు. నేనిప్పుడాసంగతి రిపోర్టుచేస్తున్నాననుకోకండి. ఊరికే మీతో చెబుతున్నాను, అంతే."

మిస్టర్ చడ్డా ఆశ్చర్యంగా చూచాడు. "మీయింట్లో దొంగతనమా? ఎప్పుడూ? ఎలా జరిగిందబ్బా! నాకు చెప్పనేలేదే!"

"ఔను, చెప్పలేదు. ఇప్పుడైనా నేను రిపోర్టు రూపంలో చెప్పటం లేదు. తప్పిళ్ళు అన్నీ తెలుసుకునిమాత్రం మీరు చేసేదేముంటుందీ?

"అలాగ అనకండి. మేము మా కర్తవ్యాన్ని నెరవేర్చాలంటే మీరు మాకు మద్దతు ఇవ్వాలి మరి! ఎప్పుడు జరిగింది ఇదీ? ఏమేమివస్తువులు పోయాయి?"

"ఎప్పుడు జరిగిందో చెప్పలేను. ఇవాళే తెలుసుకున్నాం. నాలుగు వస్తువులు పోయాయి. వాటివిలువ సుమారు పదిపన్నెండువేల రూపాయలు ఉంటుంది....కాని ఇదివరకే చెప్పానుగా; ఇది రిపోర్టుకాదు....ఇలాంటి అక్రమాలు సాగిపోతున్నవి మరి! మీరేమో అటువంటివాళ్ళపట్ల సానుభూతి ఉండాలన్నట్టుగా చెబుతున్నారు. మీపని ఒకటైతే మనస్సు వేరుగా వుంటున్న దన్నమాట! న్యాయరక్షణ మీ పని అయితే, మీ మనస్సుమాత్రం న్యాయ విరుద్ధంగా పోతున్నదన్నమాట. ఇలాగని నేనెప్పుడూ అనుకోలేదుసుమీ! మా బారిస్టరుగారి మాటల్లోకూడా నాకెప్పుడూ ఈ రహస్యం స్ఫురించనే లేదు!"

యస్.పి. ముఖంలో కొంచెం గంభీరముద్ర వచ్చింది. "క్షమించాలి మిసెస్ మోహినీ! మీరు నన్ను అపార్థంచేసుకోవద్దని మనవి. అక్రమాలు సాగుతున్నాయంటే.... అది మా లోటుకాదు. నేటికాలపు విద్యావిధానమే అలా ఉంది. దానిఫలితమే ఇదంతా. ఈనేరస్థుల్లో అధికసంఖ్యాకులు బాగా చదువుకున్నవాళ్ళే. అటువంటివాళ్ళయెడల సానుభూతి అంటే—"

"నాకు అర్థం అయింది లెండి", మోహిని నవ్వింది, "క్షమించండి, ఇంకోవిషయం చెబుతారూ? మీరేం చేస్తున్నట్టు మరి? అక్రమాలు, దుండగాలు మితిమీరిపోతున్నాయికదా! ఆనాడు రైలును కూలదోయటం జరిగింది. ఆసంఘటనవిషయమై ఇంతవరకు మీరు ఏమి దర్యాప్తుచేసినట్టు? ఎవరినో వాళ్ళనూ, వీళ్ళనూ తీసుకువచ్చి జైల్లో పెట్టారు. కాని వాళ్ళంతా పాపం, నిరపరాధులు, అమాయకులు. ఈవిధంగా శాంతికాముకుల జీవితాలు రక్షణ లేకుండా ఆపదలకు గురిఔతున్నాయని మీమనస్సుకు తట్టటంలేదా?"

చడ్డా మోహినిముఖంలోకి స్థిరంగా చూచాడు. "ఆ దుండగీడు త్వరలోనే మాచేతులో చిక్కుతాడనే ఆశిస్తున్నాం. వాడు ఈ పట్నంలోనే వచ్చి దాగియున్నట్టు నిశ్చయంగాతెలిసిపోయింది....క్షమించాలి మిసెస్ మోహినీ! మీ అతిథిని వచ్చి కలుసుకోవాలనే అనుకున్నాను."

మోహిని నవ్వింది. "నాకు ఎందుకు కబురుచెయ్యలేదు మరి! ఫోనులో చెబితే ఏర్పాటుచేసేదాన్నేనే. మీరు నాకు పరిచితులుకూడాను. చాల సంతోషించేదాన్ని! ఒకరోజా, రెండురోజులా? ఎనిమిదిరోజులున్నాడుకదా ఇక్కడే. ఇప్పుడైతే వెళ్ళిపోయాడాయెనుమరి...."

"క్షమించండి. మీరు ఇంకోవిధంగా అనుకోకండి. మాకు పైనించి గట్టి తాకీదులే వస్తున్నాయి. గడచినవారమంతా మేము ఆవిషయమే పరిశీలిస్తూ చాల శ్రమపడ్డాం. కాని ఎంతకూ అంతుచిక్కలేదు. నేను మనసులో ఎంత ఆందోళనపడుతున్నానో మీరు ఊహించగలరనుకుంటాను. ఫలితం దక్కకపోతే చేసిన శ్రమ అంతా బుగ్గిపాలైనట్టేకదా! పైపెచ్చు నేను ఉద్యోగంకూడా మానుకుని వెళ్ళిపోవలసివస్తుంది."

అతన్ని అంతకన్నా ఎక్కువగా వాగించదలచుకోలేదు మోహిని. "పోనీండి, దానికేంలెండి. మీకు శ్రమ ఎక్కువేపాపం! బాధ్యత నెత్తిమీద

వున్నప్పుడు మానసికమైన ఆందోళన ఎక్కువగా వుంటుంది, నిజమే. ఇంతకూ నన్నేంచెయ్యమంటారో చెప్పండి. మాయింట్లో జరిగిన దొంగతనం మాట మరిచిపొండి. దానివల్ల మీకు అనవసరంగా శ్రమ ఎక్కువౌతుంది. మీకు వలసినంత సహాయం చెయ్యటమే నా ఉద్దేశం. ఇంతకూ అసలు మీ అనుమానం ఇటువైపు ఎలా ప్రసరించిందీ?"

"ఏమో నాకే తెలియదు. రైలుసంఘటన జరిగిన ముందురోజే ఒక అతిథి మీయింటికి వచ్చినట్టు....మాటలసందర్భంలో బారిష్టరుగారు అన్నారు. అతనికి జ్వరం వచ్చిందనీ, ఇక్కడే వుంటున్నాడనీకూడా తెలిసింది. సరే, వెళ్ళి చూడాలి అనుకున్నాను. పోనీలెండి, అయిపోయిందిగా!....ఎప్పుడు వెళ్లాడు ఇక్కడినించి?"

"బాగానే ఆరోగ్యం చిక్కింది. నిన్న సాయంత్రమే వెళ్ళిపోవాలన్న ఆలోచనలో వున్నాడు. నాతో చెప్పాడు; నేను సరేనన్నాను. రాత్రి మేము తిరిగివచ్చేసరికి బాగా పొద్దుపోయింది. వెళ్ళిపడుకున్నాను. ఏ రాత్రప్పుడో రైలువేళ చూచుకుని వెళ్ళిపోయివుంటాడు."

చడ్డా మోహినిముఖంలోకి చూచాడు. "మీ నౌకర్లను అడిగి, అతడు ఎప్పుడు వెళ్ళిపోయిందీ సరిగ్గా తెలుసుకోలేదా మీరు?"

మోహినికూడా అతని కన్నుల్లోకి చూస్తూ మందహాసం చేసింది. "ఉహుఁ. తెలుసుకోలేదు" అన్నది. మళ్ళీ వెంటనే అందుకుని "ఇప్పుడు అడిగి తెలుసుకోనా? పిలిపించమంటారా నౌకరును?" అన్నది.

మందహాసపూర్వకమైన ఆమె ముఖకవళికలో ఒక వ్యంగ్యరేఖకూడా కనిపించింది సూపరింటెండెంటుకు. "వద్దులెండి; ఎందుకూ?" అన్నాడు.

కాని మోహిని బటన్ నొక్కి గంట మోగించింది. నౌకరును పిలిచి అడగవలసిందేనన్న సన్నద్ధత కనిపించింది ఆమెలో. కొంచెం అప్రసన్నురాలైనట్టుకూడా కనిపించింది. సూపరింటెండెంటుకు మనసులో అనుతాపం కలిగింది. మోహిని సమక్షంలోకి వచ్చాక అతనిలో ఒక విజయ ఆకాంక్ష పొడసూపింది మొదట. కాని క్రమేణా....తాను ఓడిపోవటమే మంచిదనట్టు భావన కలుగసాగింది. మొదట అతనిలోని పౌరుషం సవాలుచేసింది. కాని చివరకు అదే పరిక్రాంతమైనట్టు తోచింది. కాని ఇప్పుడు మళ్ళీ విజయం

చేతిలోకి వస్తున్నట్టు కనిపించింది. కాని చేయిచాచి ఆ విజయాన్ని అందుకో లేకపోతున్నాడు. అలా అందుకోటం హైన్యం అనుకున్నాడేమో! అలా అందుకుంటే తన పౌరుషం పరాజితమైనట్టేనని భావించాడేమో! పౌరుషం విజయంపొందాలంటే పురుషుడు పరాజితుడు కావటమే సముచితమా ఇటు వంటి సమయంలో?

నౌకరు వచ్చాడు. అతనితో మాటాడ్డాకి ఆమెకు అవకాశం ఇవ్వలేదు యస్. పి. తానే అతన్ని పలుకరించి "నువు వెళ్ళి మా డ్రయివరుతో కారు ఇంటికి తీసుకుపొమ్మని చెప్పు. మళ్ళీ తీసుకురానక్కర్లేదు. నేనే వచ్చేస్తానని చెప్పు" అన్నాడు. నౌకరు వెళ్ళిపోయాడు.

"మిసెస్ మోహినీ! క్షమించాలి! ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది నాకు; వచ్చేటప్పుడు ఇంట్లో చెప్పారు: వీలుగావుంటే కారు వెంటనే తిరిగి పంపిం చెయ్యమని. మాటలసందర్భంలో మరచిపోయాను. మీ కారులో పంపిస్తారుగా నన్ను?"

మోహిని అతని ముఖంలోకి సాశ్చర్యంగా చూచింది. అతనిపట్ల కృతజ్ఞతాభావం మనసులో ఉత్పన్నమైంది. కాని అతనిచేతుల్లో తాను ఓడి పోయినట్టుగాకూడా ఒక అనుభూతి కలిగింది. అందువల్ల హాసపూర్వకంగా ఇలా అన్నది: "మా కారులో వెళ్ళచ్చులెండి, కాని ఇంతకూ మీరు అడగనే లేదేం మా నౌకరును: అతిథి ఎప్పుడు వెళ్ళిపోయాడు అని?"

"అది మీపని. తీరిగ్గా వున్నప్పుడు మీరే అడగండి."

అతని మనస్సులోని సందేహం బాగా బలపడిపోసాగింది. ఏమైనా, ఇక ఈవిషయాన్ని ఏమాత్రం తన మనస్సులోకి రానియ్యకూడదనుకున్నాడు. కాని అతనికది సాధ్యం కాలేదు. అక్కడినించి తొందరగా లేచి వెళ్ళుదా మనుకున్నాడు.... మోహినిని రక్షించవలసినభారంకూడా ఇప్పుడు తనపై పడినట్టు, ఇక ఆ అతిథినిగురించిగాని, అతనికి సంబంధించిన ఏవిషయం గురించిగాని ఆమెతో ప్రసంగించకూడదనుకున్నాడు. తన్నుతాను సమాధాన పరుచుకునేందుకు ప్రయత్నించాడు: అంతా సవ్యంగానే జరిగిపోయిందనీ; అసంగతం ఏమీ లేదనీ; అందరూ వచ్చినట్టే ఒక అతిథి వచ్చాడు, అందరూ వెళ్ళినట్టే అతడూ వెళ్ళాడు; అంతా విధివిధానంగానే సాగిపోయింది అనీ.

మోహిని ఇలా చెప్పసాగింది: "ఎనిమిది సంవత్సరాలక్రితం అతడు నా సహపాఠి. తరువాత ఏదో వ్యాపారంలో వెళ్ళాడు కాబోలు! చదువులో నాకు అతనివల్ల కొంత సహాయం జరిగింది. ఏమిటబ్బా ఆ సరుకు....ఆ సరుకు....ఆప్రాంతంనించి ఎగుమతి అయ్యేది....మిరియాలో,లవంగాలో.... ఏదో అటువంటిదే ఒక వ్యాపారంలో వున్నాడు. అలాగనే చెప్పాడు. కాని నేనైతే అదంతా జ్ఞాపకం వుంచుకోలేదు...."

యస్. పి. వింటూ కూర్చున్నాడు. వినటం అతనికి కష్టం అనిపించింది. "పోనిద్దురూ! ఇప్పుడెందుకు ఆవిషయాలన్నీ. అతడు వెళ్ళిపోయాడుకదా? ఇంకెందుకు? చెప్పకండి ఆ సంగతులన్నీ."

ఇంత చౌకగా లభించిన ధైర్యానికి సంతోషించలేదు మోహిని. తన ప్రతికక్షికి తనమాటమీద పూర్తినమ్మకం కలిగించాలనీ, అతన్ని పొంతం నిరస్త్రునిచేసి కూర్చోబెట్టాలనీ ఒక స్పర్ధ ఆమెలో బయలుదేరింది. "రాగానే అతడు జ్వరం పడ్డాడు. న్యూమోనియా లక్షణాలు కనిపించాయి. మతి చెడిపోతుందేమోననికూడా భయపడ్డాం. కాని డాక్టర్ కపూర్ మంచి మందులిచ్చి వ్యాధిని అదుపులోకితెచ్చాడు. నర్సుకూడా చక్కగా ఉపచారాలు చేసింది. త్వరలోనే, సుమారు నాలుగైదురోజుల్లోనే మామూలు ఆరోగ్యం వచ్చేసింది."

మోహిని ఇలా చెప్పుకుపోతూవుంటే చడ్డాకు కష్టంగానే ఉంది. ఆమెలోని బుద్ధిచాకచక్యాన్నీ, ప్రౌఢతనాన్నీ గమనించవలెనన్న ఉత్కంఠ మొదట అతనిలో ప్రవేశించింది. క్రమేణా ఒక స్పర్ధ అతనిలో జాగృతం ఔతూ వచ్చింది. ఆయువతి అతనికి అత్యంత స్పృహణీయము, కమనీయము అయిన మూర్తిలా తోచింది. ఆమెరూపం, వంశం, వాక్చాతుర్యం అన్నీ చూచి అతడు పరాభూతుడైనాడు. ఆ పరాభవంలోనించే అణచుకో శక్యంగాని ఒక ఆకాంక్ష అంకురితమై సాగివచ్చింది. ఆయువతి అలాగ తన సమక్షంలో సంజాయిషీ చెప్పుకుంటున్నట్టు మాటాడ్డం అతనికి ఇష్టం లేకపోయింది; కష్టం కలిగింది. ఆమె అటువంటి నతన్రమస్థితిలో పడటం అతనికి నచ్చలేదు. అన్నాడు: "మీ అతిథితో కలిసి మాటాడలేకపోయినందుకు నేను విచారిస్తున్నాను. కాని అతడు మళ్ళీ త్వరలోనే ఇక్కడికి

రాగలడని నేను ఆశించవచ్చునా? అప్పుడుమాత్రం నాకు అవకాశం ఇవ్వండి; మరచిపోకండి."

సూపరింటెండెంటు ఈ నాలుగుమాటలు పలికేసరికి మోహిని ఒక అయోమయస్థితిలో పడిపోయింది. తానే గెల్చిందా? లేక తానే ఓడిపోయిందా? ఏసంగతీ తెలియక చాల తికమకపడిపోయింది. ఎందువల్లనంటే— సూపరింటెండెంటు ఇక ఎక్కువసేపు అక్కడ వుండలేదు. ఉన్నకాసేపూ మళ్లీ ఆప్రసంగాన్ని రానీలేదు. మోహిని ఇచ్చిన ఆతిథ్యాన్ని స్వీకరించాడు. ఆమె తన కారు ఏర్పాటుచేసింది; వెళ్లిపోయాడు.

మొదట సూపరింటెండెంటును తనయింటికి పిలిపించుకున్నప్పుడు మోహిని మంచి ఆత్మవిశ్వాసంతోనే వుంది. ఆమెకు ఏవిధమైన సందేహమూ లేదప్పుడు. తన బుద్ధి చాకచక్యంమీద, సౌందర్యంమీద, కౌశలంమీద పరిపూర్ణమైన నమ్మకం ఉన్నది. భర్తతో చెప్పి, అతని అనుజ్ఞపొంది తాను స్వతంత్రంగా సూపరింటెండెంటును కలవాలనుకుంది. సూపరింటెండెంటు రావటమూ అయింది; వెళ్లిపోవటమూ అయింది. ఇప్పుడు ఆమెలోని ఆత్మవిశ్వాసం లోలోపలనే స్ఖలితం అయిపోయింది. తనకు తానే విసుక్కుంది; కోపగించుకుంది. వెళ్లి అద్దంలో చూచుకుంది. ఔను తానే! ఓటమియెరుగని సౌందర్యమే! మరి ఇలా తారుమారైందేమిటి? ఆమెకేమీ అర్థంకాలేదు. ఇంతకూ సూపరింటెండెంటు తన అనుమానం నివృత్తిచేసుకుని వెళ్లినట్టా? అనుమానం ఇంకా బలపడి వెళ్లినట్టా? ఏమో, ఆమె కీవిషయమై ఒక నిశ్చయం ఏర్పడినట్టులేదు. మాటిమాటికీ అతనికీ తనకూ జరిగిన సంభాషణ యావత్తూ సందర్భంతప్పకుండా నెమరువేసుకున్నది. కాని అందువల్ల ఆమెకు ఎక్కడా ఏమాత్రం పరితృప్తి దొరకటంలేదు.

మన తెలివితేటలమీద భరోసాపెట్టుకుని ఇలాగే చేస్తూవుంటాం. సత్యాన్ని విడిచిపెట్టేస్తాం. అబద్ధానికి ముసుగు కప్పుతాం. అబద్ధానికి కాళ్ళు ఉండవు, అది నడవలేదు. సత్యంయొక్క కాళ్ళు ఎరువుతెచ్చుకుని వాటిమీదనే అది నడవాలి. మన బుద్ధిచాకచక్యాన్ని పురస్కరించుకుని దాన్నే నడిపించాలని మనం పట్టుపడితే, ఆ పట్టుకాస్తా సడలిపోతుంది; మనం ఓడిపో

తున్నాం అని స్ఫురిస్తూఉంటుంది. కాని ఆ ఓటమి మనదికాదు ; ఆ అబద్ధానిదే. అలాగే గెలుపుకూడా మనదికాదు ; సత్యానిదే.

అయితే సత్యం అంటే యేమిటి ? అన్ని స్నేహసంబంధాలనూ త్రోసివేసుకుంటూ పోవటం....అదే సత్యమా? స్నేహసంబంధాల్లోని పవిత్రతను, ఆంతర్యాన్ని నిరలంకృతంగా, నిరాలంబంగా చేసివెయ్యటమేనా సత్యం అంటేను ? కాకపోతే ఈ ప్రపంచంలో ఎలా మెలగాలిమరి ! లోపలవున్నదంతా బయటికి రావటంకోసంకాదు. మనలో ఏహ్యమైన పనికిమాలిన అపరూపం ఒకటి లేదా ? అది లోపలే ఖైదీగా ఉన్నది ; అదే మనకు ఓదార్పు. పైకి సురూపం, లోపల అపరూపం. ఇలా వుండటం సముచితమేకదా ? ఇందులో వైపరీత్యం ఏముందీ ? పైకి సురూపం కనిపించనీకుండా, అపరూపమే బయటపడి అన్నివైపులా వ్యాపించిపోవటం....అదే సత్యమా ?

ఇది చిక్కుసమస్యే. తేలిగ్గా పరిష్కారమయ్యేది కాదు. దాన్ని పరిష్కరించటమే ఒక సాధన ; చాల కఠినమైన సాధన. సాధించినవాడే యోగి. స్నేహాన్నీ, సత్యాన్నీ సమన్వయం చెయ్యగలగటమే సాధన. సత్యము ఒక్కటే. అది అఖండము, నిరవలంబము, సంగరహితము, బంధరహితము. స్నేహం సంబంధాల్ని వెతుక్కుంటుంది. వీరి, వారి, అందరి సాంగత్యము కావాలి దానికి. తనలో తాను నిస్సంగిగా వుండదు. ఇతర్లలో ఆలంబనం పొంది వుంటుంది. కనుక అది అన్నిదిక్కులా సంబంధాల్ని సృష్టిస్తూ ఉంటుంది. సంబంధాలన్నీ చివరకు బంధనాలే. స్నేహము ఈ బంధనాల్ని విరచించి వ్యాపింపజేస్తూవుంటుంది. ఆ తీగల్లోనే మనిషిని బంధించి వుంచుతుంది....ఏకాకియై నీరసించిపోకుండా, స్వప్నతుల్యుడై ఎగిరిపోకుండా.

ఈ రెండింటికీ....సత్యానికీ, స్నేహానికీ....ఎలా సంయోగం సిద్ధిస్తుందో అది భగవంతునికే తెలియాలి. కాని ఏమైనాసరే మానవుడు సాధించవలసింది అదే. స్నేహాన్నీ విడిచిపెట్టకూడదు; సత్యాన్నీ త్రోసిరాజనకూడదు. స్నేహమే అతని జీవనం; సత్యం అతని జీవ్యం అనగా జీవింపతగినది. అవి రెండూలేక వ్యక్తేలేడు. కాని ఈ రెండింటిమధ్య పరిపూర్ణసామంజస్యం లేకపోవటమనేదే అతని సమస్య. ఈ సమస్యాపూర్తిలోనే అతని పురుషార్థం ఇమిడివున్నది.

మోహిని తనలో రేగిన విసుగుదలను, కోపాన్ని నిగ్రహించుకోలేక పోయింది. ఏమిఃచెయ్యాలో ఆమెకేమీ తోచలేదు. టెలిఫోను అందుకుంది. "ఏమండీ, ఇప్పుడే వచ్చివెళ్ళాడు చడ్డా. ఎందుకు పంపించారండీ ఒంటరిగా అతన్ని నాదగ్గరికి ?"

"ఏం ? ఏం? ఏంజరిగిందీ ? నువ్వే పంపించమన్నావుగా !"

"నేనే పంపించమన్నానా ? సరే, పోనీలెండి; మీరతన్ని కలుస్తారా ఇప్పుడు ?"

"కలవమంటే కలుస్తాను పోనీ."

"వద్దులేండి, పోనీయండి. మీరు ఇంటికి ఎప్పుడు వస్తారు ?"

"నీకు తెలుసుగా, వచ్చినప్పుడే !"

"ఏంవచ్చినప్పుడే ! త్వరగా రండి."

"చిత్తం, ఎవరికేసు విచారణ ఇవాళ ? నాకేనేనా ?"

"మీకెప్పుడూ నవ్వులాటే. చప్పునరండీ."

"చిత్తం రాణీగారూ, అలాగే. భృత్యుడు ఆరు అయేసరికల్లా హాజరౌతాడు. ఇంకేమైనా ఆజ్ఞ !"

మోహిని ఫోను అవతల పెట్టేసింది. ఇంకా ఆమె మనస్సుకు స్థిమితం చిక్కలేదు. ఏమిఃటో హృదయంలో తీరనిలోటు ! ఏమిచెయ్యాలితాను ? ఏమిచెయ్యాలని తన తలంపు ? తన మనస్సు తనకే బోధపడటంలేదు. తన యింట్లో జరిగిన చోరీవిషయంకూడా చెప్పేసింది. ఎందుకు చెప్పిందో తనకే ఆశ్చర్యంగా ఉంది ఇప్పుడు. అది తన సొంతవిషయం. తనకు ప్రత్యేకంగా నష్టంవాటిల్లిన సంఘటన. అవసరంవచ్చినప్పుడు తన భర్తకు చెప్పుకుంటుంది. అంతేగాని అందరికీ చెప్పుకోటం ఎందుకూ ? ఈ సంఘటనకూడా చడ్డా తన అనుమానానికి జోడించడుకద !....బలేపనే జరిగిందే ! ఈ అభాగ్యుడు (జితేన్) ఎక్కడ వుంటున్నాడోయేమో ? జాడ జవాబు తెలియకుండావుందే ! తీసుకుపోతే తీసుకుపోయాడు సొమ్ములు; చస్తే చస్తాడు తన గొడవల్లో తాను చిక్కుకుని. నాకు వచ్చి చుట్టుకున్నదికదా....ఈ ముళ్లకంచె అంతా !....వ్యథగాని, విచారంగాని స్పష్టంగా రూపుకట్టలేదు ఆమె హృదయంలో; గజిబిజిగా చిక్కుపడిన దారాలవలె వున్నాయి భావాలు.

అభిమానం దెబ్బతిన్న ఆవేశం ఒకవంక పొంగి నురుగులు గ్రక్కుతున్నది. మామూలుపరిస్థితిలో అయితే ఆమెకు కర్తవ్యచింతన, కర్తవ్యభారం ఉండవు సాధారణంగా. కాని ఇప్పుడామె మామూలుపరిస్థితిలో లేదు; అతిక్రమించి చాలదూరం దాటిపోయింది. లోపల ఒక పరాభవయాతన రగులు కుంటున్నది.

అకస్మాత్తుగా ఆమెకు ఆ ఉత్తరంమాట జ్ఞాపకంవచ్చింది....పొద్దున తాను కుర్చీమీది మెత్తకింద దాచిన ఉత్తరం....దానిసంగతే మరచిపోయింది ఇంతవరకూ. ఇప్పుడు తొందరగా బయటికి తీసి చదివింది. ఒకసారి, రెండు సార్లు. కొంతసేపు ఉత్తరం అలాగే చేతిలో పట్టుకుని ఆలోచించింది. ఏదో ఒక ఆశారేఖ ఆమె ముఖఫలకంలో ప్రతిఫలించింది. తన హృదయవేదనకు సమాధానం లభించినట్లు తోచింది. ముఖంఎత్తి గోడగడియారంవైపు చూచింది. బటన్ నొక్కి నౌకర్ని పిలిచింది. "ఇవన్నీచూడు. ఇక్కడ ఎలా పడివున్నాయో! తీసి శుభ్రంచెయ్యాలని తెలియదూ అంతమాత్రం! ఊఁ. తీసెయ్యి త్వరగా" అన్నది కోపంగా.

నౌకరు ప్లేట్లు, కప్పులు సర్దేస్తూఉంటే చూస్తూ నిల్చుంది మోహిని. అవి తీసుకుని వాడు వెళ్లిపోతూవుంటే "ఇదిగో, మన మోటారు వచ్చిందేమో చూడు. వస్తే నాకు కబురుచెప్పు" అన్నది.

నౌకరు వెళ్లివచ్చి కబురుచెప్పాడు: మోటారు వచ్చేసిందని. "పోర్చిలో తీసుకువచ్చి పెట్టమని చెప్పు" అన్నది దూకుడుగా మోహిని.

"చిత్తం" అంటూ నౌకరు వెళ్లిపోయాడు.

మళ్లీ ఒకసారి ఉత్తరం తీసి గాఢంగా చూచింది. అందులో చిరునామా సగమే వుంది. ఆచోటు ఎక్కడో మనసులో ఊహించి తెలుసుకోవాలని ఆమె కోరిక. కాని స్పష్టంగా ఏమీ గోచరం కావటంలేదు. ఇంతలో పోస్టుబంట్రోతు వచ్చి ఉత్తరాలేవో ఇచ్చి వెళ్లాడు. వాటిలో తనపేర వచ్చిన ఉత్తరం ఒక్కటే వుంది. ఆమె దాన్ని చించి చూచుకుంది. పైన ఊరుపేరు లేదు; క్రింద మనిషిపేరూ లేదు. రెండే పంక్తులు రాసి ఉన్నాయి. "ప్రపంచంలో ఇటువంటి దుష్టులుకూడా వుంటారా అని అనుకుంటున్నావుకాబోలు

విహంశా! ఔను, ఉంటారు. అంతేకాదు, క్షమాపణచెప్పుకోవలసిన ఆవశ్య కతకూడా వాళ్లకు ఉండదని తెలుసుకో."

ఒక్క క్షణకాలం ఆ ఉత్తరాన్ని అలాగే చేతిలో పట్టుకుని ఉండి పోయింది. మరుక్షణమే దాన్ని చిన్నిచిన్నిముక్కలుగా చించేసి, తుక్కు కాగితాలబుట్టలోకి విసిరిపారేయాలనుకుంది--- కాని అలా చేయలేదు; కుర్చీ మెత్తకిందనే పెట్టి, గబగబా పోర్చిలోకి వెళ్లింది. "నువు అక్కర్లేదులే" అన్నది డ్రయివరుతో. తనే కారు నడుపుకుంటూ వెళ్లిపోయింది.

అప్పుడు మూడుగంటలౌతుంది. ఎండ తీక్షణంగానే వుంది. కాని ఆమె మోటారులో తిరిగింది, తిరిగింది. కాని ఆచోటు ఎక్కడో ఆచోకీ తెలుసుకోలేకపోయింది. తనదగ్గర పూర్తిచిరునామా లేదాయెను. సగమే రాసి వున్నది. గంటసేపటికిపైగా వృధాప్రయాసపడి చివరకు ఇల్లుచేరుకుంది. తలభారం అనిపించి విశ్రాంతిగా పడుకుంది భర్తరాకకోసం ఎదురుచూస్తూ.

# 15

"చడ్డా తన్నుగురించి తాను ఏమనుకుంటున్నాడేం? తానే మహా తెలివైన వాడిననుకుంటున్నాడా" అన్నది మోహిని నరేశుడు రాగానే.

"ఏం? నీకు కోపం తెప్పించాడేమిటి? మనిషి మంచివాడేనే! ఏం జరిగిందేమిటి?" సాశ్చర్యంగా అడిగాడు నరేశుడు.

"మాటలసందర్భంలో నేను అన్నాను: 'అతనికి బాగానే ఆరోగ్యం చిక్కింది; వెళ్లిపోడానికి శక్తివచ్చింది; మేము రాత్రి ఆలస్యంగా వచ్చాం; ఈలోగా రైలుటైము చూచుకుని అతడు వెళ్లిపోయాడు' అని. దానిమీద అతడు ఊరుకోవచ్చునా! ఏమిటేమిటో అడగసాగాడు. అలా అడగటానికి అతనికేమధికారముందీ? నామాట విశ్వసించకపోవటానికి అతనికేమి హక్కు ఉందీ?"

"ఔను, ఏమీ హక్కులేదు అతనికి" అన్నాడు నరేశుడు చిరునవ్వు నవ్వుతూ...."ఎందుకూ? అతన్నే పిలిపించి చెప్పేస్తాముండు 'నీకేమీ హక్కులేదు అబ్బాయి' అని."

# జితేంద్రుడు

మోహినికి కోపం వచ్చింది. "మీకు ప్రతిదీ నవ్వులాటగానే వుంటుందేం మరీను. సమయంకనిపెట్టి అయినా సరిగా మాటాడండి!"

నరేశుడు నవ్వాడు. "చిత్తం, సమయం కనిపెట్టాను. సరిగానే మాట్లాడుతున్నాను. ఊఁ, చెప్పండి, ఏమి సెలవు?...."

"ఇప్పుడు నన్నేంచెయ్యమంటారో చెప్పండిమరి."

"సముచితమైనమాట చెబుతాను. ఏమీచెయ్యకుండా కూర్చోండి! ఇప్పట్టున అదే మీరు చెయ్యవలసినపని. హాయిగా, సుఖంగా, విశ్రాంతిగా కూర్చోండి. ఏప్రసంగంలోనూ జోరబడబోకండి. వచ్చినమహనీయుడు ఎవరో పోయాడుకదా! పోనీయండి, పీడావొదిలింది. అతని ప్రారబ్ధం అతనిది. విధి, ప్రారబ్ధం కొనసాగిస్తున్నలీల అది. అందులో మనం చేయగలిగిందేముంది? అందులో జోక్యం కలుగజేసుకోకుండా దూరంగా ఉండటమే మనం చేయగలిగిందెల్లా. ఏం, యేమంటారు? సమయంకనిపెట్టి సరిగ్గా చెప్పానా లేదా?"

మోహిని అతనివైపుచూస్తూ ఉండిపోయింది. అతడు తన భర్త. కొన్ని సంవత్సరాలుగా అతనితో కాపురంచేస్తూ ఉన్నది. అయినా అతన్ని తాను పూర్తిగా అర్థంచేసుకోగలిగిందా? అతనిమాటలు ఆమెకేమాత్రమూ బోధపడలేదు. "ఇంతకూ మీరేమి ఆలోచించారు?" అని అడిగింది.

"ఆలోచించటమా? ఉహుఁ. అలాంటిపని మనం ఎన్నడూ చెయ్యమే! అయితే తమరు సెలవిచ్చేదేమిటి? నన్ను ఆలోచించమంటారా?"

"చడ్డా ఉద్దేశం యేమిటంటారు?"

"అసలు అతనిఉద్దేశం ఎలా వుండాలని మీరు అనుకుంటున్నారో అదే నాకు అర్థంకావటంలేదు. బహుశా మీరు ఇద్దరూకూడా ఒకరినొకరు బోల్తాకొట్టించాలని ఆలోచిస్తున్నట్టు తోస్తుంది. యేమంటారు? అంతేనా?"

"నాకు బోధపడటంలేదు—"

"నేను బోధపరచలేను కూడాను." నరేశుడు కించిత్ గంభీరముద్ర దాల్చాడు. "తెలివితేటలప్రదర్శనరంగం కోర్టు ఉండనేఉన్నది. మతిమంతులంతా తమ బుద్ధిచాకచక్యాన్ని అక్కడ పందెంవేసుకుని ఇష్టంవచ్చినట్టు ప్రదర్శించవచ్చు. నేను వాటికి వినమ్రుడను. ఆ యా తర్కవితర్కాలు

సూచించే నిర్ణయాన్ని సూటిగా గ్రహించేవాడినిమాత్రమే నేను. బుద్ధివక్రత చిక్కులు తెచ్చిపెడుతుందేగాని విషయాన్ని చెప్పదు. సాధారణంగా మనకు చిక్కులమీదే ప్రీతి అనుకుంటాను. చిక్కులు వుంటేనే ఆట మనోరంజకంగా వుంటుందికాబోలు! కాని నిర్వక్రత, పరిశుద్ధత కూడా ఉండవలసిందే. లేకపోతే ప్రపంచమంతా ఒక మాయాజాలంలాతయారై పోతుంది. ఎత్తు పైఎత్తులు. బుద్ధిచాకచక్యాలేతప్ప నిజాయితీ - నిలకడ - లేకుండా పోతుంది. చూడండి, మీ అతిథిమహాశయుడు మంచి బుద్ధిచాకచక్యంగలవారి జాపితాకు చెందినవాడుకాదని మీరు అనలేరనుకుంటాను!"

"అంటే?—" మోహిని గద్దిస్తున్నట్టుగా అడిగింది.

"చడ్డా అటువంటి మనుషులతోనే తనకు సంబంధం లభించాలని కోరుకుంటూ ఉంటాడు. పదును, వక్రతగలవాళ్ళతో. అటువంటివాళ్ళద్వారానే అతనికి పని, అజమాయిషీ లభిస్తాయి. ఇక్కడ అతనికి పనిలేకుండానే పోయింది. ఒకానొక వ్యక్తియొక్క బుద్ధిచాకచక్యం అతనితో పంచెంచరచి దెబ్బతీసింది. నీకు తెలుసుగా: ప్రతిఆటలోనూ రెండు పక్షాలు ఉంటాయి. ఆరెండింటికి సంఘర్షణ. ఇది ప్రాణాలతో సంబంధించిన ఆట. ఇందులో ఓటమి ఎవరూ అంగీకరించరు. సంఘర్షణ స్థిరంగా ఉండిపోతుంది. నేను కోర్టుకు సంబంధించిన ప్రాణిని. అక్కడా ఇద్దరిమధ్య వివాదం. న్యాయం అనేది ఒక బరి. అది ఒకర్ని ఒకవైపున, మరొకర్ని ఇంకోవైపున అట్టి పెడుతుంది. ఇక అక్కడినించి శిక్ష, నేరం అనే జంట విడిపోతుంది. ఆ రెండింటికీ గోదాంలో కుస్తీ సాగుతూవుంటుంది. ఇక్కడ ఒకరకమైన తీవ్రనేరాలు ఎడతెగకుండా సాగుతున్నాయి. వాటికోసంగానే ఉన్నాడు ఈ చడ్డా. ఒక గట్టి ఆఫీసరు. నేరస్థులనబడేవారిలో ఇప్పుడొక మంచి చాకచక్యం గలమనిషి తారసిల్లినట్టు కనిపిస్తుంది. అతడు మన చడ్డాను ముప్పతిప్పలు పెడుతున్నాడు. మీ ఉద్దేశం ఏమిటి? మీ సహాయ్ మంచి చాకచక్యంగల మనిషి కాదూ!"

"నరేశ్!" అన్నది మోహిని దూకుడుగా.

"అహఁ, అన్యథా భావించబోకండి. చురుకుపాలు అధికంగా ఉండటాన్ని నేను మెచ్చుకుంటాను. మందబుద్ధులూ, స్తబ్ధచిత్తులూకూడా

గణనీయులౌతారా? కారు. చురుకు, కరుకు ఉండాలి మనిషిలో. నాకిప్పుడు కలవాడినన్న ఆనందం ఉన్నదికాబట్టి సరిపోయింది గాని, లేకపోతే నేను మాత్రం అటువంటి స్ఫూర్తి పొందకుండా ఊరికేవుంటానంటావా? ఉన్నదిగా: 'హేవ్స్ అండ్ హేవ్‌నాట్స్' (కలవారు, లేనివారు) అనే మాట. ఆ రెండుతెగలమధ్యవుండే వైరుధ్యంలో కొంత ఔచిత్యం లేక పోలేదు. నావుద్దేశం ఏమిటంటే—నేరం చెయ్యనివాడు ఇతర్ల చేత చేయి స్తాడు. చెయ్యటం, చేయించటం—ఈ రెండూ చేతగానివాళ్ళు అసలు లెక్కకే రారు! మీరు ఆశ్చర్యపడనక్కర్లేదు. అది ఆ 'లాజికల్ కరోలరీ' (తర్కసంగతమైన నిష్కర్ష) అంతే! దాక్కునేవాడే ఇతర్లను ప్రోత్సహి స్తాడు. అజ్ఞాతవాసమే ఇతర్లను ప్రోత్సహించేందుకు మూలహేతువు. తెలిసిందా?"

"కవిత్వాలు అల్లబోకండి. ఈ చద్దా అతని వెనక పడ్డట్టే కనిపిస్తు న్నాడు" అన్నది మోహిని గాభరాసూచిస్తూ.

నరేశుడు నవ్వాడు. "వెనకపడ్డట్టు ఎందుకు కనిపిస్తున్నాడు? అతడేం అంత చవటవాజమ్మ కాదు!"

మోహిని అతనిముఖంలోకి చూస్తూ ఉండిపోయింది. ఆమెకు కోపంవచ్చింది. "నాతో వాదిస్తూ కూర్చోటమేనా మీరు చేసే పని? ఎంత సేపు ఈ తర్కం నాతో?"

"చూడండి, విషయం విస్పష్టంకావాలి మరి....ఇరుపక్షాలా.... లేకపోతే మా బారిష్టరీ ఏం సాగుతుంది చెప్పండి!"

"సరే, స్పష్టంగానే చెబుతాను: అతడు నా మొదటి ప్రేమికుడు. ఇక చెప్పండి, మీరు చెప్పేదేమిటో!" అన్నది మోహిని చిరచిర్లాడుతూ.

"ఎబ్బే, నేను చెప్పేదేమీ లేదు. సరే, నెంబరు ఒకటి ప్రేమికుడు. ఊఁ, నెంబరు రెండు?"

"మీరు నన్ను ఈపాశాన చంపిపారెయ్యరేం?" చీత్కారంచేస్తున్న ట్టుగా అన్నది మోహిని. "మ్చ్, అది కేసుకు సంబంధించిన విషయం కాదు. అలా అట్టిపెట్టు. మొదటి అంశం: అతడు నీ ప్రేమికుడు. ఊఁ, రెండో అంశం ఏమిటీ? చెప్పు. త్వరగా. కేసు ముందుకు సాగనీ!" అన్నాడు నరేశుడు తటస్థభావంతో ప్రశాంతంగా.

అలా గుట్టువిప్పుగించి తన ఆ భర్తవైపు చూస్తూ ఉండిపోయింది మోహిని.

"ఇదిగో మోహినీ! నేను గుడ్డివాడినికాదు నా కళ్లు నీ రూపసౌంద ర్యాన్ని చూస్తున్నాయి. చూస్తూకూడా ...మతిమంతుడైనవాడొకడు నిన్ను ప్రేమించకుండా నిగ్రహించుకొనగలడు అని నేను విశ్వసించటం నిజంగా గుడ్డితనమే అనిపించుకుంటుంది. నాప్రదేశంలో నీ సహాయ్ మతిమాలిన వాడేమీకాదు....కాని ఇదంతా అసలు కేసుకు సంబంధించిన విషయం కాదని నా విన్నపం. ఊఁ, తరువాత చెప్పు...."

"రైలు పడవేసింది అతడే!"

"అలానా! అతడా విషయం నీముందు అంగీకరించాడా?"

"ఔను. వచ్చినరోజునే చెప్పాడు."

"మంచి పరాక్రమవంతుడు. ఊఁ, తరువాత?...."

మోహిని ఆశ్చర్యపోయింది. "రాక్షసులు కాదుకదా మీరు?" తటా లున అనేసింది విచలితయై.

"కాదు మోహినీ! మానవుడు రాక్షసుడౌతాడన్నమాట అబద్ధం. ప్రేమికుడు నిజంగా పరాక్రమవంతుడే ఔతాడు. ఊఁ, ఇకపోతే మూడో అంశం ఏమిటి?"

"అతడే బొమ్మలు దొంగిలించుకుపోయాడు."

"బొమ్మలా? ఏంబొమ్మలు?"

"అవే, ఆనాడు మీకు చెప్పానుకదా!"

"ఓహో! నాకు చప్పున అర్థంకాలేదుసుమీ! కాని ఈసంగతి సరిగా పొసగటంలేదే! ఆ పరాక్రమానికీ, దీనికీ పొంతన కనిపించదే! నిన్ను ప్రేమించినవాడు తప్పనిసరిగా పరాక్రమవంతుడే కావాలి. బాపురే, నీకెంత అభిమానం!....ఊహుఁ, ఆగు, నన్ను కాస్త ఆలోచించుకోనీ."

మోహిని నిర్ఘాంతపోయి అతనివైపు చూస్తూ ఉండిపోయింది.

నరేశుడు బొటనవ్రేలు తలపై వుంచుకుని కొంచెంసేపు అలాగే స్థిరంగా కూర్చున్నాడు. ఏదో అతని మెదడులోకి రాకుండా పెపైకే తప్పించుకుపోతున్నట్టుగా ఉంది.

చివరకు కళ్లుతెరచి అడిగాడు. "'హెవ్స్ అండ్ హేవ్ నాట్స్' (కలవాళ్లు, లేనివాళ్ళు) ఏం మోహినీ! అదేనా సంగతి?"

"కాదు" మోహిని దృఢంగా జవాబు చెప్పింది.

"మరి?" అన్నాడు నరేశుడు ఆశ్చర్యంగా.

"పోనీలెండి, ఆవిషయం అలా వుంచుదాం. ఇక చెయ్యవలసిందేమిటి? ఆసంగతి చెప్పండి."

"ఏసందర్భంలో, ఏమిచెయ్యటం? అతడు పట్టుపడకూడదనేనా నీ కోరిక?"

"మీకోరిక ఏమిటి?"

"జోక్యం కలుగజేసుకోకూడదని."

"పట్టించెయ్యమనేనా మీరు అనేది?"

"అదికూడా ఒకరకంగా జోక్యం కలుగజేసుకోటమే ఔతుంది."

"మరి?"

నరేశుడు మోహినిముఖంలోకి చూచాడు. చూస్తూ ఉండిపోయాడు. ఆచూపులో స్నిగ్ధతఉంది; అన్నిసందేహాలనూ అంతర్హితంచేసివేయగల ఒక విశ్వాసంఉంది. "మోహినీ! ప్రేమకు ఒక జవాబుదారీఅంటూవుండదు. ఏదో చేసితీరాలి అన్న ఆవశ్యకత ఉండదు దానికి. ఏమీ చేయకపోయినా ప్రేమ కృతార్థమే ఔతుంది.తెలుస్తూఉందికదూ, మోహినీ! ఇక ఆసంగతి వదిలెయ్యి! నగలు దొంగిలింపబడ్డాయన్న విషయం చడ్డాకు తెలిసిందా?"

"తెలిసింది."

"ఎందుకు తెలియవలసివచ్చిందో అడగవచ్చునా?"

"నేను చేసిన పొరపాటే అది."

విని నరేశుడు కొంచెంసేపు మౌనంగానే ఊరుకున్నాడు. చివరకు ఒక నిట్టూర్పు విడిచాడు. "ఒక చిన్న పొరబాటు పెద్దదుష్ఫలితానికే దారితీయవచ్చు మోహినీ!"

అతని కంఠస్వరంలోని వ్యథను జీర్ణించుకుంటూ మోహిని అన్నది: "దుష్ఫలితం ఏముంటుందీ? వస్తువులు పోయినమాట నిజమేకదా! ఆ సంగతి పైకి చెప్పుకోటంకూడా తప్పేనా?"

"నీ ప్రేమను ప్రశ్నించుకో, మోహినీ! చెప్పుకోవచ్చునంటావా?"

మోహిని హఠపూర్వకంగా సమాధానం చెప్పింది: "ఆc! నేను ఇంకా అంత స్పష్టంగా చెప్పకపోయినా....తప్పకుండా చెప్పుకోవచ్చు!"

నరేశుడు కొంచెం కాతరచిత్తుడైనాడు: "నీమనస్సుకు నువ్వే వ్యతిరేకంగా ప్రవర్తించకు మోహినీ! నీలోని ప్రేమను నిరాకరించుకున్నందు వల్ల ప్రయోజనం? ఆదొంగతనంచేసినవాడు వాటిని పరాయివస్తువులుగా భావించి ఆపని చేసివుండడు. నీకు తెలుసు ఆసంగతి. అది తన హక్కు-అనుకునే అలా చేసివుంటాడు. నీ మనస్సు నీకేం చెబుతున్నది? అది దొంగతనం అనే చెబుతున్నదా?"

"ఆc. అచ్చంగా అది దొంగతనమే. అయినా ఏమిటి మీ రిలాగ తయారైనారు? నన్నుగురించైనా మీ రతన్ని అసహ్యించుకోరేం?"

"నిన్నుగురించే ఆపని చెయ్యలేకపోతున్నాను, మోహినీ! లేకపోతే అసహ్యించుకోటం పెద్ద కష్టమైన పనేంకాదుగా!"

ఈపరిస్థితిలోని ఆ నరేశుని అంతర్యాన్ని ఆమె ఏమాత్రమూ అర్థం చేసుకోలేకపోయింది. ఔదార్యం అంటే ఆమెకు తెలియకపోలేదు. కాని ఇక్కడ అది....వ్యంగ్యంగాని, విడంబనగాని ఏమాత్రమూ లేకుండా.... హద్దు అతిక్రమించిపోయిందే! "సరే పోనీండి, దానికేంగాని; ఇప్పుడేమి చెయ్యాలో చెప్పండి."

"ఏమీ చెయ్యనక్కర్లేదనే నా ఉద్దేశం" అని, నరేశుడు నవ్వుతూ, "పోయినవి పోగా ఉన్ననగలతోనే ఇక కాలక్షేపంచెయ్యగలగాలి" అన్నాడు.

ఓటమిమీద ఓటమి పొందుతున్నట్టుగా వుంది మోహినికి. ఆమాట నచ్చలేదామెకు. "అదేమిటి? అలా అంటారేమండీ!"

"ఉచితమైనమాటే చెప్పాను, మోహినీ! పోలీసులకు మనం మద్దతు ఇవ్వటమనేది మన 'స్వధర్మం' కాదు. అది 'పరధర్మం'. అది మనం అనుసరించకపోయినా పని సాగిపోతుంది. అలాగే పోయిననగలు తిరిగి రాకపోయినా మనకు కాలక్షేపం ఔతుంది. అదీ నా వుద్దేశం."

"నేను ఇంతకుముందే వెళ్లాను అతన్ని వెదకి కలుసుకుందామని. కాని ఉండేచోటు ఎక్కడో తెలుసుకోలేకపోయాను."

"ఎక్కడికని వెళ్లావు మరి ?"

మోహిని ఆఉత్తరం తీసి నరేశునికి ఇచ్చింది. ఇవాళ పోస్టులో వచ్చిన ఉత్తరంకూడా అతనిచేతికి ఇచ్చింది.

నరేశుడు ఆ రెండు ఉత్తరాలూ చదివాడు. కవర్లు అటు తిప్పి, ఇటు తిప్పి పరికించాడు. మొదటిఉత్తరం చేతిలో పట్టుకుని చూపిస్తూ "ఈఉత్తరం ఇక్కడే ఎందుకు ఉండిపోయిందీ ?" అని అడిగాడు.

"జితేన్ అది చదువుకోలేదనుకుంటాను. నన్నే చదువుకోమని ఇక్కడ వొదిలిపెట్టాడు."

"జితేన్ !....సహాయ్ కాదన్నమాట !....సరే, బాగానేఉంది.... అయితే అతడీఉత్తరం చదువుకోనేలేదన్నమాట !....ఇది ఆసరా చేసుకుని వెళ్ళావేం నువు ? ఊఁ, సరే, అయిందేదో అయిందిలే. ఇకముందెప్పుడూ నువు అలా మళ్ళీ వెళ్ళవలసిన అవసరంలేదు. చడ్డాతో మాటాడి నేను పరిస్థితి చక్కబరుస్తాను. ఇంతకూ ఆ పెద్దమనిషి ఇటువంటి వ్యాసంగాల నించి విరమించుకోకూడదూ ? విరమించుకునేట్టు నువు చెయ్యలేవూ ?.... సరిగ్గాచెప్పు : నీకోరికేమిటి అసలు ?"

"సరిగ్గా చెప్పమంటారా ? పోలీసులకు అతడు పట్టుబడకుండావుండా లనే నా కోరిక."

"ఎందుకు పట్టుబడకూడదు ?...."

"అతడు స్వయంగా తన్ను తానే పోలీసులకు అప్పగించుకోవాలని నా కోరిక" అన్నది మోహిని స్థిరంగా.

నరేశుడు నవ్వాడు. "అయితే దానికీ దీనికీ తేడా ఏమిటి ?"

"తేడా లేకేం ? బోలెడంత తేడావుంది" అన్నది మోహిని దూకుడుగా,

"అంటే....పోలీసులద్వారా కాకుండా....తనంతతానే ఉరికంబం ఎక్కాలన్నమాట ! అలా చేయించాలనేనా నీ ప్రయత్నమంతా ?"

మోహిని సమాధానం ఏమీ చెప్పలేదు. ఆ సమాధానం తనకొక్కదానికే తప్ప ఇతరులెవరికైనా అనవసరం అన్నట్టు ! కొంచెంసేపు ఆమె తనలో తానే (అంతర్లీన) అయి ఉండిపోయింది. చివరకిలా అన్నది :

"అయితే నేను ఇక ఇక్కడికీ అక్కడికీ ఎక్కడికీ వెళ్ళకూడదనేనా మీ ఆజ్ఞ? ఆజ్ఞకాకపోయినట్లయితే నేను...."

"ఉహుఁ. నా ఆజ్ఞ అంటూ ఏమీలేదు. ఇదివరకుమల్లేనే నీ స్వేచ్ఛ నీకు ఎల్లప్పుడూ ఉండనే ఉంది."

మోహిని కొంచెం ఆగి ఇలా అన్నది: "ఒకసంగతి చెప్పండి: అవసరం అయితే అతనిపక్షాన కోర్టులో వాదించగలరా మీరు?"

"తప్పనిసరిగా వాదిస్తాను మోహినీ!"

"నాకోసం అయినా మీరు ఆ ఉత్తరంలోని చిరునామా ఎక్కడో కాస్త సాధించిపెడతారా?"

"ఉహుఁ. ఏ కర్తవ్యాన్ని నువు నెత్తిమీద వేసుకోవాలనుకుంటు న్నావో నాకు బోధపడటంలేదు. 'పవిత్రమైనవి' అనేవి ఏవో నాకు తెలియవు. నా హద్దులు నీకు తెలుసు. అవి దృష్టిలో వుంచుకుని నేను చెబుతున్నాను: నువు నన్ను సధా సంపూర్ణంగా విశ్వసించవచ్చు."

క్షమాపణ యాచిస్తున్నట్టుగా వున్నదతని కంఠస్వరం. ఆ కంఠస్వరం వింటూంటే మోహిని విచలిత అయింది. ఆమె మరేమీ మాటాడలేదు. సాయంత్రం అయింది. క్రమేణా వెలుగు తగ్గిపోతూ ఉన్నది. ఆమె లేచి దీపం వెలిగించింది. తిరిగి వచ్చి నరేశునిప్రక్కనే కూర్చుంది. అతని హస్తాన్ని తనరెండుచేతుల్లోకి తీసుకుని "కోపం వచ్చిందా?" అని అడిగింది.

నరేశుడు నిశ్చేష్టుడై కూర్చున్నాడు. తన చేయి వెనక్కులాక్కోనూ లేదు; యేమీ మాటాడనూలేదు.

"ఆసంగతి నేను చెప్పకుండా ఎందుకు దాచిపెట్టానని మీ రడగనైనా లేదేం?"

చూస్తూచూస్తూండగానే నరేశుని కన్నులు చెమ్మగిల్లాయి. కాని అతడు అలాగే స్థిరంగా కూర్చున్నాడు.

మోహిని వివశయైపోయింది. "నేను మిమ్మల్ని చాలానే దుఃఖపెడు తున్నాను. నన్ను క్షమించగలరా?"

నరేశుని కన్నుల్లో అశ్రువులు నిండి బైటికి ప్రవహించాయి. కాని అతడు అలాగే కూర్చున్నాడు, నిశ్చలంగా....నిస్పందంగా....

మోహిని మెల్లగా సోఫామీదినించి క్రిందికి జారింది. భర్త మోకాళ్లు గుండెకు హత్తుకుంటూ, ముఖం పైకెత్తి, "చెప్పండి; చెప్పరేం?" అన్నది.

నరేశుని కన్నుల్లోనించి అశ్రువులు ప్రవహిస్తూనే వున్నాయి. మోహిని తలయెత్తి అలాగ అతనివైపు నిశ్చేష్టయై చూస్తూఉంది. చివరకు అతని మోకాళ్ళపై నుదురు కొట్టుకుంటూ "అదేమిటి మీరలాగ.... నేనేంచేశాను? మాటాడరేం? మీ క్షమాపణ యాచిస్తున్నాను" అన్నది.

నరేశుడు కొంచెం వంగాడు. రుమాలుతో కన్నీళ్లు తుడిచేసుకున్నాడు. తన మోకాళ్ళమీదినించి మోహిని ముఖాన్ని పైకి ఎత్తాడు. అన్నాడు మెల్లిగా: "మోహినీ! నువు వెళ్ళి, కాస్త అలా తిరిగి రా, పో."

"ఎక్కడ తిరిగి రాను?"

"మోటార్‌లో అలా షికారు వెళ్ళిరా. కాసేపు నన్ను ఇలా వొదిలి పెట్టు."

"మిమ్మల్ని వొదిలిపెట్టి పోనా? మీరు నన్ను క్షమించలేరా?"

"ఆ ప్రసంగమంతా ఇప్పుడు వొదిలెయ్యి మోహినీ! నీకు తెలుసు: నీమీద నాకేమీ అభియోగంలేదు. ఇప్పుడు కొంచెంసేపుమాత్రం నువు వెళ్ళిపో. నువ్వేం మనసుకు కష్టపెట్టుకోకు."

అతని కంఠస్వరంలో మళ్ళీ ప్రశ్నకు అవకాశమేలేదు. అయినా మోహిని అడిగింది: "వెళ్ళిపొమ్మంటారా నన్ను?"

"ఔను, వెళ్ళు మోహినీ! ఇది నా ప్రార్థన."

మోహిని తలెత్తి చూచింది. అతని ముఖం ప్రశాంతంగా ఉంది. వికారంగాని, వికల్పంగాని ఏమీ లేవక్కడ. అన్ని సంబంధాలనించీ విముక్తుడువలె వున్నాడు—ఆమె ఉనికికూడా ఈసమయంలో అతనికి అసంగతమైపోయినట్టు! ఆమె లేచింది. ఆమెలో కాఠిన్యం ఉబికింది. "సరే, వెడుతున్నాలెండి. ఇందువల్ల మీకు సంతోషం లభించేటట్లయితే తప్పక వెడతాను" అన్నది.

అని వెళ్లిపోయింది. భర్త తన్ను మళ్ళీ వెనక్కు పిలుస్తాడనే ఆమె ఆశించింది. కాని నరేశుడు పిలవలేదు. అలాగే కూర్చున్నాడు. ఏమాత్రం విచలితుడు కాలేదు. మోహిని గదిలోనించి బైటికి వచ్చింది. కొన్ని క్షణాల

పాటు అనిశ్చయస్థితిలో ఉండింది. చివరకు ఎక్కడికీ వెళ్ళలేదు; పైన డాబా మీదికి పోయింది. సందెచీకటి పడుతూ ఉంది. పగటిపూట వుండే ప్రజల కోలాహలం ఉపశమిస్తున్నది. దూరంగా చెట్లు, ఇళ్ళు కనిపిస్తున్నాయి. విభిన్నతను స్ఫురింపజేసే వ్యక్తిత్వం ఎక్కడా కనిపించటంలేదు. అంతా ఏకైకరూపమైన ప్రకృతే. ఆమెకు అదొక వినూత్న దృశ్యంలాఉంది. ఎంత సేపటికీ వ్యక్తులనీ, తాననీ, తనవారనీ, పరాయివారనీ....అటువంటి ఆలోచనలకే అలవాటుపడివున్న ప్రాణి కావటంచేత ఆమెకిప్పుడు నలువైపుల వికసించియున్న ఈ నిర్వ్యైయక్తికత వినూతనంగానూ, విలక్షణంగానూ కనిపింపసాగింది. అందులో తాను నిశ్శేషంగా విలీనమైపోవచ్చు. అందులో నించి మళ్ళీ వెలికి రావటానికి ప్రతివాదంగాని, ప్రతిక్రియగాని, ప్రతిదానం గాని ఏమీ అక్కర్లేదు. మరో ప్రపంచం ఇది. మామూలుప్రపంచం గ్రహ విగ్రహ ప్రతిగ్రహాలతో విస్తరించివుంది. ఈ ప్రపంచమంతా ఆ మరో ప్రపంచంలోకి చేరిపోవాలని ఉత్సాహపడుతుంది, దాన్ని తనలో సమావిష్టం చేసుకోవాలని ప్రయత్నిస్తుంది. జగత్తులోని పరమసత్యం ఇదే! చాల దూరాన ఒకటిరెండు డేగలు....పైకి ఎగిరిపోతున్నట్టుగా లేవు....గాలిలో ఈదుతున్నట్టుగా వున్నాయి. మధ్యమధ్య చిన్నచిన్న పిట్టలు గాలిలో దూసుకు పోతున్నాయి; చిరుగంతులు వేసినట్టుగా వేసి మాయమైపోతున్నాయి. ఇండ్ల కప్పుల్లోనించి పొగలు లేచి పైకి పోయిపోయి ఆకాశంలో తమ నిర్ణీత స్థానాన్ని పొందుతున్నాయి. వాటి నలుపుదనం చిత్రంలోని రంగువలె సముచితంగానే ఉందిగాని, ఎబ్బెరికంగా లేదు. ఇటువంటి ఏకాంత శూన్యవాతావరణంలో, బంధితయైపోయినట్టు, ఆమె నిల్చునివుంది. 'నేను-నాది' అన్న సంకుచిత తత్వంలోనించి తాను విడుదలపొందుతున్నట్టు హాయిగానే వున్నదామెకు, డాబామీద అటూ ఇటూ మెల్లిగా పచార్లు చేస్తూ ఉంది. ఆసమయాన ఇంట్లోనించి డాబామీదికి ఎవరూ రారుగా! కనుక అప్పుడామెలో కుదురుకుంటున్న మనస్థిమితానికి ఎట్టి ఆటంకమూ కలుగలేదు.

లోపల గదిలో ఒక్కడే ఉన్నాడు నరేశుడు. చాలవరకు అతని మనస్సుకు ఊరటకలిగింది. ఈనాడు అతనిలోయేదో ఒకానొక సంధిగ్ధస్థితి యేర్పడింది. కన్నీళ్ళద్వారా అది బైటికి ప్రవహించిపోయింది. కాని అది పూర్తిగా

ప్రవహించి విలు ప్తం అయిందా? అటువంటి సందిగ్ధస్థితి తనలో లవలేశం కూడా మిగిలివుండకూడదు. సమూలంగా దాన్ని బైటికి గెంటివేయవలసిందే. అందుకనే యేకాంతం కోరుకున్నాడు. కాని తీరా ఇప్పుడు తనొక్కడే ఉండిపోయాడు; మోహిని లేకపోయెనన్న భావమే దుర్భరం కాసాగింది. అంతకుమించి మరేమీ లాభం కనిపించలేదు. అటుచూచాడు, ఇటుచూచాడు, లోపలచూచాడు. మోహిని లేదు అన్న సూచన ఒక్కటే పొడగట్టింది. ఇంతేకాదు, అతడు వాంఛించింది. ఉపలబ్ధిని వాంఛించాడు. ఇప్పుడతనికి తెలిసివచ్చింది: అనుపలబ్ధినే కోరి తెచ్చుకున్నాను అని. తనలో యేర్పడిన అంతరాయాన్ని కనుక్కొని, దాన్ని నిర్మూలం చేసుకోవాలని తాను అనుకున్నాడు. ఈ విహీనస్థితిలో దాన్ని వెదకటం సాధ్యంకాలేదు. నాలుగు మూలలనించీ వ్యాపించి వస్తున్నది ఒకేఒక సూచన: ఆమెలేదు, ఆమెలేదు, ఆమెలేదు: అయితే తానేనా ఉన్నది? తాను ఒక్కడుగా మిగిలిపోవటానికేనా ఇలా ఉన్నాడు! ఇదే సందేహం అతన్ని మాటిమాటికీ వెన్నాడుతూ ఉంది.

తరువాత అతిథి గుర్తుకువచ్చాడు. అతడు ఆనాడు వచ్చాడు; ఈనాడు వెళ్ళిపోయాడు. అతడు ఆమెను ప్రథమంలో ప్రేమించిన వ్యక్తి. కాని తరువాతనూ ప్రేమిస్తూ ఉండవచ్చు; నిరంతరమూ ప్రేమిస్తూనే ఉండవచ్చు. ఎవరికేం తెలుస్తుంది? అయితే అలా వుండవలెననే నా ఆశీర్వాదం. ఔను అదే నా ఆశీస్సు. నా మోహినికి అందరిప్రేమ లభించవలసిందే. నాకు ఆమెపై ఏవిధమైన ఆరోపణలు ఉండరాదు. అంత దృఢంగా ఉండిపోవాలి సమైక్యత అనేది. అప్పుడేకదా ఆమెకు నేను భర్తనైనందుకు సార్థకత! అంతే మోహినీ! నిజంగా అంతే. నీపై నేను ఆ యీ ఆరోపణలు చెయ్యవలసిన అవసరం ఎప్పుడూ యేమాత్రమూ ఉండనే ఉండదు; నువ్వే చూస్తావుగా! ఓభగవంతుడా! నువ్వేగనక ఉన్నట్లయితే, నిన్ను నేను ప్రార్థించేది ఇదే...."

చూచాడు; మోహిని లేదు. నిజంగానే వెళ్ళిపోయిందికాబోలు! ఎందుకు వెళ్ళిపోయిందీ? ఆ కోపంలో అంతమాత్రం తెలుసుకోలేకపోయిందా?....నరేశుడు బయటికి పోర్చిదగ్గరకు వెళ్ళాడు. మోటారు అక్కడే

వుంది. రెండో మోటారుకూడా షెడ్డులోనే వున్నదని కబురు తెలిసింది. అతనికి విచారం కలిగింది. మోటారులేకుండా నడిచిపోయింది కాబోలు! చౌకీదారును అడిగాడు, ప్యూన్ను అడిగాడు; నౌకరును అడిగాడు. వాళ్లు తమకేమీ తెలియదని చెప్పారు. ఎలా తెలుస్తుంది? వాళ్ళకు కావలసింది నెల అయ్యేసరికి జీతం డబ్బులు; అంతేగా! అభిమానం దెబ్బతిన్న బాధను లోలోపల అణచుకుంటూ మోటారు ఎక్కి తానే డ్రయివ్ చేసుకుంటూ వెళ్లిపోయాడు.

మొదట ఈవీధిలోకి వెళ్లాడు; తరువాత ఆవీదిలోకి వెళ్లాడు. కొంచెం కొంచెంగా చాలదూరమే తిరిగాడు. ఎంతతిరిగినా వృథా అయింది. చివరకు చడ్డా ఇంటికి వెళ్లాడు. అతడు నరేశునిరాకకు చాల చకితుడైనాడు. "ఏమిటయ్యా! నువు అక్కడ ఏమేం మాటలు మాటాడి వచ్చావేమిటి? ఆవిడ నాతో దెబ్బలాటవేసుకుంది!" అన్నాడు నరేశుడు వస్తూనే.

"ఎబ్బెబ్బే, నేనేమీ మాటాడలేదే!" అన్నాడు చడ్డా.

నరేశుడు బాగా కోపంగానే ఉన్నాడు. "చాలుచాల్లే. నీ ఉద్దేశంఏమిటి ఇంతకూ? నాతో పోట్లాట పెట్టుకోవాలనేనా?"

చడ్డా ఒక అసమంజసమైన పరిస్థితిలో పడిపోయాడు. అతనికేమీ బోధపడలేదు.

"నేను లేనిసమయంలో నువు ఆవిడను అగౌరవపరచవలసిన అవసరం ఏం వచ్చిందీ? నీ కా సాహసం ఎక్కడినించి వచ్చిందీ?"

చడ్డా క్షమాపణ చెప్పుకున్నాడు: "మీరు అనవసరంగా పొరపాటు పడుతున్నారు. నాస్థితికి నేను మిమ్మల్ని...." అంటూ ఏమో చెప్పబోయాడు.

"అసలు సంగతేమిటో సాఫుగా చెప్పు: నీకేమన్నా అనుమానంగా వుందా? ఏమిటా అనుమానం?"

"ఎబ్బెబ్బే! మీరుకూడా అలా అంటారేమిటండీ?"

"ఇదిగో! నీ ఉద్యోగం ఇక్కడినించి బదిలీచేయించుకో ఇంకెక్కడికన్నా. అందుకు నేనూ సాయపడతాను కావలిస్తే."

"మీయిష్టప్రకారమే చేస్తాను బారిష్టరుగారూ! మీరు తలచుకుంటే నిల్చున్నపళంగా నన్ను 'సస్పెండు' చేయించగలరు! కాని ఇంతకూ అసలు

విషయం ఏమిటీ! పదండి, నేనుకూడా ఇంటికివస్తాను. మీ అపోహ తొలగిపోతుంది."

ఆసమయాన నౌకరువచ్చి "ఎవరో. భద్రమహిళ తమతో మాటాడి పోయేందుకు వచ్చారు" అని చెప్పాడు చడ్డాతో. ఆకబురు విని నరేశుని మెదడు బిరువెక్కిపోయింది.

"ఇప్పుడుకాదు; రేపు ఉదయం రమ్మని చెప్పు" అన్నాడు చడ్డా.

"ఎవరో తెలుసుకున్నావా అసలు?" అన్నాడు నరేశుడు.

"పోనిద్దురూ, ఎవరైతేయేం?"

నౌకరు వెళ్ళాడు. మళ్ళీ వెంటనే తిరిగి వచ్చాడు. "ఇప్పుడే మాటాడి వెళ్ళిపోతుందిట. రెండు నిమిషాలు చాలుట."

చడ్డాకు చాల కోపం వచ్చేసింది. "నువు వట్టి మూర్ఖుడులా వున్నావే. చెప్పానుకదూ, ఇప్పుడు తీరిక లేదని. అయినాకూడా నువు—"

"అంత మర్యాదలేకుండా యేమిటయ్యా మరీను. ఎవరో పాపం, చాలదూరంనించి వచ్చిందేమో, నువు—" అన్నాడు నరేశుడు.

"సరే, పోనీ", చడ్డా నౌకరువైపు తిరిగి "అక్కడ కూర్చోమని చెప్పు; వస్తున్నాను" అన్నాడు.

నరేశుడు కొంచెం అసమంజసమైన పరిస్థితిలో పడ్డాడు. "ఇక్కడికే పిలిపించకూడదూ?" అన్నాడు.

"ఏ దౌర్భాగ్యురాలో మరి!"

నరేశుడు గుటకమింగి మౌనంగా కూర్చున్నాడు.

"బారిస్టర్ బాబూ! మీరిక్కడే కూర్చోండి; ఇప్పుడే వస్తాను. మీతో పాటు నేను మీ ఇంటిదాకా వస్తాను. మీరేదో అనవసరంగా పొరపాటుపడి ఆగ్రహం తెచ్చుకున్నట్టు మీకే అర్థంఔతుంది. ఆమెగారికి నేను నౌకరు లాంటివాడిని. నేను అగౌరవంగా మాటాడేవాడినా?"

నరేశుడు వింటూ కూర్చున్నాడు, యేమీ మాటాడలేదు.

చడ్డా అక్కడికి వెళ్లాడు. "ఊఁ, చెప్పండి: మీకు వచ్చిన ఇబ్బందేమిటి ఇప్పుడు? నావల్ల తమరు ఆశించే సేవ ఎటువంటిది?"

"నాపేరు మేటిల్డా. నేను బారిస్టర్ నరేశచంద్రగారింట్లో నర్సు డ్యూటీలో వున్నాను—"

చడ్డా ధ్యాస ఎక్కడోవుంది కాబోలు. ఆమాటలు కొంచెం ఆలస్యంగా వెళ్లాయి చెవుల్లోకి. "ఏమిటీ? ఎవరింట్లో?"

"బారిస్టర్ నరేశచంద్రగారింట్లో...."

"అయితే?" అన్నాడు చడ్డా ఉరుము ఉరిమినట్టు.

"నేనక్కడ నర్సుగా పనిచేశాను...."

"అయితే నన్నేం చెయ్యమంటారు? నా టైము అనవసరంగా పాడు చేస్తున్నారే!" మళ్ళీ అదేరకమైన తీక్ష్ణస్వరంతో అన్నాడు.

"తమకు ఒక సూచన తెలిపిపోదామని వచ్చాను."

"ఊఁ, చెప్పండి!" అన్నాడు బెదరింపుగా.

మేటిల్డాకు ధైర్యం జారిపోసాగింది. "వారింటికి ఒక అతిథి వచ్చాడు...."

"ఔను, వచ్చాడు. వస్తే నాకేంసంబంధం? ఇదిగో, మీరు రేపు ఉదయం దయచెయ్యండి, ఇప్పుడు నాకు...."

"ఆ వచ్చిన అతిథిగారు రాత్రికిరాత్రికే అకస్మాత్తుగా...."

"ఇదిగో, నన్ను క్షమించాలిమీరు. మీరేదన్నా రిపోర్టు ఇవ్వదలచుకుంటే ఠాణాకు వెళ్ళి, అక్కడ రాసి ఇవ్వండి. అమర్యాదగా వ్యవహరించారనే కేసు అయివుంటుంది. కాని క్షమించాలి; మీ వృత్తి...."

"అంటే మీ అభిప్రాయం...." మేటిల్డాకు ఈసారి నిజంగానే కోపం వచ్చింది.

"అంటే నా అభిప్రాయం....'ఇక తమరు దయచేయవచ్చు' అని" అన్నాడు చడ్డా చాలతేలిగా. బటన్ నొక్కి నౌకరును పిల్చాడు. అతడు వచ్చేవరకూ ఉండకుండానే "మా నౌకరు వస్తాడు. వచ్చి మీకు బైటికి దారి చూపుతాడు" అని పలుకుతూ లోపలికి వెళ్ళిపోయాడు, తనపై తానొక ఘనవిజయం సాధించినంత తృప్తి అనుభవిస్తూ. యస్. పి. ని చడ్డా జయించాడు—ఒక కలఆఫీసరును అతనిలోనిసాధారణ వ్యక్తిత్వం జయించింది.

"అప్పుడే వచ్చేశావేం? ఎవరావిడ?" రాగానే నరేశుని ప్రశ్న.

"ఎవరో ఒక మరదలుపిల్ల. అమర్యాదరిపోర్టు పట్టుకువచ్చినట్టుంది. నేనెరగనూ పదిమందికీ పనికివచ్చే ఈ నెరజాణలందర్నీ?....ఊఁ, ఇక పదండి మరి పోదాం!"

"ఎక్కడికీ?"

"మీ యింటికే. అక్కడ విందురుగాని నా సంజాయిషీ."

"వద్దులే. అందువల్ల అయేదేమిటి? కాని జ్ఞాపకం పెట్టుకో ..."

నరేశుని కంఠస్వరం చడ్డాకు కటువుగా వినిపించింది. ఇంతకుముందే తాను చీవాట్లుపెట్టి పంపించిన వ్యక్తి గుర్తుకువచ్చింది. కాని అతడు పైకేమీ అనలేదు. అతని హృదయంలో మోహినికోసం ఒకస్థానం ఏర్పడిపోయింది. మోహినిఓటమి అతడిని ఓడించివేసింది. కాని స్వాభిమానం తొణికిసలాడు తున్న నరేశుని కంఠస్వరం అతనిమనస్సును బలపూర్వకంగా మరోదారికి తిప్పేసింది. అయినా అన్నాడు: "నేను మీ గులామును బారిస్టర్ బాబూ!"

నరేశుడు ఇంటివద్దనించి సంక్షుభితహృదయంతోనే బయలుదేరి ఇలా వచ్చాడు. అటుతిరిగి, ఇటుతిరిగి, ఏదో మాటాడి, మాటాడింపించి, చివరకు ఎలాగైతేనేం ఆశించిన స్వాస్థ్యం చేకూరినట్టయింది. "సరేలే మిత్రమా! ఇవన్నీ వదిలేసెయ్యి. నీ సంగతిసందర్భాలు ఎలావున్నాయో చెప్పు." అన్నాడు.

"అన్నీ బాగానే ఉన్నాయి మీదయవల్ల."

"పైనించి ఇంకా తాకీదులు గీకీదులు బాగా వస్తున్నాయా?"

"వాటికేంలోపం! వస్తూనే ఉన్నాయి ప్రతిరోజూ! రాజీనామా ఇచ్చే ద్దామా అనిపిస్తూ వుంటుంది అప్పుడప్పుడు. కాని ఏం ప్రయోజనం? కుటుంబం ఏమైపోవాలి? అందుకని మనస్సు చంపుకుని ఇలా వుంటున్నాను."

"ఏం? నీ కృషి ముందుకు సాగటంలేదా?"

చడ్డా కొంచెం ఉత్సాహితుడైనాడు. "ఎక్కడ ముందుకు సాగుతుం దండీ? ఇప్పుడు లోకం తీరు విలక్షణంగా తయారైంది. నేరాలుకూడా మంచిపనులుగా చలామణీ ఔతున్నాయి. కాగా మంచిమంచివాళ్ళుకూడా అతనికి సాయం చేస్తున్నారు. ఇటువంటి పరిస్థితుల్లో ఇక నేను యేం చెయ్యాలో మీరే చెప్పండి."

"ఔనౌను. నిజమే. మన మిప్పుడొక చిత్రమైన ప్రపంచంలో వున్నాం. సరే మిత్రమా! ఇక నేను వెళ్ళొస్తాను. ఏదో కోపంలో అనేశాను. క్షమించు సుమీ!"

నరేశుడు వెళ్ళిపోయాడు. చద్దా అతనివైపు సాలోచనగా చూస్తూ ఉండిపోయాడు.

# 16

పదిహేనుగంటలైంది. నౌకరు వచ్చి చెప్పాడు: "తమరు శాలువలేవో మాదిరికి పట్టుకురమ్మన్నారుట. దుకాణంనించి మనిషి వచ్చాడు" అని.

"యేమిటీ?" అన్నది మోహిని.

"మాదిరికి కొన్ని శాలువలు తెచ్చాడు" అన్నాడు నౌకరు సంకోచిస్తూ.

మోహినికేమీ బోధపడలేదు. "సరే, లోపలికి రమ్మను" అన్నదామె కాసేపు ఆలోచించి. చిన్న మూట పట్టుకుని ఒకమనిషి లోపలికి వచ్చాడు. కాశ్మీర్ తలపాగ, కాశ్మీర్ దుస్తులు ధరించివున్నాడు. వయస్సు ఇరవై ఒకటి, ఇరవై రెండు సంవత్సరాలు ఉండవచ్చు. మోహిని అతనిముఖంలోకి పరిశీలనగా చూచింది. "ఊఁ, యేమిటి?" అని పలుకరించింది.

వచ్చిన మనిషి నమూనాలు చూపించేందుకు మూటవిప్పే ప్రయత్నంలో లేడు. "నేనొక పనిమీద వచ్చాను" అన్నాడు.

"సరే, చెప్పండి పనేమిటో!" అంటూ మోహిని జాగరూకతపొంది "మీరు యే ఫరంనించి వస్తున్నారు? నేను కబురుచేశానా?" అని అడిగింది.

"లేదండి....మీ వస్తువులు కొన్ని పోయాయికదూ! అవి మళ్ళీ దొరుకుతాయి. మీరు డబ్బు ఎంతవరదాకా ఇవ్వటానికి సిద్ధంగా వున్నారు?"

ఆమాట వినటంతోనే మోహిని మెదడుకు వేడెక్కినట్టయింది. "నువు ఆ దొంగలగుంపులో ఒకడివా?"

"కాదండి....మీరు వాటికి ఎంత ఇవ్వగలరు?"

మోహిని కాసేపు సాలోచనగా ఉండిపోయింది. ఆ కుర్రవాని దిట్ట తనాన్నిగురించి ఆలోచిస్తున్నదేమో! ఈ వచ్చినవాడిని ఇలా ఉన్నపాళాన ఎందుకు పట్టించెయ్యకూడదు? అని ఆలోచిస్తున్నదేమో! మొత్తానికి ఆలో

చిస్తూనే ఉంది. ఆలోచించంచటమంటే భావాలు చిక్కపడటం అన్నమాటే.
"నిన్నెవరు పంపించారు ఇక్కడికి ?"

"ఎవరో పంపించారులెండి. యాభై వేలరూపాయలకైతే మీవస్తువులు మీకు వచ్చేస్తాయనీ, అంతకు తక్కువైతే లాభంలేదనీ మీతో చెప్పమన్నారు."

మోహిని నవ్వింది. ఆమెకు కుతూహలం కలిగింది. మజూరితో కూడా వాటి విలువలు పన్నెండువేలకంటే ఉండవు. యాభై వేలు అడుగుతున్నాడంటే వట్టి మూర్ఖుడన్నమాట ! కాని— "నువు ఆ సొమ్ములు చూచావా ?" అని అడిగింది.

"లేదు."

మోహిని నవ్వింది. "అందులో నాలుగోవంతుకూడా ఉండదు వాటి ధర." మోహినికి సహసా కోపం వచ్చేసింది, "నీకు ఇక్కడినించి ఇక బైటికి పోగలనన్న ఆశ ఉందా? ఇదిగో ! నువు బైటికి వెళ్ళటానికి వీల్లేదు, జాగ్రత ! దోపిళ్లు, దొంగతనాలు చేస్తారూ ? దోచుకున్న సొమ్ముతో పైగా ఈ వ్యాపారమా ?"

ఆమె కోపానికి అతడేమాత్రం విచలితుడు కాలేదు.

ఇంతలో అడుగుల చప్పుడు వినిపించింది. వెంటనే యువకుడు మూట విప్పాడు. అందులోనించి శాలువలు తీసి బైట పరిచాడు. నౌకరు టెలిఫోను పుచ్చుకుని లోపలికి వచ్చాడు.

మోహిని కోపంగా టెలిఫోన్ అందుకుంది. "ఊఁ. నేనే, మోహిని. చెప్పండి ఏమిటో."

అవతలవైపునించి చడ్డా మాటాడుతున్నాడు. మేటిల్డా నర్సునుగురించి అడుగుతున్నాడు.

"ఊఁ, చెప్పండి....ఇక్కడికి సరిగ్గా వినిపించటంలేదు. కొంచెం దగ్గరగా చెప్పండి....ఔను, నర్సే....మాయింట్లోఉంది....ఆఁ, ఆఁ....రండి, రండి, మీ యిల్లేగా....ఇప్పుడే ? మేటిల్డాతోనా ?....ఇప్పుడే కాదు....ఈ సమయంలో కాదులెండి, క్షమించాలి, ఇప్పుడొకచోటికికూడా వెళ్ళవలసివుంది....ఆఁ. రెండుగంటలు దాటాక, హాయిగా రావచ్చు....(నవ్వు)

కులాసాయే....ఏంచేస్తున్నానా ? శాలువలు బేరంచేస్తున్నాను....ఔను, వెళ్ళే తొందరలోనే ఉన్నాను....అలాగే, అయిదుగంటలకు రండి...."

కోపంగా ఫోను బందుచేసింది మోహిని. "ఫోనువస్తే మొదట మున్షీకి ఇవ్వు. మాటిమాటికీ నాదగ్గరకు తీసుకురావటం ఎందుకూ ?" అన్నది నౌకరుతో. నౌకరు వెళ్ళిపోయాడు.

"మీరిచ్చే ధర చెప్పారుకాదు" అన్నాడు శాలువల వర్తకుడు.

"ధర ! నువు మొదట ఇక్కడినించి బైటికి వెళ్ళిపో. అంతే నేను ఇచ్చే ధర !"

అప్పుడా యువకుడు జేబులోనించి ఒక కవరు తీసి మోహినికి ఇచ్చాడు. అందులో ఒక చిన్న మామూలు కాగితంమీద ఒకేపంక్తి ఇలా వ్రాసి వున్నది: "కొన్ని మాదిరులిచ్చి మనిషిని పంపుతున్నాను." చదువుకుని మోహిని ఆ కాగితాన్ని చించి అవతల పారేసింది.

"ఎవరిచ్చారు ఈఉత్తరం నీకు ?"

"మా సర్దారు."

"నాకీ మాదిర్లేమీ నచ్చలేదని చెప్పు. ఆయన బేరాలుకూడా చేస్తున్నాడేమిటి ?"

ఆ ప్రశ్న భావం అర్థంకాక ఆ యువకుడు సమాధానం ఏమీ చెప్పలేదు.

"ఎన్నాళ్ళనించీ ఆయన మీకు సర్దారు ?"

దీనికీ యువకుడేమీ సమాధానం చెప్పలేదు.

"ఎందుకోసం మీకు డబ్బు అవసరమైంది ? నీకేమన్నా తెలుసా ?"

సమాధానం లేదు.

"ఇక నువు వెళ్లిపోయి, 'ఎలాగో బ్రతికి బయటపడ్డాననీ, ఇకనించైనా జాగ్రత్తగా మసలుకోవాలనీ చెప్పుకో మీసర్దారుతో. అందుకే నిన్ను వదలిపెడుతున్నాను. దొంగతనాలు చెయ్యటమేకాకుండా పైపెచ్చు ఇలాంటి దుస్సాహసాలకుకూడా దిగటం మంచిదికాదని చెప్పు."

యువకుని ముఖం జేవురించినట్టు కనిపించింది.

"ఈఉత్తరం నువు మొదటే ఎందుకు ఇవ్వలేదు ?"

"అవసరంపడితేనే చివరకు ఇవ్వమన్నారు మా సర్దారు."

"హుం! ఇంకా ఏమన్నారేమిటి?" వ్యంగ్యంగా అడిగింది మోహిని.

"డబ్బు సక్రమంగా ఇవ్వకపోయినట్టయితే, అక్రమంగానైనా సరే ఇవ్వకతప్పదని చెప్పమన్నారు. అందుకనే నన్ను పంపించారు. ఆయన చాల దయగలవారు. నగలూ అవీ గృహస్థులకు కావాలి. మాకు కావలసిందల్లా డబ్బే. అందుకోసమే మా యీ దుర్మార్గం అనబడేది. ధనం అందరికీ అవసరమైవుండగా ఎక్కడో ఒక్కచోటమాత్రమే అది సంచితమైవుండటం ఏమిటి? ధనం అందరికీ సక్రమంగా పంపిణీ అయేందుకు మేము చేసే ప్రయత్నాల్నే మీరు దొంగతనాలనీ, దోపిడీలనీ అంటారు. అంతమాత్రాన మా ప్రయత్నాలనించి మేము విరమించుకోలేము. మీరు కూడబెట్టిన సంపద పెరిగి పెరిగి విరిగిపోయేనాడు ఏంజరుగుతుందో కంటితో చూచి సహించలేం. అటువంటి గడియ రాకుండా తప్పిస్తున్నాం, ఈ పాపం అంతా మేమే నెత్తిన వేసుకుని. మీ పాపం ఒక కుష్టువ్యాధిలా మిమ్మల్నే తినివేస్తుంది. అందుకనే మేము దానికిచికిత్సచేస్తున్నాం. మేమే పాపాలు, దొంగతనాలు, చెడ్డపనులన్నీ చేస్తున్నాం కదూ! అయితే కావచ్చు. కాని చాల అవసరం, ముఖ్యం అయిన పనే చేస్తున్నాం. మాకోసంకాదు మేము ఏంచేస్తున్నా. మీ మంచికోసమే మేము చేసేదంతా."

మాట్లాడకుండా వింటూ కూర్చుంది మోహిని. "ఎవరు బోధించారు నీ కీ విషయాలన్నీ?" అని అడిగింది చివరకు.

"మా కళ్ళే మాకు చెబుతున్నాయి. మా కళ్ళకు తెరపుళ్ళు కలిగించింది మా సర్దారు."

"తేలిగ్గా నాచేతుల్లోంచి యాభై వేలూ ఊడిపడతాయనేకదూ, మీ సర్దారు ఉద్దేశం?"

"లేదులేదు. తేలిగ్గాలభించకపోవచ్చు, కొంచెం కష్టం ఎదుర్కోవలసే రావచ్చు. కాని ఆ కష్టానికి మేము సిద్ధపడే వున్నాం" అంటూ యువకుడు మూటకట్టేసుకుని వెళ్ళిపోటానికి ఉద్యుక్తుడై ఇలా అన్నాడు; "మీరు తేలిగ్గా ఇవ్వరుకదూ! మేము మీకు కష్టంకలిగించే మార్గాన్నే అవలంబించాలన్నమాట. అంతేనా తమ నిర్ణయం?"

మోహిని నవ్వింది. "క్షేమంగా వెళ్ళిపోతున్నావు. అదే పదివేలనుకో. వెళ్ళు. వెళ్ళిపో. ఇకపైన ఒక్క పైసకుకూడా బేరమాడబోకు. కాని మీ సరదారు ఉండేదెక్కడో కాస్త చెప్పు. ఎక్కడా ఆయన ఉండేది?"

యువకుడు చిరునవ్వు ప్రదర్శించాడు. "త్వరలోనే తెలుస్తుందిలెండి."

"ఔను. త్వరలోనే తెలియాలి. మబ్బులు బాగానే ముంచుకువస్తున్నాయి. ఉరుములు, మెరుపులు ఎప్పుడు విరుచుకుపడతాయో చెప్పలేం. ఈసంగతింకా మీకు తెలియదేమో! అందుకనే త్వరలోనే తెలియాలి; తప్పదు."

"భగవంతుడనుగ్రహిస్తే త్వరలోనే...." అన్నాడు యువకుడు అదే రకమైన చిరునవ్వుతో.

ఇంకా మోహిని ఆ యువకుని అట్టిపెట్టుకోలేదు. అతడైనా ఆగ లేదు; మూట చంకనపెట్టుకుని బయలుదేరాడు. మోహిని అతనివైపే చూస్తూఉంది. ఒక నౌకరును పిల్చి, అతనివెనకాలే పంపించి, వాళ్ళు ఎక్కడ వుంటున్నారో తెలుసుకుందాం అన్న ఆలోచన కలిగిందామెకు క్షణమాత్రంగా. కాని మరుక్షణమే ఆమె ఆంతర్యానికి అదికూడా యోగ్యమైన పనిలా కనిపించలేదు.

సాయంత్రం చడ్డా వచ్చాడు. కాని నర్సును వెంటబెట్టుకురాలేదు. తరువాత కొంతసేపటికి నరేశుడుకూడా ఇంటికి వచ్చాడు. నర్సు చడ్డాను విడిచిపెట్టలేదు; వేధిస్తూనేవచ్చింది. చడ్డా వినీ, వినకా కాలక్షేపం చేస్తూ వచ్చాడు. చివరకు అనుకున్నాడు: 'ఈనర్సును మోహినియెదుటికి తీసుకు పోతే, దీనిగొడవ వదిలిపోతుంది' అని. కాని ఆమె రావటానికి ఒప్పుకో లేదు. ఇదీ మంచిదే అనుకున్నాడు. ఇక తరువాత తాను మోహినిని వచ్చి కలుసుకోవలసిన అవసరం ఏమీలేదు నిజానికి. కాని వస్తానని చెప్పిన సమయం సమీపించింది. ఆమెతో కలిసి మాటాడే అవకాశం అతనికి సంతోషాన్ని, ఉత్సాహాన్నీ చేకూరుస్తుంది. అందుచేత చెప్పినసమయానికు సరిగా బయలుదేరి వచ్చేశాడు.

ఇదివరకు సూపరింటెండెంటు వచ్చినప్పుడు మోహిని కొంచెం

స్వాభిమానంతో ప్రవర్తించింది. తన కౌశలంమీద విశ్వాసం పెట్టుకుని ఉండింది. కాని ఈగుణం అవగుణంగా తయారౌతుందని ఆమెకు తరువాత తెలిసింది. సత్యంలోను, సహజత్వంలోను ఉన్నవిశిష్టత, సుఖం జాగరూకత లోనూ, చతురతలోనూ ఉండనేరవు. బుద్ధిచతురత, ప్రాగ్భ్యలం ద్వారా మనల్ని మనమే సమర్థించుకోటంలో పడిపోతాం, ఎదుటివానిని మన భావా ల్లోకి లాగటానికి ప్రయత్నిస్తాం, ఎదుటివానిభావాల్లోకి మనం దూరకుండా దూరంగా వుండాలని జాగ్రతవహిస్తాం. అందువల్ల పరస్పర ఉపలబ్ధి సాధ్యం కాదు. హృదయాల్ని ఇచ్చి పుచ్చుకోటంద్వారా అది సహజంగా సాధ్యం ఔతుంది. శబ్దాడంబరం అక్కర్లేదు; బయటినించి మరేసామగ్రి అవసరం ఉండదు; కాలయాపన జరగదు. ఎలా, ఏ నియామనుసారం, కాలవ్యయం-ప్రయాసలేకుండా ఇద్దరువ్యక్తులు అత్యంతసన్నిహితులు ఐపోతూవుంటారో —అది విమర్శనకందని విషయం. కాని కౌశలం అనేది ఎంత వుపయో గించినా, ఎన్ని శబ్దాలు ప్రయోగించినా ఇద్దరు వ్యక్తులు దగ్గరకు రాజాలరు; పైగా దూరస్థులే ఔతారు. "మేటిల్డాను వెంటబెట్టుకు రాలేదేం ? ఇందాక మీరు చెప్పటం...." అన్నది మోహిని.

"ఎందుచేతనో మళ్లీ మొగం చాటేసింది ! పోనీ, రాకపోవటమే మంచిదైందిలెండి....హాయిగా ఊపిరి పీలుస్తున్నాను."

"చూడండి; ఆరోజు మీరు వచ్చి....రెండువారాలు దాటిపోయింది కదూ ! ఆనాడు కోపంగా మాటాడాననుకుంటాను, ఔనా ?"

"ఎబ్బే; ఏంలేదే !"

"మీరప్పుడు వెళ్లిపోయాక నాకు అర్థంఅయింది; నాకు కోపంవచ్చి మాటాడాననీ, మీకూ కోపం వచ్చివుంటుందనీ. ఆకోపం చివరకు మావారి మీద పడింది పోయి. ఆసాయంత్రం వారు వచ్చి మీతో దెబ్బలాట పెట్టు కున్నారు కాబోలు ! నేను అప్పుడే అనుకున్నాను: మీకు ఫోనుచేద్దామని. కాని సంకోచిస్తూ ఆగిపోయాను. ఆతరువాత రెండువారాలదాకా మీరైనా రాలేదు. ఇప్పుడైనా మీఅంతట మీరు వచ్చారా ? మీకుగల పని తీసుకు వచ్చింది గాని. నిజమే, మేటిల్డా మాయింట్లో నర్సుగా వుంది కొన్నాళ్లు. ఆమెను మేము 'మిథిల' అని పిలుస్తాం."

"మిథిలా! భేష్! బాగుంది పేరు!" అన్నాడు చడ్డా, హర్షపుల కితుడువలె.

"చెప్పరేం! ఆమె మీతో ఏమన్నది?"

"దాని బూడిద! ఏమిటో చెత్తవాగుడు వాగింది. ఇక్కడికి రమ్మంటే రాకనేపోయిందిగా! ఇక ఆ చెత్తకు విలువేమిఉంటుందీ? ముఖం దాచుకునే పిరికిబొంద! చొల్లువాగుడుమాత్రం జాస్తి."

"ఏమివాగిందీ ఇంతకూ?"

"ఏమిటే.... సరిగా నాకుమాత్రం అర్థమయేట్టు యేడ్చిందీ? ఏవో ఊహాలు, అనుమానాలు వెల్లడించింది. ఊహాలతో ఏమౌతుంది—అను మానాలతో ఏమౌతుంది? జరిగినసంగతి సందర్భాలు కావాలిగాని."

"ఏమిటి ఆవిడ అనుమానం ఇంతకూ?"

"అనుమానం మీ అతిథినిగురించే. ఆవిడ ఊహఏమిటంటే...."

"ఊఁ, ఏమిటీ?" మోహిని మందహాసంచేస్తూ అడిగింది."

"అతడు ఆముతాకు చెందినవాడేనేమోనని."

"మీ ఊహ 'కా'దనా అయితే?"—అదే మందహాసం మళ్ళీ ఆమె పెదవులమీద.

"ఊహాలతో ప్రయోజనంలేదని నా ఊహ."

ఇంతలో నరేశుడువచ్చాడు. అతన్ని చూడగానే ఆనాటిసంగతి జ్ఞాపకం వచ్చి ఇద్దరూ హాసపరిహాసాలు చేసుకున్నారు. ఆ యీ సంగతులు మాటాడు కుంటూ కూర్చున్నారు. ఏదైనా సినీమాకు వెడదామని ప్రతిపాదన వచ్చింది. కాని మోహినికి అంత ఇష్టంలేదు. ఎంతో బ్రతిమాలినమీదట చివరకు ఒప్పు కుంది. కాని ఒంట్లోనే ఆమెకు బాగా లేదో, అసలు ఆనాటి వాతావరణం లోనే జబ్బుఉందో, మరింకేమన్నా కారణం ఉందో, సినీమాలో కూర్చుని చూస్తూవుంటే ఆమెకు తలనొప్పి ఆరంభమైంది. కడుపులో వికారంకూడా మొదలైంది. సినీమా ఆరంభమై ఒక అరగంట దాటిందేమో! నరేశునితో చెప్పి హాల్లోనించి బైటికి వెళ్ళిపోయింది. నరేశుడుకూడా వచ్చేద్దామని లేచాడు. కాని 'చడ్డాను ఒక్కడినే ఇక్కడ దిగబెట్టి మీరుకూడా వచ్చేయటం అతనిదృష్టికి ఉచితంగా కనిపించదు' అన్నది మోహిని. నరేశుడు ఆగిపో

యాడు. మోహిని బైటికి వచ్చింది. "ఊరివెలుపల కొంచెం బాగా గాలి తగిలే చోటికి తీసుకుపో" అని డ్రయివరుతో చెబుతూ మోటారులో కూర్చుంది. సుమారు ఎనిమిదిగంట లౌతుంది అప్పుడు. అక్టోబరు నెల. గాలిలోని చల్లదనం హాయిగానే ఉంది. చరచరావీస్తున్న గాలితరగలవల్ల చిత్తస్వాస్థ్యం చేకూరిందామెకు. ముందుకు సాగిపోతున్నది మోటారు. ఆకాశంనిండా నక్షత్రాలే. వీధులు చాలవరకు నిర్జనంగా ఉన్నాయి. సివిల్ లైన్సు దాటిపోయింది మోటారు. పట్నం వెనుకపడిపోయింది. ఎదురుగా వున్న కొన్ని బంగళాలుమాత్రం కనిపిస్తున్నాయి. అవికూడా దాటితే ఇక శూన్యమైన ఎడారి ఆరంభమౌతుంది. అప్పుడు మోహిని మానసికస్థితి ఎలా వుండిందో చెప్పలేం. 'ఇక మోటారు వెనక్కు తిప్పి ఇంటికి పోదామా?' అని అడిగాడు డ్రయివరు. అందుకామె ఏవిధమైన అంగీకారమూ తెలుపలేదు. ఇంకా ముందుకే అయిదారుమైళ్ళ దూరం వెళ్లింది మోటారు. అంతా నిశ్శబ్దంగా వుంది. రోడ్డు తిన్నగా వెడుతోంది ఎక్కడికో! మోటారుకు వున్న లైట్లు, పైన నక్షత్రాల వెలుగు, అంతకుతప్పితే మిగిలినదంతా అంధకారమే. ఆ చీకటైనా నల్లగా లేదు. గోధుమరంగులో ఉంది. అది భయపెడుతున్నట్లూ లేదు; ఆహ్వానిస్తున్నట్లూ లేదు. తనలో తాను సమాధినిమగ్నవలె ఉన్నది. ఒకరి మిత్రత్వాన్ని ఆశిస్తున్నట్టేమీ లేదు. అసలెవరితోనూ ఏవిధమైన సంబంధమూ ఉన్నట్టులేదు. తనలో తానై, అంతా తనలోనే విలీనమై ఉన్నది. దూరంగా, ఒకప్పుడు కుడివైపున, మరొకప్పుడు ఎడమవైపున చెదురు చెదురుగా దీపాలు కనిపిస్తున్నాయి. అవి ధ్యాననిమగ్నమై, శూన్యంగా, శాంతంగా వున్న——అంధకారాన్ని చూపిస్తూ ఉన్నాయి. అంతకుమించి అవి చేయగలుగుతున్నది మరేమీలేదు."

"ఇక వెనక్కు తిరుగు!"

అకస్మాత్తుగా వచ్చింది ఆజ్ఞ. డ్రయివరు వేగం తగ్గించాడు; కారు వెనక్కు తిప్పాడు. తిరిగి ఒక మైలు వచ్చేశాక....రోడ్డుమీద నిల్చుని ఇద్దరు వ్యక్తులు చేయి ఊపారు. మోహిని ఆజ్ఞననుసరించి డ్రయివరు కారు ఆపాడు. మోహిని ముందుకువంగి చూచింది. ఆయిద్దరూ దగ్గరకు వచ్చారు.

"పట్నంలోకి వస్తున్నారా?" అని అడిగింది మోహిని.

"ఔను."

డ్రయివరు తన పక్కనున్న తలుపు తెరిచాడు. ఆ వ్యక్తి అటు తిరిగి వెళ్ళబోతూంటే మోహిని తన సీటు పక్కన వున్న తలుపు తెరిచింది. అప్పుడే కారులోని దీపంకూడా వెలిగింది.

"రండి లోపలికి."

"ఆ యిద్దరు వ్యక్తులు ఔ ద్వాకంగుండానే లోపలికి వచ్చారు.

మోహిని ఒకమూలకు జరిగి కూర్చుంది. మోటారులోకి మొదట యెక్కిన వ్యక్తి ముఖం దీపంవెలుగులో ఆమె చూచింది. శాలువలుతెచ్చిన యువకుడే అతను. రెండవవ్యక్తిని సరిగా చూచి పోల్చుకునే అవకాశం ఆమెకు చిక్కలేదు. ఆ యువకుడు శాలువలు తెచ్చినప్పుడు ధరించిన దుస్తులకు, ఇప్పుడు ధరించిన దుస్తులకు చాల భేదం ఉంది. ఇప్పుడు బుష్షర్టు, పేంటు తొడుక్కున్నాడు. అతను తన్ను గుర్తుపట్టకుండా వుండాలని ఆమె ఉద్దేశం. కాని అతడు తన్ను గుర్తుపట్టలేదన్న సాంత్వనమాత్రం కలుగలేదు. తలుపు మూయబడింది. మోటారు సాగింది. మోటారులో దీపంకూడా ఆరిపోయింది. "మీరు ఎక్కడదిగుతారు?" అన్నది మోహిని బిరుసైన కంఠస్వరాన.

"ఊరురాగానే దిగేసి వెళ్ళిపోతాం" అన్నా డా యువకుడు.

"అక్కర్లేదు. ఎక్కడ కావాలంటే అక్కడే దిగబెట్టి వెళ్లిపోతాను."

"వద్దులెండి. బస్తీ రాగానే దిగిపోతాం."

మోహిని మళ్ళీ ఏమీ మాటాడలేదు. మౌనంగానే ఉండిపోయింది. కొంతసేపు అయాక అడిగింది: "మీరు ఈప్రాంతంలో ఎక్కడైనా...."

"లేదండి; మేము ఇక్కడెక్కడా వుండటంలేదు. ఏదో షికారుగా వచ్చాం... ఆలస్యం అయిపోయింది. చీకటిపడిపోవటంవల్ల మిమ్మల్ని కష్టపెట్టవలసివచ్చింది."

"ఎబ్బే! ఏం కష్టంలేదు. పట్నంలో మీరు ఉండేది ఎక్కడ? చెప్పండి, అక్కడే దిగబెట్టి వెడతాను."

యువకుడు ఆమాటకేమీ జవాబు చెప్పలేదు. పట్నం పొలిమేర వచ్చేసింది. యువకుడు మోటారు ఆపించి దిగబోతున్నాడు. కాని ఆమూలవున్న

రెండోవ్యక్తి మాత్రం దిగిపోయే తొందరలో వున్నట్టు కనిపించలేదు ; తాను వెనక్కు బాగా ఒదిగికొని మొదటి వ్యక్తి వెళ్ళిపోటానికి వీలు కల్పిస్తున్నాడు. కాని యీ అసమంజసపరిస్థితి క్షణకాలమే. వెంటనే లేచి తలుపు తెరచాడు. తాను దిగాడు. యువకుడుకూడా దిగాడు. డ్రయివరు చెయి వెనక్కు చాచి తలుపు మూయబోయాడు. "కొంచెం ఆగండి" అన్నాడు ఆ రెండోవ్యక్తి. యువకునితో ఏవో రెండుమాటలు చెప్పి మళ్ళీ మోటారులో ఎక్కి మోహిని కూర్చున్న సీటుమీదే వచ్చి కూర్చున్నాడు. లోపలి దీపం కొంచెంసేపే వెలిగింది. ఆకాసేపటిలోనే మోహిని అతన్ని చూచింది ; నిర్ఘాంతపోయింది. అతడెవరోకాదు ; జితేంద్రుడు ! విచిత్రమైన దుస్తుల్లో వున్నాడు—పట్నంలోని ఒక సంపన్నులయింటి నౌకరులాగ. తలుపు మూయబడింది. మోటారు సాగిపోతున్నది.

"మీరెక్కడ దిగుతారు ?"

"ఆ పై చౌతరాలోనే దిగిపోతాను."

మోహిని బటన్ నొక్కి దీపం వెలిగించింది, జితేంద్రునివైపు ఎగాదిగా చూచింది. అతడుకూడా అమెవైపు చూచాడు. ఆమె చూపులు కిందికి వాల్చుకుని చేతిగడియారంలోచూచింది. ఎనిమిదీ ఇరవై అయింది. తొమ్మిదింటికల్లా మోటారు సినీమాహాలుదగ్గరకు పంపించాలి. ఇల్లు ఇంకా మూడు మైళ్ల దూరం ఉంటుంది. అక్కడినించి సినీమాహాలు మైలున్నర. మూడు, ఒకటిన్నర ; మొత్తం నాలుగున్నరమైళ్ళు. పదినిమిషాల పని. ఇంకా ముప్ఫయి నిమిషాలు ఉంటాయి. "బజారులో కొట్లు ఇంకా వుంటాయా ? మందు ఒకటి కొనాలి" అన్నది మోహిని డ్రయివరుతో.

"అప్పుడే మూసేయరు ; ఇంకా వుంటాయి కొట్లు."

"అయితే బజారుమీదుగా పోనీ."

బజారులో ఒక మందులదుకాణందగ్గర మోటారు ఆగింది. మోహిని డ్రయివరుచేతికి పైకం ఇచ్చి రెండుమూడు వస్తువులేవో కొనుక్కురమ్మని చెప్పింది. అతడు డబ్బు పుచ్చుకుని వెళ్లాడు. మోహిని జితేంద్రునివైపు తిరిగి అడిగింది : "ఇంకా ఏంకావాలి నీకు నాదగ్గరనించి ?"

"ఇందాక కబురంపించానుకదా ! యాభై వేలు."

"ఏం ? ఇంకా పొట్ట నిండలేదా ?"

"లేదు. నాకు తీరికలేదు. చప్పున జవాబుచెప్పు !"

"జవాబు వేరే చెప్పేదేముంది జితేన్ ! నువ్వు ఎప్పుడూ నాదారికి అడ్డంరాబోకు."

"జితేన్ పళ్లు పటపట కొరికాడు. "ఎవరు వచ్చారు నీదారికి అడ్డం ? అంత గొప్పగా అనుకుంటున్నావేమిటి నిన్నుగురించి నువ్వు ?"

నాదగ్గర యాభై వేలు కాదుకదా -ఒక్కపైసాకూడా లేదు. నన్ను ఊరికే వేధించబోకు. ఇలా విచ్చలవిడిగా తిరిగేస్తున్నావే — ఏమౌతుందో తెలియకుండా ! నెత్తిమీదికి ఏమిరానున్నదో నీకేమన్నా తెలుసా ?"

"వస్తుంది చావు! అంతేకదూ ! మీ తలమీద సమస్త చట్టాల రక్షణ హస్తం ఉంది....ఉండనీ ! నాకు టైములేదు; చప్పున తేల్చు !"

"ఒక పని చెయ్యరాదూ ? నీ ముఠానంతనూ వెంటబెట్టుకొని మాయింటి మీద దాడిచెయ్యి. ఇంకా ఏమన్నావుంటే దోచుకుపో. నీ ఆకలిపొట్ట అప్పటి కైనా నిండుతుందేమో !"

"అదేపని చెయ్యవలసివస్తుందేమో చివరకు. నేను చాల మంచి వాడిననీ, అలాంటిపనులు చెయ్యలేననీ భావించికదూ .... నువ్వు అలా అంటున్నావు ! కాని మోహినీ ! పట్టినవ్రతమేదో పట్టాను. నాకు మిగతా విషయాలేమీ తెలియవు. దోపిడీ నాకు చేతకాదనుకోకు."

"నేనలాగేమీ అనుకోటంలేదు. పో, దోపిడీలు చెయ్యి, చావు....! బడాయిలు కొడతావెందుకూ నాముందు ?"

జితేంద్రుడు తాను కూర్చున్నచోటునించి లేచాడు, తలుపు తెరచాడు, క్రిందికి దిగాడు, తలుపు మూసేశాడు. గబగబా డ్రయివరుసీటులో వెళ్లి కూర్చున్నాడు. ఇంజన్ స్టార్టు చేస్తున్నాడు.

మోహిని చేయిచాచి అతని భుజం పట్టుకుంది, "ఏమిటా పని ? నీకేమన్నా పిచ్చెత్తిందా ?" అంటూ.

తన భుజం పట్టుకున్న ఆమెచేతిని గట్టిగా ఒకచేత్తో పట్టేశాడు జితేంద్రుడు. అదొక వజ్రముష్టిలా అనిపించింది మోహినికి. ఆపట్టులో ఆమె చేతివ్రేళ్ళు బలహీనములైనాయి. మొత్తం చెయ్యే శక్తిహీనమై

పోయింది. అసలు ఆ చేయిగల వ్యక్తిలోనే శక్తి ఇగిరిపోయినట్టుంది. అంతా ఆకస్మికంగా జరిగిపోయింది. ఇలా జరుగుతుందని అనుకోటానికి వ్యవధానమే లేదు. జితేంద్రుడు వేగంగా మోటారు తోలుకుపోతున్నాడు. మోహిని చూచింది. కొన్ని క్షణాలవరకూ ఆమె మన స్పృహలో ఉన్నట్టు లేదు. ఏమి జరుగుతున్నదో, ఏమి జరగటంలేదో ఆమెకేమీ.తెలియటంలేదు. కొంతసేపటికి మామూలు స్పృహ వచ్చింది. పరిస్థితి గుర్తించింది. హృదయంలో ఒక క్షోభ, ఆవేదన నిండిపోయాయి. ఒక ఘోరమైన జుగుప్స మధిస్తున్నది లోపల. క్రోధం మాత్రం ఏమీ లేదు; శత్రుత్వభావమూ లేదు. ఒక నీరసమైన క్లాంతి, ఒక మలినమైన గ్లాని ఆమెను ముంచుకున్నాయి. ఎదురుగా కూర్చుని, మోటారును అమితవేగంగా తోలుకుపోతున్న ఆవ్యక్తితో మాటాడ్డానికిగాని, అతన్ని అడ్డగించటానికిగాని బుద్ధిపోనేలేదు ఆమెకు. ఒకరకమైన పీడ, వ్యథ లోలోపల పీడిస్తున్నాయి. వెక్కివెక్కి యేడువసాగింది. ఇక తనసంగతి గురించిన ఆలోచన పూర్తిగా వొదిలేసుకుంది ; అభాగ్యురాలు తాను. ఇక ఆ అభాగ్యుడికి తానేం సాయంచెయ్యగలదు ? ఎటూ చూడకుండా కళ్ళు పూర్తిగా మూసేసుకుంది. తన హృదయవేదనలో తాను మునిగిపోయి కూర్చుంది.

జితేంద్రుడు మోటారును ఎటు తీసుకుపోతున్నాడో అతనికే తెలియదు. ఈ సంఘటన ముందుగా అనుకున్నదికాదు, పెట్టిందికాదు. ఇలా వస్తుందని ఎవరూ అనుకోలేదు. అప్పటికప్పుడు తారసిల్లింది. చూస్తూ చూస్తూండగానే అతనిలో ఒక ఘోరమైన ఆలోచన ఉత్పన్నమైంది. ఎకాయెకి వెళ్లి 'స్టీరింగ్ వ్హీల్' (చక్రం) దగ్గర వెళ్లి కూర్చున్నాడు. వెనుకనించి ఆ స్త్రీహస్తం వచ్చి బుజం పట్టేసి అటకాయించింది. అందుచేత అతనికి ఇంకా పట్టుదల ఎక్కువైంది. తాను కర్త కాదు ; క్రియకు కర్మతుల్యుడే, క్రియ అతన్ని తయారుచేసింది. తాను తనలోలేడు. మనిషిలో భావాలు ఉంటాయి అంటారు. భావమేతప్ప మనిషిఅంటూ వేరేఉండడు బహుశా. కాని అప్పుడప్పుడు అనిపిస్తూవుంటుంది : 'మనుషులనేవాళ్ళు అసలువుండరు అనీ, దేవతలన్నా వుంటారు లేక రాక్షసులన్నా వుంటారు' అనీను. అన్ని శరీరాల్లోనూ వాళ్లే ఉంటూవుంటారు. మానవుడు శరీరధారియై ఒకప్పుడు

దేవతకూ, మరొకప్పుడు రాక్షసునికీ వశమైపోతూ వుంటాడు. శరీరం అనేది కేవలం ఒక 'మీడియం' (మాధ్యమం.) భావమే కర్త. సద్భావం దేవత; దుర్భావం రాక్షసుడు. కర్తృత్వం వాళ్ళదే; మనిషిది కాదు. జితేంద్రుని పరిస్థితి ఇంచుమించు అలాగే ఉంది. ఇప్పుడు జితేంద్రుడు అనే వ్యక్తి లేడు. మోటారు తోలుకుపోతూంటే వెనుకనించి ఎవరో వెక్కి-వెక్కి ఏడుస్తున్నట్టు వినిపిస్తున్నది! ఎవరో ఉన్నట్టున్నారే! ఒకపక్కన బడబడ ఇంజన్ మోత; మధ్యమధ్య ఉండిఉండి వెక్కి-వెక్కి యేడుపుధ్వని చెవికి తగులుతూనే ఉంది. కాని దాని భావమేమీ అతని హృదయానికి అంటుతున్నట్టు లేదు. తనలో ఆమెకేమీ సంబంధంలేదు. ఎవరితోనూ ఆమెకు సంబంధంలేదు. ఆమెలో ఆమె పరిపూర్ణురాలు. ఆమెసంగతి ఒకరు వినిపించుకోనక్కర్లేదు; పట్టించుకోనక్కరేదు అన్నట్టు అతడు మోటారును నడిపించుకుపోతున్నాడు. ఎక్కడినించో....తన పక్కనించేనేమో....తనలోనించేనేమో కూడా....వెక్కి-వెక్కి ఏడుపుధ్వని వినవస్తూనేఉంది. మిక్కిలి తత్పరుడై, చాల జాగ్రత్తగా, విచలితుడు కాకుండా, జనసమ్మర్దంలోనించి మితిమీరిన వేగంతో తోలుకుపోతున్నాడు మోటారు. అలా తోలుకుపోవాలంటే ఎంతో నేర్పు, అవధానం అవసరం. ఈకళలో అతడు సిద్ధహస్తుడులా కనిపించాడు. తాను తనలో లేడాసమయాన. తనలోనించి ఉత్తీర్ణుడు అయినాడు.

"దిగండి."

విన్నదామాట ఒకమూల ముడుచుకుని కూర్చున్న ఆ స్త్రీ.—

"దిగండి.'

వెంటనే ఆమెకు చైతన్యం కలగలేదు. మెల్లమెల్లగా స్థితిగతులు బోధపడుతున్నాయి. ఆవ్యక్తి తలుపు తెరిచి "దిగండి" అని చెబుతున్నాడు. ఆమె చీరసర్దుకుంటూ దిగింది. కాని ఇదేమిటి? తన యిల్లేనే! తన యింటి ముందు పోర్చి! దూరంగా ససంభ్రమంగా నిల్చున్నాడు దర్వాన్. ఆమెకేమీ అర్థంకాలేదు. ఇంకా బాగా నమ్మకం చిక్కక నలువైపులా పరికించి చూచింది. 'ఇదంతా ఏమైనా ఇంద్రజాలమా? సత్యంకాదా?....' అనుకుంది. ఆ వ్యక్తివైపు చూచింది. ఔను, అతడే! జితేంద్రుడే! "మీకు నేను చాల కృతజ్ఞురాలను" అన్నది అప్రయత్నంగా.

"ఇప్పుడు టైము ఎంత ? చూడండి" అన్నాడు వ్యక్తి.

మోహిని తనకు తెలియకుండానే చేతిగడియారం చూచింది. "పావు తక్కువ తొమ్మిది" అన్నది. అంటూండగానే ఆమెకేదో జ్ఞాపకం వచ్చింది. "ఒక చిన్న సాయం చేసిపెడతారా ? డ్రయివరు లేడుకదా ! మీకు తెలిసిన విషయమే. నేనేమో బాగా అలసిపోయాను. సినీమానించి మావారు వచ్చే వేళ అయింది. కొంచెం వెళ్ళి వారిని తీసుకురాగలరా ?" అన్నది.

అలా పనిచెప్పటంలో ఆమె ఉద్దేశం ఏమిటో అతనికి బోధపడలేదు. మాటాడకుండా నిల్చున్నాడు. మాటైతే అనేసిందిగాని, తరువాత 'ఏమిటి ? ఇతన్ని పంపిస్తున్నానేమిటి ?' అని తనకు తానే విస్మితురాలైంది. జరిగిన పొరపాటు సర్దుకుందామని ఆలోచిస్తూనేవుంది. కాని ఎదురుగా నౌకరులా నిల్చున్న ఆ వ్యక్తి 'చిత్తం, అలాగే !' అంటూ సలాంచేశాడు.

మోహిని మాటతిప్పుకోవాలని అనుకుంటూనేవుంది, కాని ఆవ్యక్తి మోటారులో ఎక్కి అప్పుడే పోనేపోయాడు. ఆమె తన గదిలోకి వెళ్ళింది. మనసంతా అస్తవ్యస్తంగా ఉంది. 'ఏమికానున్నదోకదా ! మోటారు తీసుకుని నేనేవెడితే బాగుండిపోయేదే !' అనుకుంది. కాని ఇప్పుడు తట్టింది ఈ ఆలోచన; అప్పుడు తట్టలేదు మరి ! ఆమ్మె మనస్సే ఆమెను మాటిమాటికీ కొరుక్కు తినసాగింది. 'అరె, ఇలాచేశానేమిటి ?....కాని ఎలాగూ మోటారు పంపించకతప్పదుగా! సరే కానీ; అయిందేదో అయింది....'అని ఇలాగే ఏవేవో ఊహాపోహలతో, తత్తరపడుతూ కూర్చుంది. తొమ్మిదిన్నర అయింది; పావుతక్కువపది అయింది. అలాగే ఎదురుచూస్తూ కూర్చుంది.

జితేంద్రుడు యథావిధిగా చద్దాను వాళ్ళింటిదగ్గర దింపేశాడు ; నరేశుని తీసుకుని ఇంటికి వచ్చాడు. ఉండటం నౌకరువేషంలోనే వున్నాడాయెను. సినీమాలోనించి బయటకు రాగానే బారిష్టర్ గార్ని గుర్తుపట్టి ముందుకు వచ్చాడు. 'మీమోటారు అక్కడవుంది, దయచెయ్యండి' అన్నాడు. ఆ యిద్దరూ సినీమాలోని సంగతులు నెమరువేసుకుంటున్నారేమో ! ఎవరుగాని అతన్ని సరిగా దృష్టిపెట్టి చూడలేదు. "మా డ్రయివరు ఏమైనాడు ?" అని అడిగాడు బారిష్టరు.

అతడు చెప్పిన ఏదో సమాధానంతో సరిపుచ్చుకుని ఆ ఇద్దరూ మోటారులో ఎక్కి కూర్చున్నారు.

మోటారు వచ్చి పోర్చిలో ఆగటంతోనే మోహిని ఆతృతగా పరిగెత్తుకుంటూ వచ్చింది. నరేశుని కంఠం కావిలించుకుని "ఇంత ఆలస్యం చేశారేం?" అన్నది.

ఆమె ఆతృత, వ్యగ్రత చూచి నరేశుడు ఆశ్చర్యపోయాడు. "పిక్చరు చాల పెద్దది" అన్నాడు.

"పదండి; మీరు లోపలికి పదండి. ఈ డ్రయివరు సమయానికి మంచి సాయం చేశాడు. ఇతనికి బహుమానం చెల్లించి ఇప్పుడే వస్తాను" అన్నది.

నిశ్చింతగా, నరేశుడు తన గదివైపు ముందుకు సాగిపోయాడు. మోహిని తన చేయి చాచి జితేంద్రుని హస్తాన్ని అందిపుచ్చుకుంది. "నేను నీకు చాల చాల కృతజ్ఞురాలను" అన్నది.

"ఏమైనా బహుమతి ఇప్పిస్తారా? బీదవాడికి మేలు జరుగుతుంది" అన్నాడు జితేంద్రుడు కటువుగా.

ఆమాట మోహినికి చాల కష్టం కలిగించింది.

"నడిచే వెళ్ళిపోతావేమిటి?"

"ఎబ్బే, 'ప్లేన్'(విమానం)లో వెడతాను."

"పద, నేను కారులో పంపించి వస్తాను."

"అనవసరంగా మాటలుమాత్రం ఖర్చుపెట్టుకుంటారెందుకూ? విశ్రాంతిగా పడుకోండి పోయి."

దర్బాన్ బల్లెం పుచ్చుకుని మెట్లమీద సావధానంగా నిలబడివున్నాడు.

"జితేన్, నన్ను క్షమించు!" అన్నది మోహిని చాల తగ్గుస్థాయిలో, అతనికి దగ్గరగా వచ్చి.

ఆమె కంఠస్వరం కంపించింది. జితేంద్రునికి తనపై తనకు అసహ్యం వేసింది. చాల కోపం వచ్చేసింది. ఆకోపంలో ఏమి అనేవాడో ఏమో! కాని తన్నుతాను నిగ్రహించుకున్నాడు. ఏమీ మాటాడకుండా తిరిగి వెళ్ళిపోతున్నాడు.

"ఇదిగో...."

ఆకంఠధ్వని అతనివెనకాలే ఉరకలువేసింది. అందులో ఏదో అను రోధం: ఏదో ఉపాలంభం! జితేంద్రుడు తిరిగి వచ్చాడు; సలాంచేశాడు. "మోటారు షెడ్డులో పెట్టాలికాబోలు బహుశా! మంచిది...." అన్నాడు.

శూలాల్నిమించిన మాటలు విసురుతూన్న ఆవ్యక్తివైపు చూస్తూ నిల్చుంది మోహిని కొంతసేపు. చివరకన్నది: "ఔనౌను, పద! నేను కారులో కూర్చుని షెడ్డు ఎక్కడ ఉందో చూపిస్తాను, రా!"

కారు షెడ్డులో పెట్టేసి జితేంద్రుడు బయటకు వస్తూంటే మోహిని అతని చేయి పుచ్చుకుని "జితేన్!" అన్నది.

జితేన్ ఆమె హస్తాన్ని విసురుగా విదలించికొట్టి పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ గబగబా దాటిపోయాడు.

# 17

జితేంద్రుని గది. సాయంత్రం ఆరుగంటలవేళ. కుర్చీలో కూర్చునివున్నాడు జితేంద్రుడు. ముందున్న మేజామీద ఏడెనిమిది కప్పులు, గ్లాసులు ఉన్నాయి. అన్నీ ఖాళీవే. చుట్టూ నాలుగువైపులా కుర్చీలు, ముక్కాలిబల్లలు సరిగ్గా అన్నే వున్నాయి. అవీ ఖాళీగానే వున్నాయి. ఇంతవరకూ వాటిమీద ఎవరో ఆసీసులై వుండి ఇప్పుడే లేచివెళ్లారని తెలుస్తూఉంది.

తిన్నీ వచ్చింది. జితేంద్రుడు చూస్తూ కూర్చున్నాడు. ఆమె కప్పులు, గ్లాసులు మేజామీదినించి తీసి లోపలికి పట్టుకుపోయింది. జితేంద్రుడు సిగ రెట్ వెలిగించి నోట్లో పెట్టుకున్నాడు. తిన్నీ మళ్ళీ వచ్చింది. కుర్చీలు, ముక్కాలిబల్లలు అన్నీ ఒక పక్కకు సర్దేసి వెళ్ళిపోతుంటే జితేంద్రుడు పిల్చాడు: "తిన్నీ!"

పిలుపు విని తిన్నీ మేజాదగ్గరకు వచ్చి నిల్చుంది.

జితేంద్రుడు ఒక్క సిగరెట్టుదమ్ము పీల్చాడు; పొగ విడిచిపెట్టాడు. తిన్నీవైపు చూడకుండానే ఇలాఅడిగాడు: "విన్నావా నువు మేము ఏమేమి విషయాలు మాటాడుకున్నదీ?"

ఆ ప్రశ్న అనవసరం ; దానికి సమాధానమూ అనవసరం — అన్న ట్టుగా మూగిమొద్దులా నిల్చుంది తిన్నీ.

"వినలేను కదూ! పోనీలే. వినకుండా ఉండటమే మంచిది. మా పనులు, ఆలోచనలూ.... ఇవన్నీ ప్రయోజనంలేనివే" అంటూ జితేంద్రుడు తిన్నీముఖంలోకి చూచాడు. చూపు మరలించుకుని సిగరెట్ దమ్ము పీల్చాడు. పొగ వదిలాడు. ఉంగరాలుగా తిరుగుతూన్న ఆ పొగలో విలీనుడైనాడు.

రెండు నిమిషాలు గడిచాయి. తిన్నీ ఇంకా అక్కడే వున్నదని జ్ఞాపకంవచ్చింది. "వెళ్లు తిన్నీ. నీ పనిచూచుకో" అన్నాడు.

తిన్నీ మాటాడకుండా వెళ్ళిపోయింది. కొంతసేపటివరకూ జితేంద్రుడు అక్కడ అలాగే కూర్చున్నాడు. తరువాత లేచి పచార్లు ఆరంభించాడు. మెల్లిగా చీకట్లు కమ్ముకుంటున్నాయి. కాని అతడు అలాగ పచార్లు చేస్తూనే ఉన్నాడు, ఇటునించి అటు, అటునించి ఇటు.

తిన్నీ లాంతరు వెలిగించి తీసుకువచ్చి మేజామీద పెట్టింది. జితేంద్రుడు చూచాడు. కాని పచార్లు ఆపలేదు. యధాపూర్వంగా అడుగులు వేస్తూనేవున్నాడు.

లాంతరు పెట్టేసి తిన్నీ వెళ్ళిపోయింది. ఇప్పుడామెకు ఏవిధమైన కుతూహలమూ ఉన్నట్టులేదు. ఆవ్యక్తిని అర్థంచేసుకోవాలన్న ప్రయత్నం ఇప్పుడామెలో కనిపించటంలేదు. అతనిసంగతి ఇదివరకే ఆమెకు అర్థమైపోయిందో, లేక అర్థంచేసుకోవాలన్నకోరికే విడిచిపెట్టేసిందో! అతడు తనలోనే ఉంటున్నాడు. అందుచేత ఆమెకూడా తనలోనే ఉండిపోవటం నేర్చుకుంది. ఉంటారు దేవలాపురుషులు ; వాళ్ళలోకం ఎక్కడో అవగాహన కాదు. ఇక్కడవుంటూ ఆమె అతన్ని పూర్తిగా పొందనేలేకపోయింది. ఎప్పుడూ అతడు వాకిట్లో గడపలోనే కూర్చుంటాడు. లోపల అంతఃపురంలో సంగతులు అతనికి అక్కర్లేదు. చాలదూరంగా ఉంటాడు. బైట గడపదగ్గర ఉండిపోవటమే అతనికి సంతృప్తి. బైట కూర్చుని కూర్చుని ఓడిపోయి, అలసిపోయి చివరకు మళ్ళీ తనదగ్గరకే వస్తాడు అన్న ఆశ క్రమేణా నిరాశ ఔతూవచ్చింది. అందుచేత అటువంటిఆశనుఆమెఇప్పుడుమనసులోకే రానీయటంలేదు. తనపనిలో తాను నిమగ్నయైవుంటుంది; అతన్నిగురించి ఆలోచించ

టమే మానివేసింది. తన ఆలోచనలకు అందేవాడా అతను? మూడునాలుగు రోజులనించీ ఒక్క పులగం మాత్రమే వండమని ఆజ్ఞ! సగ్గుబియ్యంకూడా వాడవద్దన్నాడు. ఏవస్తువైనా ఆపులగంలోనే వేసి వండమన్నాడు. తిన్నీ పులగంతప్పేల కుంపటిమీదికి ఎక్కించింది. చెంబులుతోముతూ కూర్చుంది. ఇంతలో తన వెనుకనే పేరుపెట్టి పిలుస్తున్న కంఠధ్వని: "తిన్నీ!"

తిన్నీ వెనక్కు తిరిగి చూచింది. లాంతరు వెలుగు మందంగాఉంది. జితేంద్రుని పెదవులపై ఒక చిరునవ్వు కనిపించిందామెకు. అది చాల అరుదుగా కనిపిస్తూఉండే వస్తువు. కాని ఇప్పటి ఆ చిరునవ్వు చూచి ఆమెకు ఎక్కువ ఆనందం కలుగలేదు.

జితేంద్రుడు నవ్వుతూ ఇలా అన్నాడు: "తిన్నీ! సమాజపువ్యవస్థ అంటే నీకు తెలుసా? మనచుట్టూ ఉన్నదంతా సమాజమే. మనమంతా కలిసి ఒక సమాజం. ఈ వ్యవస్థను, అంటే—ఇప్పుడుంటూన్న నియమ నిబంధనాల్ని మేము మార్చివెయ్యాలని చూస్తున్నాం. ఏం? అర్థం అయిందా?" అంటూ జితేంద్రుడు బిగ్గరగా నవ్వాడు. ఆనవ్వు తిన్నీకి చాల భయంకరంగా వినిపించింది. చేస్తున్న పనిలో చేయి లగ్నంకావటంలేదు. ఆ నవ్వునూ, అతన్నీ చూస్తూ ఉండిపోయింది.

"ఏమిటి? అలా చూస్తావేం?" ఆపని వొదిలేసి ఇలా వచ్చెయ్యి. నీకు ఇంకా బాగా తెలిసేట్టు చెబుతాను. పిచ్చిదానా! ఇదంతా తెలుసుకోటం చాల అవసరం, నీకు ప్రేమ అనేది బాగా తెలుసు. నేను విప్లవం అనే దాన్ని నీకు బోధిస్తాను" అంటూ జితేంద్రుడు అదోరకంగా నవ్వాడు. "మృదువైన, రసార్ద్రమైన ప్రేమలాంటిది కాదది. ఆధునికమైన విజ్ఞానం... కఠినమైన, బరువైన, వాస్తవమైన విజ్ఞానంసుమీ అది."

"పులగం తయారౌతున్నది. తిన్నతరువాత చెబుదురుగానిలెండి."

ఆమాటవిని జితేంద్రుడు జంకుతూ ఆగిపోయాడు—"ఏమిటీ?"

"తయారైపోయిందిలెండి" అంటూ చేతులు కడుక్కొని ఆమె కుంపటిదగ్గరకు వెళ్లింది. గరిటెతో పులగం కొంచెం బైటికితీసి చిదిమి చూచింది. "ఇంకా కొంచెం ఉడకాలి, రెండునిమిషాలు ఆగండి...."

ఓడిపోయినవాని వాలకం పడింది జితేంద్రునికి. తిరిగి తన గదిలో!

వచ్చాడు. మళ్ళీ పచార్లు ఆరంభించాడు. మనస్సుకు శాంతి లేకుండావుంది. అతని హృదయంలో ఏమిభావాలు సందడిస్తున్నాయో మరి! నవ్వు మాయమై పోయింది; ముఖంలో ఒకరకమైన కాఠిన్యత వచ్చేసింది. ఆ కాఠిన్యత తీవ్ర తరరూపం తాలుస్తున్నట్టున్నది. ఏ సంకల్పరజ్జువుచేతనో అది చెదరి పోకుండా సుస్థిరంగా అక్కడ బంధింపబడుతున్నట్టున్నది.

తిన్నీ ప్లేటులో పులగం పెట్టుకుని, ఒక చంచాకూడా తీసుకుని వచ్చింది. "రండి, కూర్చోండి, తయారైంది."

ఎవరో వెనుకనించి పట్టిలాగి ద్రుతగతిని ఆపుచేసినట్టు జితేంద్రుడు నిల్చిపోయాడు. "వచ్చావా?" అన్నాడు లోపలిభావావేశాన్ని అణచుకుని.

"మీరు నెయ్యికూడా వేసుకోటం మానేశారు. కొంచెం పట్టుకురానా?"

"వద్దు" విసురుగా జవాబు.

"ఊరగాయ తీసుకురానా పోనీ."

"వద్దు."

"ఏం? కోపంవచ్చిందా ఎవరిమీదన్నా?"

జితేంద్రుడు ఏమీ మాటాడకుండా మేజాముందు వచ్చి కూర్చు న్నాడు. తిన్నీవెళ్ళి ఒక గ్లాసుమంచినీళ్ళు తెచ్చి పెట్టింది. జితేంద్రుడు దత్తచిత్తుడై చంచాతో పులగం కొంచెంకొంచెం తీసుకుని తింటున్నాడు. తిన్నీ అక్కడే నిల్చునివుంది.

"కూర్చో."

చివాట్లు తిని జీర్ణించుకుంటున్న మనిషిలా తిన్నీ కూర్చుంది. జితేంద్రుడు నెమ్మదినెమ్మదిగా తింటున్నాడు, మనసు తిండిమీదలేనట్టు.

"ఏమిటో తెలియజెబుతానన్నారుగా! ఇప్పుడు చెప్పండి" అన్నది తిన్నీ.

"నేను తెలియజెబుతానన్నానా?" సాశ్చర్యంగా అడిగాడు జితేంద్రుడు.

"ఔను, చెబుతానన్నారుగా ఇందాక! ఇప్పుడు తీరిగ్గావున్నాను, చెప్పండి."

"నువుకూడా భోజనంచెయ్యి మరి!" అన్నాడు మెల్లిగా జితేంద్రుడు.

"నేనా ?" ఆశ్చర్యంగా అన్నది తిన్నీ. "నాభోజనానికేం? తింటూనే మీరు చెప్పేది వింటాను."

"అలాకాదు; ముందు తిను" అన్నాడు జితేంద్రుడు ఇంకా తిన్నగా.

"అంటే మీరు నాకు తెలియజెప్పాలనుకున్న విషయం అంత అవసర మైంది కాదనేగా దాని అర్థం ?"

"ఔను, అంత అవసరమైనదేమీకాదులే!" అన్నాడు జితేంద్రుడు పరమసంతోషం వెలిబుచ్చుతూ.

ఆమాటాడిన కంఠస్వరం అహోకరీతిగా వుంది. తిన్నీ నిలువునా కరిగి పోయింది. అతనివైపు అలా చూస్తూ ఉండిపోయింది. అతడు పులగం తినటం అయిపోయింది. ప్లేటు పక్కకు నెట్టాడు. తిన్నీ చేతిలోకితీసుకుంది ఆప్లేటు. జితేంద్రుడు గ్లాసు ఎత్తి రెండుగుక్కలు మంచినీళ్లు త్రాగాడు. పుక్కిలించి ఉమ్మివేయాలని లేచాడు. ఇంతలోనే తిన్నీ ప్లేటు అతనిముందు పెట్టింది "అందులో పుక్కిలించి ఉమ్మేయండి: ఎక్కడికో పోవటం ఎందుకూ ?" అంటూ. జితేంద్రుడు ఆమెముఖంలోకి చూచాడు. మెల్లిగా ఆమెచేయి పక్కకు తొలగించి, మేజాపక్కనించి త్రోవచేసుకుని అటు వైపు మూలకువెళ్ళి పుక్కిలించివుమ్మేశాడు. తిన్నీ అతనిచేతిలోని గ్లాసు అందుకుంది. గ్లాసు ప్లేటు కిందపెట్టేసింది. పక్కనఉన్న తుండుగుడ్డ తెచ్చి అతనికి ఇచ్చింది. జితేంద్రుడు మరేమీ అభ్యంతరం చెప్పలేదు. తుండు గుడ్డతో మూతి, చెయ్యి తుడుచుకుని వచ్చి యథాస్థానంలో కూర్చున్నాడు. తిన్నీ వెళ్ళిపోయింది. జితేంద్రునిపరిస్థితి ఏంబాగాలేదు.

మరికాసేపటికి తిన్నీ తిరిగివచ్చింది. "ఇక ఇప్పుడైనా చెబుతారా ?" అన్నది.

"నువు భోజనం చేశావా ?"

"చేశాను."

"నేనేం చెబుదామనుకున్నానోగాని, మరచిపోయాను తిన్నీ !"

"విప్లవంగురించి చెబుదామని ఆరంభించారు. ఇకపోతే, సమాజం, వ్యవస్థ అనేవాటినిగురించికూడాను. చెప్పండిమరి, తిన్నగా అర్థంచేసు కుంటాను."

జితేంద్రుడు నుదురు అరచేతిలో అదుముకున్నాడు తనే అన్నీ మరచిపోతూవుంటాడు. అతని బుద్ధితీక్షణత తడిసిపోయినట్టుంది. తుపాకి మందు ఎండి పొడిపొడిగానే ఉండాలి. బుద్ధి సీరుగారుతూంటే లాభంలేదు. తుపాకిమందు తడిసిపోతే ఎందుకూ పనికిరాదు. ఇంతకుముందే అతని మనో నేత్రంముందు విస్పష్టంగా, నిర్దిష్టంగా గోచరిస్తూ ఉండిన విషయం ఇప్పుడు మాయమైపోయింది. "వ్యవస్థమార్చాలి ; విప్లవం తీసుకురావాలి" అన్న విషయం గుర్తుకురానంత దూరస్థవిషయమా తనకు ? ఇంతలోనే మసక మసకగా అయి, అదృశ్యమైపోయిందే ! దానికి ఇంతకుపూర్వం ఉండిన ప్రాముఖ్యత, ఆవశ్యకత ఇప్పుడు లేకుండా పోయాయి. "తిన్నీ ! ఆ సొమ్ములు నీదగ్గరే వున్నాయి కదూ ! ఎప్పుడైనా ధరించి చూచావా ?.... చూడలేదు, నాకు తెలుసు. ఒక్కసారి పెట్టుకుని చూడాలన్న కోరిక కలగటం లేదూ నీకు ?"

"ఊహుఁ."

"ఏం ? చాల అందంగావుంటాయి."

"గొప్పవాళ్ళకయితే బాగుంటాయి. నేను అందగత్తెనా ఏమన్నానా?"

జితేంద్రుడు ఒక్క నిట్టూర్పు విడిచాడు. "నువుకూడా అందగత్తెవే తిన్నీ."

ఆమెహృదయం పొంగింది : "నిజంగానా ?"

"నిజంగానే. అబద్ధంకాదు."

"నాకు పెడతారా మరి సొమ్ములు !" అకస్మాత్తుగా అనేసింది తిన్నీ.

జితేంద్రుని శరీరంమీద ఎవరో కాటువేసినట్లనిపించింది. తిన్నగా సంబాళించుకున్నాడు. "గొప్పవాళ్లు ధరిస్తారు ; తక్కువవాళ్లు ధరించలేరు. ధనవంతులు ధరిస్తారు ; బీదవాళ్లు ధరించలేరు" ఇలా అంటూండగానే అతనికి ఆవేశం రెచ్చిపోయింది. "బీదవాళ్లు ఎందుకు ధరించలేకుండా వున్నారు ? వాళ్ళూ ధరిస్తారు ; ధరింపజేస్తాను. ఔను తిన్నీ ! నీకు సొమ్ములు పెడతాను నేను."

ఆ శబ్దాలు సరిగా అర్థంకాలేదు తిన్నీకి. కాని ఆమె ఉత్సాహం సన్న గిల్లింది. ప్రేమ దొరుకుతుందికదా అనుకుంటే బరువు ఎదురైంది. ప్రీతి

చవిచూద్దామనుకుంటే సిద్ధాంతం తారసిల్లింది. ఆమాటల్లోని సిద్ధాంతాన్ని ఆమె అర్థంచేసుకోలేకపోయింది. రుచిలేని, ఖర్చువైన తెంకమాత్రమే లభిం చింది. "పోనీలెండి, ఎందుకులెండి" అన్నది.

"అలాకాదు. ఏపీ ఇలా పట్టుకురా !...." అన్నాడు జితేంద్రుడు పట్టుదలగా.

తిన్నీ ఇప్పుడు స్వతంత్రురాలుకాదు ; ఆజ్ఞానువర్తిని. వెళ్లి సొమ్ముల పెట్టె తీసుకువచ్చింది. జితేంద్రుడు ఒక్కొక్కటే అందులోనుంచి తీస్తూ చూస్తూ ఉండిపోయాడు. "ఇలా రా తిన్నీ !" అన్నాడు చివరకు.

వెళ్ళిపోతున్న తిన్నీ తిరిగి వచ్చింది. ఏమీ మాటాడలేదు. అతడు ఒక్కొక్కటే తీసి ఆమెకు సొమ్ములు పెడుతున్నాడు. ఆమె పెట్టించుకుం టోంది. అందుకతడు ఆనందిస్తున్నట్టుగా భావించింది. అతని సంతోషాన్ని తనముఖంలో ప్రతిఫలింపజేస్తూ ఆమె అతని కెదురుగా నిల్చుని, అతడు సింగారిస్తున్న సొమ్ములన్నీ తనువుపై స్వీకరిస్తూ ఉంది.

కాని ఇందువల్ల అతనికి సంతోషం కలుగలేదు. అతనికి కావలసింది ఇంకా వేరేఉంది. "ఏం తిన్నీ ! ఎలావుంది చెప్పు ఇప్పుడు ?"

"మీకు అందంగా అనిపించటంలేదా ?"

జితేంద్రుడు తిన్నీవైపు చూచాడు. ఈమెకంఠంకన్నా ఇంకా తెల్లగా వుండిన ఇంకోకంఠం, ఇంకా అందంగా వుండిన ఇంకో ముఖం గుర్తుకు వచ్చాయి అతనికి. ఆమెదగ్గరనించి ఈసొమ్ములన్నీ ఇక్కడికి లాక్కొ చ్చాడు. ఇవి అక్కడ అధికృతమైన సొత్తుగానూ, ఇక్కడ అనధికృతమైన సొత్తుగానూ భావింపబడుతున్నవి. "చాల అందంగావున్నావు తిన్నీ ! వెళ్ళి అద్దంలో చూచుకో !"

"వెళ్ళనా ? చూచుకోనా ?"

ప్రశ్నలో ఉల్లాసం లేదు. అతనికి కష్టంఅనిపించింది. ఇంతచేసీ లాభంలేకపోయిందన్నమాట ! పెల్లగించి తీసుకొచ్చాడు ; కాని ఆనందాన్ని తీసుకురాలేకపోయాడు. శ్రీమంతుని సంపద తీసుకువచ్చి పేదవానికి సుఖ సంతోషాలు చేకూర్చగలిగితే అది కొంతమేలే ! కాని పేదవాళ్ల సంతోషం కొరకుగాని మరెవరి సంతోషంకొరకుగాని కాకుండా తనసంతోషంకొరకే....

తన గారడీలో తానే మునిగిపోవటంలేదుకదా! "ఔను, వెళ్ళు వెళ్లి అద్దంలో చూచుకో" అన్నాడు.

ఆజ్ఞపొంది తిన్నీ వెళ్లిపోయింది. జితేంద్రుడు తనభావాల్లో తాను నిమగ్నుడైపోయాడు. అనుకున్నట్టుగా జరగలేదు. పాపం ఆ పిల్ల ముఖం ఒక్కసారి ఆనందంతో వికసించేట్టు చేయగలిగినా, ఏదో కొంత చేయగలిగి నట్టు సంతోషించేవాడు. అసలు ఆమెను సంతోషపెట్టగల వస్తువు ఏదో అతనికి తెలియకపోలేదు. కాని అది తనదగ్గర లేదిప్పుడు. కొంచెంకూడా మిగల్లేదు. ఒకప్పుడు ఉండింది; కాని అప్పుడు తిన్నీ ఎక్కడుందీ? తిన్నీ వచ్చేసరికి తాను పూర్తిగా దివాలా అయిపోయాడు. 'అభాగ్యురాలు, వీనితోనే ఆనందపడుతుం'దనుకున్నాడు. కాని అలా జరగలేదు: పైగా పూర్తిగా వ్యతిరేకమైనట్టుంది. అతని మనోవైకల్యం హద్దుమీరింది.

తిన్నీ అద్దంలో చూచుకుని మళ్ళీ వచ్చింది. "నిజమేనండీ! చాల అందంగా వున్నాను."

జితేంద్రుని హృదయంలో బాధ అలాగే వుంది. "ఈసొమ్ములు నీవి కావు, మరింకెవరివో అనుకుంటున్నావు కాబోలు! వాళ్ళవేంకావు ఇప్పుడు. వీటిమీద వాళ్ళ హక్కు ఏమీ లేదిప్పుడు. బీదవాళ్ళసొత్తే ఇది. ఇప్పుడు దుఃఖాలు-కష్టాలు అనుభవిస్తున్నారే, వాళ్ళే ఈ సొమ్ముల్ని తీసుకుని ఆనందిం చాలి. హాయిగా తీరుబాటుగా కాలక్షేపం చేస్తున్నవాళ్ళు ఈ సొమ్ముల్నికూడా తామే అట్టిపెట్టుకోటం నిజంగా చాల పెద్దదుర్మార్గం." ఇక్కడ జితేంద్రుడు కొంచెం ఆగాడు. ఈసొమ్ములు యాభై వేలరూపాయలకు తిరిగి యథాస్థానం వెళ్ళిపోతాయికదా అన్న ఆలోచన స్ఫురించింది. ఉహుఁ, అది మంచిపని కాదు; యాభై వేలరూపాయలూ తమకు దక్కవలసిందే, సొమ్ములూ చేయి జారిపోకూడదు—అనుకున్నాడు. "ఔను అది చాల పెద్దదుర్మార్గం! ఈ దుర్మార్గాన్ని సహించి ఊరుకోటానికి వీల్లేదు."

అతనిమాటలు తిన్నీ మొదట శ్రద్ధగానే విన్నది. ఇంతలో ఆమె కేదో జ్ఞాపకం వచ్చినట్టయింది. సొమ్ములు అలా వంటిమీద వుంచుకునే వెళ్ళి పక్కచుట్ట ఒకటి భుజంమీద పెట్టుకుని తీసుకువచ్చింది. "మీరు లేవండి. మంచంమీద పరుస్తాను."

మాటాడకుండా లేచి నిల్చున్నాడు జితేంద్రుడు. తిన్నీ మంచంమీద పక్క అమర్చింది. చూస్తూ నిల్చున్నాడు జితేంద్రుడు. చివరకు ఒక యంత్రంలా వచ్చి పక్కమీద ఆసీనుడైనాడు.

"ఇప్పుడిక తీసెయ్యనా వీటిని ?"

జితేంద్రుడు కొంచెంసేపు తదేకంగా ఆమెముఖంలోకి చూస్తూఉండి పోయాడు. చివరకు "ఏమైనా కొంచెం గొంతు తడుపుకోడానికి వుందా తిన్నీ !" అని అడిగాడు అకస్మాత్తుగా.

తిన్నీ గుడ్లువొప్పజెప్పి చూడసాగింది—తాను విననట్టు, విన్నా అర్థంకానట్టు.

"చూడు, ఏమన్నా ఒకచుక్క మిగిలివుందేమో...."

తిన్నీ తాను వున్నచోటునించి కదల్లేదు. జితేంద్రుడు ఆవస్తువును ఎప్పుడో ఒకసారి అడుగుతూవుంటాడు. ఆ అడిగేరోజు తరచుగా రాదు. ఆమెకు తెలిసినప్పటినుంచి ఇది నాలుగోసారో అయిదోసారో అయి వుంటుంది. ఏకాంతసేవి, సంయమి, మహాతపస్వి....ఈ పురుషుడు. అటు వంటిపురుషునికి అప్రతిహతమైన అధికారం వుంటుంది. ఏ సంవత్సరానికో ఒకసారి సారాయం కోరినందువల్ల తప్పేముంది ? కాని తిన్నీ సంస్కారాలకు అది విరుద్ధమే అయినా. ఆమెకతనిపట్ల వుండే శ్రద్ధ అందువల్ల ఏ మాత్రమూ తగ్గలేదు. అతనిలో నిరంతరం ఒక జ్వాల ప్రజ్వలిస్తూనే ఉంటుంది. ఏమిటో ఆ జ్వాల ఆమెకు తెలియదు. కాని అది చాల దారుణమైనదన్నసంగతి మాత్రం ఆమె గుర్తించింది. అతనికి అప్పుడప్పుడు ఈ సారాయంచుక్కలు ఔషధప్రాయంగా పనిచేస్తూఉంటాయి. అంతేగాని వేరేమీ కాదు. అందుచేత అతడు నాలుగుచుక్కలు ఎప్పుడైనా అడిగాడంటే ఆమెలో కృతజ్ఞతాభావం ఉత్పన్నమౌతుంది. ఆ ఔషధమే లేకపోతే అతడు పూర్తిగా తనలో తాను ఏ లోతుల్లోకో దిగబడిపోతాడు; మళ్లీ బైటికిరాడు. ఆసంగతి ఆమెకు తెలుసు. ఇక అటువంటి సమయంలో ఈ నాలుగు బిందువులూ లోపలికిపోయి, అమృతంలా పనిచేసి, అతన్ని వెలుపలకు తీసుకు వస్తాయి. జీవితంలో పర్వదినంవలె అప్పుడప్పుడు వస్తుంది ఇటువంటి అవసరం. అప్పు డీ చుక్కలు కావలసివస్తాయి. అప్పుడామెకు భయంగానే

వుంటుంది; కాని ప్రసన్నతకూడా అనుభవిస్తుంది—ఒక సమున్నతశిఖరం కరుగుతున్నప్పుడువలె; ఒక ఘోరతాపసి మానవుడుగా మారుతున్నప్పుడు వలె. అందువల్లనే ఆమె ఇప్పుడు జితేంద్రునిమాట వినగానే నిశ్చేష్టయై నిలబడి చూస్తూవుంది.

"అలా నిల్చుండిపోయావేం తిన్నీ! కాస్త వెళ్ళిచూడు, నాలుగు చుక్కలు దొరుకుతాయేమో!"

తిన్నీ వంటిమీది సొమ్ములన్నీ ఒక్కొక్కటే తీసివేసింది. అన్నీ పెట్టెలో పెట్టేసింది. జితేంద్రుడు చూస్తూ కూర్చున్నాడు. ఆమెను తొందర పెట్టలేదు. పెట్టె మూసేసి ఆమె వెళ్ళి సీసా, గ్లాసు తెచ్చి టేబిల్‌మీద పెట్టి వెళ్ళిపోతూంటే జితేంద్రుడు అన్నాడు: "ఇదిగో కొంచెం కిందికివెళ్ళి పఠాన్‌ను ఇలా పంపించు; ఇంకా వెళ్ళివుండడు."

తిన్నీ క్రిందికి వెళ్ళింది. కాసేపటిలో తిరిగివచ్చింది. "వస్తున్నాడు" అని కబురు చెప్పింది.

ఆమె అలాగే అక్కడ నిల్చివుండటం చూచి "ఇక నువు వెళ్ళి పోవచ్చు" అన్నాడు జితేంద్రుడు.

"ఉహుఁ, నేను ఇలా వట్టిచేతుల్తో వెళ్ళేదిలేదు."

జితేంద్రుడు సాశ్చర్యంగా ఆమెవైపు చూచాడు.

"గ్లాసులో నేను పోస్తాను ఉండండి. పోసి, సీసా పట్టుకుపోతాను" అంటూ తిన్నీ కొన్ని బిందువులు గ్లాసులో పోసింది. సీసాకు మూత పెట్టేసి తీసుకుపోయే ప్రయత్నంలో ఉంది.

జితేంద్రుడు చేయిచాచి సీసా పట్టుకుని, "అహఁ, అలాకాదు, ఇక్కడేవుండనీ" అన్నాడు.

"ఉహుఁ, నేనివ్వను."

"తిన్నీ!"

"ఎక్కువగా తాగేస్తారు. సీసా నేనిక్కడ అట్టిపెట్టను."

జితేంద్రుడు సీసాను ఆమెచేతిలోనించి గట్టిగా లాగేసుకున్నాడు. "ఇక నువు వెళ్ళిపో; నీపని చూచుకో."

తిన్నీ హాతం చేసింది. అక్కడినించి కదలలేదు. "నేనిక్కడనించి పోను అసలు.

" !"

ఇంతలో కిందినించి పఠాను వచ్చాడు. యువకుడే, కాని ఒడ్డు పొడుగు ఉన్నవాడు. తన వయసుకు మించినవాడులా కనిపిస్తాడు. "ఏం భాయీ, నువు కాస్త పుచ్చుకోకుండా ఎలాగ? చెయ్యబోయే పని చాల గట్టిది కూడాను" అన్నాడు జితేంద్రుడు మందహాసపూర్వకంగా.

పఠాను తిన్నీవైపు చూచాడు. తానూ చిరునవ్వు ప్రదర్శించాడు. "మంచిది, అలాగనే" అన్నాడు మెల్లిగా.

ఇక్కడ తిన్నీ అందరి వినోదాల్నీ సహించి ఊరుకుంటుంది; పైపెచ్చు మెచ్చుకుంటుంది. అందులో ఒకడు అందరికీ సర్దారు; తన్ను మన్ననగా చూస్తున్నాడు; తా నతనిదగ్గర సగౌరవంగా కాలక్షేపంచేస్తున్నది. ఆమెకు కోపంవచ్చింది. "మరోగ్లాసు పట్టుకురావాలి" అన్నాడు జితేంద్రుడు.

ఆమె చెయ్యగలిగిందేమీ లేదు. గ్లాసుపట్టుకురావటానికంటూ ఆమె వెళ్ళింది.

గదిలోనించి ఆమె అవతలకువెళ్ళగానే జితేంద్రుడులేచి తలుపుగడియ వేశాడు. "తిన్నీ ఇంకా గాభరాపడుతోంది, పఠాన్!" అంటూ సీసాలో నించి సారాయం గ్లాసులో పోశాడు. గ్లాసు అతనికి అందిస్తూ "ఊc, పుచ్చుకో పఠాన్, నీ కార్యసిద్ధికోసం!" అన్నాడు.

పఠాన్ గ్లాసు అందుకున్నాడు. ఒక్క గుక్కలో తాగేశాడు అంతా.

"ఇంకానా? ఊc, పుచ్చుకో...." అంటూ జితేంద్రుడు ఇంకొంచెం కూడా పోశాడు గ్లాసులో. "పఠాన్! నీ అనుచరులకు చెప్పు; సర్దారు ఓటమి అనేది ఎరుగడని. మూడురోజుల్లో పని పూర్తి అయిపోవలసిందే. ఏమిటి అలా చూస్తావు? మింగేసెయ్యి! పరాక్రమశాలివి కదూ! ఇదిగో! ఇంకో సంగతి: నీ అనుచరులనుకూడా వెనకపడనీయబోకు. కావలిస్తే బాగా తాగించు. ఇవాళ మంగళవారం. గురువారం రాత్రి.... తెలిసిందా? నేను అక్కడికి వస్తాను. అంతవరకూ—"

తరువాత ఇక మాటాడలేదు. ఒక్క చూపు చూచాడు పఠానువైపు.

ఆచూపుకు పఠాను వొణికిపోయాడు; కాని ప్రోత్సాహితుడైనాడుకూడా. తన మానమర్యాదలక్కడ తాకట్టుపెట్టి వెడుతున్న ప్రతిజ్ఞామూర్తిలా వున్నాడు పఠాను. గ్లాసు ఎత్తి గుటుక్కున తాగేశాడు; సర్దారుకు 'సాల్యూటు' (సలాం) చేశాడు.

జితేంద్రుని నుదుటిపై వంపుగీతలు లేవు. సందిగ్ధభావం లేదు. ఉక్కుమనిషిలా కనిపించాడు. ఉండివుండి ఏ దూరపులోతులకో పరిగెత్తి పోతూవుండే ఆచూపులో ఏమిమంత్రంఉందో! పురుషుడా? అపౌరుషేయుడా? అసంభవం అనేది తనప్రోల అంతర్హితం అయిపోయినట్టు.... కార్యసిద్ధి అవలీలగా హస్తగతం కాబోతున్నట్టు....నిర్భరచిత్తుడై "ఇకవెళ్లిపో! నువు పఠాన్వు; ఆసంగతి మరచిపోకు!" అన్నాడు.

మరొకసారి 'సాల్యూటు' (సలాం) చేసి పఠాన్ వెళ్ళిపోయాడు. ఇక సీసాలో మిగిలివున్నది తాను గ్లాసులోపోసుకుని, అలా నిల్చునే, మందులాగ గుటుక్కున మింగేశాడు. గదిలో అటూ ఇటూ పచార్లు ఆరంభించాడు. కొద్దిసేపటిలో అతనికి నిషా వచ్చింది; అడుగుల్లో వేగం వచ్చింది; మనస్సుకు స్ఫూర్తి వచ్చింది. అలా పచార్లు చేస్తూచేస్తూ అలమారలోనించి కలం, కాగితాలు తీశాడు. మేజామీది లాంతరువత్తి పెద్దదిచేశాడు. దానివెలుగులో ఒకటిరెండు పేజీలు రాశాడు. అలా రాస్తూనే వున్నాడు. ఇంతలో అవతల తపతప తలుపుకొడుతున్న చప్పుడు వినిపించింది.

"ఏమిటి తిన్నీ!" అని కేకవేశాడు.

తలుపుమీద ఇంకా తపతప చప్పుడు వినిపిస్తూనే ఉంది.

"ఇదిగో, అటు నీవైపు గొళ్లెం పెట్టేసుకో. ఏవిధమైన శబ్దం వినిపించటానికి వీల్లేదు" అన్నాడు విసుగ్గా.

ఇంకా తలుపుమీద తపతప చప్పుడు ఆగలేదు. జితేంద్రుడు కోపంగా వెళ్ళి దూకుడుగా తలుపు తీశాడు. ఎదురుగా గుమ్మం అవతల తిన్నీ నిల్చుని వుంది. "ఏం? ఎందుకూ? తపతపా ఏమిటా చప్పుడు?"

తిన్నీ అతనివైపు యేటవాలుగా ఒక్క చూపు చూచింది. మాటాడకుండా పెట్టకుండా గుమ్మందాటి ముందుకు వచ్చేసింది. మేజామీది సీసా ఎత్తి చూచింది. అందులో ఇంకా ఒకచుక్కకూడా లేదు. ఒక కరుణారస

ప్లుతమైన చూపు జితేంద్రునివైపు ప్రసరించింది. సీసా, గ్లాసు తీసుకుని ఇవతలకు వచ్చేసింది. ఏం మాటాడలేదు.

అంతా చూస్తూ గుమ్మంలో నిల్చున్నాడు జితేంద్రుడు. హఠాత్తుగా అతనికి రోషం వచ్చేసింది. "తలుపు వేసుకుని నీవైపు గొళ్లెంపెట్టుకో. ఎలాంటిచప్పుడూ నాకు వినిపించకూడదు, తెలిసిందా ? గప్‌చిపుగా పడుకుని నిద్రపో" అన్నాడు.

అందుకు సమాధానంగా తిన్నీ ఒక లోటాలో మంచినీళ్ళుపోసి దాని మీద ఒక చిన్న గిన్నె మూత ఉంచి, అతని మంచం తలగడదగ్గర ముక్కాలి పీటమీద పెట్టింది.

"మంచినీళ్ల నాకేం అవసరంలేదు" అన్నాడు జితేంద్రుడు.

ఆమాట తిన్నీ వినిపించుకోనేలేదు. బొక్కెన ఒకటి పంపుకింద పెట్టింది. నిండిన తరువాత దాన్ని జితేంద్రునిగదిలో యథాస్థానంలోఉంచింది. దానిమీద పీట ఒకటి మూత పెట్టింది.

"అయిందా ? ఇంకా యేమన్నా పని వున్నదా నీకు ఈ గదిలో ?" అన్నాడు జితేంద్రుడు రుసరుసలాడుతూ.

తిన్నీ మారుమాట పలకకుండా అవతలగదిలోకి వెళ్లిపోయింది. ఇటుకరాతినేలమీద జంపకానా పరచుకుంది. తలవైపున మడతపెట్టిన చీర ఒకటి దిండులా అమర్చుకుంది. జితేంద్రుని పాదాలకు సాష్టాంగపడిన మనిషిలా పడుకుంది నిద్రపోవటానికి.

జితేంద్రుడు ఇంకా తన హఠం విడిచిపెట్టలేదు. "సరే, ఇక తలుపులు మూసేస్తున్నాను. నువుకూడా గొళ్లెంపెట్టుకో అటువైపు....తప్పకుండా పెట్టుకో" అంటూ తలుపులు మూసేసి గడియపెట్టాడు. "ఊఁ, నువుకూడా గొళ్లెం పెట్టుకో" అని హెచ్చరించాడు మరొకసారి.

ఆమె లేచి గొళ్లెంపెట్టుకున్న చప్పుడు వినిపించాక జితేంద్రుడు నిశ్చింతగా మేజావద్దకు వచ్చాడు. ఈ 'నిశ్చింత' అతడు ఎవరినిగురించి పొందాడో అర్థంకాదు. మొత్తానికి ఇక బైటినించి ఏవిధమైన అంతరాయం తనకు ఉండబోదు అన్న నమ్మకం మాత్రం కలిగింది. కలం తీసుకుని ఇంకా రాద్దామని కూర్చున్నాడు; కాని కలం సాగలేదు. ఆలోచిస్తూ

కూర్చున్నాడు. నుదురుమీద ముడుతలు పడ్డాయి. బొటనవేలితోనూ, రెండు ఇతరవేళ్లతోనూ కన్బొమలు అదిమి పట్టుకున్నాడు. మళ్ళీ వొదిలేశాడు. కాగి తాలు దగ్గరకు తీసుకున్నాడు ; కాని కలం సాగటంలేదు. చివరకు కాగితాలు అవతల పెట్టేశాడు. లాంతరు వత్తి తగ్గించేశాడు. ఆ లాంతరు తీసుకుపోయి దూరంగా ఒకమూల పెట్టాడు. మంచంమీద వచ్చి పడుకున్నాడు.

గదిలో పైన ఒక వెంటిలేటర్ ఉంది. కిందనొక కిటికీ ఉంది. కిందికిటికీ మూసేవుంది. వెంటిలేటరు మూసేందుకు వీల్లేదు. కొద్దిగా చలి వేస్తున్నది. కృష్ణపక్షపురోజులు. ఇంకా చంద్రుడు ఉదయించి వుండడు. ఉదయించినా పైకి వచ్చివుండడు. వెన్నెల ఇంకా లోపలికి రావటంలేదు. జితేంద్రుడు పడుకునివున్నాడు. కాని నిద్ర రావటంలేదు. తల బరువెక్కి నట్టుగా వుంది. పడుకున్నాడు, పడుకున్నాడు; ఎంతసేపటికీ తల తిరిగిపోతు న్నట్టుగా ఉంది. నిద్ర అనేది తనదగ్గరకు రాకుండా దూరంగా ఎక్కడికో పారిపోయింది కాబోలు ! లేచి కిటికీ తెరిచాడు. తెరవటంతోనే ఒక తియ్యని గాలితరగ వచ్చి సోకింది. కొంతసేపు గాలి తింటూ అలాగే నిల్చున్నాడక్కడ. చివరకు వచ్చేసి నిండా దుప్పటి కప్పుకుని పడుకున్నాడు. ఒక అరగంట వరకూ ఒత్తిగిలకుండా అలాగే పడుకున్నాడు. కాని నిద్ర పట్టనేలేదు. తల తిరుగుడు అధికమైంది. అప్పుడు కాస్త ఒత్తిగిలి పడుకున్నాడు. మరొక అరగంటసేపు అలాగే బిగబట్టుకుని పడుకున్నాడు. కాని లాభంలేకపోయింది. ఇలా ఎంతసేపు గడిచిపోయిందో చెప్పలేం. వెన్నెల బైట ఏమన్నా ఉందేమోగాని లోపలికిమాత్రం రావటం లేదు. కిటికీ చాల కిందుగా వుండ టంచేత ఆకాశంలోకి చంద్రుడు వచ్చాడో లేదో తెలియటంలేదు. అతని కిప్పుడు చంద్రుడు కావలసివచ్చాడు. చంద్రబింబం అవసరంవచ్చింది ఇప్పు డతనికి. చంద్రుడు వున్నాడు, నశించిపోలేదు అన్న కబురుకోసం తహతహ లాడుతున్నాడు. చెడ్డ చీకటిగావుంది. కటికిచీకటి ; కాబట్టి వెంటనే, ఇప్పటి కిప్పుడు చంద్రుడు కావాలి. లేకపోతే ఈ చీకటి తనను మింగేస్తుంది.

హఠాత్తుగా లేచివెళ్లి తలుపు కొట్టాడు; టక్-టక్, టక్-టక్.

"ఎవరది ?" అవతలనించి కేక.

"తిన్నీ !"

"మీరా !" అంటూ తిన్నీ చివాలున లేచి తలుపు తెరచింది. జితేంద్రుని ముఖం సరిగా కనిపించటంలేదు. తిన్నీ హృదయం పులకించింది.

"కొంచెం బైటికి వెళ్లి చూడు తిన్నీ ! ఎక్కడేనా చంద్రబింబం ఉందేమోను !"

తడుముకుంటూ తిన్నీ ముందుకు నడిచింది. అటుపక్కవున్న తలుపు తెరిచింది. అటువైపు చిన్నఖాళీ స్థలం ఉంది. అక్కడ కొంతభాగం రేకులతో కప్పివుంది. మిగతాభాగం ఖాళీగానే ఉంది. తిన్నీ అక్కడికి వెళ్లి చూచింది. "ఉన్నాడుగా చంద్రుడిక్కడ !" అన్నది అక్కడినించే.

"ఉన్నాడా ?" అన్నాడు జితేంద్రుడు, 'లేడేమో !....' అన్నభావాన్ని స్ఫురింపజేసే తీరులో. వెంటనే అక్కడికి వెళ్ళాడు. పెద్దపెద్ద మేడలచాటు నించి అప్పుడే పైకివచ్చి ముఖంచూపిస్తున్నాడు చంద్రుడు. ఇంకా పూర్తిగా అంధకారం తొలగిపోలేదు. వెన్నెలవెలుగులు నెమ్మదిగాత్రోవచేసుకుని వస్తున్నాయి. అతనికి సంతోషం కలిగింది. ఒక్క నిట్టూర్పు విడిచాడు. ఆకాశంలోకి అలా చూస్తూ ఉండిపోయాడు. కొన్ని క్షణాలపాటు సర్వం మరచిపోయినవాడులా వున్నాడు. ఆకాశం, అందులో మిణుకుమిణుకుమంటూన్న నక్షత్రాలు. ఒక పెద్ద వెలుగుముద్దవలె చంద్రబింబం——అంతకుతప్పితే మరేమీ కనిపిస్తున్నట్టు లేదతనికి. కొంతసేపటికి హఠాత్తుగా వెనక్కుతిరిగి చూచాడు. "అరె, నువ్వింకా నిల్చునే వున్నావే ! పో, వెళ్ళి పడుకో" అన్నాడు.

తిన్నీ అక్కడినించి కదల్లేదు. చైతన్యంలేని ప్రతిమవలె ఆలాగే నిల్చుంది అక్కడ.

"పో, వెళ్ళి పడుకో. నేనిక్కడే వుంటాను. వెళ్ళి తలుపు వేసుక్కో."

తిన్నీకి ఆ మాటలు వినిపించాయి; కాని అర్థంఅయినట్టు లేదు. అతన్ని వేధిస్తున్న ఆ ఒంటరితనాన్ని లాక్కొని తనలో ఇముడ్చుకోవాలని ఆమె తహతహ. అతనిలోని ఆ నిరంతరవ్యథను జోలపాడి, చిచ్చికొట్టి తనలో నిద్రపుచ్చవలెనని ఆమె ఆరాటం. అతన్ని అంతగా తిప్పలు పెడుతున్నది, అశపెడుతున్నది, వేధిస్తున్నది, సతమతంచేస్తున్నది — ఏమిటది ? అతనిలోని బాధవయావత్తూ తన పైటకొంగులోకి తీసుకుని మూటగట్టి

వేయాలనీ, అప్పుడతడు వచ్చి, తాను చిచ్చికొడుతూంటే, మెల్లిగా కళ్ళు మూసుకుని నిద్రపోవాలనీ ఆమె తహతహ.

"మంచం తెచ్చి వెయ్యనా ?" అని అడిగింది.

"వేస్తే వెయ్యి."

గబగబా వెళ్ళి లోపలనించి మంచం తెచ్చింది. రేకులకు ఇవతలగా వెన్నెల్లో వేసింది.

"ఈమంచం నీది కాబోలేన్నే !" అన్నాడు జితేంద్రుడు ఆమెదగ్గరకు వచ్చి.

తిన్నీ ఆమాట వినిపించుకోలేదు. వెళ్లి పక్కచుట్ట తెచ్చి మంచం మీద పరిచింది.

"నువు నేలమీదనే పడుకుంటావేమిటి ?"

మరెక్కడ పడుకుని నిద్రపోయే అర్హతవుందితనకు !.... అన్నట్టుగా ఆమె మాటాడకుండా ఊరుకుంది.

"సరే, తలుపు వేసుకో."

"వేస్తాలెండి."

ఆమాట విని జితేంద్రుని హృదయం బరువెక్కింది. వెంటనే అతడు వెనక్కు తిరిగాడు. చంద్రుడు బాగా పైకి వచ్చేస్తున్నాడు. వెన్నెల పాల నురుగులాగ ఇండ్ల కప్పులపై వ్యాపిస్తున్నది. ఈశోభ అంతా ఇవాళే, మరె న్నడూ లేదు అన్నట్టు ! ఈనాడే తాను జన్మించినట్టుగా ఉన్నదతనికి. కాసేపు మంచంమీద కూర్చున్నాడు. మళ్ళీ లేచి అక్కడే పచార్లు ఆరంభించాడు. తిన్నీ అక్కడే గుమ్మంలో ముడుచుకుని కూర్చుంది ; వెళ్లిపోలేదు. అతని మనస్సులో యేదో పెద్ద దుఃఖం పొంగింది. కాని అతడు పైకి ఏమీ మాటాడలేదు. అలాగే పచార్లు సాగిస్తున్నాడు. ఒకసారి ఆమూలకువెళ్ళి తిరిగివచ్చేసరికి గుమ్మంలో తిన్నీలేదు. ఒక పెద్ద ఓదార్పు చేకూరినట్టు నిట్టూర్పు విడిచాడు.

మరికాసేపటి యేవో గుసగుసలు వినిపించాయి అతనికి. ఇద్దరు వ్యక్తులు మాటాడుకుంటున్న సవ్వడి ! మొదట ఆ విషయం తానేమీ పట్టించు కోలేదు. కాని ఎంతసేపటికీ ఆ గుసగుసలు తగ్గటంలేదు. ఆతెరచివున్న

గుమ్మంలోనించి తిన్నీగదిలోకి వచ్చాడు. కాని ఆ రెండోగుమ్మం మూసే వుంది. మెట్లదగ్గరనించి ఒకవ్యక్తి "ఇప్పటికిప్పుడే నేను సర్దార్‌ను కలుసుకోవాలి; చాల అవసరం" అని పలుకుతున్నాడు. జితేంద్రునికి ఆమాటలు వినిపించాయి.

"ఇప్పుడాయన విశ్రాంతి తీసుకుంటున్నారు; రేపు రా" అంటున్నది తిన్నీ.

"ఊహుఁ. రేపటివరకు వీల్లేదు."

"ఇవాళ అసలే వీల్లేదు. ఇప్పుడే ఆయనకు కాస్త కునుకు పట్టిందో లేదో! వచ్చేశావే! ఊహుఁ. ఇప్పుడు కాదు. లక్షసార్లు చెప్పాను: ఇప్పుడు వల్లకాదని....బిగ్గరగా అరవబోకు. కొంచెం నెమ్మదిగా మాటాడు."

అవతల వ్యక్తి ఒప్పుకోటంలేదు. తిన్నీకూడా మొండిగానే జవాబు చెబుతున్నది.

వింటూ నిల్చున్నాడు జితేంద్రుడు.

చివరకు...."సరే, నువు ఇక్కడే వుండు అయితే. ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యబోకు. నేను వెళ్ళి చూస్తాను. మెళకువతో వుంటే గాని, నా అలికిడి విని మేలుకుంటేగాని కబురు చెబుతాను. ఏమి చెప్పమంటావు?" అన్నది.

"వచ్చాడు దొంగ అని చెప్పు."

నెమ్మదిగా అడుగులు చప్పుడుగాకుండా జితేంద్రుడు వెళ్లిపోయి మంచంమీద కూర్చున్నాడు. అతని హృదయం మిక్కిలి కృతజ్ఞతాభావంతో నిండిపోయింది.

వచ్చింది తిన్నీ. అతడు కూర్చునివుండటం చూచింది. "ఎవరో వచ్చారు విప్పా! దొంగట! ఇప్పుడు కాదు, రేపు రమ్మని చెప్పనా?" అన్నది.

"కాదు తిన్నీ! ఇప్పుడే రమ్మను."

ఆమనిషి లోపలికి వచ్చాడు. "ఒక పోలీసు గూఢచారిని పట్టుకున్నాం. అడవిలో మన శిబిరందగ్గరనే తారట్లాడుతూవుంటే పట్టుకున్నాం. ఏంచెయ్యమంటారు అతన్ని?"

తిస్నీ అక్కడే వుంది. జితేంద్రుడు అతనితో ఇలా అన్నాడు: "కళ్ళకు గంతలు కట్టారుగా! ఇంకా విప్పలేదుగా! గంతలు అలాగే వుంచి తీసుకుపోండి. చేతులు కట్టేసి పెద్ద బజారులో రోడ్డుపక్కన విడిచిపెట్టెయ్యండి."

"విడిచిపెట్టమంటారా?"

"ఔను. విడిచిపెట్టండి."

"చిత్తం...."

"వినిపించలేదా? చెప్పానుగా! విడిచిపెట్టెయ్యండి."

ఆమనిషి విస్మితుడై సర్దారువైపు చూస్తూ నిల్చున్నాడు. వెంటనే తిరిగి వెళ్ళిపోలేదు.

"వెళ్లు" అన్నాడు క్లుప్తంగా జితేంద్రుడు.

ఆ మనిషిలో ద్వైధీభావం పోలేదు. అయినా మాటాడకుండా వెళ్లిపోయాడు. జితేంద్రుడు చిత్రపుబొమ్మలా కూర్చుండిపోయాడు. "ఇలా రా తిస్నీ!" అన్నాడు చివరకు.

దగ్గరకు రావటానికి భయంవేసిందామెకు. ఇలా ఎప్పుడూ అతడు తన్ను దగ్గరకు పిలవలేదు. తానేమి అపరాధంచేసిందో.... ఏమి కోపం చేస్తాడో ఏమో! వచ్చి కొంచెం దూరంగానే నిల్చుండిపోయింది. జితేంద్రుడు తన మంచంమీద, తనపక్కన చోటు చూపిస్తూ "ఇలా రా తిస్నీ!"

ఆమెకు శరీరమంతా పులకించింది. నిల్చున్నచోట రాతిబొమ్మలా అలాగే వుండిపోయింది.

"భయపడబోకు తిస్నీ! ఇలా రా!"

తిస్నీ దగ్గరకు వచ్చింది. చెయి చాచి ఆమెను పట్టుకుని పక్కన కూర్చోబెట్టుకున్నాడు. తల కొంచెం వంచాడు; చేత్తో ఆమె చుబుకాన్ని పుచ్చుకుని పైకి ఎత్తాడు. "తిస్నీ!"

అమాయకపు పిల్ల! ఆమె ముగ్ధనేత్రాల్లో స్నేహరసం తొణికిసలాడుతూఉంది.

తనపై తనకే ధిక్కృతి కలిగింది జితేంద్రునికి. ధన్యత అనేది తన

నొసట వ్రాసిలేదు. "ఈ రాతిగుండెవాడిని, ఈ పశుతుల్యుడిని నువు క్షమించ గలవా తిన్నీ!" అన్నాడు.

ఈ నిర్దయుడైన వ్యక్తి తనతో ఏమంటున్నాడు? ఆమె కన్నుల నిండా అశ్రువులు కమ్ముకున్నాయి.

"నిన్ను నేను యాభై రూపాయలకు కొనుక్కున్నాను. ఈ పాపాన్ని నేను ఎలా కడిగివేసుకోగలుగుతాను?" అంటూ జితేంద్రుడు ఆమె కన్నీళ్లు తుడిచాడు. ఆమె తన ముఖాన్ని అతనిగుండెలో దాచుకుని వెక్కి వెక్కి ఏడువసాగింది. అతడామెను పూర్తిగా ఏడవనిచ్చాడు.

ఏడుపు తగ్గింది. అతడామెముఖాన్ని తనగుండెమీదినించి ఇవతలకు తీశాడు. తీరని అపేక్షతో వ్యాకులమై ఉన్నది ఆమె ముఖం! అశ్రుజలంతో సుస్నాతమై పరిపూతమై యున్న ఆ ముఖం! అబ్బ! తానేగనక ఆవిధంగా శాపగ్రస్తుడు కాకపోతేనా!....అతడు మెల్లిగా ఆమె మస్తకాన్ని ముద్దు గొన్నాడు, ఆశీర్వదిస్తున్నట్టుగా.

ఆమె సిగ్గు, అవమానంతో కుంచించుకుపోయింది. కాని పైకి కనిపించే ఈగ్లానికి అడుగున ఆమె ఒక గౌరవప్రాప్తిని అనుభవించింది.

"ఎటువంటి అధముడు, అభాగ్యుడు అయినవానిచేతుల్లో వచ్చి పడ్డావో తెలుసుకున్ననాడు....నువు నన్ను తప్పక క్షమిస్తావని నేను ఆశిస్తు న్నాను" అన్నాడు జితేంద్రుడు.

మనసులోనే 'శివశివ' అనుకుంటూ తిన్నీ అక్కడినించి పారిపో యింది. అటువంటి మాటలు ఆమె వినగలదా?....విని సహించగలదా? ఇక అక్కడ జితేంద్రుడు ఒక్కడే మిగిలిపోయాడు. అతనిమీదనించి ఏదో బరువు దిగినట్టనిపించింది. అప్పటికి చంద్రుడు నడిమింటికి వచ్చాడు. అటువైపే చూస్తూ తనను తాను విసర్జించేసుకున్నాడు జితేంద్రుడు.

# 18

చివరకు జితేంద్రుడు లేచి కూర్చున్నాడు. చాలసేపయింది మెలకువ వచ్చి; కాని అలాగే పడుకునివున్నాడు. ఇప్పుడు లేచి అటు ఇటు తిరుగసాగాడు.

"లాంతరు వెలిగించనా?" లోపలినించి వినిపించాయి మాటలు.

"తిన్నీ! నువు మేలుకునే ఉన్నావా?" కోపంగా అడిగాడు జితేంద్రుడు.

అందుకు సమాధానం ఏమీ చెప్పకుండా తిన్నీ లాంతరు వెలిగించి మేజామీద పెట్టింది.

ఆ వెలుగులో అంధకారం అగుపించింది. ఆకాశంనిండా నక్షత్రాలే. గడియారం చూచాడు. నాలుగున్నర అయింది.

"గుమ్మం తీసే వుందేం? తలుపు వేసెయ్యి" అన్నాడు.

తిన్నీ తలుపు వెయ్యలేదు. నేలమీద పరచుకున్న తన పక్కమీద పడుకుంది. జితేంద్రుడు ముందుకువచ్చి దభీమని తలుపు మూసేశాడు. బొక్కెనలోవున్న చన్నీళ్ళు విసురుగా ముఖాన కొట్టుకొని ముఖం కడుక్కున్నాడు. కొంచెం హాయిగా వున్నట్టనిపించింది ప్రాణం.

తిన్నీ నిద్రపోలేదు. అలాగే పడుకుని, గడపమీదుగా చేయి పోనిచ్చి మెల్లిగా తలుపులు తెరిచింది. అవి చాల బరువైన దినాలు. ఆసంగతి తిన్నీకి తెలియదు; కాని అలాగని స్ఫురిస్తూనేఉంది. అందుచేత నిద్రపోతున్నా లేచి కూర్చుంటుంది. తనకు ఆ వ్యక్తి ఒక తాయిత్తు. దానిలో ఒక యంత్రం ఉంది. అందులో ఏమి మంత్రం లిఖితమైందో ఆమెకు తెలియదు. ఒక్క అక్షరంకూడా తెలియదు. ఈ వ్యక్తి ఏమి వ్రాస్తాడో, ఏమి చదువుతాడో, ఏమి ఆలోచిస్తాడో, అతని కోరికలేమిటో, పనులేమిటో---ఆమెకంతా అగోచరంగా వుంది. అతడెక్కడున్నాసరే, అది పరలోకం అన్నమాటే. 'అతడొక రత్నం, ఆ రత్నాన్ని దాచే డిబ్బీ తాను' అని ఆమెకొక నమ్మకం. రత్నపు విలువ రత్నాల వర్తకునికి తెలుస్తుంది. ధరించేవాళ్ళు ధరిస్తారు. కాని దాన్ని సురక్షితంగా ఉంచటానికి ఒక డిబ్బీ కావాలి. రత్నం ఆతరువాత ఎవరిదైనా గానీ, ముందుగా డిబ్బీది: ముఖ్యంగా డిబ్బీ ఉండవలసిందే. అందుచేత తాను అస్తమానం అతనిచుట్టూ కనిపెట్టుకునే వుంటుంది, గాలి కూడా సోకనీకుండా.

జితేంద్రుడు తుండుగుడ్డతో ముఖం గట్టిగా తుడుచుకున్నాడు. మేజా దగ్గర వచ్చి కూర్చున్నాడు. నోటుపుస్తకం తీశాడు. ఏమిటో వ్రాయటం మొదలుపెట్టాడు. వ్రాశాడు, వ్రాశాడు; ఇరవై ఇరవైఅయిదు నిమిషాలు

దాటాయి. ఇక నోటుపుస్తకం అవతల పెట్టేసి లేచాడు. గదిలో అటూ ఇటూ పచార్లు ఆరంభించాడు. గడియారం చూచాడు. అయిదు దాటింది.

"తిన్నీ !" అని పిలుస్తూ అటువైపు చూచాడు. గుమ్మం తెరచే వుండటం చూచాడు. "ఏమీలేదులే పడుకో" అన్నాడు మళ్ళీ.

లాంతరు పుచ్చుకుని తిన్నీ గదిలోకి వచ్చాడు. అటువైపు వున్న గుమ్మం తెరిచి పైకి వెళ్ళాడు. తిన్నీలేద్దామని అనుకుంటూనే, అవసరం లేనట్టు భావించి, అలానే పడుకుంది. కాని మళ్ళీ ఏదో జ్ఞాపకంవచ్చి లేచింది. బొగ్గులు పోసి, కుంపటి వెలిగించి నీళ్లు పెట్టింది.

జితేంద్రుడు తిరిగివచ్చాడు. ఎవరినీ పలకరించకుండా తన గదిలోకి వెళ్లాడు సరాసరి. సబ్బుతీసుకుని బొక్కెనదగ్గరకు వెళ్లాడు ముఖం కడుక్కుందామని. తిన్నీ గబగబా వచ్చింది. ఆనీళ్ళు అవతల పారబోసి చెంబు తీసుకుపోయింది. అతనికి కష్టంవేసింది ; కాని హృదయంలో కృతజ్ఞత అతిశయించింది. ఒక్క నిమిషంలో చెంబునిండా వేడినీళ్లు ప్రత్యక్షమైనాయి. జితేంద్రుడు ముఖం కడుకున్నాడు. గడియారం చూచాడు. మళ్లీ గదిలో పచార్లు ఆరంభించాడు. ఇంతలో ఏమిటో జ్ఞాపకంవచ్చింది. "తలుపు మూసెయ్యి" అన్నాడు.

"మీకు నిద్రపట్టలేదా ?" తిన్నీ అడిగింది మెల్లిగా.

ఏమిటో అనుమానిస్తున్నవాడులా క్షణంసేపు ఆగాడు జితేంద్రుడు. "తలుపు మూసెయ్యి" అన్నాడు మళ్లీ.

చాల తీక్షణంగానే అన్నాడు. చిన్నబోయి అలానే నిల్చుంది తిన్నీ. గత్యంతరంలేక వెనక్కు వచ్చేసింది. ఈమనిషికి చుట్టూ అన్ని కవాటాలూ మూసేవున్నాయి. ఎటునించి ప్రవేశించేందుకూ అవకాశంలేదు. కోపంగా వెళ్లిపోయింది తిన్నీ. అవతలవేపు గొళ్లెం పెట్టుకుంది.

జితేంద్రుడు పచార్లు చేస్తూనే ఉన్నాడు. తెల్లరవస్తూంది. క్రమేణా చీకటి తరిగిపోతున్నది. జితేంద్రుడు ఉండిఉండి గడియారం చూచుకుంటున్నాడు ; అధీరుడైపోతున్నాడు. ఈపాటికి అతనికి కబురు వచ్చివుండవలసింది. అంతా వ్యర్థం అయిపోయి ఉండదుగద ! ఊహుఁ, అల్లా అనుకోటం

అతనికి ఇష్టంలేదు. అనుకున్నట్టు అంతా సక్రమంగా జరిగేవుంటుంది. ఇలా ఆలోచిస్తూ మధ్యమధ్య ఆగిపోతూవున్నాడు ; మళ్లీ పచార్లు సాగిస్తున్నాడు.

కొంతసేపటికి వచ్చాడు ఆ ఒడ్డుపొడుగుగల పఠాన్. జితేంద్రుడు తలఎత్తి చూచాడు. ఒక్కమాటకూడా పలకలేదు.

ఇటువంటి స్వాగతం లభించినందుకు పఠాన్ చిన్నబోయాడు. విజయోత్సాహంతో వచ్చినవాడల్లా జంకుతూ "కొంచెం ఆలస్యం అయింది విప్పాః" అన్నాడు.

"ఔను. పదినిమిషాలు. నువ్వు పఠాన్‌వన్నమాట మరచిపోలేదుకద!"

"లేదు సర్దార్ !" అన్నాడతడు గాభరాపడుతూ.

జితేంద్రుడు మందహాసం చేశాడు : "చెప్పు : అంతా సవ్యంగా నడిచిందా ?"

"చిత్తం. కాని...."

"సరే....'కాని' కూడా ఉన్నదా ? కాని....ఏమిటీ ? చెప్పు"అన్నాడు జితేంద్రుడు చిరునవ్వులో ఎటువంటి వ్యంగ్యమో మిళాయించి.

"డ్రయివరుకు గాయం తగిలినట్టు తెలుస్తున్నది."

జితేంద్రుని నుదుటిపై కోపరేఖ కనిపించింది. కాని అతడేమీ మాటాడలేదు. పఠాన్ ఇంకా ఏమిచెబుతాడో నని ఎదురుచూస్తూ ఉన్నాడు.

"గత్యంతరం లేకపోయింది మరి ! అతడు భయపడలేదు ; ప్రాణాలకూ తెగించాడు. ఇక అప్పుడు....తుపాకిగుండు వంటికి కొద్దిగా రాచుకుపోయినతర్వాత దారికి వచ్చాడు."

జితేంద్రుడు లోపల మండిపోతూ, కుడిచేయి గాలిలో విసురుగా ఊపుతూ "సరే....అసలుసంగతి చెప్పు" అన్నాడు.

పఠాన్ బెదిరిపోయాడు. నత్తినత్తిగా చెప్పసాగాడు : "ఆవిడగారిని జీప్‌లో తీసుకువచ్చాం. ఆమెకేమీ ఇబ్బంది కలిగించలేదు మేము. మాకు చాల చిత్రం అనిపించింది ఆమెతీరు. ఏడవలేదు. పెట్టలేదు. మామీద వైర భావమూ ప్రకటించలేదు. తిట్టలేదు, ఏమీచెయ్యలేదు....కళ్ళకు గుడ్డపేలిక కట్టేశాం. ముఖానికి ముసుగువేశాం. కాని....బాధకలిగేట్టు కాదులెండి.... డబ్బుసంగతి ప్రస్తావించాం. ఇస్తాననదు ; ఇవ్వననదు ; ఏమీ మాటాడదు.

భయపెట్టాం, కాని భయపడితేగా! పైగా "మీకెందుకూ డబ్బు! మీ సర్దారు ఎక్కడున్నాడు?" అని ఎదురు ప్రశ్నలు వేయసాగింది. మేము చెప్పాం: 'ఆయన ఆజ్ఞప్రకారమే చేస్తున్నాం మేము. మిమ్మల్ని వచ్చి కలుసుకోటానికి ఆయనకు తీరికలేదు' అని. ఆయనకు తీరికవున్నప్పుడే ఆలోచిద్దాంలే. మీరు పోయి విశ్రాంతి తీసుకోండి; చాల శ్రమపడ్డారల్లేవుంది అన్నదామె. సర్దార్ జీ!........"

"ఏమిటి?" అన్నాడు జితేంద్రుడు గద్దింపుగా.

పఠాన్ ఒక ఉత్తరం బైటికి తీశాడు. "ఈఉత్తరం ఆమెగారు ఇచ్చింది. 'ఈఉత్తరం మీసర్దారు కివ్వండి. ఆయన దీన్ని వెంటనే పంపిస్తారు' అని చెప్పింది."

"ఎప్పుడు ఇచ్చింది?"

"అప్పుడే."

"మరి ఇప్పుడు తెచ్చావేం?"

"తెల్లవారేసరికి రమ్మని మీఆజ్ఞ! అందుచేత నేననుకున్నాను...."

"అనుకున్నావు!" వ్యంగ్యభరితమైన చిరునవ్వుతో జితేంద్రుడు అన్నాడు: "పఠాన్కూడా అనుకుంటూ వుంటాడన్నమాట! ఊఁ. ఏమనుకున్నావు?—సరే, పోనీలే; అనుకుంటూనే ఉండు. డ్రయివరు సంగతేమిటి?"

"అక్కడే రోడ్డుపక్కన విడిచిపెట్టేశాం. మేము...."

"భలే తెలివిగలవాళ్ళే మీరు!" జితేంద్రుడు మళ్ళీ పచార్లుచేస్తూ "సరే, అయిందేదో అయింది; ఇక వెళ్లు. ఇప్పుడే వెడుతున్నావా?"

"మీరక్కడికి వస్తారా?"

"నాకు తీరికలేదని చెప్పు. అవసరంకూడాలేదు. డబ్బు తప్పనిసరిగా ఇవ్వవలసిందేనని చెప్పు."

జితేంద్రుని అడుగుల్లో వేగం హెచ్చింది. తలవనితలంపుగా చేతివ్రేళ్ళు ముడుచుకుపోయాయి. కుడిచేతిలోని కవరు నలిగిపోయింది. ఏదో ఆలోచనలో తల్లీనుడైనాడు. అప్పటి అతని ముఖవైఖరి చూచి పఠాన్ భయభ్రాంతుడైనాడు. మొద్దుబారిపోయి అలాగే నిల్చున్నాడు.

"టీ పట్టుకురానా ?"

జితేన్ ఉలికిపడి చూచాడు. తిన్నీ కనిపించింది పై ప్రశ్న అడుగుతూ. చెప్పిన పని చెయ్యటమేగాని, తనకుతానై వచ్చి అడగవలసిన అవసరం ఏమిటీ ? అతనికి కోపం వచ్చింది. "ఏమంటున్నావ్ ?" అన్నాడు. అంటూనే ఆలోచనాప్రపంచంలోనించి మామూలు ప్రపంచంలోకి వచ్చాడు. అటు తిన్నీ, ఇటు పఠాన్ — ఇద్దరూ స్ఫురణకువచ్చారు. "ఊఁ, పట్టుకురా.... పఠాన్ ! రా, కూర్చో" అన్నాడు.

టీ త్రాగుతూ చాల గంభీరంగా కూర్చున్నాడు జితేంద్రుడు. ఏమి మాటాడ్డానికీ పఠాన్‌కు సాహసం లేకుండా ఉంది. "నాకు తీరికలేదనిచెప్పు. నేను రావలసిన అవసరమూలేదనిచెప్పు" అన్నాడు జితేంద్రుడు హఠాత్తుగా.

పఠాన్ మౌనంగా కూర్చున్నాడు. మేజామీద ఒక చిన్న గిన్నెకింద అణగివున్న ఆ కవరువంక చూస్తూ కూర్చున్నాడు. దానివిషయమై సర్దారుకు జ్ఞాపకంచేసేందుకు ధైర్యం చాలటంలేదతనికి.

"జీప్ ఎక్కడుంది ?"

"ఇక్కడికే తెచ్చాను."

"నంబర్ ?"

"మార్చేశాం."

"నువు ఒక్కడివేనా ? ధీర్‌జీ లేడా వెంట ?"

"చిత్తం-లేడు —"

"సరే, జీప్ ఇక్కడే ఉండనీ....టీ ఇంకా అక్కర్లేదా ? అయితే ఇక నువు వెళ్ళచ్చు."

పఠాన్ బయలుదేరి వెడుతూంటే జితేంద్రుడు అన్నాడు : "కష్టపెట్టటం మా ఉద్దేశం కాదనికూడా చెప్పు. సుఖశాంతులు చేకూర్చటమే మా పని అని చెప్పు... ఊఁ, ఇక వెళ్ళు."

పఠాన్ ఆమాటలు వింటూనే వెళ్ళిపోయాడు. అతడు మెట్లమీదినించి దిగుతూన్న చప్పుడు ఆగిపోగానే జితేంద్రుడు ఆ కవరు తీసుకున్నాడు. విప్పి చదివాడు :

"ప్రియతమా!

"చాల హాయిగా, సుఖంగా వున్నాను. మీరేమీ విచారపడకండి. డ్రయివరుకు పాపం అనవసరంగా గాయం తగిలింది. ఒకటిరెండు రోజుల్లో వచ్చేస్తున్నాను.

"మీ........

"మోహిని"

కవరుమీద బారిస్టర్ నరేశచంద్రుని పేరు, చిరునామా ఉన్నాయి.

ఒకటిరెండు నిమిషాలు ఆఉత్తరాన్ని అలాగే చేతుల్లో పట్టుకునే వున్నాడు జితేంద్రుడు. చివరకు మరోకవరు తీసుకున్నాడు. ఉత్తరాన్ని అందులోపెట్టి మూసేశాడు. దానిమీద తన చేత్తో చిరునామా వ్రాశాడు. తిన్నీని కేకవేసి పిల్చాడు.

తిన్నీ వచ్చింది. "కింద ఎవరన్నా వుంటే ఇలా రమ్మను" అన్నాడు. ఒక మనిషి ఎవరో వచ్చాడు. 'ఈవుత్తరం తక్షణమే ఆ చిరునామాకు అంద జేసిర'మ్మని ఆజ్ఞాపించాడు.

కవరు తీసుకుని ఆ మనిషి వెళ్ళిపోయాడు తిన్నీ టీకప్పులు తీసుకు పోయింది. జితేంద్రుడు మళ్ళీ కేకవేసి పిల్చాడు : "తిన్నీ!"

తిన్నీ వచ్చి నిల్చుంది.

"చేతులు కడుక్కుని రా."

చెంబులు తోముతూ....జితేంద్రుడు పిలవగానే అలాగే వచ్చేసింది. ఇప్పుడు చూచుకుంది : చేతులు మురికిగా వున్నాయి. వెంటనే వెళ్ళి చేతులు కడుక్కుని మళ్ళీ వచ్చింది.

"తిన్నీ, నీకు అసలు కోపంకూడా రాదేం!"

"చెప్పండి, ఎందుకు పిల్చారో!" కోపంగా అడిగింది తిన్నీ.

"ఔను. ఒకమాట చెప్పాలనే పిల్చాను. ముందుగా ఒకసారి కిందికి వెళ్ళి వీర్‌జీ ఉన్నాడేమో ఇక్కడికి రమ్మను. నువు చాల మంచిదానివి కదూ!"

'మంచిదానివికదూ!' అన్నమాట విని ముఖం చిట్లించుకుని తిన్నీ కిందికి వెళ్ళింది. వీర్‌జీని పిల్చుకువచ్చింది.

"ఇక నువ్వు వెళ్ళి పని పూర్తిచేసుకునిరా" అన్నాడు జితేంద్రుడు తిన్నీతో. వెంటనే పీర్‌జీవైపు తిరిగి ఇలా అన్నాడు : "తెలిసిందా పీర్‌జీ ! వాళ్లు డ్రయివరును గాయపరిచారు. అతన్నీ, మోటారునూ రోడ్డుమీదే వది లేసి వచ్చేశారు. సంగతి ఏమైందో నువ్వు తెలుసుకునిరావాలి. చడ్డా వ్యవహా రంకూడా తెలుసుకునిరా. ఒక గంటలో తిరిగిరావాలి."

ఇలాగే పీర్‌జీకి ఇంకా కొన్ని ఆజ్ఞలు, హెచ్చరికలు చెప్పి పంపిం చేశాడు. ఆతరువాత తిన్నీని పిల్చాడు. ఆమె వచ్చింది. "కూర్చో తిన్నీ ! అబ్బెబ్బే కూర్చో ! చూడు, నేను వెళ్ళిపోయాక నీవ్యవహారం ఏమిటో కాస్త ఆలోచించుకున్నావా మరి !"

తిన్నీ ఆశ్చర్యంగా ఆ వ్యక్తిముఖంలోకి చూస్తూ ఉండిపోయింది. మేజాకు అవతలవైపున అతనికి ఎదురుగా కూర్చుంది. కూర్చుని అలాగే చూస్తోంది, మాట పలుకు లేకుండా.

"నిన్ను నేను పాపం చాల ఆయాసపెడుతున్నాను. అన్నిపనులు నీచేతనే చేయించుకుంటున్నాను. ఒక నౌకరుకంటెకూడా ఘోరంగాఉంది నీపని.

"అసలు మీరు నన్నెందుకు పిల్చారో ఆసంగతిచెప్పండి" అన్నది తిన్నీ చికాకుగా.

"అదే చెబుతున్నానుగా తిన్నీ ! నువ్వు ఆరాధించుకుంటూన్న భగ వంతుడు....పాపంపండగానే....పాపిష్ఠుల్ని ఇక్కడినించి ఎత్తుకుపోతూ వుంటాడుకదూ !....అదే అడుగుతున్నాను : ఆతరువాత ఏం కావలసివుంది? ....అని....ఇదిగో నీకింతవరకూ చెప్పానుకాదు : ఈసొమ్ములెవరివో ఆస్త్రీని పట్టి తీసుకువచ్చారు. ఇప్పుడు అడవిలో మన శిబిరంలో ఉంది ఆవిడ.... సొమ్ములు ఆమెకు ఇచ్చివేద్దామా ?"

"ఊఁ....ఇచ్చివెయ్యండి."

జితేంద్రుడు నవ్వాడు ; "అవి తీసుకుని ఆవిడ పారిపోతుంది. ఆ తరువాత నీగతి, నాగతి ఏం కావాలి ? పొట్ట నిండటం ఎలాగ ? నేను పని చేసేవాడిని కాదు; డబ్బు సంపాదించేవాడిని కాదు. ఇప్పుడు మేం చేస్తున్న పనిపాటలన్నీ చూస్తున్నావుగా, క్రాంతికారులు చెయ్యవలసింది ఇదే. మాలో

ఎవరూకూడా ఇంతకుమించి మరేమీ చెయ్యరు. ప్రపంచమంతా పెనగులాట, దోపిడి, దురాక్రమణచేసి కూర్చున్నవాళ్ల దగ్గరనించి మేము దోపిడిచేస్తూ ఉంటాం. మాదగ్గరనించి దోచుకుపోతాడు మరొకడు. మరొకజాతికూడా ఉన్నది తిన్నీ !....వాళ్ళు పౌరుషంగా, వీరోచితంగా దోచుకుపోరు. ఒక క్రమబద్ధమైన పద్ధతిలో దోపిడిచేస్తూ ఉంటారు....పోనీలే, నేను వాగుడు ఆరంభించినట్టున్నానే !....అదే, ఆజాతిప్రతినిధే వచ్చింది. చూస్తావా ఆమెను ?"

"ఎందుకు ?"

"ఎందుకేముంది ? చాల ఐశ్వర్యవంతురాలు; బాగా చదువుకున్నది; మంచి అందగత్తె....చూస్తావా ?"

"నాకు సొమ్ములు అక్కర్లేదు."

"ఏం ? ఆనాడు పెట్టుకున్నావుగా ! అప్పుడు అవిపెట్టుకుంటే ఎంతో అందంగా ఉన్నావు."

"అయితే ఏం ? పరాయిసొమ్ములు నాకెందుకు ?"

"పరాయిసొమ్ములు ! అందుకనే చెబుతున్నాను తిన్నీ ! అవి నీ సొంతం అయినతర్వాత ఆమెను పంపించేద్దాం, ఏమంటావు ?"

తిన్నీ ఏమంటుంది ? ఆ వాగుడు వింటూ కూర్చుంది.

వాగుడే నిజానికి. జితేంద్రుడు తిన్నీముఖంలోకి చూస్తూ మళ్లీ ఇలా ఆరంభించాడు : "బంగారం పచ్చగా వుంటుంది; ఒకోసమయంలో అందం గానే కనిపిస్తుంది. దాన్ని రకరకాల ఆకారాల్లో, అనేక ప్రకారాలుగా సొమ్ములు తయారుచేస్తారు. కాని బరువెక్కువ. దానితో ఆటవస్తువులు నిర్మిస్తే బాగానేవుంటుంది. కాని వాటితో ఆడుకోటం ఎలాగ ? బరువుగా వుంటాయికదూ !....ఇకపోతే రాళ్ళు....రాళ్లే....కాని అవి రత్నాలు, వజ్రాలు, మాణిక్యాలు ! అందంగానే వుంటాయిసుమీ ! ఏం తిన్నీ ! అందంగా వుండవూ ?....ఔను, నేను అందాన్నే తీసుకువస్తాను....ఇప్పుడు దైన్యం వ్యాపించివున్నచోట సౌందర్యాన్ని ప్రతిష్ఠిస్తాను....ఏం తిన్నీ ! నీకు అందం అక్కర్లేదా ?"

వెళ్ళిపోడానికి లేచింది తిన్నీ."

"ఏం, లేచావేం తిన్నీ?"

"పప్పు మాడిపోతుంది అవతల."

"ఇవాళ మాడిపోతే పోయిందిలే. అన్నీ తగలబడిపోనీ. నువు కూర్చుని నేను చెప్పేదంతా విను."

కాని తిన్నీ ఆమాటలు వినిపించుకోలేదు; పప్పుగాని మరింకేదిగాని నాశనంకావటం ఆమెకిష్టంలేదు.

తిన్నీ వెళ్ళిపోయాక జితేంద్రుడు తన కణతలు రెండూ గట్టిగా నొక్కి పట్టుకున్నాడు—కుడివైపున బొటనవేలితో, ఎడమవైపున మిగతా నాలుగువేళ్ళతోనూ. ఆమధ్య నుదురంతా నొప్పిపెడుతున్నది. అలాగ మోచేయి మేజామీద ఆనించి, అరచేతిలో నుదురు ఒత్తిపట్టి, చాలసేపు కూర్చున్నాడు. ఇంతేనా తన అదృష్టం? తనలో మెలికలుపడివున్న భావాల్ని మాటల్లో ఇమిడించి ఎవరితోనైనా చెప్పుకుని, వెళ్లబోసుకుని తన్ను తేలిక పరుచుకునే యోగ్యత లేదా? లోపల పెరిగిపోతున్న భారాన్ని బయటికి ప్రవహింపజేసుకునే అవకాశమే లభించదా? అందరిదీ ఒక దోవ అయితే తనది ఇంకో దోవా? ఉలిపికట్టెలా తాను అందరికీ దూరంగా ఉండవలసిన వాడేనా? ఈ దీనురాలైన తిన్నీ పాదాలమీద వాలిపోయి తాను నిశ్శేషంగా అంతర్హితం అయిపోవాలనిపిస్తుంది ఒకోసారి. కాని, అయ్యయ్యో! ఈ తిన్నీ కూడా తనకెంతో దూరాన, ఎంతో ఎత్తున, అందరాకుండా....

అతడు లేచాడు. ఆ అభాగ్యాన్నే వరిస్తాడు! అందులోనే ముందుకు సాగుతాడు! మరోమార్గం ఏదీ! లేచి దృఢంగా అటూ ఇటూ నడుస్తున్నాడు గదిలో. ఇంతలో అతనికేదో హఠాత్తుగా జ్ఞాపకంవచ్చింది. తక్షణమే గడ్డం చేసుకున్నాడు. తిన్నీగదిలోనించి అవతలికిపోయి పంట్లం తొడుక్కున్నాడు; మేలైన బుష్షర్టు ధరించాడు; మేజోళ్ళు, బూట్లు తొడుక్కున్నాడు; హ్యాట్ పెట్టుకున్నాడు. తిరిగి తనగదిలోకివస్తూ "అయిందా?" అని ప్రశ్నించాడు తిన్నీని.

తిన్నీ తలెత్తి చూచింది. అతని వ్యవహారం ఆమెకెప్పుడూ విస్మయ కరంగానే వుంటుంది. ఇప్పుడు కొత్తగా ఆశ్చర్యంకలగలేదు. "అయింది. ఎక్కడికైనా వెడుతున్నారేమిటి?" అని అడిగింది మెల్లిగా.

"ఔను. వెడుతున్నాను."

"కూర్చోండి; తీసుకువస్తున్నాను."

పప్పు, రొట్టెలు పళ్ళెంలో వేసుకుని తీసుకువచ్చి మేజామీద పెట్టింది తిన్నీ. ఆమె తన యిష్టప్రకారం ఇక్కడ యేమీ చేయలేకుండా వుంది. వట్టి ఎండురొట్టెలు తప్పితే శుభ్రమైన చపాతీలుచేసే వీలులేదు. అటువంటిదుస్తులు ధరించి ఆవ్యక్తి ఆ చప్పిడిరొట్టెల్ని కేవలం పప్పు మాత్రమే నంజుకుని తింటూవుండటం చూస్తోంటే తన్నుతాను బాదుకోవాలని పిస్తోంది; లేకపోతే అతన్నే పట్టుకుని నాలుగు బాదాలనిపిస్తోంది ఆమెకు.

జితేంద్రుడు నవ్వాడు. "నీపద్ధతి మరీచిత్రం తిన్నీ! ఎక్కడికి వెడుతున్నానో అడిగైనా తెలుసుకోవేం?"

"ఒక్క ఊరగాయముక్క వేయించుకోండి."

"—అక్కడికే వెడుతున్నాను."

ఆ మాట ఆమె వినిపించుకోనట్టుగా ఊరుకుంది. వినిపించుకుంది, కాని ఏమి అర్థంచేసుకుందో మరి! "ఒకముక్క తీసుకురానా?"

"తినటం అయిపోనే అయిపోయిందిగా!....అయితే నువు చూడ వన్నమాటేగావచ్చి? సరే, పోనీలే. ధనవంతులదగ్గర ఒక్క గర్వంతప్పితే మరేంవుంటుంది గనక!"

వెంటనే తిన్నీ ఏమీ మాటాడలేదు. కాసేపు ఆగి "చాలపెద్ద ధన వంతురాలా?" అని అడిగింది.

"ఆహా! చాలా!" అన్నాడు జితేంద్రుడు సముత్సాహితుడై.

"చాల అందమైన మనిషా?"

"ఊఁ, చాలా అందమైంది!"

విని తిన్నీ ఒక్కక్షణం ఊరుకుంది. చివరకు అడిగింది: "మిమ్మల్ని ప్రేమిస్తోందా?"

జితేంద్రుడు ఉలికిపడ్డాడు. "ప్రేమా!"

"మీరు ప్రేమిస్తున్నారా ఆమెను?"

"నేనా? ప్రేమించటమా!" అంటూ జితేంద్రుడు పగలబడినవ్వాడు. ఆనవ్వు చూచి ఆమె భయపడిపోయింది. రెండడుగులు వెనక్కి జరిగింది.

చూస్తూ చూస్తూండగానే అతని ముఖంమీది ఆనవ్వు అంతర్హితమై పోయింది. గాలితరగల్లో దాని ప్రతిధ్వనిమాత్రం ఇంకా శబ్దిస్తున్నది. కాని జితేంద్రుడు ముఖం వాల్చుకుని గదిలో పచార్లు ఆరంభించాడు. అకస్మాత్తుగా తిన్నీకి దగ్గరగావచ్చాడు. ఆమె భయపడి వెనక్కు జరిగింది. అతడు ముందుకు సాగివచ్చి ఆమెగడ్డం పుచ్చుకుని ముఖం పైకిఎత్తాడు.

తిన్నీ గాభరాపడుతూ గుడ్లువొప్పజెప్పి చూస్తూఉంది.

జితేంద్రుడు ఆగిపోయి, ఆమెకన్నుల్లోకి చూస్తూ ఇలా అన్నాడు: "ప్రేమ అనేది మంచివస్తువు కాదు నా తిన్నీ!" అతడామె చుబుకం విడిచి పెట్టేశాడు. మెడవెనకనించి నడుముచుట్టూ చేయి పోనిచ్చి పొదివిపట్టు కున్నాడు; తిన్నగా ఆమెను అవతలగదిలోకి తీసుకుపోయి విడిచిపెట్టాడు. చప్పున వెనక్కు వచ్చేసి ఇవతలవైపున గొళ్ళెం పెట్టేశాడు.

మరికాసేపటికి వీర్‌జీవచ్చి కబురుచెప్పాడు: ఊరంతా గగ్గోలుగా చెప్పుకుంటున్నారు. డ్రయివరుకు కొద్దిపాటిగాయమే తగిలింది; ఆసుపత్రిలో ఉన్నాడు; ఏంపరవాలేదు. అతడిచ్చిన స్టేటుమెంటులో విశేషమేమీలేదు. చడ్డా ఎక్కడవాడుఅక్కడే వున్నాడు. ఎటూ ముందుకుసాగినట్టు కనిపించటంలేదు.

జితేంద్రుడు కనుబొమలు కుంచించి సర్వం విన్నాడు. "వీర్‌జీ! ఒక సంగతి అడుగుతాను చెప్పు: ఇక నాకు సెలవివ్వగలవా?"

సాశ్చర్యంగా సర్దారుముఖంలోకి చూస్తూ నిల్చున్నాడు వీర్‌జీ.

"నీదగ్గర మొత్తం డబ్బు ఎంత వుంది?"

"డబ్బేముంది?"

"అయితే డబ్బు మనకు కావాలా! పైసా లేకుండా ఏవ్యవహారం సాగుతుందీ?" అంటూ జితేంద్రుడు నవ్వాడు. ప్రభుత్వం నాణేలు, నోట్లు ముద్రిస్తుంది. మనం లూటీచేసి తీసుకువస్తాం. ఆ ముద్రించిన డబ్బును వెద జల్లి సిపాయిలు, మెంబర్లు, నౌకర్లు వగైరాలను నియమిస్తుంది ప్రభుత్వం. లక్షలకొద్దీ సిపాయిలు, లక్షలాది నౌకర్లు, వేలాది మెంబర్లు! నౌకర్లంటే ఆఫీసర్లు, మెంబర్లంటే నాయకులు. మనం విప్లవం లేవదీస్తున్నాం. అందు కోసం ఆ ముద్రించి సిద్ధంగాఉన్న ధనాన్ని వాళ్ళదగ్గరనించి లూటీచేస్తాం.

మనం తయారుచెయ్యం డబ్బును; ప్రభుత్వమే తయారుచేస్తుంది. మనం లూటీచేస్తాం. మనం లూటీచేస్తేమాత్రం, ఎంత కావలిస్తే అంత తయారు చేసుకుందేవాళ్ళకు ఏంనష్టం? నువు వీరుడివి, నీ ఉద్దేశం ఏమిటి చెప్పు?"

ఆవీరుడు సర్దారువైపు విస్తుపోయిచూస్తూ నిల్చున్నాడు.

"నువ్వేం మాటాడటంలేదే! నిజమే, నేనూ మాటాడకుండా ఊరు కోవలసిందే. మన యీ చర్చలవల్ల ఏమీ ప్రయోజనముఉన్నట్టు కనిపించదు. మనమూ డబ్బుతయారుచెయ్యటం ప్రారంభించామనుకో. నోట్లు, నాణేలు ముద్రిస్తాం. మొదట అలాగే అనుకున్నాం. పెద్ద కష్టమైన పనేం కాదు. కాని ఆ ఆలోచన మానేశాం. ఎందువల్లనో తెలుసా? అవి కృత్రిమమైన నోట్లు, నాణేలు ఔతాయి. ఎందువల్లనంటే వాటిమీద ప్రభుత్వముద్ర వేయాలి. మనముద్ర వేయటానికి వీల్లేదు. అందువల్ల అవి కృత్రిమం ఔతాయి. అందు వల్ల డబ్బు చౌకఅయిపోతుంది; అంతేగాని మనిషివిలువ పెరగదు. డబ్బు చౌకఅయితే మనిషి నీచుడుగా తయారౌతాడు. అందువల్ల మనం కఠినమైన మార్గాన్నే చేబట్టాం. మనం చేసే దొంగతనం దొంగతనం కాదు. అదొక సాహసకృత్యం. దానికి గుండెబలం కావాలి; తెలివి కావాలి; విజ్ఞానం కావాలి. కాని ఇంతకూ అసలుప్రశ్న వేరు. మనం డబ్బు పెట్టి సామాన్లు కొనుక్కుంటున్నాం. డబ్బువల్లనే మనిషికి పుష్టివస్తుంది. ఈ డబ్బుమీద సర్కారుముద్ర ఉంటుంది. అందుచేత మనం ప్రభుత్వాన్ని త్రోసిరాజనటం లేదు. పైగా స్థిరపరచటమే ఔతున్నది. డబ్బు లేకుండా మనపనులు సాగు తాయా? లేదా, సర్కారువారిది కాకుండా, కేవలం మనదీ అనదగిన డబ్బు ఏదైనా ఉండటానికి అవకాశం ఉందా? అదీ ఇప్పుడు మనం ఆలోచించ వలసిన ప్రశ్న! ఇదిగో వీర్‌జీ! అసలు నిజమైన క్రాంతి అంటే అదీ! తుపాకిని, పిస్తోలును ఎదుర్కొవలసిన అవసరమే ఉండకూడదు. ఆయుధాల అడ్డం లేనినాడే మానవుడు ముందుకు సాగగలుగుతాడు. ఏమంటావ్ వీర్‌జీ! ఒప్పుకుంటావా నా మాటలు?"

సర్దార్ ఉపయోగించిన తర్కం అంతుపట్టలేదు వీర్‌జీకి.

జితేంద్రుడు నవ్వాడు: "సరే, పోనీలే. అయితే ఇంతకూ డబ్బు కావాలంటావు! ఎంత కావాలి?"

"యాభై వేలు అని మీరే చెప్పారుగా!"

"సరే, బాగుంది! అది లభించాక అంతటితో దాని అవసరం లేకుండాపోతుందా?"

"మీ అభిప్రాయం ఏమిటో సరిగా బోధపడటం లేదు" అన్నాడు వీర్ జీ తికమకపడుతూ.

"పోనీలే, ఏఅభిప్రాయం అయితే యేం? నా మనస్సుకు నాకే సరిగా అర్థంకావటంలేదు. అంతా గడబిడగా ఉన్నట్టుంది. ఇంతకూ మనిషి స్థైర్యానికి అధారం ఏమిటి? ఒక స్థిరమైన సంకల్పం. అది మంచి శ్రద్ధతోకూడినది కావచ్చు; లేదా మొండిపట్టుదలే కావచ్చు. మానవుడు ఆ సంకల్పంనించి తొలగిపోయాడూ అంటే—భ్రష్టుడైనాడన్నమాటే. ఏమంటావ్?"

తమ యీ సర్దారు ఉద్దేశాల్నీ, భావాల్నీ గ్రహించటం అనుచరులకు కష్టతరమే. జితేంద్రుడు పలికిన మాటల్లోని భావం వీర్ జీకి సరళంగా అవగతంకాలేదు. ఏదో ఒక అర్థం స్ఫురించినట్టూ ఉంది. సర్దారుముందు తర్కించటం అనుచరులకు సాధ్యంకాదు. చకితులై నిల్చిపోవలసిందే.

"పోనీలే.... ఇప్పుడు ఎంతైంది? ఓ! తొమ్మిదిన్నరే! మోటారు ఎక్కడుందీ?" అడిగాడు జితేంద్రుడు.

"అక్కడే, మర్రిచెట్టుదగ్గర."

"సరే, వీర్ జీ! డబ్బుకోసం ప్రయత్నం చేస్తాను. కాని ఇది సరయిన మార్గంకాదు. డబ్బును ప్రభుత్వమే తయారుచేయడమేమిటి? మనం ఎందుకు చేయకూడదు? రూపాయలు మోగించే చెయ్యికాదు, శ్రమఓర్చే చెయ్యే సత్తా కలది కావాలి. శ్రమే డబ్బు అవాలి, డబ్బు మట్టిలోకలిసిపోవాలి.... డబ్బు అనేది నాశనమైపోవాలి. అప్పుడూ విప్లవం! అదీ అసలైన విప్లవం! ఇక మిగిలిందంతా తమాషాయే. ప్రభుత్వాన్ని పూజించటమే. పేరుకు విప్లవం! కాని చేసేదిమాత్రం పూజ! ధనాన్ని లూటీచేస్తున్నామంటే అర్థం అంతేగా! ధనమే దేవుడు ఔతున్నదికాదూ! కాదు కాదు వీర్ జీ! ఇదెంతమాత్రం సరయినపద్ధతి కాదు....సరే, ఇంతకూ జ్ఞాపకంపెట్టుకో. నాతరువాత నువ్వే ఉన్నావు.... ఇక నేను వెడుతున్నాను. ఆ తలుపులు ఇక తెరిచేసెయ్యి—ఇంకా మూసే వుంచవలసిన అవసరం లేదు."

ఇక జితేంద్రుడు అక్కడ ఆగలేదు. మెట్లుదిగి వెళ్ళిపోయాడు. జీప్‌లో ఎక్కి అడవిలోవున్న శిబిరంవైపు వేగంగా వెళ్ళిపోయాడు. (ఆ శిబిరాన్నిగురించి ఇక్కడ వర్ణించి వ్రాయవలసిన అవసరంలేదు. వివరాలు పత్రికల్లో ప్రచురింపబడ్డాయి) మోహినికి ఒక ప్రత్యేకమైన గది ఏర్పాటు చేశారు. గది అనటానికి వీల్లేదు. పైన పెంకు కప్పిన కొస్త ప్రదేశం. బాగా విశ్రాంతిగా ఉండే చోటే. ఒక మంచం, దానిమీద ఒక పరుపు, దిండు, పక్కన ఒక కుర్చీ, ముక్కాలిపీట ఉన్నాయి. అందులోనే ఒక మూల స్నానాదికాలకు ఏర్పాట్లు ఉన్నాయి. బయట పహరాఉంది.

"రావచ్చునా ?" అని అడుగుతూనే జితేంద్రుడు గదిలోకి వచ్చేశాడు. ఆసమయంలో మోహిని దిండుమీద తలపెట్టుకుని, శాలువ కప్పుకుని పడుకునివుంది. అతనిమాట వినిపించగానే ససంభ్రమంగా లేచి కూర్చుంది.

లోపలికి వచ్చి జితేంద్రుడు ఒకసారి వెనక్కి గుమ్మంవైపు చూచాడు. మళ్ళీ ఆమెవైపుతిరిగి "క్షమించాలి, అదేమిటి ? లోపల తలుపు గడియవేసుకోకపోయినారా ?" అని అడిగాడు.

మోహిని సమాధానంచెప్పకుండా అలాగే కూర్చుంది.

"అంత భయంవేసిందా ఏమిటి ? మీ సామాన్యసురక్షణదృష్ట్యా లోపల తలుపు గెడవేసుకోవాలనికూడా స్ఫురించలేదా ? మీసెలవైతే నేను వేస్తాను" అంటూ వెళ్ళి గడియపెట్టి వచ్చాడు. కుర్చీలో కూర్చుంటూ "సెలవా ? కూర్చోమంటారా ?" అని అడిగాడు.

"అంటే.... నేను లేచి నిల్చోవాలని తమ ఆజ్ఞా ?"

"అటువంటిశ్రమ మీరేమీ పడనక్కరేదు—"

మోహిని కాళ్లు మంచంమీదినించి కిందికి చాచి సరిగా కూర్చుంది. "నా ఉత్తరం పంపించారా ?"

"ఎందుకూ ?"

"పంపించలేదా ?"

"ఆసంగతి అలా వుంచండి. తమకు తెలుసుగా ; తమరు ఇక్కడికి ఎందుకు రావలసివచ్చిందో ! మాకు డబ్బు అవసరం."

"అయితే కావచ్చు. నాప్రశ్నకు జవాబు అవసరం."

"ఆవృత్తరంతో పెద్ద అవసరం ఏమీలేదు. డబ్బు విషయంలో మీరు___"

"నేను చేయగలిగిందేముందీ?"

"మీరు చేయగలిగిందేమిటో మీకే తెలుసు. మా అవసరం మీరు తీర్చగలరు."

"నాదగ్గర డబ్బు లేదు. ప్రాణం వుంది. అది కాజెయ్యండి. దానితో మీపని అవదా?"

"అర్థం అయింది. ప్రాణంకంటే మీకు డబ్బే తీపి అన్నమాట! బహుశా దానితోనే మాపని కానిచ్చుకోవాలనుకుంటాను."

"అందుకు నేను మీకు పూర్తిగాసహాయపడగలను. మీరే చూస్తారు, ఒక్క ఆర్తనాదంకూడా బయటికి రానీయను."

"నగలు మీరు వాపసుకోరుతున్నారా?"

"మీదయ!"

జితేంద్రునికి కోపంవచ్చేసింది. "మోహినీ! నాటకం ఆడబోకు. మాకు డబ్బు అవసరం."

"వెళ్ళి దోచుకురండి. మీకేంతక్కువ? మేము బూర్జువాలం. ఏం చెయ్యగలం? ఊరికే సంపాదిస్తాం, అంతేగా!"

"ఔను, సంపాదించారు; కూడబెట్టారు; లక్షలువిలువజేసే సొమ్ములు చేయించుకున్నారు. మేడలు, మిద్దెలు, శృంగారాలు, ఆడంబరాలు...." ఆవేశంతో జితేంద్రుని కంఠం కంపించింది.

"ఎబ్బే, దోచుకున్నాం!"

"ఔను, దోచుకున్నారు. కండలుకొరికి, నెత్తురుపీల్చి నిలువచేశారు.... ఇంతకూ తిన్నగా ఇస్తావా లేదా?"

"చెప్పేశానుగా! వెళ్ళండి, వెళ్లి కన్నాలువేసి కొట్టుకురండి. భయం ఎందుకూ? ఎక్కడ ఏదివున్నాసరే అంతా మీదేనన్నఉద్దేశంతోనేగా ఈ దోపిడీ ఒక వృత్తిగా పెట్టుకున్నారు మీరు? పనిచేసేవాళ్ళదేమీలేదు. విప్లవం తెచ్చేవాళ్లదే అంతా! సిగ్గేలా లేకపోయిందబ్బా నీకు? ఇంతపెద్ద క్రాంతి కారుడివై కూడా డబ్బుకోసం ఒక ఆడదాన్ని యాచిస్తూ కూర్చున్నావు!"

"అయితే మోహినీ! ఇక అదే చేయమంటావా?" అన్నాడు జితేంద్రుడు మెల్లిగా.

"నన్ను అడుగుతున్నావా? అది అడిగేందుకే వచ్చావా?"

"ఔను, అది అడిగేందుకే వచ్చాను. ఇలాంటి మాటలతో కాలక్షేపం చేయటానికి మాకు తీరికలేదని చెప్పటానికికూడా వచ్చాను."

"తీరికలేకపోతేవెళ్లిపో. ఎందుకు అనవసరంగా ఇక్కడ ఆయాసం?"

"వెడతాను. ఆయాసమూపడను" అంటూ జితేంద్రుడు లేచాడు. తలుపు తెరిచాడు. బైట కాపలాకాస్తున్న మనుషులకు సైగచేశాడు. మరి కాసేపటిలో ఇద్దరుయువకులు వచ్చారు. వాళ్ళచేతుల్లో తాళ్ళు ఉన్నాయి.

జితేంద్రుడు వాళ్ళచేతుల్లోనించి తాళ్ళు లాక్కొని ఒక మూలకు విసిరి పారేశాడు, "మీరు మనుషులా మనుబోతులా?" అని మందలిస్తూ. వెంటనే మోహినివైపు తిరిగాడు. "ఈవ్యక్తులు నిన్ను మరోచోటికి తీసుకుపోయి వుంచటానికి వచ్చారు. ఈశిబిరం ఇక్కడినించి ఎత్తివేయవలసిందే ఇప్పుడు. ఇక్కడినించి చాలదూరం వెళ్ళిపోవాలి" అని, ఆయువకులవైపు తిరిగి "ఊఁ. తీసుకుపొండి" అన్నాడు.

యువకులు అనుమానిస్తూ నిల్చిపోయారు. మోహిని క్షణమాత్రంగా స్తబ్ధంగా ఉండిపోయింది. ఆమెకోపం అంతా ఎటో ఎగిరిపోయింది. కరుణగా మారిపోయిందేమో! తాను కూర్చున్నచోటునించి లేచివచ్చింది. జితేంద్రుని కుర్చీదగ్గర మోకాళ్ళమీద కూలబడ్డది అతనిచేయి పట్టుకుంది. ఆమెకన్నుల్లో విహ్వాలత ద్యోతకంఔతోంది. జితేంద్రుడు ఆమెచేతిని విదిలించి విడిపించుకున్నాడు. "చూస్తారేం? తీసుకుపోండి."

ఒక యువకుడు ముందడుగువేశాడు.

"జితేన్!" అన్నది మోహిని కాతరకంఠస్వరాన.

"ఇక్కడ జితేన్ ఎవడూలేడు. పొరపాటుపడుతున్నావు. ఇది ఇల్లు అనుకుంటూ కలలుగంటున్నావేమో! ఇది మహారణ్యం!"

అతని పాదాలమీద నుదురుమోపి మోహిని ఇలా అన్నది: "నీ పాదాలు పట్టుకుంటాను, ఇంత కాఠిన్యం వహించబోకు."

జితేంద్రుడు తన పాదం వెనక్కి తీసుకున్నాడు. "ఏమిటి చూస్తూ నిల్చున్నారు ? తీసుకుపోరేం ?"

మోహిని వివశయైపోయింది. అతని మోకాళ్ళురెండూ గట్టిగా పట్టుకుంది. యువకులు ముందుకు వచ్చారు. అక్కడవున్న ముక్కాలిపీట అవతలకు నెట్టేసి, ఇద్దరూ చెరియొకరెక్క పుచ్చుకుని ఆమెను లేవనెత్తటానికి ఉద్యుక్తులైనారు. ఆమె తన రెండుబాహులూ చుట్టి జితేంద్రుని కాళ్ళను పెనవేసుకుంది.

"సరే, ఆగండి ; మీరు బయటికి వెళ్ళండి" అన్నాడు జితేంద్రుడు. వాళ్ళు వెళ్లిపోయాక "ఇలాంటి నువ్వేనా అంత హఠంపోయావు ఇందాక ?" అన్నాడు.

మోహిని అతని కుడిచేయి పట్టుకుని మాటిమాటికీ తన నోటికీ, కళ్ళకూ, ముఖానికీ అద్దుకుంటూ "జితేన్....జితేన్...." అంటున్నది ఏడుస్తూ.

"లేచినిల్చో. గుమ్మం తెరచివుంది. తలుపులు వేసిరా. ఇంత నీచురాలివైనావా ? నీకు సిగ్గులేకపోయినా నాకు సిగ్గౌతున్నది నీ వ్యవహారం చూస్తే !"

మోహిని కిందికి వాలిపోయి, అతడు తొడుక్కున బూట్లకు పైభాగాన....మేజోళ్ళమీదనే అతని పాదాల్ని మాటిమాటికీ ముద్దుపెట్టుకున్నది.

"ఈవ్యవహారమంతా జితేంద్రునికేమీ అర్థంకావటంలేదు. గాభరాగా వెళ్లి గుమ్మంమూసేసి వచ్చాడు. ఆమెను లేవనెత్తి నిల్చోబెట్టాడు. ఆమె వేళ్లనరికిన వృక్షంవలె అతని వక్షస్సీమపై వాలిపోయింది. "మోహినీ ! మోహినీ !" అన్నాడు జితేంద్రుడు వివశుడై.

ముఖాన్ని అతని వక్షంలో అదుముకుని మోహిని వెక్కివెక్కి ఏడువసాగింది. ఏమీ మాటాడలేదు. జితేంద్రుడు ఆమెను మెల్లగా తీసుకుపోయి మంచంమీద కూర్చోబెట్టాడు. అతికష్టంమీద ఆమెపట్టు విడిపించుకునివచ్చి వేరుగా కుర్చీలో కూర్చున్నాడు. మోహిని కన్నుల్లోనించి అశ్రువులు ధారలు కట్టాయి. అతనికి కోపంవచ్చింది. "ఏమిటీగొడవ మోహినీ !"

"నన్ను చంపిపారెయ్యరాదూ జితేన్! భయపడతావెందుకూ?" అన్నది మోహిని ఏడుస్తూనే.

"కన్నీళ్ళుచూపిస్తూ మాటాడబోకు నారీ! చెప్పేదేమిటో తిన్నగా చెప్పు."

"నేరుగా నన్ను చంపిపారెయ్యమని చెబుతున్నాను, జితేన్! వక్ర మార్గాన నిన్ను నువు చంపుకోబోకు."

"నాకు డబ్బు కావాలి" అన్నాడు జితేంద్రుడు చల్లబడిపోతున్న కటుస్వరాన.

"అంతా తీసుకుందువుగాని. మొదట నన్ను చంపిపారెయ్యి."

జితేంద్రుడు బూటుకాలు ఎత్తి నేలమీద విసురుగా చరిచాడు. వెళ్ళి తలుపు తెరిచాడు. "ఏయ్, వాళ్లను రమ్మని చెప్పు."

ఆ యిద్దరుయువకులు మళ్ళీ వచ్చారు. ఈసారి ఆమూలపడివున్న తాళ్లను తీసుకువచ్చి జితేంద్రుదే వాళ్లకు ఇచ్చాడు. "ఊఁ, తీసుకుపోండి ఆ సిగ్గుమాలినదాన్ని" అన్నాడు.

ఒక యువకుడు ముందుకు వచ్చాడు. మోహిని లేచినిల్చుంది. రెండు చేతులు కలిపి ముందుకుచాచింది. ఆయువకులు ఆమెచేతుల్ని త్రాళ్లతో కట్టేశారు. ఇప్పుడామె కన్నీళ్లన్నీ ఇగిరిపోయాయి. ఒక తీవ్రవిషాదరేఖా మిశ్రితమైన చిరునవ్వు పెదవులపై కనిపించింది. "ఇక వెళ్ళనా?" అని అడిగింది జితేంద్రునిపైపు చూచి.

"ఊఁ, తీసుకుపోండి" అన్నాడు జితేంద్రుడు కాఠిన్యం ఉట్టిపడు తున్న అధికారస్వరాన.

ఆమెను అలా బంధించిన చేతులతోనే ఆ యువకులు తీసుకపో యారు. జితేంద్రుడు చూస్తూ నిల్చున్నాడు. చివరకు కుర్చీలో వచ్చి కూర్చు న్నాడు; మోచేతులు ముందున్నముక్కాలిపీటమీద ఆనించి చూస్తున్నాడు ఎదురుగా గుమ్మంగుండా. ఏముంది అవతల? అంతా శూన్యమే. అంతా వెళ్లిపోయారు. ఆ తెల్లని శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు—ఏమీ కనిపించని శూన్యంలోకి.

పదిపదిహేను నిమిషాలు గడిచాయి. అతడు లేవలేదు. కుర్చీలోనే

అలాగే కూర్చున్నాడు. కదల్లేదు, మెదల్లేదు. రెండు అరచేతుల్లోనూ చెంపలు ఆనించి, శూన్యభవిష్యత్తులోకి చూపులు జొనుపుతూ, అలాగే కూర్చున్నాడు.

మరికాసేపటికి అకస్మాత్తుగా తలెత్తి కేకవేసి ఎవర్నో పిలిచాడు. "ఎక్కడ వుంచారు ?" అని అడిగాడు.

"అక్కడే, ఆగదిలో."

"అక్కడ కాదు; అక్కడేం వసతి ఉన్నదనీ ?"

"మంచం వుంది, కంబళి వుంది, నీళ్ళబొక్కెనకూడా వుంది."

"ఇవి చలిరోజులు తెలుసునా ?"

"ఎండుగడ్డిమోపుకూడా ఒకటి తెచ్చి పడెయ్యమన్నారా ?"

"నన్నడగాలా ? వెళ్ళండి...."

వాళ్ళు వెళ్ళిపోయాక జితేంద్రుడు శిబిరంగురించి విచారణ సాగించాడు. దీన్ని ఇంకా ఇక్కడే వుంచినందువల్ల రక్షణ వున్నదా ? ప్రమాదం వస్తుందా ? దీని ఆచోకీ పోలీసులకు తెలిసిపోయినట్టు కబురు విన్నాడు. కాబట్టి శిబిరం ఇంకా ఇక్కడ ఉండటం సురక్షితంకాదు. మార్చివేయవలసిందే. కాని ఇప్పటికిప్పుడు మరోచోట ఏర్పాటుచేసుకోగలగటం చాల దుస్తరమైన పని. శిబిరం యావత్తూ ఒక్కసారి పరిశీలించి చివరకు మోహినివున్న గదిలోకి వచ్చాడు.

మోహిని నవ్వుతూ స్వాగతం ఇచ్చింది. "ఈచాపమీద ఎలా కూర్చుంటావు ? కుర్చీ తెప్పించుకోరాదూ ?" అన్నది.

జితేంద్రుడు ఎలాగో ఆ చాపమీదే కూర్చున్నాడు. "ఏమిటి ఇదంతా నీ వ్యవహారం మోహినీ !"

మోహిని నవ్వింది. "దానికేంగాని, నువు ఇక్కడేనా వుండటం ?"

"ఉహుఁ. ఇక్కడ వుండటంలేదు."

"నీయిల్లు ఒకసారి చూడాలనివుంది నాకు. నన్ను అక్కడికే తీసుకుపో త్వరగా."

"ఇల్లు !....ఔను. ఒక యిల్లు అనబడేది ఉంది."

"ఇంకా ఎవరైనా వున్నారా అక్కడ ?"

"ఆఁ, ఉన్నారు. నువు డబ్బుగనక ఇచ్చేట్టయితే....లేకపోతే నేనేం చేసేది?"

మోహిని నవ్వింది. "డబ్బులేనివాళ్ళంతా ఏం చేస్తున్నా? పేద వాళ్ళంతా ఏం చేస్తున్నారు?"

"మాదొక పెద్ద కుటుంబం అనుకో మోహినీ! అందరూ నన్ను ఆశ్రయించుకుని వున్నవాళ్లే. తెచ్చిపెట్టవలసింది నేను ఒక్కడినే! అందరి పొట్టలు నిండాలంటే నేనెక్కడినించి తీసుకురాను? ఉన్నచోటునించే రావాలిమరి లేనిచోటికి. ఉన్నచోట మితిమించి ఉన్నదీ అంటే ఎందు కుండాలి? ఉండవచ్చునని ఎలా సమర్థించగలం? నువ్వే ఆలోచించు. ఉంటే ఉన్నదిలే అని సహించి ఊటుకోటమే జరుగుతున్నదిగాని; ఉండవచ్చు, అది సవ్యమే అని సమర్థించేదుకు వీల్లేదుకదా! అందుకోసమని ఒక దళం ఏర్పాటుచేశాం; వ్యవహారం సాగిస్తున్నాం; అక్కడినించీ, ఇక్కడినించీ కొట్టుకువస్తున్నాం. కాని నిజం చెబుతున్నాను: మాకు అవసరమైనంతవరకే దోచుకుంటున్నాం; అధికంగా ఏమీ ముట్టుకోటంలేదు, అందరూ ఒంటరిగాళ్లే. సంసారం జంజాటాలేమీ లేవు. అటువంటప్పుడు వాళ్ళు తమ బ్రతుకు తాము ఎందుకు బ్రతకలేకుండా ఉండాలి? వాళ్ళ పనిపాటలు వాళ్లు ఎందుకు చేసుకోలేకుండావుండాలి? అలాంటివాళ్ల బ్రతుక్కు అంతరాయాలు ఏర్పడు తూంటే ఎలా సహించి ఊరుకుంటారు?— అందుకనే చెబుతున్నాను; కొస్త డబ్బు నువు ఏర్పాటుచేసిపెట్టు. యాభై వేలు కాకపోతే మానె! కొంచెం తక్కువైనాసరే. ఇదిగో, మొండితనం మానెయ్యి."

మోహిని నవ్వింది. "ఎలాగో ఇంత పెద్దపరివారం ఉండనేవుంది నీకు. ఇంకొక్కదాన్ని నేనుకూడాను. అందరూ ఉండటంలేదూ ఇదే తమ యిల్లనుకుంటాను. నేనూ అలాగే వుంటాను. కాని డబ్బుమాత్రం నాదగ్గర ఒక్క దమ్మిడీకూడా లేదు."

జితేంద్రునికి లోలోపల చాల కోపంవచ్చేసింది. విసిగిపోయాడు. చాపమీదినించి లేచి గదిమధ్యలో వచ్చి నిల్చున్నాడు. అటు ఇటు చూచాడు. గుమ్మంలోనించి అవతలకి చూస్తూ "ఇలా రా" అన్నాడు. ఒకమనిషి ఎందు

గడ్డిమోపు ఎత్తుకుని ఎదురుగా వచ్చాడు. "దాన్ని బైట ఆమూల పడెయ్యి" అన్నాడు జితేంద్రుడు.

మోహిని తన పెదవులమీది చిరునవ్వును అంతర్హితం చేసుకుంటూ మాటాడకుండా ఉండిపోయింది.

"కావలిస్తే ఆమెకు మరో కంబళి తెచ్చి ఇవ్వండి. ఇంకో ముక్కాలి పీట పట్టుకురా! ఇంకా ఏమన్నా కావాలేమో అడుగు" అన్నాడు జితేంద్రుడు ఆమనిషితో.

"ఇంకా ఏమన్నా కావాలా అమ్మా!" అడిగాడు ఆమనిషి.

"ఏమీ అక్కర్లేదు."

మోహిని అక్కడ వున్న విషయమే మరుపు తగిలినట్టుంది జితేంద్రునికి. గది అంతా కలయదిరుగుతూ, అదీ ఇదీ పరిశీలిస్తూ ఏమేమి యేర్పాట్లు ఇంకా చెయ్యాలో ఆజ్ఞలు జారీచేశాడు ఆ మనిషికి. "అన్నీ సరి జేసెయ్యండి తెలిసిందా? సాయంత్రానికల్లా దాగా ఎండుగడ్డి పరిచెయ్యండి."

అంటూ జితేంద్రుడు వెళ్లిపోడానికి ఉద్యుక్తుడైనాడు. మోహిని ముందుకు వచ్చి అతనిచేయి పట్టుకోటానికి ప్రయత్నించింది. అతడు తన చేయి ఆమెకు అందనీకుండా దిటవుగా అడుగులువేసుకుంటూ గుమ్మందాటి వెళ్ళిపోయాడు.

# 19

జితేంద్రుడు బైటికివచ్చి అక్కడి మనుష్యులతో "మీరెవ్వరూ ఆమెదగ్గరకు వెళ్లి పలుకరించవలసిన అవసరమేంలేదు. ఆమె కాస్త దారికివచ్చినట్టు తెలిస్తే నాకు కబురుచెయ్యండి. లేక ఆమె ఏదన్నా చెబితే వినండి; విని ప్రముఖమైన విషయం ఉంటే నాకు కబురు చెయ్యండి. ఏదైనా అవసరమైతే అక్కడినించి కబురు వస్తుంది" అన్నాడు.

అచ్చోటు వీడి బయలుదేరాడు జితేంద్రుడు. హృదయం భారంగా వుంది. జీప్‌లో తాను ఒక్కడే వున్నాడు. తానే డ్రయివుచేస్తున్నాడు. ఎప్పుడూ ఇలా కార్యభారంతో నలిగిపోతూవుండటం బాగులేదు. విశ్రాంతి కావాలనిపిస్తోంది మనసుకు. మనసును ఎల్లప్పుడు బిగదీసుకుని ఉంచుకోటం లోని భావం ఏమిటి?.... అసలు ప్రకృతిఅనేది ఏమీ లేనట్టేనా?....

మానవుడేనా ఉన్నది ?....అతడూ, అతనికి అవసరమైన రాగద్వేషాలూ మాత్రమేనా ఉన్నవి ?....కాదు....ప్రకృతికూడా ఉంది! సమస్త లౌకిక వ్యవహారాలకూ, అతీతమైన మహాప్రకృతి ఉంది. అది మనల్ని తనలో ఇముడ్చుకోటానికి సదా సిద్ధంగానే వుంటుంది. మంచిచెడ్డలనీ, విధినిషేధాలనీ అక్కడ లేవు. అందులో మనం మునిగిపోవచ్చు, సుస్నాతులం కావచ్చు....ఇలాంటి ఆలోచనలతో మనస్సు ఎక్కడ విహరిస్తూవుందో! జీప్ యమునానదిని సమీపించింది. జీప్ దిగాడు. ఒడ్డున నిల్చుని చూచాడు. ఆపైన ఇసుక, ఇంకాపైన అడివి. పాదాలకిందినించి ప్రవాహం వెళ్ళిపోతోంది. నాలుగైదు నిమిషాలసేపు ఆ నిర్జన విస్తృత ప్రకృతిలో నిమగ్నుడై చూస్తూ ఉండిపోయాడు. ఇంతలో అతనిలోనించే ఎవరో వీపుచరిచి 'పని వుంది చాలా' అని జ్ఞాపకంచేస్తున్నట్టు అనిపించింది. అస్తమానం ఏదోఒక పని బరువుగా నెత్తిమీద ఎక్కి కూర్చునివుండటం అతనికి అసహ్యం అనిపించింది. నదిఒడ్డునే బయలుదేరి పోతున్నాడు. కొంతదూరం పోయాక 'బోట్‌క్లబ్' అని రాసివున్న 'సైన్‌బోర్డు' కనిపించింది. ఫలానా ప్రొఫెసర్ మిత్రుని 'బోట్‌క్లబ్' అదేనని గుర్తుకువచ్చింది. వెళ్లాడు లోపలికి. కాని అక్కడెవరూ లేరు. పల్లెకారు భార్య కాబోలు పరిగెత్తుకుంటూవచ్చి "ఏమిటి అయ్యగారి ఆజ్ఞ" అంటూ నిలబడింది.

జితేంద్రుని మనస్సు ఖాళీగా వుంది. "పడవఉందా ?" అని అడిగాడు అప్రయత్నంగా.

ప్రశ్న విలక్షణంగా వుంది. ఆ స్త్రీ నిర్ఘాంతపోయింది. పడవలు కాక పోతే ఇంకేముంటాయి అక్కడ ? "తెడ్లు ఇవ్వమన్నారా ?" అని అడిగింది.

"ఊఁ, కాని....తీసి అట్టిపెట్టు" అని పలికి తనకుతానే విస్మితుడైనాడు. "ఎప్పుడు వస్తారు ?" అని అడిగిందా స్త్రీ.

తాను ఎప్పుడు వచ్చేదీ చెప్పాలన్నసంగతి అతని కప్పుడు గుర్తుకు వచ్చింది. "రాత్రికి వస్తాను; పదిగంటలకు."

"ఆ పసుపుపచ్చని చిన్న డింగీ...."

"ఆఁ, ఆఁ, అదే."

ఆమె ఈ కాలేజివాళ్ళను బాగా ఎరుగును. మంచి సరదామనుషులు

వాళ్ళు. ఆనాడు రాత్రి మూడుగంటలప్పుడు వచ్చాడు ఆ ప్రొఫెసర్. వచ్చి డింగీ తీసుకుని వెళ్లాడు. మరొకనాడు ముగ్గురు ఆడపిల్లలు వచ్చారు పడవ కావాలంటూ. బాగా వెన్నెల కాస్తున్నది; పదకొండౌతుంది. 'మేం ముగ్గురం ఒంటరిగానే వెడతాం' అన్నారు. 'నేను నడుపుతాను పడవ, ఒంటరిగా ఎందుకూ ?' అన్నాడు పల్లెకారు. కాని వాళ్ళు ఒప్పుకోలేదు. 'మేం ఒంటరి గానే పోగలం' అన్నారు. ఇటువంటివాళ్ళందరూ ఆ స్త్రీకి క్రొత్తకాదు. "అలాగేలెండి బాబూ !" అన్నది సాలోచనగా.

జితేంద్రుడు చుట్టూ చూస్తూ నిల్చున్నాడు. ఇంకా ఇక్కడ వుండటం అనవసరం అనిపించింది' షర్టుజేబులో చేయి పెట్టుకుని అక్కడినించి బయలుదేరి వెళ్ళగొట్టబడుతున్నవాడల్లే వెళ్లిపోయాడు. ఆ స్త్రీ ఆ విలాస పురుషునివైపు అలాగే కొంతసేపు చూస్తూ నిల్చుంది. చివరకు లోపలకు వెళ్లిపోయింది.

ఇలా ఇంకో పదినిమిషాలు గడిచాయి. కాని ఇందువల్ల జరిగేదేమీ కనిపించటంలేదు. తననుతాను మోసుకోక తప్పేట్టులేదు. విధిలేక వెళ్లి జీప్‌లో కూర్చున్నాడు స్టార్టుచేశాడు. రోడ్డుమీద ముందుకు సాగిపోతున్నది మోటారు. కాని అతనికి ఎవరో తన్ను అడ్డగిస్తున్నట్టుంది; ఎవరో గట్టిగా పట్టేసినట్టుంది. అలాగే మొత్తంమీద నదిఒడ్డునే కారు నడుపుకుంటూ పోతున్నాడు. ఏమిటి ఈ నిర్బంధం తాను అనుభవిస్తున్నది ? హాయిగా, స్వేచ్ఛగా వెళ్లలేకపోతున్నాడేం ? ఈ జీప్, ఈ రోడ్డు, ఈ పరిగెత్తటం.... ఏమిటి ?.... ఇదంతా యేదైనా వివశత్వమా ? ఉహుం. ఇది వివశత్వం కాదు; తాను స్వతంత్రుడు. కాని తనలో తానే బంధితుడై వున్నట్టు ఏమిటి ఈ అనుభూతి ? ఈ బంధనం కర్మదా ?.... వ్యవస్థదా ?.... నియతికి సంబంధించి నదా ?.... యేదో ఒకటి.... ఉంది.... అమోఘంగాఉంది ! అబ్బ ! దీనినించి విడుదల లేదా ?....

వచ్చాడు చివరకు తిన్నీ దగ్గరకు. అతన్ని చూడ్డంతోనే తిన్నీ గాభరా పడిపోయింది. ఎప్పుడూ ఉన్నట్టులేదు ముఖం. సాధారణంగా ఆముఖంలో ఒక ప్రతిజ్ఞ, ఒక సంకల్పం వ్యక్తమౌతూ ఉంటాయి; యేదో చెయ్యాలన్న దీక్ష, యేమిచెయ్యాలో ఆ నిర్ణయం, స్పష్టంగా కనిపిస్తూఉండేవి. కాని

ఇప్పుడా ముఖంతీరు వేరుగా ఉంది---సర్వం మరచిపోయినవాడికిమల్లే, కార్యభారాన్ని తనకు తెలియకుండా తొలగద్రోచికొన్నవాడికిమల్లే. "ఎక్కడి నించి వస్తున్నారూ ?" అని అడిగింది.

"అక్కడినించే."

"ఏమిటి సమాచారం ?"

"ఏమీలేదు. కాస్త దిండు ఒకటి పడెయ్యి; పడుకుని నిద్రపోతాను."

తిన్నీ అతని బూటుతాళ్లు విప్పేసింది. బూట్లు అవతల పెట్టేసింది. అతని షర్టు వంకెకు తగిలించింది. మంచంమీద దిండుపెట్టి, దుప్పటి పరిచింది. జితేంద్రుడు పడుకున్నాడు. తిన్నీ తలదగ్గర కూర్చుని నుదుటిపై చేయి నిమురుతూ అడిగింది. "చాలదూరం వెళ్లారేమిటి ? బాగా అలసిపోయినట్టున్నారు."

"ఔను. అలసిపోయాను. నన్ను నిద్రపోనీ; లేపబోకు."

తిన్నీ మెల్లగా అతని నుదుటిమీద చేత్తో నిమురుతూ కూర్చుంది. జితేంద్రుడు కన్నులు మూసుకుని పడుకున్నాడు. కొన్ని నిమిషాలు గడిచాక తన నుదుటిమీదినించి నెమ్మదిగా ఆమెచేయిని తీసి దూరంచేశాడు. తిన్నీ ఊరికేనే కూర్చుంది....దారితప్పి....పరిభ్రమించి ...అలసిపోయి....నిద్రాముద్రితుడై వున్న ఆ శిశువును అలాగే చూస్తూకూర్చుంది. చివరకు లేచి వెళ్ళిపోయింది.

జితేంద్రుడు లేచి గదిలో పచార్లు ఆరంభించాడు. చివరకు మళ్ళీ మంచంమీద వచ్చి కూర్చున్నాడు. రెండు ఉత్తరాలు రాశాడు. రెండు కవర్లలో పెట్టి మూసేశాడు. తిన్నీని కేకవేసి పిల్చాడు. ఆమె వచ్చాక ఇలా అన్నాడు : "ఇదిగో తిన్నీ ! రెండు ఉత్తరాలు. ఇదేమో పఠాన్‌కుఇచ్చెయ్యి; రేపు ఉదయం అతడు దాన్ని తీసుకుపోయి ఎవరికి ఇవ్వాలో వాళ్ళకు ఇచ్చేసి వస్తాడు. రెండోది నీదగ్గరే అట్టిపెట్టుకో. సాయంత్రానికి ఆవిడ వస్తుంది.... ఆ సొమ్ముల యజమానురాలు. సొమ్ములు ఆమెకు ఇచ్చెయ్యి. ఆఉత్తరం కూడా ఆమెకు ఇవ్వు. ఆమె ఎలా చెబితే అలా చెయ్యి."

తిన్నీ ఆఉత్తరాలు రెండూ తీసుకుంది. అతడు చెప్పినదంతా విన్నది. తాసై యేమీ మాటాడలేదు. అవ్యక్తితో ఎక్కువగా మాటాడ్డంగాని, ఆ యీ

ప్రశ్నలు అడగటంగాని పనికిరాదు. అంటే అతనికి గుట్టు, దాపరికం ఎక్కువ అని కాదు. ఊరికే అదీ ఇదీ అడగటమే అసంగతంగావుంటుంది.

ఉత్తరాలు చేతిలో పుచ్చుకుని అలాగే నిల్చుంది తిన్నీ. క్షణాలు భారంగా ఉన్నట్టు గ్రహించింది. కాని మారుమాట పలక్కుండా సహించుకు పోవటమే తన వంతు. "తిన్నీ! ఆమె ఎలా చెబితే అలా చెయ్యి. ఎలా వుండమంటే అలా వుండు. నాకు మారుగా ఆమెను మన్నించు. ఇక నేను...." జితేంద్రుడు ఇక తరువాతి మాటను తనలోనే అణచేసుకుని మరో వైపు చూస్తూ ఉండిపోయాడు. తిన్నీ అతనివైపే చూస్తూ ఉంది. ఆమె ఇంకా అక్కడే నిల్చుని తనవైపే చూస్తున్నదనీ, తాను మాట పూర్తిగా చెప్పలేదనీ, జితేంద్రునికి జ్ఞాపకంవచ్చింది. "నేను వెళ్లిపోవాలి తిన్నీ! చాలదూరం వెళ్లాలి" అన్నాడు.

"సరే, మంచిదే! కాని అందుకు మీరు—కష్టపడటం ఎందుకు? నన్నుగురించి విచారంగా ఉందా మీకు?"

జితేంద్రునికి నిజంగానే చాల కష్టంగా ఉంది. "నీకేదో సరైన యేర్పాటు చేసే పోతాను."

తిన్నీ నవ్వింది. "నన్నుగురించి మీరు విచారపడవలసినంతయోగ్యత నాలో యేమీ లేదు. మీరు భగవంతుడిని ఎందుకు నమ్మరూ? అందరికీ తగిన యేర్పాటు ఆయనే చేస్తాడే!....చాలదూరం అంటే....ఎక్కడికీ మీరు వెళ్లేది?"

"అందరికంటే దూరాన మీ భగవంతుడు ఉన్నాడుకదూ! నువ్వు త్రోవ చెబితే అక్కడికే వెళ్లాలని నా కోరిక."

"ఆయన చాల దగ్గరేవుంటాడు విప్పా!....మీరెక్కడికీ వెళ్లకండి!"

జితేంద్రుడు ఒక నీరసమైన చిరునవ్వు ప్రదర్శించాడు. "వారంటు వస్తే వెళ్లక తప్పదు తిన్నీ!"

తిన్నీ గాభరాపడ్డది. "వారంటా?"

జితేంద్రుడు నవ్వాడు, "గాభరాపడవలసిన అవసరంలేదు. వారంటు సర్కారువారిది కాదు....మీ భగవంతుడు ఎలా పిలుస్తాడేమిటి? ఆయన వారంటు ఎలా వుంటుంది? యమధర్మరాజుద్వారా వస్తుందికదూ! ఆయన

వారంటే వచ్చిందంటే తిన్నీ, అవలిగట్టుకు దాటిపోతాను! నిజంగా చాల అలసిపోయాను! మీ భగవంతుడికి మన గోడు వినిపిస్తుందంటావా? నన్ను తన దగ్గరకు పిలిపించుకోమని నువు మీ భగవంతుడికి చెప్పు తిన్నీ! నీ మాటైతే వినిపించుకుంటాడేమో! నేనెరగను ఆయన్ను; ఎప్పుడూ ఆయన్ను నేను పిలిచినపాపాన పోలేదు...."

"ఊరుకోండి. అలా మాటాడతారేం?....మీకు నిద్రరావటంలేదా?"

"నిద్ర బాగానేపోయానుగా!.... సరే. దీనికేంగాని....ఏవీ నా దుస్తులు ఇలా తే."

జితేంద్రుడు దుస్తులువేసుకున్నాడు. ఒక మిలిటరీ ఆఫీసరులా తయారైనాడు. వెళ్ళిపోయాడు.

మోహినిని ఆగదిలోనే అట్టిపెట్టి వుంచారు ఇరవైనాలుగు గంటల పాటు. మొత్తంమీద ఆమె అక్కడ హాయిగానే కాలంగడిపిందని చెప్ప వచ్చు. మంచంమీద కంబళి పరచుకుని హాయిగా నిద్రపోయింది. కప్పుకు నేందుకు ఇంకో కంబళికూడా ఉంది. అటువంటిచోట నివసించటం తనకు అలవాటే అన్నట్టు ఇబ్బంది పడలేదు. అప్పుడప్పుడు మాత్రం ఒక విషాద రేఖ మనసులో పొడసూపుతూనే ఉండేది; కాని అది ఎక్కువసేపు ఉండేది కాదు. ఒకసారి చుట్టూ చూచుకుని తిరిగి ప్రసన్నత తెచ్చుకునేది. జీవితంలో ఆమెకు ఇబ్బందులనేవి లేనేలేవు. ఇటువంటి పరిస్థితులు ఇంటిదగ్గర తనకు దుర్లభం. పుట్టింట్లోగాని, అత్తగారింట్లో గాని ఆమె కిటువంటి అవకాశం లభించలేదు. అక్కడా, ఇక్కడా ఏలోటూ లేకుండా గడిచింది. ఇప్పుడు ఇటువంటి పరిస్థితి ఏర్పడిందంటే....ఇదేదో కొత్తగా అనిపించిందామెకు. తానిప్పుడొకరకంగా ఖైదీ అనీ, ఒకందుకు శిక్షింపబడుతున్నాననీ మనసులో స్ఫురిస్తూ ఉంటుంది. కాని నిజంగా ఆ శిక్ష అనుభవించేది తాను కాదనీ, మరింకోవ్యక్తి అనీ ఆమెకు బోధపడుతూ ఉంటుంది. కాగా ఆమె హృదయం ప్రసన్నభావపూరితమౌతున్నది.

పగలంతా గడిచిపోయింది. విశేషం యేమీ జరగలేదు. ఎవరూ ఆమె దగ్గరకు రాలేదు, పలుకరించలేదు. వాళ్లూ వీళ్లూ వచ్చి, అదీ ఇదీ అడిగి వేధి

స్తారనే ఆమె అనుకుంది. కాని ఎవరికీ ఇటువైపు ధ్యాసే వున్నట్టు కనిపించ లేదు. సాయంత్రం అయేసరికి కబురు చెప్పారు: 'ఇక్కడినించి బయలు దేరి వెళ్లాలి' అని.

చుట్టూ మూసేసివున్న ఒక మోటారులో ఆమెను తీసుకుపోయారు. ఒక అరగంట అయాక మోటారు ఆగింది; తలుపు తెరిచారు. ఎదురుగా పరదాగప్పిన సవారీ ఒకటి కనిపించిందామెకు. ఆ సవారీలో కూర్చోబెట్టారు ఆమెను. ఇద్దరు మనుషులు సవారీని మోసుకుపోయారు. కొంతసేపటికి సవారీని నేలమీద దింపారు. ఒకవైపు పరదా తొలగించారు. అప్పుడు మోహినికి కనిపించింది కిందినించి పైకి వెడుతున్న ఒక మెట్లవరుస ఎదురుగా. ఆ మెట్లుఎక్కి పైకివెళ్లమని చెప్పారు. ఆమె అలాగే మెట్లెక్కి పైకి వెళ్లింది. వెళ్లి ఒక గదిలో ప్రవేశించింది.

మోహిని లోపలికి రాగానే తిన్నీ వచ్చి లోపల గడియవేసింది. తానిప్పుడు ఎక్కడ వున్నదో యేమో మోహినికేమీ అవగతంకావటంలేదు.

''రా, అక్కా!''

ఆమాట వినేసరికి మోహినికి ఆశ్చర్యం కలిగింది. తిన్నీ లాంతరు వత్తి పెద్దది చేసింది. అక్కా అని పిలుస్తూ మోహినిదగ్గరకు వచ్చింది. ఆమె చేయి పుచ్చుకుని మంచందగ్గరకు తీసుకుపోయి కూర్చోబెట్టింది.

మోహిని గది అంతా కలయజూచింది. జితేంద్రుని గది! అతని గదిలాగే వుంది. "నువు ఎవరవు?" అని అడిగింది మోహిని.

"నాపేరు తిన్నీ. ఇది మా యిల్లు....ఉండండి చెబుతాను...."అంటూ బొమ్మలపెట్టె తెచ్చింది. కవరుకూడా తెచ్చింది.

మోహిని ఆ పెట్టె తనదేనని గుర్తుపట్టింది. కాని దాన్ని ఆమె ముట్టుకోలేదు. ఎదురుగా నిల్చునివున్న ఆ అమాయికపు తిన్నీని చూస్తూ ఉండిపోయింది.

"ఇవి మీవేగా! తీసి చూచుకోండి" అన్నది తిన్నీ.

''నావా?....ఇవి నావి ఎలాగౌతాయి?" విస్మయపడుతూ అడిగింది మోహిని.

"మీవేనని ఆయన చెప్పారు. మీరు వస్తారనీ, ఇవన్నీ ఇచ్చివెయ్య మనీకూడా చెప్పారు."

"ఎవరూ చెప్పింది ?"

"ఆయనే...." తిన్నీ బుగ్గలు ఎర్రబడ్డాయి. "ఇవి మీదగ్గరనించే ఎత్తుకునిరాబడినట్టు....సర్దార్ చెప్పారు."

"ఎవరా మీ సర్దారు ? ఏవో మాయమాటలు చెప్పాడు కాబోలు !"

"ఎబ్బే, ఆయనెప్పుడూ అబద్ధంచెప్పరు" అన్నది తిన్నీ వెంటనే ఉత్తేజితయై.

"అయితే ఆయన దొంగతనాలు చేస్తాడా ? ఆమాట నిజమేనా ?" నవ్వుతూ అడిగింది మోహిని.

"ఆయన చెబితేమాత్రం....అది నిజమే. ఆయన నాకు చెబుతూ ఉండేవారు : 'మేం దొంగతనాలు చేస్తాం. కాని దొంగలదగ్గరనించే....వాళ్ళు ఎత్తుకొచ్చిన దొంగసొమ్మును మేము ఎత్తుకొచ్చి దొరలకు ఇస్తాం' అని. దొరలంటే ఎవరో తెలుసునా ? బీదవాళ్లెంతమందైతే ఉన్నారో వాళ్లంతా దొరలేనట ! ధనవంతులలో చాలమంది పచ్చి దొంగలట ! ఆయన చెప్పేవారు."

మోహిని వింటూ ఉండింది. "ఊఁ ! ఇంతకూ ఏదీ ఆ దొంగల సర్దారు ? అసత్యవాదులకుకూడా ఆయన సర్దారులా వున్నాడే ! నన్నుగురించి కూడా ఏమన్నా చెప్పేవాడేనా ?"

"చాల ధనవంతురాలనీ, చాల అంద....చాలమంచివారనీ చెప్పేవారు."

"అందుకనేనా నన్ను—ఎత్తుకువచ్చాడు ?" కోపంగా అడిగింది మోహిని.

తిన్నీ ఉలికిపడింది. "అదేమిటి అక్కా ! అలా అంటావేం ? అంత దయగలవాడిని మనం ఎక్కడా చూడం."

"ఔను, చాల దయగలవాడు" అంటూ మోహిని సొమ్ములపెట్టెను అవతలకు నెట్టింది. "తీసుకుపో అది ! అవతలికి తీసుకుపో !" అన్నది. తరువాత కవరు విప్పి చదువుకుంది :

"మోహినీ! ఈ తిన్నీభారం ది. ఇంకా శుక్రవాళ్ళు ఉన్నారు. వాళ్ళ భారంకూడా నీదే. ఇవాళ శుక్రవారం. సోమవారం సాయంత్రందాకా గడువు ఉంది. ఎక్కువ వ్యవధానం లేదు. నాకు అటూ ఇటూ వెళ్ళాల్సిన పనులు ఉన్నాయి. జ్ఞాపకం పెట్టుకో: సోమవారం సాయంత్రం. ఈలోగానే అంతా అయిపోతుంది. మకాములు ఎత్తివేస్తున్నాం. యువకులంతా ఎక్కడి వాళ్ళక్కడ వెళ్ళిపోతారు. వాళ్ళందరికీ ఒక్కొక్క వెయ్యిరూపాయలు మాత్రం ఇవ్వు. నాకు తీరికలేదు. క్షమాపణ చెప్పుకునేందుకుకూడా తీరిక లేదు. అంతా సోమవారం సాయంత్రంలోగా అయిపోకపోతే ఇతర్ల ప్రాణంమీదికి వస్తుంది. అలా జరగనీయవద్దు.

—జితేన్."

ఉత్తరం చేతిలో పుచ్చుకుని అలాగే కూర్చుంది మోహిని. అతని వ్రతం పూర్తిఅయిపోయిందన్నమాట! ఆమె తిన్నీవైపు చూచింది. తిన్నీ ఆమెవైపే తదేకంగా చూస్తూఉంది. మోహిని హృదయం కరుణార్ద్రపూరితం అయింది. తిన్నీని దగ్గరకు రమ్మని పిలిచింది. "సర్దారు నీతో ఏమిచెప్పి వెళ్ళిపోయాడు?"

"నువ్వు వస్తావనీ అంతా నీకు అప్పగించెయ్యమనీ, నువ్వు చెప్పినట్టు నడచుకోమనీ — అంతే ఆయన చెప్పింది. మరింకేమి చెప్పలేదు."

"అదికాదు. తానెక్కడికి వెడుతున్నదీ నీకేమైనా చెప్పాడా?"

"ఆయన ఎక్కడికి వెళ్ళేదీ, ఏంచేసేదీ నాకు ఒకప్పుడుమాత్రం చెప్పేవారా?"

"అయితే ఏమీ చెప్పనేలేదా?"

"ఉహుఁ. ఏమీ చెప్పలేదు."

"ఎప్పుడు వెళ్ళాడు?"

"నిన్న రాత్రే వెళ్లారు."

మోహిని సాలోచనగా ఉండిపోయింది కొంతసేపు. "ఈ వుత్తరంలో ఏమిరాశాడో నీకేమైనా తెలుసా తిన్నీ?"

"ఏమి రాశారేమిటి?" జిజ్ఞాసువులా అడిగింది తిన్నీ.

"నీకేమీ చెప్పలేదూ మరి?"

"ఉహుఁ! నాకు చెప్పిందల్లా అంతే....నువుచెప్పినట్టు నడుచుకో మనీ....ఇంకా...." అని యేమో చెప్పబోతూ సంకోచిస్తూ ఆగిపోయింది.

"ఇంకా....ఏమిటది? చెప్పు

"ఉహుఁ. ఏమీ లేదు."

"చెప్పు తిన్నీ! యేమీటో చెప్పబోయావుగా?"

"ఏమీ లేదక్కా! అది ఆయనకు అలవాటులే....ఏమీలేదు. నన్ను క్షమాపణ అడుగుతూ ఉంటారు."

"క్షమాపణ ఎందుకూ? ఏవిషయమై?"

"ఏవిషయమైనా గానీ అక్కా! ఆయనమాత్రం దేవతలాంటివారు ప్రతిమాటకూ ఆయన గొంతు గద్గదం ఔతుంది. ప్రతివిషయంలో చివరకు నన్ను క్షమాపణ కోరుతూవుంటారు. నాకు కష్టంగా వుంటుంది, వొళ్ళంతా వొణికిపోతుంది. మా ప్రాంతంలో (బెంగాలు) అప్పుడు కాటకం వచ్చి పడిందిగా అక్కా! ఆరోజుల్లో ఆ అవస్థ ఏంచెప్పను? చివరకు మానాన్న యాభై రూపాయలు తీసుకుని నన్ను వీరి చేతుల్లో అప్పగించేశాడు. ఈయనకు నేను దాసీని అయిపోయాననుకుని నిశ్చింతపొందాను. కాని ఈయన మాన వుడు కాదు. ఏమనాలో తెలియక 'దేవత' అంటున్నాను. కాని దేవతలకై నా హృదయం వుంటుందేమో, ఈయనకుమాత్రం హృదయంలేదు. దీనజనులే ఆయనకు దేవతలట! నేను ఆయనకు జనతామూర్తిగానో, భారతమాతగానో ఇంకా ఎలా కనిపించేదాన్నోమరి!....నాకై తే తెలియదు. యాభై రూపాయ లిచ్చేసి మా నాన్నను వారు ఉద్ధరించారు. మహానరకంలో పడకుండా నన్నూ రక్షించారు. కాని తానుమాత్రం మహాపాపం చేశానని చెబుతూ ఉండేవారు; కన్నీళ్ళు పెట్టుకునేవారు; నన్ను క్షమాపణ అడుగుతూ వుండేవారు. అదీ విషయం అక్కా! ఇంతకన్నా మరేంలేదు."

మోహిని నిశ్శబ్దంగా వింటూ కూర్చుంది. దూరాన అవతల యేం చూస్తున్నదో మరి! చివరకిలా అన్నది: "వచ్చిన అతిథికి మర్యాదచెయ్య మనిఅన్నా చెప్పాడా పోనీ! చూదాం పద తిన్నీ! మీ పొయ్యి, పెనం ఎక్క డున్నాయో ఏమిటో!"

? తిన్నీ వుండే చిన్నగది చూచింది. మళ్ళీ వెనుకగదివైపు ఒక
సారి ంది. "ఇంతేనా యిల్లు తిన్నీ! ఇంతలోనే కాలక్షేపం చేస్తున్నా
దన్న !" అన్నది మోహిని.

ౌను. ఇంతే ఇల్లు."

ామానేం లేదే!"

ుదంతా సామానుకాదూ?"

ంతేనా సామానంలా?"

ంకా ఏంకావాలి?" అని ఎదురు ప్రశ్నించింది తిన్నీ సాశ్చర్యంగా.

ోహిని జవాబేమీ చెప్పలేదు. అటువైపు ఆ ప్రక్కన వున్న ఖాళీ
స్థలం హడా వెళ్ళి చూచింది. రేకులుకప్పివున్న అక్కడి చిన్నవసారా
చూ: తిరిగిమళ్ళీ గదిలోకి వచ్చి మంచంమీద కూర్చుంది. ఈయిల్లు,
ఈకా —ఆమెకేమీ అర్థంకావేదు. ఇంత చిన్నది—ఇదికూడా ఒకకాపురం
వుం ల్లేనా? వస్తువులు, సామానులు కొనుక్కోటం, తెచ్చుకోటం
ఏమీ: నాయిల్లు, నాకాపురం అన్న మమకారమే ఎక్కడా కనిపించదు.
తనల లానే, తనకు నే క్షయింపజేసుకుంటూ ఏమిటో ఈ జీవితం?
నిస్సారం, శూన్యం!

ఇలాంటి ఆలోచనలలో బాహ్యస్మృతి లేకుండా మోహిని కొంత
సేపు మంచంమీద అలాగే కూర్చుంది. చివరకు అన్నది: "యేమన్నాకొ_స్త
చేసిపెడలావామరి? చాల అలసటగా ఉంది."

తిన్నీ వంటగదిలోకి వెళ్ళిపోయి తన పనిలో నిమగ్న అయింది.
మోహిని కొంచెంసేపు అక్కడే కూర్చుంది. చివరకు లేచి తానూ వంట
గదిలోకి వెళ్ళింది.

"తిన్నీ! కింద ఎవరేనా ఉంటున్నారా?"

"ఆయన అనుచరులే వుంటున్నారు."

"వాళ్ళను నువు ఎరుగుదువా?"

"ఆఁ. అందరినీ ఎరుగుదును."

"పైకి ఎవరూ రాలేదే?"

"పైకి ఎవరూ రావటానికి వీల్లేదు. పిలిస్తే రావలసిందే."

"తిన్నీ! నువు ఎన్నాళ్ల నించీ ఈయనతో వుంటున్నావు?"

"మూడుసంవత్సరాలనించి....ఒక్కమాట అడగనా అక్కా? మీ యింట్లో ఆయన జబ్బుపడ్డారుకదూ కొన్నాళ్లు. నువు ఎంతో సేవచేసి నయం చేశావుటగా! అయినాకూడా ఇలా చేశారేం ఆయన? నిన్నింత అవస్థ పెట్టారేం?

'నన్ను అవస్థపెట్టాడా? ఎవరు చెప్పారు నీకు?....అవస్థపెట్టటం కాదు, శిక్షించాడు. ధనికులకు శిక్ష!"

"మరొకలా అనుకోకు అక్కా! నువ్వెందుకూ ఆయన్ను అవస్థ పెడుతున్నావు?"

ఆప్రశ్న విని మోహిని మూగిమొద్దులా ఉండిపోయింది....అమాయకురాలుకాని ఆ అమాయికపు తిన్నీ ముఖంలోకి చూస్తూ! "అక్కా! పురుషులసంగతి వేరనుకో. వాళ్ళకు ప్రేమే ప్రధానంకాదు; కాని మనం ఆడవాళ్ళం, ప్రేమను స్వీకరించకపోతే వేరే దారేమిటి మనకు?"

మోహిని తిన్నీవైపు సాశ్చర్యంగా చూస్తూ ఇలా అన్నది: "ఏమిటి తిన్నీ, నువు మాట్లాడేది?"

"చూడు అక్కా! మనకు భర్తవుంటాడు, పరమేశ్వరుడూ ఉన్నాడు. భర్తను పరమేశ్వరుడుగాకూడా భావించి గౌరవించమని పెద్దలు చెప్పారు. అంటే ...దాని అర్థం యేమిటీ? ప్రేమను నిరాకరించటం మన ధర్మం కాదు అనేగా! నువు ఆయనగారి ప్రేమను నిర్విఘ్నంగా ఎందుకు స్వీకరించలేకపోయావు అక్కా! వివాహితవై వుంటే—"

"తిన్నీ! నిన్ను ఇలాగ నేను వాగనీయను. కిందికి వెళ్ళి, ఇక్కడ ముఖ్యమైన మనిషి ఎవరైనా వుంటే ఇలా పైకి రమ్మని చెప్పు."

తరువాత మోహిని తన ఆలోచనలలో తాను తత్పరురాలైంది. మున్ముందు జరుగవలసిన పనుల్లో నిమగ్న అయింది.

* * * * *

రాత్రి పదకొండు దాటినతరువాత జితేంద్రుడు వచ్చి నావ అడిగి తీసుకున్నాడు. తెడ్లు తగిలించాడు. నదీప్రవాహానికి ఎదురుగా నడుపుకుంటూ పోతున్నాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది. శర్వరీకాంత నవ్వుతున్నట్టుగాఉంది.

ఆకాశాన నక్షత్రాలు విరివిగా ఉన్నాయి. మామూలుకన్న ఎక్కువ ప్రకాశ మానంగా ఉన్నాయి. వెన్నెలలేదు. చెట్లు నిద్రపోతున్నాయి. నదీజలం ప్రవహిస్తూనే ఉంది, కాని ప్రసుప్తస్థితిలో వున్నట్టు అగుపిస్తున్నది. పడవ నడుపుతూ జితేంద్రుడు వేస్తున్న తెడ్ల చప్పుడు తప్పితే అంతా నిశ్శబ్దంగా ఉంది. ఇక పోతే ఒడ్డుమీది కీచురాళ్ళ రొద నిశ్శబ్దాన్ని మరింత భయంకరంగా చేస్తున్నది. జితేంద్రుడు పడవ నడుపుకుంటూ వెడుతున్నాడు. కోటు విప్పి పక్కన పెట్టేశాడు. వంటిమీద బనీసు ఒకటే వుంది. అయినా ఇంకా ఉక్కిపోతున్నట్టే ఉంది అతనికి. ఒక మైలుదూరం వచ్చివుంటాడు. చలిరేయి అయినప్పటికీ ఎక్కువగా శ్రమచేస్తున్న కారణంచేత నుదుటినిండా చెమట పట్టిపోయింది. అయినా తెడ్లు వేస్తునేఉన్నాడు. పట్నం వెనుకబడిపోయింది. ప్రాణానికి హాయి అనిపించసాగింది. చుట్టూ ఎక్కడా జనసంచారం అంటూ లేదు. అతనికిక యేవిధమైన ఆంతరాయమూ ఉండదని నమ్మకం కలిగింది. కాని యేమిటిది ? ఎక్కడిదా వెలుగు ? ఎవరినో దేన్నో వెతుకుతున్నట్టుగా అతనివరకు వచ్చింది. ఎవరు విసురుతున్నారా వెలుగును ? చూస్తూ చూస్తూండగానే ఆ వెలుగు మాయమైపోయింది. యేదో లే.... అతడు నావ నడుపుకుపోతున్నాడు. బాగా అలసిపోయాడు. వొళ్ళుహూనంఅయింది.పడవనుఅవల ఒడ్డుకుపట్టించాడు.తాను పడవదిగి ఇసుకమీద వెల్లకిలాపడుకున్నాడు.అతనికి ప్రాణం హాయిగా వున్నట్టు అనిపించింది. చల్లగావుంది ఇసుక ; అవసరానికి మించి చల్లగావుంది. అసలే చలిరోజులు. మామూలుకన్న ఎక్కువ చలిగా వుంది అనాడు. కాని ఆ వాతావరణమంతా అతనికి చాల మనోహరంగా ఉంది; వంటికి ఆ చలిగాలి తగులుతూఉంటే చాల సుఖకరంగా వుంది. చేతులు కాళ్లు చాచి హాయిగా పడుకున్నాడు. పాదాలకు బూట్లు ఉన్నాయి. పైన పంట్లం ఉంది. వంటిమీద ఒక్క బనీనుమాత్రమే ఉంది. అలసిపోయిన శరీరంమీద చలిగాలి సోకుతూంటే ఆప్యాయంగా ఉంది. చక్కగా స్వేచ్ఛగా వంటికంతా ఇసుక తగిలేట్టు పడుకున్నాడు. చేతులుబాగా వెనక్కు వేశాడు. ఒక్కసారి ఆవులించాడు. మధ్యమధ్య అటూ ఇటూ పొర్లుతూ హాయిగా పడుకున్నాడు—చాలకాలంనించీ తనకిటువంటి మధురమైన భూదేవి స్పర్శ లభించింది కాదన్నట్టు—ఎన్నోసంవత్సరాల తరువాత, ఎన్నో జన్మల

తరువాత తనకీనాటికి ఈ పృథివిస్పర్శ లభించి బ్రతుకు కృతార్థమైపోయినట్టు. శూన్యంగా అలా కాసేపు పడుకుంటాడు. మళ్ళీ కాసేపు అటూ ఇటూ పొర్లు తాడు. తాను ఉన్నాడు; పృథివిని అంటుకుపోయిన తన కృతార్థత ఉంది. అంతకుతప్ప అతన్ని ఆశ్రయించుకుని ఏ బరువూ లేదిప్పుడు. ఎంతసేపు అతడలాగ అక్కడ పడివున్నాడో అతనికి తెలియదు. పూర్తిగా ఈ బాహ్య ప్రపంచాన్ని విస్మరించి మళ్ళీ దాని ఉనికి తనకు పొడగట్టేంతవరకూ అలాగే పడివుండేవాడే. కాని ఉలికిపడి చూచాడు. ఆ వెలుగు మళ్ళీవచ్చి మీద పడింది. ఇద్దరు సిపాయిలు, ఒక ఆఫీసరు చేరువనే నిల్చివుండటంచూచాడు. అతడు వెంటనే లేచి నిల్చున్నాడు. ఆఫీసరువైపు చెయిచాచాడు. నిస్సం కోచంగా, చాల ప్రసన్నంగా "చెప్పండి, ఏం పనిమీద దయచేశారు?" అన్నాడు.

చాచిన చేయి చాచినట్టుగానే ఉండిపోయింది. ఆఫీసరు కదల్లేదు. "ఎవరు నువు?" అని అడిగాడు.

"నేనా? ఒక విసిగిపోయిన జీవిని."

"ఊc. తీసుకురండి ఇతన్ని." ఆఫీసర్ ఆజ్ఞ!

ఆఫీసరు తిరిగి వెళ్ళిపోతున్నాడు. సిపాయిలు జితేంద్రుని పట్టుకుని తీసుకువస్తున్నారు.

చేరువలోనే వాళ్ల నావ ఉంది. అంత పెద్దనావ ఇంతదగ్గరగా రావటం, తనకు ఆసంగతే తెలియకపోవటం—జితేంద్రుడు తనకులానే ఆశ్చర్య పోయాడు. ఒడ్డుకువచ్చాక "మీ ఆజ్ఞ అయితే నేను వెళ్లి కోటు తెచ్చు కుంటాను" అన్నాడు జితేంద్రుడు.

"సరే, తెచ్చుకో" అన్నాడు ఆఫీసరు.

"థాంక్సు! (ధన్యవాదాలు!) తమరు అన్యథా భావించకపోయి నట్లయితే....ఈ నావనుకూడా క్లబ్‌లో దాని చోటుకు దాన్ని చేర్చే పెయ్యండి."

ఆఫీసరు మనం ఎరిగినవాడే. చడ్డా! అసలేం మాటాడకుండా గంభీరం గానే ఉందామనుకున్నాడు చడ్డా. కాని ఆ వ్యక్తి చాల తమాషా మనిషిలా కనిపిస్తున్నాడు. "ఎవరిదీ ఆపడవ?" అని అడిగాడు.

"పడవ పడవవాడిదే అవుతుంది. కాని ఇదిమాత్రం క్లబ్బుది" అన్నాడు జితేంద్రుడు.

సూపరింటెండెంటుకు సంతోషం కలిగింది. ఎవరోగాని మంచి పనం దైన వ్యక్తే ననుకున్నాడు. కోటు తీసుకుని పరీక్షించాడు. పడవనుకూడా బాగా తనిఖీచేయవలసిందని ఆజ్ఞాపించాడు. అపాయకరమైన సామగ్రి ఏమీ లేనట్టు నిర్ధారణ అయిపోయింది. సూపరింటెండెంటు నవ్వుతూ "రా, నీ పడవలోనే కూర్చుని వెడదాం రా!" అన్నాడు. వెంటనే సిపాయిల వైపు తిరిగి వాళ్ళను ఆపెద్దనావలో ఎక్కి వెళ్ళిపొమ్మనిచెప్పాడు. ఫలానాచోట ఆగి తమకోసం ఎదురుచూస్తూ ఉండండనికూడా చెప్పాడు.

"మీరు నాకు అవతల ఒడ్డుకు చేరుకునే అవకాశం కల్పిస్తున్నారు, కృతజ్ఞుడను, రండి" అన్నాడు జితేంద్రుడు.

సూపరింటెండెంటు తనకు తాను ధైర్యం చెప్పుకున్నట్టుగా బిగించిన తన పొట్టమీద ఒకసారి తడివిమూసుకుని సంతృప్తిపొందాడు. ఇద్దరూ ఆ చిన్నపడవలో ఎక్కి కూర్చుకున్నారు. తెడ్లదగ్గర జితేంద్రుడు కూర్చున్నాడు. ప్రవాహపువాలున వెళుతోంది పడవ. అందుచేత తెడ్డువెయ్యవలసిన అవ సరం అంతగా లేదు. ఇద్దరూ సంభాషణకు దిగారు.

"మీ యిల్లెక్కడ?" చడ్డా అడిగాడు.

"నాయిల్లా? ఎక్కడా లేదు. ప్రేమలేనిచోట ఇల్లు వుంటుందా? మీరే చెప్పండి."

ఆమాట చడ్డాకు నచ్చింది. "పోట్లాడి వచ్చేశావేమిటి? ఈరాత్రి ఇక్కడ ఇసుకతిన్నెమీదనే గడుపుదామనుకున్నావా?"

"చిత్తం, అలాగే అనుకున్నాను. ఇసుక చల్లగా వుంది; గాలికూడా చల్లగావుంది. నాకు మాత్రం వొళ్ళంతా వేడెక్కివుంది."

"సరే, ఇంకేం? మేము రావటంకూడా మంచిదే అయింది. నిన్ను ఇంటికి తీసుకుపోయి దిగబెడతాను, మళ్ళీ ఇలాగ ఎప్పుడూ నీమీద గయ్యాళి తనం చెయ్యవద్దని మీ ఆవిడతో గట్టిగా చెబుతాను."

"నన్ను ఇంటికి తీసుకుపోతారా? వద్దు-వద్దు, ఆపనిమాత్రం చెయ్య కండి బాబూ!"

చడ్డా నవ్వాడు. ప్రేమఅనేది అతనికీ....నలుగురూ అనుకుంటూంటే విన్నమాటే. అనుభవంలోకి వచ్చింది కాదు. "నేను వెంట ఉంటాగా ! నీకు భయం ఎందుకూ ?" అన్నాడు.

"మీరు చాలదయగలవారు. నేను మాత్రం ఇంటికి వెళ్ళనండీ. రెండు మూడు రోజులయాక—అప్పుడాలోచిస్తాను. ఇప్పుడు నన్ను మరింకెక్కడి కేనా తీసుకుపోండి, మీయిష్టం; ఇంటికిమాత్రం వద్దు."

పాపం, మగవాళ్ళగతి ఇలాగే వుంటుంది అనుకున్నాడు చడ్డా. బైట జోరుగా అధికారం చలాయిస్తూ ఉంటారు. ఇంటికిపోతే పిల్లుల్లా ఉండవల సిందే ! "నువు చాల చిత్రమైన మనిషిలా వున్నావే ! ఇంతరాత్రివేళ, ఈ చీకటిలో, పడవ ఒకటి వేసుకుని, ఇల్లువిడిచి ఇంతదూరం వచ్చి, చల్లని ఇసుకమీద తెల్లవార్లూ ప్రాణాచారం పడుకుంటావా ? ఇదా నీ వ్యవహారం ? ఇదిగో తమ్ముడూ ! ఆడవాళ్ల పొగరు ఇంత ఇదిగా రెచ్చిపోనీకూడదోయ్ ! పైగా ఇంకోసంగతి చూచావూ ? నీవెంట తగిలి మేము అనవసరంగా శ్రమ పడ్డాం. ఏం ముప్పు ముంచుకొస్తుందో ననుకున్నాం మేము. తీరా చూస్తే భార్యకు భయపడి పారిపోతున్న పౌరుషవంతుడివి నువు. సరేలే, అంత భయంగావుంటే ఈరాత్రి మాయింట్లో వుండి, రేపు ఉదయమే వెడుదువు గానిలే....ఏం పని చేస్తావు నువు ?"

"నేనేం పని చేస్తానూ ? కనిపిస్తూనేఉన్నాగా, ఏం జేసేవాడినైందీ! ఒక్కొక్క రోజే లెక్కపెట్టుకుంటూ కాలక్షేపం చేస్తున్నాను."

ఇలా మాటాడుకుంటూ పోయారు. నిర్ణీతస్థలం చేరుకున్న తర్వాత నావ క్లబ్‌లో అప్పగించేశాడు. తాను చడ్డాతో బయలుదేరాడు.

"మొదట ఇక్కడికి నువు నడిచే వచ్చావా ?" అడిగాడు చడ్డా.

"నడిచి కాకపోతే మరింకెలా వస్తాను ?"

"నేనేదో వాహనం ఉందనుకున్నాను ఇంకా....సరేలే, పోదాంపద !"

సిపాయీలు ఆగివున్నచోటికి వచ్చా రిద్దరూ. ఆ తరువాత పోలీసు స్టేషన్‌కు వెళ్ళారు. అక్కడినించి జితేంద్రుడు చడ్డాతోపాటే ఆయనింటికి వెళ్లాడు. వెంటనే అక్కడ తగిన ఏర్పాట్లు చేయబడినాయి. జితేంద్రుడు మంచంమీద పడుకోబోతూ అడిగాడు : "మిస్టర్ చడ్డా మీరేనా "

"ఔను. మీకెలా తెలుసూ?"

"పేరు ప్రతిష్ఠలుగల వారిని ఎరగని వాళ్ళుంటారా? నమస్కారం!"

జితేంద్రుడు ఒంటరిగా మిగిలిపోయిన తరువాత ఏమేమో ఆలోచిస్తూ పడుకున్నాడు. మొత్తంమీద సంతోషంగానే ఉన్నాడు. రెండు రోజులు ఏ కార్యభారమూ పెట్టుకోకుండా హాయిగా కాలం గడపాలనే అనుకున్నాడు. ఇంకా రెండుమూడుచోట్లకు పోయి కొన్ని యేర్పాట్లు చక్కబెట్టవలసివుంది. ఆ పిమ్మట ఎలాగూ చడ్డాను కలుసుకోవలసినవాడే.

తెల్లవారిన తరువాత "మీరు నాపట్ల చాల దయచూపించారు చడ్డా బాబూ! ఇక నేను సెలవు తీసుకుంటాను!" అన్నాడు.

"నేనుకూడా వెంటరానా యేమిటి? చూస్తాను, మీ ఆవిడగారు ఏమిటో మరీ ఇంత.... కాని క్షమించాలి; నామనస్సు ఇప్పుడు చీకాకుగా ఉంది; రావటానికి నాకు తీరికలేదు."

"మీకు కలిగిన చీకాకు ఏమిటో సెలవు ఇవ్వండి. ఈ సేవకునివల్ల కాదగిన పనేదన్నావుంటే చెప్పండి; చేస్తాడు."

"మరేంలేదు. ఈ కాలేజి పిల్లకాయలున్నారు చూశారూ.... పైకి చూస్తూ నడుస్తూఉంటారే!.... ఈనాటి వాళ్ళ చదువులు, వాళ్ళ వ్యవహారాలూ...."

"మీరు కోపగించుకోకుండావుంటే ఒక్క మనవి చెప్పుకుందామని వుంది. ఇప్పుడైతే వెళ్ళిపోతున్నాను కానీ.... నాకుమాత్రం మనస్తృప్తిలేదు. మళ్ళీ అవసరంపడితే మీ దగ్గరికే వచ్చేస్తాను. రమ్మంటారా? ఆ అవసరం కలుగుతుందనే మీరు భావించవచ్చు."

చడ్డా నవ్వాడు. "ఓ, తప్పకుండా! ఎప్పుడవసరంపడితే అప్పుడు సంతోషంగా వచ్చెయ్యండి. ఇది మీ స్వగృహం.... ఇక్కడ మీకు ఏవిధమైన సంకోచం అవసరంలేదు."

జితేంద్రుడు వెళ్ళిపోయాడు. కనుచూపుమేర దాటిపోయాడు. అప్పుడు చడ్డా ఒక్కసారి నుదురుమీద అరచేయి ప్రాముకున్నాడు. స్మృతిపథంలో ఒకమూల యేవోకొన్ని అంశాలు పైకి ఉబుకసాగాయి. కాని స్పష్టంగా

బయటికివచ్చి పట్టుబడటంలేదు. ఒక మనిషిని పిల్చాడు, రహస్యంగా బోధించాడు. ఆ మనిషి జితేంద్రుని వెనకాలే బయలుదేరాడు.

కాని అతడు జితేంద్రుని వెంబడించలేకపోయాడు. అతడు ఎప్పుడు, ఎక్కడ, ఎలా మాయమైపోయాడో ఆ మనిషికి అంతుపట్టలేదు.

చడ్డాకు నిజంగా చాల చికాకుగానే ఉంది. అతడు సహజంగా ఉత్సాహం, సాహసంగల వ్యక్తి. అంసుచేత నిభాయించుకుని వస్తున్నాడు. మరొకడైతే ఆ వుద్యోగంలో తల్లకిందులైపోయేవాడే. మూడురోజులైంది. మోహినిని గురించిన కబురు యేమీ ఇంతవరకు తెలియరాలేదు. ఇంతపని చేసిన ఆ దుండగీడులు ఎవరో యేమాత్రమూ అచోకీ తెలియటంలేదు. ఇటువంటి పరిస్థితుల్లో తాము ఓడిపోయినట్టేకదా! తనకైతే కొన్ని ఊహలు, అనుమానాలు ఉన్నాయి; వాటికి ఆధారం లేకపోలేదు. కాని ఈ కొత్త దుండగీడు ఎవరోగాని ఎంతకూ అందకుండా పోతున్నాడే! మోహినిని ఎవరో ఎత్తుకుపోయారు అన్నవిషయం అతన్ని బాధిస్తూనేవుంది. ఆమె మూర్తి అతని మనస్సులో ఎంతమాత్రం చెరిగిపోలేదు....అక్షయంగా నిలిచివుంది. ఇది ప్రభుత్వానికి కాదు; ప్రత్యేకం తనకే అవమానకరం అని బాధపడుతున్నాడు. హృదయంకల మానవుడుకదూ! ఒక్క న్యాయచట్టమే అతనికి దేవుడేంకాదు; కాని ఆ జరిగిన సంఘటనమాత్రం సూటిగా అతని మాడుమీద మొట్టినట్టయింది. రెండురోజులు జరిగిపోయాయి. మరేమీ విశేషం సంఘటిల్లలేదు. సోమవారం వచ్చేసింది; సాయంత్రం అయింది. ఏడుగంటల వేళ జితేంద్రుడు చడ్డా సమక్షంలోకి వచ్చి ఉత్సాహంగా చేయిచాచాడు.

చడ్డా చాల సంతోషించాడు. "వచ్చావా తమ్ముడూ! రా, ఇంట్లో శాంతిభద్రతలు నెలకొన్నాయా?"

"మీ దయవల్ల ఇక శాంతి చేకూరుతుంది చడ్డాబాబూ! మీరిన్నాళ్ళనించి పట్టుకోవాలని వెదకుతున్న జితేంద్రుణ్ణి నేనే. ఇదిగో వచ్చేశాను."

చడ్డా తనముతానే విశ్వసించలేకపోయాడు. జితేంద్రుడన్న పేరు విని ఆశ్చర్యపోయాడు. "ఏమిటీ....ఈ?"

జితేంద్రుడు కూర్చుంటూ "ఎబ్బే, నేను వెళ్ళిపోవటంలేదు, ఇక్కడే కూర్చుంటున్నాను" అన్నాడు.

"ఇంతలోనే "చడ్డా! చడ్డా!" అని పిలుపు వినవచ్చింది. చడ్డా స్వప్నలోకంలోనించి తేరుకుని వాస్తవజగత్తులోకి చేరుకుంటున్నాడు.... అంతలోనే నరేశుడు లోపలికి రానేవచ్చాడు. వస్తూనే జితేంద్రుని చూచి "హలో! సహాయ్! 'హౌ డూయూ డూ?' (కులాసాయేనా?)" అంటూ ప్రశ్నించాడు.

జితేంద్రుడు లేచి నిల్చున్నాడు. చాచివున్న నరేశుని చేయి గాఢంగా అందిపుచ్చుకుని జోరుగా కరచాలనంచేశాడు. "మిమ్మల్ని మళ్ళీ కలుసుకో గలిగాను, కృతార్థుడిని" అన్నాడు.

"నరేశ్‌బాబూ! ఈయన సహాయ్‌కాదు. మిస్టర్ జితేన్....నా.... అతిథి" అన్నాడు చడ్డా ఆవేశంలో తననుతాను అతిక్రమించి.

"అతిథి! సరేగాని, మహాశయా! తమరిక్కడ ఏంచేస్తున్నారు? 'చడ్డానుకూడా తీసుకురండి 'బ్రిడ్జి'వేద్దాం అన్నది మోహిని. వస్తావా మరి?" అన్నాడు నరేశుడు చడ్డాను ఉద్దేశించి.

"ఇప్పుడేనా?....మా అతిథిగారికి తగిన ఏర్పాట్లు చూడద్దూ!.... మీరు పదండి; నేను వస్తాను."

"ఇంకా ఎంత ఆలస్యం? ఒక అరగంటలో వస్తావా పోనీ...."

"ఆఁ, ఆఁ. మీరు పదండి. ఈయన ఇప్పుడే వచ్చారు. కొద్దిగా యేర్పాట్లుచేసి వెంటనే వస్తాను."

నరేశుడు వెళ్ళిపోయాక చడ్డా తలుపులన్నీ మూసేసి వచ్చాడు. "చాల నిశ్చింతగా వున్నట్టున్నావే? ఏమిటి సంగతి?" అని అడిగాడు.

"మీ సమక్షంలోకి వచ్చేశాను. ఇంకా నాకు చింతయేముంది?"

చడ్డాకు కాస్త భయం అనిపించింది. అతని అలవాటుతప్పితే అందుకు వేరే కారణం యేమీలేదు. కాని ఇప్పుడు ఎదురుగా కూర్చునివున్న ఆవ్యక్తిని చూస్తోంటే భయం అనేది అనవసరం అని తోచింది. ఆ వ్యక్తిముఖంలో దుర్మార్గంగాని, సామర్థ్యంగాని ఆసమయంలో ఏమీ కనిపించటంలేదు. ఒక్క ప్రఫుల్లత మాత్రమే గోచరిస్తున్నది, అంతే. మరేంలేదు. "తమ్ముడూ! ఒప్పుకుంటున్నాను నిజంగా నువ్వు మమ్మల్ని ఎందుకూ పనికిమాలినవాళ్ళని చేసి విడిచిపెట్టావు. ఇంత హంగామాచేసినవాడివి నువ్వేనా? నీ ముఖం

చూస్తుంటే నాకు నమ్మకం చిక్కటంలేదు. ఒక్కవిషయం అడుగుతాను చెబుతావూ ? బారిష్టర్‌గారు నీవిషయమే పట్టించుకోకుండా అలా వెళ్ళిపోయారేమిటి ? నువు ఆయన స్నేహితుడివికదా !"

పట్టించుకోకపోవటం యేముంది ? నేను మీ సమక్షంలోకి వచ్చి వుండటం చూచి, నిశ్చింతగా వెళ్ళిపోయారు, అంతే." అన్నాడు జితేంద్రుడు నవ్వుతూ.

"ఇంకోసంగతి అడుగుతాను చెప్పు : మోహినిని నువ్వేనా ఎత్తుకుపోయింది ?"

"ఆమె ఇంట్లోనే ఉన్నది కాబోలుగా ! అవిడే మిమ్మల్ని ఇప్పుడు రమ్మని కబురుచేసిందనుకుంటాను ?"

"మాట దాటెయ్యబోకు. అసలుసంగతి ఏమిటో కాస్త చెపుదూ ?"

జితేంద్రుడు నవ్వాడు. "నాకు ఎక్కడ ఏమి ఏర్పాటుచేస్తారో చేద్దురూ. రెండు రాత్రిళ్ళనించీ నాకు నిద్రే లేదసలు; నేనూ కాస్త విశ్రాంతి తీసుకుంటాను, మీరుకూడా 'బ్రిడ్జిపార్టీ'కి వెళ్ళరండి. అనవసరంగా ఎందుకీ ఆలస్యం ? అక్కడ మీకోసం ఎదురుచూస్తూంటారు కూడాను."

"అది సరేలే....దానికేం గాని....నువ్వేం భయపడబోకు....సంగతేమిటో తెలుసుకుందామని కదూ....నిన్నడిగేది ?....విషయమేమిటో ఉన్నదున్నట్టు చెప్పు....నీకేం పరవాలేదు, నేను చెపుతున్నానుగా...."

"ఉన్నదున్నట్టే చెపుతున్నాను, నాకు నిద్రవస్తున్నది. మీకు కృతజ్ఞుడిని. తమకు తెలుసుకదా ఇప్పటివరకు....ఇంటిదగ్గర...."

"సరే నీఅంతట నీవే వచ్చి ఇలాఎందుకు అప్పజెప్పేసుకున్నావు ? ఇలాంటి పిచ్చిపని...."

జితేంద్రుడు నవ్వాడు : "నాలుగు రోజులు ముందో వెనకో ఎలాగూ పట్టుబడకతప్పదు. మీబారినుండి ఎల్ల కాలం ఎలా తప్పించుకోగలను? 'మీకూ నాకూకూడా ఎందుకీలేనిపోని చీకాకు పెంచుకోడం?' అనిపించింది. అందుకని ఇలా వచ్చి హాజరైనాను. ఇక నన్ను ఎక్కడకి పంపించాలో అక్కడికి పంపించేసి మీరూ మనశ్శాంతి పొందండి."

ఇలా నేరుగా ఏమీ లభించదని నిశ్చయించుకున్నాడు చడ్డా. ఇక

ఎక్కువ కాలయాపన చెయ్యలేదు. పోలీసుస్టేషనుకు ఫోను చేశాడు. సరియైన పూర్తిబందోబస్తులో జితేంద్రుని స్టేషనుకు తీసుకువెళ్ళి కొట్లో పెట్టించాడు. తర్వాత తీరికచేసుకుని మోహిని యింటివైపు బయలుదేరాడు.

# 20

మోహిని శాలువా ఒకటి కప్పుకుని, వెనుకవైపుకు తలబెట్టుకుని సోఫాలో పడుకుంది, శాంతంగా నిశ్శబ్దంగా వుంది గదంతా. గది ఉనికిని తెలుపుతున్నది అందులో దీపపు వెలుగు ఒక్కటే. ఏమి కానున్నదో ఆమెకు తెలియదు. తెలుసుకోవాలన్న ప్రయత్నమూ ఆమెలో కనిపించటం లేదు. తనలో తాను మునిగిపోయివుంది. ఇన్నాళ్ళనించీ ఒక్కటే ఆశమీద నిల్చివుంది. ఆ ఆశ నెరవేరినట్టే కనిపిస్తున్నది. కాని ఆమె కోరింది ఇదేనా? ఇదేనా ఆమె కోరింది!? 'కాదు-కాదు-కా'దని ఇప్పుడు అనిపిస్తూ ఉంది. అలాగనే ఆశించింది. కాని ఆ ఆశ నెరవేరాలని మాత్రం ఆమె వాంఛించలేదు. అదినెరవేరిందంటే....ఇక దానివల్ల సంభవించే ఫలితాలతో ప్రాణాలు ఒడ్డి యుద్ధం చేయవలసిందే! ఏడీ? ఏమైనాడు ఆ జితేన్? అతనివద్దనించి ఇంకా మూల్యం వసూలుచేస్తారా? ఇంకా అతన్ని పిండి, పాలార్చి నిస్సారం చెయ్యాలా? అతడు తన నెత్తురు చుక్కలతో ఎప్పటికప్పుడు రుణం యావత్తూ చెల్లించుకుంటూ వచ్చాడు కదా! ఓయి భగవంతుడా? ఏమి కానున్నదో కదా!

ఇలా తనకు తానే ప్రశ్నించుకుంటుంది. పలుసార్లు ప్రశ్నించుకుంటుంది. కాని సమాధానం పొందాలన్న కోరిక లేదు. ఎందువల్లనంటే—హృదయాంతరాళంలో సమాధానం ఉండనే ఉంది. తన ప్రశ్నలన్నింటికీ అడుగున ఆధారభూతమైవున్న శ్రద్ధాధరిత్రిని ఆమె వొదులుకోలేకుండా వుంది. అంతా భగవంతుని లీల. ఈ జగత్తంతా ఆయనదే. మనమంతా ఆయన బిడ్డలమే. ఏదైనా మన మంచికే అవాలి. మనం ఎన్ని అపమార్గాల్లో గిరిగింతలు కొట్టినా చివరకు భగవంతుని ఒడిలో చేరవలసినవాళ్ళమే. అప్పుడనుకుంటాం: 'యాత్ర ముగిసింది, మజిలీ చేరుకున్నాం' అని.

అప్పుడప్పుడు మోహినిలో కనిపిస్తూఉండే ఈరకమైన అవస్థ నదే

శునికి అంతుపట్టదు. ఇచ్చోట ప్రతివాడు తనలో తాను ఒంటరివాడు, ఏకాకి అయిపోతాడు. అతి సన్నిహితులైనవారితోకూడా పార్థక్యమే గోచరిస్తుంది: ఇటువంటి స్థితిలో 'నేను వేరు, ఇతరులు వేరు' అన్నభావం ఉన్నదని అంగీకరించవలసిందే. ఎటువంటి అధికారం గాని, అభియోగంగాని అక్కడి వరకూ పోజాలదు. మనమందరం ఒకరికోసం ఒకరుగా ఉన్నవాళ్ళమే. కేవలం ఎవడికివాడుగా ఉండటం లేదు; ఉండలేం. కాని ఎప్పుడో ఒకొక్క-క్షణంవచ్చి పడుతుంది; అప్పుడీ సంబంధబాంధవ్యాలను అంటిపెట్టుకుని వుండం; ఏదో అపరలోకసంబంధులమైపోతాం. అప్పుడనిపిస్తుంది: ఈ సంబంధాలన్నీ పైని కప్పుకున్న దుప్పట్లులాగా జారిపోయాయని. ఇతర్ల కోసమూకాదు, మనకోసమూకాదు, ఈ బ్రతుకంతా యేమీలేదు; బండిసున్న అనిపిస్తుంది. ఇదేనా కృతకృత్యత అంటే? లేక ఇదేనా మృత్యువు అంటే?

ఏమైనాగానీ, నరేశుడు గదిలోకివచ్చి స్తబ్ధచిత్తుడై నిల్చిపోయాడు. అంతమరీ చప్పుడుగాకుండా రాలేదు. అయినాకూడా మోహినికి తెలియలేదు అతడు వచ్చినట్టు. గుమ్మంలోకి రాగానే....రోజాకుమల్లేనే చిరునవ్వునవ్వుతూ వినోదంగా పిలువబోయాడు. కాని మరుక్షణమే వాతావరణం అతన్ని అటకాయించింది. ఒకటిరెండు క్షణాలపాటు మోహినివైపు చూస్తూ అలా నిల్చున్నాడు. తరువాత కుర్చీలో కూర్చున్నాడు. ఆమెలో చైతన్యం ఉన్నట్టులేదు. అతడామెను తానై పిల్చి పలుకరించనూ లేదు. చాలరోజులతరువాత మోహిని వచ్చింది. ఇంతవరకూ సరిగా మాటే మాటాడలేదు....కచేరీనించి వచ్చాడు. ఇంట్లో మోహిని కనిపించింది. వెంటనే ముఖం సంతోషంతో వికసించింది. ఏవేవో బోలెడన్ని ప్రశ్నలు ఉబుకుతున్నాయి కడుపులోనించి. కాని ఆమె ముఖం చూడగానే అన్నీ ఆగిపోయాయి. తన ఉల్లాసాన్ని తాను అణచుకోవలసి వచ్చింది. ఆమె ముఖంలోనూ, కన్నుల్లోనూ ఏమిటో ఉన్నది. కొంచెంగా చిక్కిపోయింది శరీరం. ముఖముద్రలో యేదో విషాదంయొక్క-ఉపసంహారం గోచరిస్తున్నది. కాని ఒక క్రొంగ్రొత్త విమలత, పరిపూర్ణత కనిపిస్తున్నాయి. హఠాత్తుగా అతడు అభిభూతుడై ఆగిపోయేడు. వెళ్ళి నిండుకౌగిలిలోకి తీసుకోవటం అసంభవం అయింది. వీపుతట్టి స్వాగతం ఇవ్వటంకూడా పడలేదు.

మోహినికూడా అభియుక్త మాదిరిగా ఒకింత వెరగుపాటుకు లోనయింది. అతని చూపుల్లో కట్టుపడి అలాగేనిల్చివుంది. చూపులూ చూపులూ మాత్రమే కలిశాయి. క్షమాపణ యాచిస్తున్నట్టుగా వున్నాయి మోహిని చూపులు. నరేశుని చూపుల్లో క్షమాదానంకాదు, స్వకీయహృదయవిహ్వలత మిక్కుటంగా ప్రదర్శితమైంది.

క్షణాలు బరువై తోచాయి. "కచేరీనించి రావటం ఆలస్యమవుతూందా ఇప్పుడు ?" అన్నది మోహిని.

"....ఎప్పుడు వచ్చావు ?"

"ఇప్పుడే వస్తున్నాను" అంటూ మోహిని నవ్వింది, "అంతాచెబుతా లెండి....రాత్రి.... ఇప్పుడు ఇంకా...."

నరేశుడు మళ్ళీ మాటాడలేదు. మెదడు బరువెక్కినవాడులా ఉండి పోయాడు.

అదిచూచి మోహిని భయపడింది. సాహసించి ముందుకువచ్చి అతని భుజం పట్టుకుని "ఏమిటీ ? అలా ఊరుకున్నారేం ?" అన్నది.

"ఇప్పుడు ఇంకా....పనేమన్నా ఉందా? ఏంపనో చెప్పు ?" అన్నాడు గంభీరంగా నరేశుడు.

మోహిని గాభరాపడుతూ ఒకడుగు వెనక్కువేసింది.

"చడ్డాదగ్గరికి వెళ్ళాలా ?"

"వద్దు-వద్దు-" అన్నది మోహిని చీత్కారంగా వద్దు.

"మోహినీ ! నిన్ను నీవు అలా మరీ కష్టబెట్టుకోకు. విచారపడవలసిన అవసరం నీకేమీ లేదు. చడ్డా విషయమయ్యేకదూ నీ చింత ? వెళ్ళి అతన్ని పిల్చుకువస్తాను" అన్నాడు నరేశుడు మృదుకంఠస్వరాన.

"మీ కెలాగ తెలిసిందీ ?"

"దానికేంలే.... ఇప్పుడే వస్తానుండు."

ఇంతకన్నా ఎక్కువగా మాటలు జరగలేదు. నరేశుడు చడ్డా యింటికి వెళ్ళాడు; తిరిగి వచ్చాడు. వచ్చి....సోఫామీద, తల వెనక్కుపెట్టుకుని, స్మృతి తప్పిన మనిషిలా పడుకునివున్న మోహినివైపు చూస్తూ ఉండి పోయాడు. అతని మనసులో కరుణ ఉత్పన్నమైంది. మానవుడు

నిస్సహాయుడు. ఈసంగతి అతనికి తెలుసు. క్రోధం ఎల్లప్పుడు తెలియనితనం లోనించే పుట్టుకొస్తుంది. క్షమాగుణంలోకూడా అనధికృతమైన దయ ఉన్నది. కనుక స్వేచ్ఛయిచ్చి వొదిలెయ్యటమే మనిషి చెయ్యగలిగింది. అదిఇచ్చెయ్యటం, సహానుభూతిని తనదగ్గరే అట్టిపెట్టుకోటం—అంతే చెయ్యవలసినపని. అంతకుమించి మరేమీ సాధ్యంకాదు.

కాని మరీ ఆలస్యం అయిపోతున్నది. "మోహినీ !" అని పిల్చాడు చివరకు.

మోహిని కళ్ళు తెరిచింది, సిగ్గుపడింది. ముఖంమీదికి దుప్పటి మేలి ముసుగులా లాక్కుంది. లేచి కూర్చుంది. "వచ్చారా ! చాల త్వరగానే వచ్చేశారే !"

"ఒక్క అరగంటలో వస్తానన్నాడు. బ్రిడ్జి ఆటకు నువు రమ్మంటున్నావని చెప్పాను."

"అలా ఎందుకు చెప్పారూ ?"

"—అక్కడ సహాయ్ కలిశాడు. ఏమిటతనిపేరు, జితేన్ కదూ ?"

"ఏమిటీ-ఈ !" ఉలికిపడి ఆశ్చర్యంగా అడిగింది మోహిని.

"బహుశా అతనిపని పూర్తిచేసుకునే చడ్డా ఇక్కడికి వస్తాడు."

నరేశుని ముఖంలోకి పరిశీలనగా చూచింది మోహిని. ఏమీలేదక్కడ. ఏ ప్రయత్నం లేదు; ఏ నిరోధంలేదు.

"ఏం చేస్తున్నాడక్కడ అతను ?" అడిగింది మోహిని.

"హాయిగా పడకకుర్చీలో కూర్చున్నాడు. సిగరెట్టుకూడా కాలుస్తున్నాడేమో....జ్ఞాపకంలేదు. వాళ్ళిద్దరికీ ఎన్నాళ్ళనించీ ఏర్పడిందో మరి అంత స్నేహం ! కొత్తగాని, బెరుకుగాని ఏమీ కనిపించటంలేదు ఆయిద్దరిమధ్య."

మోహిని సోఫాలోనించి లేచింది. మెత్తవున్న ముక్కాలిపీట ఒకటి అతని కుర్చీదగ్గరకు లాక్కుని కూర్చుంది. "సంగతి చెప్పరేం మరి ? మీరే మనుకుంటున్నారు ?"

"నేను ఏమనుకుంటాను ? ఏమనుకోవాలో నువు ఇంకా తెలియజెబుతావు అనుకుంటున్నాను."

"నేనా ?"

'ఔను.'

"నేనేమీ చెప్పలేను. నాలుగు రోజులనించీ నాకు అతని సమాచారమే తెలియటం లేదు.... అతని అనుచరులు నన్నావేళ తీసుకుపోయారు; కైదులో పెట్టారు. యాభై వేల రూపాయలు ఇవ్వమన్నారు, ఇవ్వనని చెప్పాను. అక్కడే కైదీగా వున్నాను. తరువాత అతడే స్వయంగా వచ్చాడు. నన్ను వేరే ఇంకోచోట ఒంటరిగా అట్టిపెట్టండని వాళ్ళకు హుకుం జారిచేస్తూ, నాకు శిక్ష విధించాడు.... ఆ తరువాత ఏమైందో నాకు తెలియదు. ఒక ఉత్తరం ఇచ్చారు నాకు; నాసొమ్ములు నాకు ఇచ్చారు; నన్ను విడిచిపెట్టేశారు.... ఇప్పుడతడు చడ్డా దగ్గరవున్నట్టు మీరు చెబుతున్నారు. అంటే పోలీసుల చేతుల్లో చిక్కాడా ?.... చెప్పరేమండీ ?"

"అలాగే కనిపిస్తున్నది."

".... ఎలా మరైతే ?"

"చూద్దాం, ఏం జరుగుతుందో !"

"మీరతన్ని రక్షించలేరా ?"

"చెప్పలేను. రక్షించాలన్న కోరిక నీకైతే ఉన్నదనుకో. కాని అతనికి ఉన్నదా రక్షింపబడాలని ?"

"అతని కా కోరికఉన్నదో లేదో; లేకపోతేమాత్రం ఏం ?"

"అంతా నీకోరిక ప్రకారం, నాకోరిక ప్రకారమే జరిగిపోవాలన్న మాట ! అంతేనా ?" అంటూ నరేశుడు నవ్వాడు.

"మీరు బారిస్టరు, తెలిసినవారు, పలుకుబడిఉంది...."

"పైగా భర్తను...." అంటూ నరేశుడు మళ్ళీ నవ్వాడు.

"ఔను, నాకు మీరు భర్త" అంటూ గంభీరంగా పలికింది మోహిని అతని కన్నుల్లోకి చూస్తూ.

నరేశుడు ఒక శాంతియుతమైన చిరునవ్వు ప్రదర్శించాడు. "సరే. మీముందు ఓడిపోయాను రాణీగారూ!.... ఇక నేనేమిచెయ్యాలో చెప్పండి.... న్యాయచట్టం అనేది ఒక తిరుగలి లాంటిది. దానికి రెండు రాతిపలకలు ఉంటాయి. ఆ రెండింటిమధ్య నలిగిపోయే గింజను రక్షించాలంటే కష్టమే మోహినీ ! మిగతా నేరాలన్నిటికీ కొన్ని నియమ నిబంధన లున్నాయి. ఆ

నియమాలలో ఏవో కొన్ని లోపాలు ఎత్తిచూపవచ్చు. అందులో పెద్ద కష్టమేం లేదు. కాని ఇక్కడ ఈ వ్యవహారం వేరు. తిరుగలిరాళ్ల ఉన్నాయంటే మరొక వస్తువును పిండిచెయ్యటానికే; కాగా పిండి అయిపోయే వస్తువుకూడా కేవలం ఇదొక్కటే. లోపాలు చూపటం అనే చిట్కా ఇక్కడ ఎక్కువగా పారదు. ఇది రాజనీతికి సంబంధిన కేసు. ఇటువంటి నేరాల విషయంలో జరిగే న్యాయవిచారణ అంతా లోకం ముందు ఒక ప్రదర్శన అనుకో. కాని వాస్తవంగా జరిగేదిమాత్రం కేవలం ప్రతీకారం మాత్రమే.... అయినా చెప్పేశానుగా : ఈకేసు నేను పడతాను, పోరాడతాను అని. సరేనా ? ఇంకా నీకు కావలసిందేమిటి.... కాని ఒక్క సంగతి చెప్పు మోహినీ ! ఇంతకీ నువ్వు...." వాక్యం పూర్తిచెయ్యకుండానే మోహినివైపు చూచి నవ్వాడు.

అందుకు సమాధానంగా మోహినికూడా మందహాసంచేసి ఊరుకుంది.

ఇలాంటి చిరునవ్వులద్వారానే ఇద్దరూ పరస్పరం సన్నిహితులౌతూ వుంటారు; హఠాత్తుగా మనస్సులలో ఒకమూల ఏర్పడివున్న అభావ-అధియోగాలు శాంతించుతూ వుంటాయి.

తరువాత చడ్డా వచ్చాడు. ఈలోగా భార్యాభర్తల మధ్య ఏకాస్తా ఎడము అనేదిలేకుండా పూడిపోయింది.

చూచి చడ్డా ఆశ్చర్యపోయాడు. మోహిని కొంచెం వాడిపోయినట్టు కనిపించింది; కాని ప్రఫుల్లత మామూలుకన్న అధికం అయింది. మోహినికి స్వాగతవచనంగా "ఎప్పుడు వచ్చారు మీరు ?" అని అడిగాడు చడ్డా.

"ఎక్కడినించీ ?" నవ్వుతూ ప్రతి ప్రశ్నవేసింది మోహిని.

"వినోదాల్లోనించి" అన్నాడు చడ్డా, అలాగే నవ్వుతూ.

"ఏమీ లేదంటీ — ఈ అయిదారు రోజులనించీ వినోదమన్నదే లేదు. ఒక్క బ్రిడ్జిఆటకూడా ఆనందించిన పాపాన పోలేదు.... అయితే.... మా మిత్రుడు మీ యింట్లోవున్నట్టు చెబుతున్నారే మావారు !"

"చిత్తం, రావడం అయితే వచ్చారు."

"అంటే వెళ్లిపోయాడా మళ్ళీ ?"

"చిత్తం, ఒక రకంగా...."

"అంటే—? చడ్డా బాబూ ! మీరు—"

చడ్డా నవ్వాడు. "ప్రభుత్వపు అతిథికదూ! అటువంటివాని గౌరవ మర్యాదలకు యోగ్యమైందా నా కుటీరం? మహారాజభవనంలాంటి మీ బంగళా అయితే బాగుంటుంది. లేకపోతే ఏముంది? సర్కారువారి 'అతిథి గృహం' ఉండనే ఉంది."

"జైలుకు పంపించేశావా?" నరేశుడు అడిగాడు. "ఊఁ, సరే అయితే, చెప్పు: నేనతన్ని ఎప్పుడు కలుసుకోవచ్చు?"

"కలుసుకోటమా?"

"ఔను! నే నీ కేసులో అతని తరపున పనిచేయదలచు కున్నాను.... ఏం? అర్జీ పెట్టుకుని అనుమతి తెచ్చుకోవలసిందే నంటావా?"

"అదేమిటి, మీ యిద్దరూను....బ్రిడ్జిఆట వేసుకుందామని పిల్చుకు వచ్చి ఇదా?" అన్నది మోహిని.

"చెప్పవేం చడ్డా! నేనతన్ని ఎప్పుడు కలుసుకోటానికి వీలౌతుంది?"

"కాగితాలూ, అవీ కొంచెం పూర్తికానియ్యండి మరి!" అన్నాడు చడ్డా నవ్వుతూ వినయపూర్వకంగా.

"మాకూ ఇక్కడ కాగితాలు అవీ పూర్తికావాలసే వున్నాయి.... ఊఁ, చెప్పు నీ సంగతి చప్పున!"

వ్యవహారం పురుషుల చేతుల్లోకి వెళ్ళిపోయింది—అనిపించింది మోహినికి. దావాలు పేచీలుద్వారా కూడా వ్యవహారాలు నడుస్తూఉంటాయి. కాని ఆ మార్గం మోహినికి తెలియదు. చడ్డా సానుభూతిని ఆమె వాంఛిస్తు న్నది. "పోనిద్దురూ గొడవ! 'కట్-థ్రోట్' వేద్దాం కూర్చోండి" అన్నదామె.

కాని ఆట 'కట్-థ్రోట్' ఆరంభమే కాలేదు, మరేదో కట్-థ్రోట్ ప్రారంభమయింది. ప్రపంచం కేవలం సాహానుభూతియుతమైనదే కాదు; స్పర్ధాపూర్ణమైనది కూడాను. లోకంలో ఈ రెండూ ఉన్నాయి, అందుచేతనే ఇది లోకం అయింది. స్త్రీ లేకుండా అందరూ పురుషులే అయితే—పురు షుడు లేకుండా అందరూ స్త్రీలే అయితే—ఇక సృష్టి ఏమిసాగుతుంది?.... మాటలు సాగుతూనేఉన్నాయి; ఇద్దరిమధ్యా అభిప్రాయభేదం మాత్రం అలాగే వుంది. ఎన్ని మాటలైనా మధ్యన యేర్పడ్డ యీ అంతరాన్ని మాత్రం అంత ర్హితం చేయలేకనే పోతున్నవి.

చడ్డా వెళ్ళిపోయాడు. నరేశుడు కొంతసేపు తల గోక్కుంటూ కూర్చున్నాడు. తన్ను ఒక పెద్ద అపరాధినిగా భావించుకుని బాధపడుతున్నది మోహిని. "ఏమిటండీ! ఏమిటాలోచిస్తున్నారు?" అన్నది చివరకు.

"వ్యవహారం చాల కష్టంగానే కనిపిస్తోంది."

"మిమ్మల్ని నేను క్షమాపణ ఎలా వేడుకోవాలో నాకు బోధపడటం లేదు నా కారణంగా ...."

నరేశుడు మోహినివైపు చూడకుండానే ఇలా అన్నాడు: "ఇక్కడ జరిగేవన్నీ ఎవరో ఒకరి కారణంగానే జరుగుతూఉంటాయి. అటువంటి కారణాలే లేకపోతే ప్రపంచం ఏనాడో పాడుపడిపోయేది! మోహినీ!.... నాకు పనిపాటుల్తో తీరికవుండదని నువు బాధపడుతున్నావా? మా బారిష్టరీ అంటే కేవలం ఒక వినోదం అనుకో! ఈ నీ కేసులో జొరపడ్డానంటే.... హాయిగా చేతికి కొంత పని యేర్పడుతుంది. పైగా ఇది ఒక మామూలు కేసు కాదు. రేపటినించి చూస్తావుగా: పత్రికలనిండా ఎక్కి గగ్గోలు అయిపో తుంది. దానిమూలాన మన పేరుకూడా ఇట్టె మోగిపోతుందనుకో."

విని, మోహిని మనస్సుకు చాల కష్టమైంది. ఈ తన భర్తయెడల ఎటువంటి కృతజ్ఞతకూడా వట్టి నీచమైనదిగా గోచరించిందామెకు. ఎందువల్ల నంటే-అతని ఔదార్యం ఈ క్షుద్రమైన కృతజ్ఞతలకు చాలా అతీతమైపోయింది. "మీ సొమ్ములన్నీ నేను తిరిగి తీసుకువచ్చేశాను." అంటూ ఆమె విచిత్రంగా నవ్వి, "పోయిన సొమ్ములు వచ్చాయి. తెచ్చినవాళ్ళకు బహుమతి యేమన్నా ఇస్తారా?" అన్నది మళ్ళీ.

"ఇస్తాను, తప్పకుండా ఇస్తాను. కాని ఆ వ్యక్తి ఎప్పుడేనా యేదిగాని కోరినట్టుందా? ఆ సంగతి నాకు తెలియనీ మొదట! అతడు చెయ్యటమే గాని, చేయి చాచటం అంటూ లేదుగా ఎన్నడూను!"

"ఎందుకు చాచడూ! ఈసారి మీరు తప్పించుకోలేరులెండి. ఈ దఫా అతడి పరిశ్రమకు పరిపూర్ణమైన మూల్యం చెల్లించాల్సి వుంటుంది!"

"అలాగా! ఏమిటో ఆ 'పరిపూర్ణత' తెలియనీ."

"పన్నెండువేల రూపాయలు!".

"పన్నెండువేలా! ఇది పరిపూర్ణం ఎందుకౌతుంది? ఒక లెక్క

ప్రకారంగా ఉంది—అంతే! పదమూడుకాదు; పదకొండూ కాదు; రెంటికీ మధ్యనున్న పన్నెండు!.... సంగతేమిటి మోహినీ?"

"తిన్నీ అని ఒక అమ్మాయి వుంది. ఇప్పుడామె నాతో రాలేదు; మీ ఆజ్ఞ అయితే రేపు ఉదయమే వచ్చేస్తుంది....బెంగాలీపిల్ల....పసిడిబొమ్మ అనుకోండి. ఇరవైయొకటి ఇరవైరెండు సంవత్సరాలు ఉంటాయి.... పోతే....పన్నెండుమంది పిల్లకాయలున్నారు.

నరేశునికి నవ్వొచ్చింది."ఓహో! ఈ బెంగాలీవాళ్లుభలేవాళ్ళేనే! ఇరవైయొకటి ఇరవైరెండు సంవత్సరాల వయస్సు! పన్నెండుమంది పిల్లకాయలూనా!" అంటూ నరేశుడు పకపక నవ్వసాగాడు. మోహినికూడా నవ్వు ఆపుకోలేకపోయింది. తానుకూడా కిలకిల నవ్వింది.

"మీ—జితేన్‌దొరగారి పటాలం అన్నమాట! భేష్ ఇంకేం? మనకు బోలెడంత రికార్డు దొరికినట్టే."

ఇలా విషయాన్ని హాస్యం కిందికి మార్చేసి మాటాడుతున్న అతని నవ్వుముఖంలోకి చూస్తూ ఉండిపోయింది మోహిని.

"కాబట్టి అదన్నమాట లెక్క! పన్నెండుమంది కుర్రవాళ్ళు పన్నెండు వేలరూపాయలు! అయితే ఆద్వాదశవాహినీ జగద్ధాత్రీమాత— ఏమిటన్నావు ఆవిడ పేరు?"

"తిన్నీ."

"తిన్నీ! ఆహా! జగజ్జననీ వసుంధరా మాతృసమానురాలు, ఆ-తిన్నీ! ఇంకేం, నేను తప్పకుండా మన్నిస్తున్నాను నిన్నూ, నీ జితేంద్ర మహాశయుని! ఎటువంటి పేరు వెదకి పెట్టుకున్నాడు! ఒక్కసారిగా పరిశుద్ధ అద్వైత....ఊఁ, తరువాత చెప్పండి?"

మోహిని సాశ్చర్యంగా భర్తముఖంలోకి చూస్తూంది. ఆచూపులో సందేహం అనేదేమీ లేదు, విమూఢతమాత్రమే ఉంది. ఆమె ఏమీ మాటాడ లేకపోయింది.

"ఊఁ, మూల్యం మాట చెప్పరేం? ఆ పన్నెండుమంది లెక్కా తేలి పోయింది. ఇకపోతే మీకు? మీ మూల్యంకూడా చెప్పండి!"

ఆ భర్తముందు మోహిని మరీ కరిగిపోయింది. "అబ్బ! ఆపుదురూ, మీధోరణి!" అన్నది కించిత్తుకోపం ప్రదర్శిస్తూ.

నరేశుడు నవ్వాడు. "ఏం? మీకూ నాకూ వేరే మజూరీ లేదం టారా? సరే, పోనీలెండి. కాని చూడండి రాణీగారూ, నేను బారిష్టరును. ఫీజు లేకపోతే కదలను అసలు....ఎవరబ్బా ఆ దేవి, అష్టాదశభుజధారిణి? ఒక మహామాతనే ఆవిష్కరించావుకదా నా మనఃపథంలో. ఆ చతుర్వింశతి భుజశూరులు ఆ మహాతల్లి పుత్రరత్నాలు! ఆహాహాహా! అటువంటి ఆ స్వర్ణ ప్రభ!....జగన్మాత దర్శనం ఎప్పుడౌతుందోకదా! బహుశా ఈ రాత్రంతా ఉత్కంఠతో వేగిపోతూ ఉండాలన్నమాట నేను....ఇంతకూ మాదేవి భువన మోహినీదేవి మాయకుకూడా అంతు పంతులేకుండా వుంది....అందు చేతనే విన్నవించుకుంటున్నాను: నా మజూరీమాట మాత్రం పక్కా చేయించ మని. దయచేసి ఇప్పుడే అనుగ్రహించారంటే....ధన్యోస్మి...."

మోహిని ముఖం ఎర్రబడిపోయింది. "చాల్లెండి, మరీను...."అన్నది.

# 21

ఎక్కడచూచినా గగ్గోలుగా వుంది. దేశవ్యాప్తమైయున్న ఒక బ్రహ్మాండమైన కుట్ర బయటపడింది. విప్లవ కార్యకర్తల సూత్రధారి పట్టుపడ్డాడు. ఇక ఎటువంటి రహస్యాలు బయటికివస్తాయో చెప్పలేము! ఇంతవరకూ పైకి పొక్కినవిషయాలు చాలాకొద్ది. అసలుదేశమంతటా ఈ విప్లవోద్యమం.... భూమికింద పెద్దపెద్ద సొరంగాలు చేసుకొని వ్యాపించిపోయి వున్నట్లుగా అనుమానాలు వెల్లడించబడ్డాయి. సమయానికి గుట్టు బయటపడింది, మాన వత్వం ఒక మహాప్రళయం బారినుంచి బయటపడింది. ఇంకానయం.... లేకపోతేనా, దావానలం ముంచుకువచ్చి సర్వనాశనం కాకపోయేదా? నాగ రికవ్యవస్థ కూలిపోయేదికాదూ? సభ్యమానవజీవితం తగలబడిపోయేదికాదూ? ఇలాంటి ప్రచారం ఎంతసాగిందో అంతులేదు.

ఇటువంటి పరిస్థితిలో నరేశుడు చేపట్టిన కార్యం కష్టతరమయింది. అతడొక స్టేజిమీద నిల్చున్నట్లు, అతని ముఖంమీద 'ఫుట్-లైట్స్' ప్రకా శం నిండుగా పడుతున్నట్లు వుంది అతనిస్థితి. ఇటువంటి పరిస్థితి వస్తుందని

అతడెన్నడూ అనుకోలేదు. హఠాత్తుగా సంభవించింది. అతడొక అసమం జసమైన పరిస్థితిలో పడ్డాడు. "మోహినీ! వ్యవహారం కష్టతరంగానే వుంది. ఇప్పటికి రెండుసార్లు వెళ్ళి కలసిమాట్లాడాను. నీ జితేంద్రుడు తన్ను రక్షించుకోవాలన్న ఉద్దేశంలో లేడు; ఇతర్లను రక్షించాలనే తాపత్రయం లోనే ఉన్నాడు. దోపిడులు, దొంగతనాలు, హత్యలు—అన్నినేరాలూ తాను చేసినట్టే ఒప్పుకోటానికి సిద్ధంగా వున్నాడు. కాని ఆ యా సంఘటనలను గురించి అతడు చెప్పదలచుకోలేదు. సంఘటనలు తడివితే ఇతర వ్యక్తులు కూడా కొందరు ఇరుక్కోవలసి వుంటుంది. అది అతనికి ఇష్టంలేదు.... కేసు కోర్టులో విచారణకు వచ్చేసరికి ఇంకా కొన్నాళ్లు పడుతుందనుకుం టాను. కొన్ని నెలలుకూడా పట్టవచ్చు....వాతావరణమేమీ బాగున్నట్టు కని పడదు. చడ్డా చాలా విచిత్రంగా మారిపోయాడు. అతడు నిన్నూ, నన్నూ కూడా ఈ కేసులో ఇరికించినా మనం ఆశ్చర్యపడనవసరంలేదు" అన్నాడు మోహినితో.

మోహిని అంతా విన్నది. చేరువనే కూర్చున్న తిన్నీకూడా విన్నది. "మరి మేం అతన్ని వెళ్లి కలుసుకోటానికి ఏమైనా ప్రయత్నంచేశారా?" అని అడిగింది మోహిని.

"మీరువెళ్ళి కలుసుకోటం అంత అవసరం అంటావా మోహినీ? పత్రికలవాళ్ళ చూపులన్నీ అక్కడేవున్నాయి. ప్రభుత్వపుదృష్టి యావత్తూ అక్కడేవుంది. అది విరమించుకుంటే—"

"తిన్నీని చూస్తున్నారుగదా....అయినా మీరు అలాగే అనేట్టయితే పోనీయండి....అతన్ని వెళ్లి చూడ్డం సాధ్యపడదంటారా? ఏవిధంగానూ వీలేకాదంటారా?"

"ఎలాగో సాధించవచ్చు. కాని అందువల్ల చాల ఇబ్బందులున్నాయి. పోనీ, యేదైనా ఉత్తరం రాసి అతనికి పంపించండి; అతని జవాబు నేను పట్టుకొస్తాను....అంతమాత్రంతో తృప్తిపడి సరిపెట్టుకోటం మంచిది."

"నేనూ వకీలునే. ఆమార్గాన పని అవదా?"

"నువు వకీలు వెప్పుడైనావు? పేరుకు వకాల్తా ప్యాసైనావు....అంతే గదా! పట్టా రిజిష్టరు చేయించుకోమని ఎన్నిసార్లు చెప్పాను!"

"అయితే కలవటం వీలుపడదంటారా ?....ఏమమ్మా చెల్లెలా ! తిన్నీ! ఏమిచెయ్యమంటావు చెప్పు ?"

తిన్నీ వింటూ కూర్చుంది. ఆమె ముఖవైఖరిలో యెట్టి పరివర్తన రాలేదు. "పోనీలే అక్కా ! ఆయనకు ఏది మంగళప్రదంఅనుకుంటున్నారో, అలాగే కానీయండి" అన్నది.

ఆమాటవిని మోహిని విచలితఅయింది. కోమలత్వంలోకూడా ఎంత దార్ఢ్యం ! "కానీయండి, ఏంజరిగినాసరే ! అదేదో తర్వాత చూచుకుందాం గాని....ముందు మీరు వెళ్లి అతన్ని కలుసుకోటానికి కావలసిన ఏర్పాట్లు చేసుకురండి !" అన్నది మోహిని భర్తతో.

"సరే...." అన్నాడు బుర్రగోక్కుంటూ నరేశుడు.

నరేశుడు తన ప్రతిభను, సామర్థ్యాన్ని పూర్తిగా వినియోగించవలసి వచ్చింది. చివరకు ఎలాగైతేనేం సాధించగలిగాడు: ఒక పెద్దగదిలో ఒక మూల జితేంద్రుడు, మోహిని, తిన్నీ—ఇక నాలుగోమనిషి ఎవడూ లేడా చుట్టుపక్కల—ముగ్గురూ దగ్గరగా కుర్చీల్లో కూర్చుని తమలోతాము మాటాడు కుంటున్నారు. దూరంగా జైలుఅధికారితో బాతాఖానీ నడుపుతున్నాడు నరేశుడు.

జితేంద్రుని ముఖవైఖరి యావత్తూ మారిపోయింది. ఆ మార్పును వెంటనే విశ్వసించటం కష్టమైంది. అసలు ఆ వ్యక్తేకాదు, మరోవ్యక్తి అనిపించేట్టు ఉన్నాడు. ముఖం నీరసంగాఉన్నా స్నిగ్ధమైన చూపు ! మనిషి కొంచెం దుర్బలంగా కనిపించినా స్వస్థమైన శరీరం !

"ఏం తిన్నీ ! ఆనందంగా ఉంటున్నావా ?—"అడిగాడు జితేంద్రుడు.

తిన్నీ గుడ్లు వొప్పగించి తన విప్పారవంక చూస్తూ కూర్చుంది. అతని ముఖంలోని ఆ వికాసం, ప్రసన్నత ఆమె కర్థంకావటంలేదు. ఆ ముఖం ఇదివరకెప్పుడూ కఠినంగానో, లేకపోతే కంఠం గాద్గదికంవహించో ఉండేది. అంతసహజంగా, ప్రసన్నంగా ఉండటం ఆమె ఎప్పుడూ చూడనేలేదు. దూరస్థుడు, దుర్గముడు, ఒక తపస్వివలె గోచరించేవాడు. అతడే ఇప్పుడు, ఈ జైలుఖానాలో, ఒక వికసించిన పువ్వులా కళకళలాడుతున్నాడు. ఆమె

ఆశ్చర్యపోతూ....తనకు అత్యంతసమీపంలో ఎట్టయెదుట ప్రత్యక్షమై సర్వ విధాల ప్రాప్యుడై వున్న....ఆ తన ఉపాస్యదైవాన్ని చూస్తూ ఉండిపోయింది.

అన్నీ ఒప్పుకోటానికే సిద్ధంగా వున్నావుట ! నిజమేనా ? మా వారు అంటున్నారు !"— మోహిని అడిగింది.

"ఔను; నిజమే."

"నువు అసలు ఎలా పట్టుబడ్డావో ఇప్పటివరకు మాకు తెలియనే తెలియదు! వారైనా చెప్పలేదు. ఏం ? ఆమాత్రం తప్పించుకోటం చేతకాక పోయిందా ?"

జితేంద్రుడు మందహాసంచేశాడు. "నేను అలా అనుకోటంలేదు మోహినీ! అసలు నేను బయటవున్నప్పుడే— తప్పించుకుంటూవున్నప్పుడే— ఖైదులో ఉన్నట్టుగా ఉన్నాను. నిజంగా ఇక్కడికి వచ్చినతర్వాతనే బయటకు వచ్చినట్టూ, తెరిపిన పడ్డట్టూ ఉంది. ఆ ఖైదునించి విడుదల పొందటానికి నేను చాలానే ప్రయత్నించవలసివచ్చింది. నిజంగా నేనక్కడ అలసిపోయా ననుకో. విసిగిపోయాను. దైవఘటనవల్ల చడ్డాతో పరిచయం ఏర్పడింది. ప్రథమదర్శనంలోనే అతనికి నామీద ప్రేమకలిగింది. అతడు నాకొక దారి చూపించగలడని నాకనిపించింది. అదివరకైతే నాకు దారి, తెన్ను తెలియ కుండా వుండేది. మూలమూలల తిరుగుతూ ఉండేవాడిని. చడ్డాను చూడగానే నాకు మార్గం గోచరించినట్టయింది. వెంటనే అతనిదగ్గరకే వెళ్ళిపోయాను. 'ఇదిగో నేనే; వచ్చేశాను. ఇక మీ పని కానిచ్చుకోండి' అన్నాను."

"కావాలని వచ్చి పట్టుపడ్డావన్నమాట ! ఇక తప్పించుకుని బయట పడాలన్న కోరికలేదా నీకు ?"

"లేదు. తప్పించుకుపోవటం నాకిష్టం లేదు. నానుండి నేను ఎలా తప్పించుకుపోగలను ! ఎన్నాళ్ళు తప్పించుకుంటాను ? నేను గ్రహించాను మోహినీ, ఆ ప్రయత్నం అనవసరం !"

"నీకు ఉరిశిక్షవేస్తారు, తెలుసునా ఆసంగతి ?"

జితేంద్రుడు మోహినివైపు చూచాడు; తిన్నివైపు చూచాడు. తిన్నీ కన్నుల్లో ఆ ప్రశ్నేలేదు, అగాధమూ ప్రశ్నరహితమూ అయిన స్వీకృతి తప్ప. మరేభావమూకూడా లేదు ! చీరకొంగులోకి చేయిపోనిచ్చి

ఆమె ఒకవస్తువేదో బైటికి తీసింది. అది జితేంద్రునికి ఇవ్వబోతూ "ఇది తీసుకుని ధరించండి" అన్నది.

రెండు వరుసలదారంతో కట్టిన తాయత్తు అది. తిన్నీ దాన్ని అతని అరచేతిలో పెట్టింది. జితేంద్రుడు దాన్ని చేతిలోకి తీసుకుంటూ నవ్వాడు. "ఇది చూచావా మోహినీ! ఈ తాయత్తుకు కట్టిన దారం ప్రభావంతో ఉరి త్రాడు ఫట్‌మని తెగిపోయి నేను విముక్తుడినౌతానని తిన్నీ నమ్మకం.... ఏం తిన్నీ! అంత గుణం ఉంది కదూ దీనిలో?"

"ఇటు ఇవ్వండి, నేను కడతాను" అంటూ తిన్నీ లేచింది.

కూర్చోమన్నట్టుగా చేయి వూపాడు జితేంద్రుడు. తిన్నీ కూర్చుంది. జితేంద్రుడు ఇలా అన్నాడు: కట్టించుకుంటాలే తిన్నీ! కట్టువడుతానులే! ఇక విచ్చలవిడిగా ఉండను, అంతవరకు నమ్ము. మోహినీ! 'ఐ నీడ్ ది బాప్టిజమ్' (నాకు చక్రాంకితాలు అవసరం)"

ఈ సమయంలో అవతలనించి కబురు వచ్చింది: నిర్ణీతమైన కాల పరిమితి అయిపోయిందనీ, చూడవచ్చినవారు ఇక వెళ్ళిపోవాలనీను. "ఇంకా నువు మాకు చెప్పదలచుకున్న దేమన్నాఉందా?" అని అడిగింది మోహిని.

"నేను చెప్పేదేముంది? మిగతా వాళ్ళందర్నీ బారిష్టరుబాబు కాపాడ తారని నేను ఆశిస్తున్నాను. వారంతా నిర్దోషులు. చేసేవాళ్ళదికాదు దోషం; చేయించేవాడిదే. ఆ చేయించినవాడు నేను. విషమంతా నాలోదే. స్వతంత్రం కోసం, విశ్వశాంతికోసం, విప్లవకార్యక్రమం నిర్వహిస్తున్నాం అని వాళ్ళు విశ్వసించారు, నడుముకట్టి పనిచేశారు. వాళ్ళకు ఆవిశ్వాసం, దీక్ష కలిగించింది నేనే. కాని లోలోపల నాకే ఉండేదికాదు ఆ విశ్వాసం. వాళ్ళు ఒక ఆశ యాన్ని తెలుసుకున్నారు, విశ్వసించారు. నా కా తెలుసుకోటం లేదు, నమ్మ కంలేదు. అందువల్లనే బహుశా నేను నాయకుడినైపోయాను. నామాట లకూ, నాకూ అంతరం వుండేది....మీ అహింసా సిద్ధాంతంలో వచ్చి పడ్డాననిమాత్రం అనుకోబోకు మోహినీ! అది సాహంకారిక సిద్ధాంతం. చావనివాడెవరు? ఒకరు ఒకర్ని చంపటం అనేది కల్ల. జన్మ అంటే మృత్యువే. జననమరణాలు వేర సృష్టిలేదు. అవి కాలపురుషుని అస్త్రాలు;

ఆ పనిముట్లతోనే ఈ సమస్త సృష్టిరచన! ఈ రెండింటిమధ్యలో రాగం ఏమిటి, ద్వేషం ఏమిటి? లేవు మోహినీ, అవి లేవు. కన్నీళ్ళు లేవు, దయ లేదు....ఒక్కటే ఉంది....అది సత్తు. అసత్తు అనేది ఉండజాలదు. నువు లక్ష చెయ్యి; అసత్తు అనేది ఉండనే ఉండదు. దానికి ఉనికి లేదసలు. లేనిది లేనేలేదు; నువు ఎన్నైనాచెయ్యి లేనిదిరాదు; రాబోదు....కాని కనిపిస్తున్న ఈఅసత్తు అంతా ఎందుకు ఉన్నట్టు? మిథ్య ఎందుకింత కనిపిస్తున్నది? 'చెడు' అనబడేది ఎందుకుంటున్నది? సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపకుడు అయిన ఈశ్వరుడు ఉండగా, సైతాను విజృంభణకూడా ఎందుకు సాగుతున్నది? ఎక్కడినించి సాగుతున్నట్టు ఈ విజృంభణ?....అదీ ప్రశ్న! అసలైన ప్రశ్న అదే మోహినీ!....లేనిది ఎలా వుంటున్నది?...." జితేంద్రుడు నవ్వాడు—"నేను నిన్ను కైదులోపెట్టాను. గదిలో ఉత్త ఇటిక నేలమీద కంబళి పరుచుకు పడుకోమన్నాను. ఒక కంబళి కప్పుకోమన్నాను. అవి కూడా ఇచ్చివుండక పోవచ్చు. అన్నం, నీళ్ళు ఇవ్వకుండా ఆకలితో నిన్ను మాడ్చి చంపివేసే వాడినేమో....ఒక్క తుపాకిపేల్చి చంపిపారేసే వాడినేమో....ఏమైనా చేసివుండవచ్చు. మోహినీ! ...ఏమైనా జరగవచ్చు, అన్నీ జరగవచ్చు! కాని ఇదంతా ఎందువల్ల ఎలా జరగగలుగుతోంది? అదీ ప్రశ్న!....ఏది లేదో అదే ఎలాగుసాగుతున్నది?....అబ్బ! ప్రశ్న ప్రశ్నగానే ఉండిపోయింది. సమాధానంఎక్కడా దొరికిందికాదు!....ప్రేమించాను, నిజమే. చంపిపారెయ్యాలనికూడా అనుకున్నాను! అదికూడా అంత నిజమే. ఏమిటి? ఇందులో ఏదన్నా పొరపాటుమాట ఉన్నదా?....రెండూ జరిగినవే కదా?....రెండూ నా ఒక్కడిలో అనుభూతమైనవే కదా?....రెండూ సత్యమేకదా?....అందుకనే అన్నాను: బయట ఉన్నంతవరకు ప్రశ్న ప్రశ్నగానే వుండిపోయింది. సమాధానం ఎక్కడా దొరికిందికాదు అని....ఇప్పుడు ఇక్కడికి వచ్చాను; సమాధానం దొరికింది....ఏమిటా సమాధానం అంటావా? ఇదీ సమాధానం: ఇదొక జైలు; అంతే సమాధానం. మరింకెక్కడా ఏ కొంచెం సమాధానంకూడా దొరకటం అసంభవం....ఒక చేత్తో నిన్ను కావిలించుకుని, మరొక చేత్తో పీకనులిమి చంపివేయగలను....అంతే జరుగుతున్నదంతా! ప్రేమ అన్నా అదే, ద్వేషం అన్నా అదే. అన్నీ ఒకటే

వస్తువు : సత్తు లేదా అసత్తు !....కాని లేనిది లేనే లేదు; ఉన్నదేదో ఉన్నది....ఇదొక ప్రపంచం అనీ, మనమంతా స్వతంత్రపౌరులమనీ అనుకుంటూ వుంటాం....ఈ అనుకోటమే ఒక ప్రశ్న....దీనికి సమాధానం యేమిటంటే —ఇదంతా ఒక జైలు; మనమంతా కైదీలం: జైలు భగవంతునిది; మనం భగవంతుని కైదీలం. ఇదొక్కటే సమాధానం, మోహినీ, ఇదొక్కటే .పరిష్కారమార్గం; లేకపోతే మన అసత్తుతో మనం సత్తును అడుక్కి తొక్కిపారేసుకుంటాం. అది మనలోనించి పైకి వికసించకుండానే అణగిపోతూ వుంటుంది....తిన్నీ టైము అయిపోయినట్టుంది; ఇదిగో, నీ తాయిత్తు, నీ చేత్తోనే కట్టు....మెడ వదలిపెట్టు....చేతికి కట్టు."

తిన్నీ మెల్లిగా అతని మణికట్టున దారం ముడివేసి తాయిత్తు కట్టింది.

జితేంద్రుడు మందహాసం చేశాడు.

మోహినికి దుఃఖంపొంగి ఏడ్చింది.

తిన్నీ తాయిత్తుకట్టి జితేంద్రునికి పాదాభివందనం చేసింది.

"పదండి, పదండి, చాల ఆలస్యం అయిపోయింది" అంటూ నరేశుడు వచ్చి జితేంద్రునితో. కరచాలనం చేశాడు. కావిలించుకుని కుదిలించి వేశాడు.

జితేంద్రుడు అందరికీ చేతులు జోడించి నమస్కారం చేశాడు.

# ఉపసంహారం

జితేంద్రుని కేసు విచారణ వివరాలు అనవసరం. అవి అందరిసొత్తు అయి పోయాయి. ఉరితీసేందుకు ప్రయత్నం సాగింది. నెలలతరబడీ, సంవత్సరాల తరబడీ సాగింది. కాని అనుకున్నట్టు ఉరితీయటం జరగలేదు.. ఇందువల్ల అందర్నీమించి జితేంద్రునికే ఎక్కువ నిరాశ కలిగినట్టు వింటున్నాం. ఈ సంగతి అతడే ఒక ఉత్తరంలో వ్యక్తపరిచినట్టు తెలిసింది. కాని ఆ ఉత్తరం ఎవరికి రాసిందీ, ఆ వ్యక్తి ఎక్కడున్నదీ తెలియలేదు. మొత్తంమీద మనకు రూఢిగా తెలిసిన అంశం ఏమంటే—జితేంద్రుడు ఈనాటివరకూ బ్రతికే వున్నాడు; కాని ఏకాకిగా, ఎవరూ వెళ్ళి చూడ్డానికి వీల్లేకుండా కఠిన నిర్బంధంలో, ఉన్నాడు.

చడ్డాకూడా ఉన్నాడు. కాని ఇప్పుడు పోలీసు ఉద్యోగంలో లేడు. యమునా నదిలో ఇసుకతిన్నెపై ఆనాడు జితేంద్రునితో తనకు సంఘటిల్లిన పరిచయాన్ని అతడెన్నడూ మరచిపోడు. ఆ స్మృతి అతనికొక నిధి వంటిది; మరెవ్వరూ తనదగ్గరంచి అపహరించలేని ఒక నిధి అతనికది.

మిథిల కోర్టుకువచ్చి సాక్ష్యం చెప్పటంలో సత్యాన్నే అంటిపెట్టుకుని వుంది. ఆమె ఒక్క సత్యాన్నే ప్రేమిస్తుంది. మాయలు, మోహాలు ఆమెకు పనికి రావు. కాని తీరా చివరకు ఉరిశిక్ష పడకపోయేసరికి 'ఛీ, యీ ప్రపంచంలో సత్యానికి విలువలేదు' అనే నిర్ణయానికి వచ్చేసింది. కాని తనకు తగిన పురస్కృతి పరలోకంలో తప్పకుండా లభించి తీరుతుందన్న ఆమె సంతృప్తిని ఎవరు భంగపరచగలరు?

